# పోతన భాగవతము - భాషాతత్త్వ సమాలోచనము



494.8275
ఆద--పోత
63,967

డా॥ వై. ఆదెప్ప, ఎం. ఏ., ఎం. ఇడి., పిహెచ్ డి.

Monaroy

# న భాగవతము -
# షాతత్త్వ సమాలోచనము



వై. ఆదెప్ప, ఎం. ఏ., ఎం. ఇడి, పిహెచ్. డి.

1985 లో నాగార్జున విశ్వవిద్యాలయమువారిచే పిహెచ్. డి. పట్టముపొందిన సిద్ధాంత గ్రంథము.

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి 1987

ప్రతులు : 1000

మూల్యము : రు. **75/-**

హక్కులు రచయితవి.

తె.శా.క
C.7695

ప్రతులకు :-

నాగరాజా పబ్లికేషన్స్

**Prop :** వై. నాగరాజమ్మ
**31-16-30 A**
బుల్లెమ్మ వీధి
మాచవరం
విజయవాడ—520004.

ముద్రణ : శ్రీ రాఘవేంద్ర ప్రింటింగ్ వర్క్స్,
విజయవాడ-1.

తెలుగు విశ్వవిద్యాలయము
కళాభవన్
హైదరాబాదు
వారి
ఆర్థిక సహాయముచే
ఈ సిద్ధాంత గ్రంథము
ముద్రింపబడినది.

శ్రీమతి & ప్రొఫెసర్ తూమాటి దొణప్పగారి

ఆశీస్సులతో

ఈ సిద్ధాంత గ్రంథము ముద్రింపబడినది.




పోతన భాగవతం—శృంగారం: రచన : డాక్టర్ లేళ్ళ
చెర్వు భానుప్రసాదరావు, పేజీలు: 200, వెల: 80
రూపాయలు, ప్రతులకు: శ్రీమతి మేళ్ళచెర్వుల లక్ష్మీ
కుమారి, భరద్వాజ, 4—2—6, బండలబజారు, ముని
సిపల్ హైస్కూలు వెనక, నరసరావుపేట—522 601.



రచయిత సతీమణితో

# అభిప్రాయములు

## తెలుగు విశ్వవిద్యాలయం


**ఆచార్య తూమాటి దొణప్ప**
ఎమ్ ఎ, పిహెచ్ డి, డి లిట్
కులపతి

కళాభవనం
హైదరాబాద్-500 004


తేది -2-1987

అర్థార్థులకు విపులార్థాలను ప్రసాదించగల విజ్ఞానసర్వస్వం వైయాసికమైన భాగవతం. దీనిని తెనిగించిన పోతన వాణిచిత్తవశీకరణైకవాణి. ఏతద్వాణీ విలాసాల వివరణమే ప్రకృతకృతి 'పోతన భాగవతము-భాషాతత్త్వ సమాలోచనము' నాగార్జున విశ్వవిద్యాలయంనుంచి పి ఎచ్. డి పట్టం పొందిన సిద్ధాంత ప్రబంధమిది.

ఏతత్కర్త వర్ధిష్ణువు, పై అచెప్ప శాస్త్రసంసేవనం వల్లనూ, ఆచార్యోపదేశం వల్లనూ, స్వయుక్తి సంపత్తి వల్లనూ, మంచి వ్యుత్పత్తిని సంతరించుకొన్న బుద్ధిశాలి ప్రాచీన వ్యాకరణ మర్యాదలనూ, ఆధునిక భాషావిజ్ఞాన మర్మాలనూ వలసినంత ఆకళించుకొన్న వ్యుత్పన్నుడు పుష్కరకాలంపైగా డిగ్రీ కళాశాలలలో పైతరగతుల విద్యార్థులకు తెలుగు భాషాసాహిత్యాలను బోధిస్తున్న అధ్యాపకుడు

విచారణనిపుణత్వం, శాస్త్రీయ విశ్లేషణం, సమగ్ర నిరూపణం ఈ రచనయందలి ముఖ్యలక్షణాలు నాగార్జున విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో నా పర్యవేక్షణలో చిరంజీవి అచెప్పచేసిన పరిశ్రమకు ఫలంగా రూపొందిన ఈ రచనను గూర్చినేను ఎక్కువగా చెప్పడం శ్రేయంగాదు.

సత్యంజ్ఞాన మనంతం నిరంతరం జయతి' అని గురుచరణుల వాక్కు తథాస్తు.

తూమాటి దొణప్ప

**Dr. C. R. SARMA,** *M A, M Litt, Ph D,*
**Professor & Head,**
**Department of Telugu**
**Madurai Kamaraj University,**
**MADURAI-625 021**

బమ్మెర పోతన ప్రసాదించిన భాగవతం మందార మకరంద మాధుర్యానికి మారు పేరు ఆ మాధుర్యాన్ని చవి చూసేందుకు రచయితలు పలువురు ప్రయత్నించారు, కృతకృత్యులయ్యారు కాని ఆ భక్త కవి భాషాతత్త్వాన్ని పరిశీలించిన వారు చాలా మంది లేరు అందులోను నిశితంగా పరిశీలించినవారు అసలు లేరన్నా అతిశయోక్తి కావనుకుంటాను కాగా, సుప్రసిద్ధ పరిశోధక విద్వాంసులు ఆచార్య తూమాటి దొణప్పగారి పర్యవేక్షణలో మిత్రులు డాక్టర్ వై ఆదెప్పగారు సాగించిన పరిశోధనకు ఫలితంగా వెలువడిన యీ బృహద్గ్రంథం భాషాసేవకుల్ని బహుధా అలరించగలదనడంలో నా కెలాంటి సందేహమూ లేదు

ఈ సిద్ధాంత గ్రంథంలో ఎన్నో వ్యాకరణాంశాలు సాధికారికంగా చర్చించబడ్డాయి. వర్ణవిచారం మొదలుకొని వాక్య విజ్ఞానం దాకా గల విభిన్న విషయాలను ఆదెప్పగారు పరిశీలించారు అవసరమైన సందర్భాలలో ఇతర ద్రావిడ భాషలలోని అంశాలను కూడా వివరించారు ఇలా తులనాత్మకంగా పరిశీలించడం అవసరమే కాక అభిలషణీయం కూడా ఇందువల్ల గ్రంథం విలువ పెరుగుతుందని నా నమ్మకం.

ఈ వివిధ విషయాలతో పాటు, పోతన కృతిలో ప్రయుక్తమైన లోకోక్తులు నుడికారాలు మొదలైన వాటిని కూడా వివరించడం జరిగింది అందువల్ల పోతన ఉపయోగించిన భాషా విశేషాల నన్నిటిని రచయిత ప్రస్తావించినట్లు భావించవచ్చు ఆసక్తిగొలిపే అంశాలు ఎన్నో చోటు చేసుకోవడం వల్ల, సిద్ధాంత గ్రంథమే అయినా, ఇది సాహిత్యోపాసకుల్ని అలరించగలదని నేను భావిస్తున్నాను

మిత్రులు ఆదెప్పగారు సాహిత్యంలో అముద్రితంగా ఉన్న విషయాలను గ్రహించి యీ కోవకు చెందిన రచనలు చేయవలెనని నా కోరిక, ఇందుకు ఆయన అర్హులని కూడా భావిస్తున్నాను

మధుర
23-1-87

చల్లా రాధాకృష్ణ శర్మ

**Prof. V. Ramachandra**
**M A., Ph. D.,**

**Professor**
**Department of Telugu,**
**University of Madras,**
**MADRAS-600 005**

Madras-5
19-1-87.

ప్రియమైన డా॥ ఆదెప్పకు,

మీ సిద్ధాంత గ్రంథమైన 'పోతన భాగవతము-భాషాతత్త్వ సమాలోచనము''ను చదివితిని

పురాణ కవులలో సహజ పాండిత్య బిరుదాంకితుడై అతి స్వతంత్రుఁడైన బమ్మెరపోతన భాగవత భాషాతత్త్వమును వివరించెడి ప్రయత్నమెంతో ప్రశంసనీయమైనది స్వతంత్రులైన కవుల ప్రయోగములు భాషాతత్త్వ ప్రదర్శనమునకు మఱింతగా నుపకరింపఁగలవు

శాస్త్రీయమైన మీ గ్రంథరచనా ప్రణాళిక పోతన భాగవత భాషాతత్త్వ నిరూపణమున కనుకూలమైయుండి మెప్పు గొల్పుచున్నది.

పోతన కవిత్వ తత్త్వము నెఱుంగుటకైన భాగవతమునె చదువవలెను ఆ భాగవత భాషా తత్త్వము నెఱుంగుటకు మీ గ్రంథము పఠించవలెను దీనిని చదివిన వారే భాగవతమును చదివినవారు.

శుభాశంసనములతో,

పి. రామచంద్ర చౌదరి

Dr. Smt T. Susheela M A, Ph. D,
READER M I L DEPT
DELHI UNIVESITY DELHI-7

శ్రీ ఆదెప్పగారి పిహెచ్ డి సిద్ధాంత వ్యాసానికి నేను కూడా ఒక పరీక్షకురాలినిగా ఉన్నాను అప్పుడా వ్యాసాన్నిసమగ్రంగా చదివాను ఇప్పుడేముద్రిత ప్రతిని మరల పఠించే అవకాశం కలిగినందువల్ల చాలా ఆనందంగా వుంది భాషా శాస్త్ర కోవిదులు, సాహిత్యతత్త్వవేత్తలు అయిన శ్రీ తూమాటి దొణప్పగారి పర్యవేక్షణలో రూపొందిన ఈ గ్రంథం తెలుగు సాహితీ సరస్వతికి మరో నూత్నాలంకారంగా అమరింది ఆదెప్పగారి భాషాశాస్త్ర, వ్యాకరణ విషయ జ్ఞానములు మెచ్చుకోదగ్గవి పోతన భాగవతంలో వర్ణముల నిర్వచన నిరూపణనుంచి సామెతలు నుడికారముల వరకు వున్న భాషని చక్కగా కూలంకషంగా పరిశీలించారు ఈ పరిశీలన తెలుగు భాషా చరిత్రక్రమ వికాస పరిణామాల అధ్యయనానికి బాగా తోడ్పడుతుంది తెలుగు భాషా పరిణామ దశలో పోతన కాలం సంధియుగం అని అనవచ్చును ఇతని భాగవతంలో ప్రాచీన అర్వాచీన రూపాల ప్రయోగాలు రెండూ మేలు కలయికను పొందాయి కాబట్టి ఇతని భాషానుశీలనం ఎంతో అవసరం పోతన భాగవత భాషానుశీలనం చేసిన వారిలో వీరే ప్రథములను కుంటాను ఈ గ్రంథం సాహితీ విద్యార్థులందరికీ ఉపకరించడం మాత్రం కాక, సాహితీ ప్రియుల మన్ననలందు కొంటుందనడంలో ఏమాత్రం సందేహం లేదు

పుస్తకం చివర జోడించినమూడు అనుబంధాలు 1 వైకృతపదములు 2 సమాసములు 3 ధాతువులు ఎంతో ఉపయోగపడేవిగా ఉన్నాయి వైకృతపదములలోవైకృత పదములు సంస్కృత భవములతో కూడిన పట్టికతోపాటు తులనాత్మక పరిశీలనకొరకు ప్రాకృత రూపాలని కూడాయిచ్చారు అలాగే "సమాసముల"లో, విభిన్నప్రకారముల సమాసాల వివరణయిచ్చారు ఇక 'ధాతువుల' లోధాతువుల వర్గీకరణతోపాటువాటిఅర్థాలనికూడా వివరించారు ఈఅనుబంధాలు వెంటనేసంప్రదించడానికి ఎంతోవుపయోగకరంగావుంటాయి ఇటువంటి ఉత్తమ గ్రంథంరచించిన శ్రీఆదెప్పగారినిఅభినందిస్తూశుభాశంసనలనందిస్తున్నాను వీరు ముందుముందు విద్యార్థులకు, విద్వజ్జనులకూ ఉపయోగపడే ఎన్నోగ్రంథాలు రచించేటట్లు సరస్వతీదేవి కృపచూపాలని ప్రార్థిస్తున్నాను

కొత్తఢిల్లీ

సుశీల.

1-2-87.

Dr. R. V. S. SUNDARAM
I K S University of Mysore,
Manasagangothri, MYSORE- 570006

"పోతన భాగవతము - భాషాతత్త్వ సమాలోచనము" అనే సిద్ధాంతగ్రంథం భాషాసాహిత్యవేత్తల దృష్టిని ఆకర్షిస్తుందనడంలో సందేహం లేదు. అర్థప్రధానంగా వికాసం చెందుతూ వచ్చిన ప్రాచీన తెలుగు సాహిత్యంలో శబ్దానికికూడా తగినంత ప్రాధాన్యాన్ని ఇచ్చిన పోతన భాగవతం ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకుంది. భాషాతత్త్వ సమాలోచనానికి అర్హమైన విశేషాలను అందించగల విశిష్టకావ్యం భాగవతం. ఈ కారణంవల్ల డా. వై. ఆదెప్ప రచించిన ఈ సిద్ధాంతగ్రంథం ఆసక్తికరమైంది.

ఆధునిక భాషాశాస్త్ర దృష్టితో ప్రాచీన కావ్యాలను పరిశీలించే పని ఇటీవలే మొదలైంది. ఇలాంటి సిద్ధాంత గ్రంథాలు కొన్ని వెలువడినా, విభిన్న సాహిత్య ప్రక్రియలద్వారా అభివ్యక్తమైన తెలుగు భాషా స్వరూపాన్ని విస్తృతంగా పరిశీలించవల్సి ఉంది. ఈ మార్గంలో డా॥ వై. ఆదెప్పగారి ప్రకృత పరిశీలన విద్వాంసులనూ, పరిశోధకులనూ ఆకర్షించగలదని నమ్ముతున్నాను.

ఆర్వీ యస్. సుందరం

# అవతరణిక

197 వ సంవత్సరము ఆంధ్ర విశ్వవిద్యాలయమందు యం ఏ పూర్తి చేసితిని 1972 వ సంవత్సరము శ్రీ చింతలపాటి బాపిరాజు ఓరియంటల్ కాలేజీ (లేపాక్షి)లో తెలుగు ఉపన్యాసకులుగా చేరితిని 1974 వ సంవత్సరము అక్టోబరు 0 వ తేదీన ప్రైవేటు కాలేజి ఉద్యోగమునకు స్వస్తి చెప్పి రాయదుర్గము ప్రభుత్వ జూనియర్ కళాశాలలో తెలుగు జూనియర్ లెక్చరరుగా చేరితిని ఉన్నత విద్యపై గల గాఢాభిలాషతో 1975 వ సంవత్సరము రీజనల్ కాలేజీ ఆఫ్ ఎడ్యుకేషను, మైసూరులో Summer School Cum Correspondence Course నందు ప్రైవేటుగా బి ఇడి పూర్తి చేసితిని తదుపరి 1977వ సంవత్సరములో రాయదుర్గము నుండి పశ్చిమ గోదావరి జిల్లా నిడదవోలుకు బదిలీ అయితిని ఆ సమయమున హిమాచల్ ప్రదేశ్ యూనివర్శిటీ వారు నిర్వహించు యం ఇడి పరీక్ష ప్రైవేటుగాSummer School cum CorreSpondence Courseలో చేరి పూర్తిచేసితిని పూజ్యులు, గురువులు, శ్రేయోభిలాషులు అయిన ఆచార్య తూమాటి దొణప్పగారు ఒక సారి అకస్మాత్తుగా హైదరాబాదులో కనిపించిరి నేను పిఎచ్ డి చేయవలయునను తృష్ణను వారికి వ్యక్తము చేసితిని వారు దానికి ఆమోదముద్ర వేసిరి 1982 వ సంవత్సరము నాగార్జున యూనివర్సిటిలో ఆచార్య తూమాటి దొణప్పగారి ఆధ్వర్యవమున పిఎచ్ డి రిజిస్ట్రేషను చేసితిని వారు ఎప్పటికప్పుడు నా యెడ వాత్సల్యములో తగిన సలహాలు ఇచ్చుచు వ్రాసిన విషయములను సరిదిద్దు చుండిరి దైవ వశాత్తు వారు తెలుగు విజ్ఞాన పీఠమునకు ప్రత్యేకాధికారిగా 1985 జనవరిలో నియమితులైరి హైదరాబాదులో ప్రత్యేకాధికారి పదవితోపాటు, అంతర్జాతీయ తెలుగు సంస్థ నిర్దేశక పదవిని స్వీకరించిన నాటి నుండి వారు విరామములేని కార్యక్రమములలో మునిగిరి ఎప్పుడు విరామములభించిన అప్పుడు రాత్రివేళలలో ఎంతో శ్రమతో నేను వ్రాసిన విషయములను సరిదిద్దుట జరిగినది.

అగష్టు 1985లో ఈ సిద్ధాంతగ్రంథమును నాగార్జున విశ్వవిద్యాలయము వారికి పి హెచ్. డి పట్టము కొరకు సమర్పించుట జరిగినది డిసెంబరు 1985లో నాగార్జున విశ్వవిద్యాలయము వారు డాక్టరేటు పట్టమును ప్రకటించిరి తెలుగువిశ్వవిద్యాలయము వారు అందించిన రూ 5000 - ఆర్థికసహాయముతో ఈగ్రంథమును ముద్రించుచున్నాను ముద్రణసమయములో ఎన్నిసార్లు సవరించినను అక్కడక్కడ తప్పులు దొర్లుట సంభవించినది పాఠకులు దీనిని మన్నించ గలరని కోరుచున్నాను "పోతన భాగవతము-భాషాతత్త్వ సమాలోచనము అను ఈ గ్రంథము పాఠకులకు ప్రయోజన కారి కాగలదని నమ్ముచున్నాను

డా వై. ఆదెప్ప.

# కృతజ్ఞతాభివందనములు

నా పరిశోధనమునకు అవకాశమును కల్పించి, సమయానుకూలముగా తగిన సలహాలను అందించుచు తమ కార్యక్రమములందు తలమున్కలగుచున్నప్పటికిని నేను వ్రాసిన విషయములను మొదటినుండి చివరివరకు ఎంతో సహనముతో సరిదిద్దుచు పరిశోధన పూర్తి అగుటకు సహకరించి గ్రంథ ముద్రణము తరువాత ఆశీస్సులందించిన పూజ్యులు గురువర్యులు వాత్సల్యపూరితులు ఆచార్య తూమాటి దొణప్పగారికి మనఃపూర్వక నమోవాకములు తమ విధిని నిర్వర్తించుచు అడిగిన వెంటనే సందేహములను నివృత్తిచేసి సహకార మందించిన డాక్టర్ ఆకురాతి పున్నారావుగారికి నా హృదయ పూర్వక నమస్సులు కొద్దిపాటి పరిచయముతో నేనడిగిన సందేహములను తీర్చిన మాన్యులు అంతర్జాతీయ తెలుగు సంస్థ ఉప నిర్దేశకులు డా యస్ శివరామమూర్తిగారికి నాకృతజ్ఞతాభివందనములు పరిశోధన ప్రైవేటుగా చేయుటకు అనుమతించిన ఉన్నత విద్యాశాఖ నిర్దేశకులవారికి నా కృతజ్ఞతా సుమాంజలులు. అవసరమైన పుస్తకములను అడిగిన వెంటనే ఇచ్చిన అంతర్జాతీయ తెలుగు సంస్థ గ్రంథాలయాధికారి గారికి, సిబ్బందికి, సకాలములో గ్రంథమును ముద్రించి యిచ్చిన శ్రీ రాఘవేంద్ర ప్రింటింగ్ వర్క్సు అధినేత శ్రీ సుకమంచి మోహనరావుగారికి, ఈ సిద్ధాంత గ్రంథమును ముద్రించుటకు ఆర్థిక సహాయము రు 5000/- అందించిన తెలుగు విశ్వవిద్యాలయము వారికి నా కృతాజ్ఞతా పూర్వక నమస్సులు.

ఈ సిద్ధాంత గ్రంథమును పరిశీలించి అభిప్రాయము అందించి ఆశీర్వదించిన విద్వాంసులు ఆచార్య చల్లారాధాకృష్ణశర్మగారికి, భాషాశాస్త్రనిపుణులైన శ్రీమతి T సుశీల గారికి, శ్రేయోభిలాషి గురుతుల్యులైన ఆచార్య వి రామచంద్ర చౌదరి గారికి మిత్రులు డా ఆర్ వి యస్ సుందరంగారికి నానమస్సుమాంజలులు

పరిశోధన ముద్రణ సమయములలో సహాయ సహకారము లందించిన నా సహధర్మచారిణి శ్రీమతి వై నాగరాజమ్మకు నా కృతజ్ఞతలు.

విజయవాడ
13 2 87

డా వై ఆదెప్ప

# విషయానుక్రమణిక

## 4. క్రియారూప విజ్ఞానము

# 0. ప్రవేశిక

## పోతన భాగవతము-భాషాతత్త్వ సమాలోచనము

భారత భాగవత రామాయణములు ఆంధ్ర వాఙ్మయమున గల ఉత్తమోత్తమ గ్రంథములు. అందు వ్యాసప్రోక్త సంస్కృత భాగవతమును సహజ పాండిత్య విభవలాంఛనుడైన బమ్మెర పోతనామాత్యుడు అనువదించినాడు. వారు యథోచితముగా సంస్కృతాంధ్రములు మేళవించి అందరును మెచ్చునట్లు రచించిన ఉభయ భాషా రచనాశోభితుడాయన.

నివాస ప్రాంత విషయమున వివాదాభిప్రాయములున్నను పోతన పదునైదవ శతాబ్దమువాడని పరిశోధకులు నిర్ధారించిరి. వీరభద్ర విజయము, భోగినీదండకము, నారాయణ శతకము కర్తృత్వవిషయముగా వాదోపవాదములు ఉన్నవి. ఆంధ్ర భాగవత భాగములు అనేక కారణములచే నశించుటచే అనువదింపబడి అచ్చు రూపమును పొందినవి. పంచమస్కంధమును బొప్పరాజు గంగయయు, షష్ఠస్కంధమును ఏర్చూరి సింగనయు, ఏకాదశ, ద్వాదశ స్కంధములను వెలిగందల నారయయు పూరించినట్లు ప్రత్యక్ష ప్రమాణముల ఆధారముగా పరిశోధకులు నిర్ణయించిరి. మిగిలిన భాగములందు ద్వితీయ చతుర్థ స్కంధములలోను దశమ స్కంధము ఉత్తర భాగమునందును ఇతర కవుల చేయి కొంతలో కొంత కలదను అభిప్రాయమును కలదు. ప్రస్తుత సమీక్ష వ్యాసమునకు ఆంధ్ర భాగవతము నందలి ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, సప్తమ, అష్టమ, నవమ, దశమ స్కంధములలోని భాషా ప్రయోగములు ఆధారముగా స్వీకరింపబడినవి.

భగవంతుడు శబ్ద శాస్త్రమునకు కారణుడని పోతన మనసార నమ్ముట వలన-

పలికెడిది భాగవతమట
పలికించు విభుండు రామభద్రుండట నే
బలికిన భవహరమగునట
పలికెద వేఱొండు గాథ పలుకగనేలా అని

తత్సమ పద నిర్మాణము — అజంత ప్రాతి పదికలు
హలంత ప్రాతి పదికలు

వైకృతి పద నిర్మాణము, అన్య దేశ్యములు, సర్వనామ, సంఖ్యావాచక, విశేషణ, లింగవచన, నామ విభక్తులు వాని రూప నిష్పత్తి, విభక్తి విపర్యయము, సమాసము మొదలగునవి ఉదాహరణ వ్యాఖ్యకముగా విశ్లేషింపబడినవి

నాల్గవ అధ్యాయము క్రియా రూప విజ్ఞానము

ఇందు ధాతు నిర్మాణము, సామాన్య సంశ్లిష్ట సంయుక్త ధాతువుల స్వరూప స్వభావములు, సార్వనామికానుబంధములు, కాలబోధక ప్రత్యయములు, సామాన్య సంయుక్త సమాపక క్రియలు, అకర్మక, సకర్మక, ప్రేరణార్థకములు, అసమాపక క్రియలు, క్రియా విశేషణములు మొదలగు విషయములు పరామర్శింపబడినవి

ఐదవ అధ్యాయము వాక్య విజ్ఞానము

సామాన్య వాక్యములు క్రియారహిత వాక్యములు, క్రియా సహిత వాక్యములు, సంశ్లిష్టవాక్యములు, సంయుక్త వాక్యములు, అనుకృతివాక్యములు ఉపపత్తులతో పరిశీలించుట జరిగినది

పోతన ప్రయోగించిన ప్రధాన లోకోక్తులు, నుడికారములు ఆరవ అధ్యాయమున వివరింపబడినవి.

ఈ సిద్ధాంత గ్రంథమున నిర్ధారితమైన సారాంశము సింహావలోకనముగ సమీక్షింపబడినవి.

ఈ సిద్ధాంత వ్యాసమునకు నాలుగు అనుబంధములు జోడింపబడినవి వైకృత పదములు - మాతృకలతో కూడిన పద పట్టిక మొదటి అనుబంధమందును, రెండు మూడు నాలుగైదు ఆరు మొదలగు అంశముల సమాసముల వర్గీకరణము రెండవ అనుబంధమందును, ఆచ్ఛికములైన సామాన్య, సంశ్లిష్ట, సంయుక్త ధాతువులు తత్సమ సంశ్లిష్ట ధాతువులు వాని అర్థ వివరణము మూడవ అనుబంధమందును. ఉపయుక్త గ్రంథపట్టిక నాల్గవ అనుబంధమందును ప్రదర్శింపబడినవి.

# 1. వర్ణవిచారము [PHONOLOGY]

## 1.0 వర్ణ వ్యవస్థ :

పోతన భాగవత భాషయందలి వర్ణముల తీరుతెన్నులను పరిశీలించిన ఈ క్రింది స్వరూపము వ్యక్తమగును. ఈ వర్ణములను రెండు భాగము లుగా విభజింపవచ్చును.

1. దేశ్య పదఘటితములైన వర్ణములు
2 తత్సమ పదఘటితములైన అదనపు వర్ణములు

1.1 పోతన భాషలో గల దేశ్య పదఘటితములైన వర్ణములను అచ్చుల, హల్లుల విభాగము ననుసరించి పరిశీలింతము.

1. అచ్చులు . 10 :

అ ఇ ఉ ఎ ఒ అను అచ్చులు ఐదు, వాని దీర్ఘములైన ఆ ఈ ఊ ఏ ఓ అనునవి ఐదు మొత్తము పది. హ్రస్వ, దీర్ఘము లనెడు భేదమేకాని నిజమునకు అది ఒక అచ్చే; ఆ పక్షమున అ, ఇ, ఉ, ఎ, ఒ లతో పాటు దీర్ఘమును చేరిన ఆరచ్చులు మాత్రమే తెలుగున నున్నట్లు లెక్క

అచ్చుల పట్టిక :

ఇందు కొన్ని వివృతములు, అర్ధవివృతములు మరికొన్ని సంవృతములు, అర్ధసంవృతములు కొన్ని అగ్రస్వరములు మరికొన్ని పశ్చాత్ స్వరములు. వీని వివరణము క్రింది పట్టికలో రూపితము.

| | అగ్రస్వరము (Front Vowel) | పశ్చాత్ స్వరము (Back Vowel) |
|---|---|---|
| సంవృతము | ఇ | ఉ |
| అర్ధ సంవృతము | ఎ | ఒ |
| వివృతము | అ | |

ఐ, ఔ లను సంధ్యక్షరములని అందురు. ఈ రెండును తెలుగున గల అచ్చులలో వ్యాకరణకారు లందరును పఠించిరి. కాని, ఇవి ప్రత్యేక వర్ణములు కావు. అర్థము భేదించు స్వభావము వానికి లేదు. ఐ ఔ లలో తొలుత అ కారమును స్వరవ్యంజనముల పిమ్మట య కార వ కారములును క్రమముగా సమాహారములయి యున్నవి. అనగా తొలుత స్వరధర్మమును, ఆ మీద వ్యంజన ధర్మమును కలిసినవి. కావున వీనిని ప్రత్యేక వర్ణములుగా స్వీకరింపలేదు. ఇవి క్రమముగా అయి (అయ్) అవు (అవ్) లు వాని రూపాంతరములని చెప్పవచ్చును.

పోతన ప్రయోగములు :

ఐ : 'మంద బుద్ధులమైన మమ్ము' 1-320

అయి : 'శోకంబయిన లోకంబు' 1-295

ఔ : 'నమరన్ విన్న నయంచెనేని విజనంశ శ్రీకరుండౌదుడిన్' 7-351

2. హల్లులు : పోతన భాషలో ప్రయుక్తములైన హల్లులు మొత్తము 21 :

దేశ్య తత్సమ పద ఘటితములైన హల్లులు ఇక్కడ ఈయబడినవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అవి : | ప బ | త ద | ట డ | చ జ | క గ |
| | ఫ భ | థ ధ | ఠ ఢ | ఛ ఝ | ఖ ఘ |
| | మ | న | ణ | | |
| | వ | ర ల | ఱ ళ | య | |
| | | స | ష | శ | హ |

1.1.1. పోతన భాగవతమున వచ్చు అచ్చుల నిర్ధారణమును క్రింది విధముగా పరిశీలింపవచ్చును.

| /అ, ఇ/ | ప్రథమాచ్చు | ద్వితీయాచ్చు |
|---|---|---|
| అజాది | హలాది | |
| అది 4-220 | మమ్ము 3-528 | |

| | | | |
|---|---|---|---|
| | ఇది 4-394 | మిమ్ము 4-607 | — |
| | అట్టి 8-76 | నన్ను 4-161 | |
| | ఇట్టి 4-404 | నిన్ను 4-358 | — |
| /అ, ఉ/ | అంద్రు 3-944 | మద్దు 10.పూ.1328 | నడపు 1-224 |
| | ఉంద్రు 4-816 | ముద్దు 9-168 | నడుపు 10.ఉ.7 |
| /అ, ఎ/ | అట్టి 7-53 | చలి 9-171 | |
| | ఎట్టి 10 పూ 676 | చెలి 9-320 | — |
| | అద్ది 4-256 | రండు 10.పూ.1269 | |
| | ఎద్ది 4-67 | రెండు 10.పూ.1228 | — |
| /అ, ఒ/ | అక్కు 8-182 | చక్కు 10 ఉ,523 | — |
| | ఒక్కు 10 పూ.1738 | తొక్కు 10 ఉ 1031 | — |
| /ఇ, ఉ/ | ఇంట 4-86 | చిట్టు 10 ఉ 1172 | వాడి 10.పూ 867 |
| | ఉంట 8-61 | చుట్టు 10 ఉ 568 | వాఁడు 1-99 |
| /ఇ, ఎ/ | ఇంత 3-397 | చిక్కు 3-309 | అది 3-721 |
| | ఎంత 8-389 | చెక్కు 10 పూ 1082 | అదె 9-405 |
| | ఇన్ని 8-565 | | వారి 1-304 |
| | ఎన్ని 10 పూ 1709 | | వారె 10 ఉ.502 |
| /ఇ, ఒ/ | ఇత్తు 4-289 | చిక్కు 3-309 | — |
| | ఒత్తు 7-259 | చొక్కు 10.ఉ.1031 | — |
| /ఉ, ఎ/ | ఉక్కు 10.ఉ 403 | తొలి 10.పూ.807 | అదరు 10.ఉ 55 |
| | ఎక్కు 10.ఉ 1292 | తెలి 9-432 | అదరె 9-455 |
| /ఉ, ఒ/ | ఉండు 7-184 | | |
| | ఒండు 4-890 | — | — |
| /ఎ, ఒ/ | ఎల్లి 10 పూ.801 | మెఱుగు 3-604 | — |
| | ఒల్లి 10 పూ.678 | మొఱుగు 8-87 | |

## 1.1.1.2 అచ్చులందు హ్రస్వదీర్ఘముల భేదక ప్రవృత్తి-
ప్రథమాచ్చుగా

| | అజాది | హలాది |
|---|---|---|
| /అ, ఆ/ | | వలు 4-492<br>పాలు 4-418 |
| /ఇ, ఈ/ | ఇరు 4-219<br>ఈరు 4-402 | విను 3-20<br>పీను 8-452 |
| /ఉ, ఊ/ | —<br>— | కుడు 9-438<br>కూడు 8-331 |

## 1.1.1.3 దీర్ఘముల మధ్య అచ్చులు

| | | |
|---|---|---|
| /అ, ఈ/ | అ 2-85<br>ఈ 10 పూ.1033 | మాకు 7-43<br>మీకు 4-733 |
| /అ, ఊ/ | అర్పు 3-620<br>ఊర్పు 10.పూ 1756 | మాయరు 8-448<br>మూయరు 8-448 |
| /అ, ఓ/ | అ 3-227<br>ఓ 9-283 | క్రాలు 10.పూ.213<br>క్రోలు 3-194 |
| /ఈ, ఊ/ | ఈరు 4-402<br>ఊరు 10 పూ.725 | |
| /ఈ, ఏ/ | ఈరు 4-402<br>ఏరు 2-9 | నీరు 10.ఉ.114<br>నేరు 10.పూ.656 |
| /ఈ, ఓ/ | ఈరు 4-402<br>ఓరు 7-95 | |
| /ఏ, ఓ/ | ఏరు 2-9<br>ఓరు 7-95 | |

## 1.1 2.1. హల్లుల శ్వాసనాద భేదము

| | పదాది | అపదాది |
|---|---|---|
| /క, గ/ | కట్టి 10.ఉ 140 | చనక 9-230 |
| | గట్టి 10 పూ 838 | చనగ 1-50 |
| /చ, జ/ | చలము 10 పూ 140 | చల్లు |
| | జలము 8-600 | జల్లు 9-315 |
| /ట, డ/ | పాటు 2-33 | |
| | పాడు 10 పూ.725 | |
| /త, ద/ | — | — |

## 1.1.2.2 ద్విత్వరూపములు :

| | | |
|---|---|---|
| /క్క, గ్గ/ | — | అక్క 8-182 |
| | | అగ్గ 10 పూ 1214 |
| | | ఎక్కు 10 ఉ 1292 |
| | | ఎగ్గు 3-130 |
| /చ్చ, జ్జ/ | — | — |
| /ట్ట, డ్డ/ | — | గట్టి 10.పూ 838 |
| | | గడ్డి 1 420 |
| | | పట్టు 10 ఉ 84 |
| | | పడ్డ 3-623 |
| /త్త, ద్ద/ | — | ఎత్తు 10 పూ 145 |
| | | ఎద్దు 10 ఉ.521 |
| /ప్ప, బ్బ/ | — | అప్పు 1-406 |
| | | అబ్బు 1-173 |
| /న్న, మ్మ/ | — | |
| | | అన్న 10 పూ 150 |
| | | అమ్మ 10 పూ.150 |
| | | కమ్మ 1-347 |
| | | కన్న 3-130 |

/య్య, ల్ల/ — ఒయ్యన 10 పూ 609
ఒల్లన 3-158

**1.1.3 వర్ణముల నిర్వచన వ్యాప్తులు :**

**1.1.3 1 అచ్చులు ( OWELS) :**

/అ/ సంపూర్ణ వివృత అగ్రహ్రస్వ స్వరము :
(OPEN SHORT FRONT VOWEL)

| పదాది | పద మధ్యము | పదాంతము |
|---|---|---|
| అది 4-220 | గనపు 10 పూ 881 | చిఱుత 10 పూ 224 |
| అల్లుడు 10 పూ 50 | కదమ 10 పూ 848 | త్రొక్కుట 10 పూ 368 |
| కమ్న 8-652 | చెనకు 10 ఉ 566 | దొరగ 10.ఉ 417 |

/ఆ/ సంపూర్ణ వివృత అగ్ర దీర్ఘస్వరము :
(Open Long Front Vowel)

| | | |
|---|---|---|
| ఆతము 10 పూ 624 | చూలాలు 9-610 | అకటా 1-162 |
| నాలుగు 9-8 | పొల్పారు 10 పూ 355 | ఎట్టెట్టా 10 పూ.1257 |

/ఇ/ తాలవ్య సంవృత విస్తారిత హ్రస్వస్వరము :
(Close Front Spread Short Vowel)

| | | |
|---|---|---|
| ఇద్దఱు 10 పూ 1082 | కోరిక 3-507 | ఎఱమి 10 ఉ 180 |
| చిఱుత 10 పూ 224 | తేనిడు 10.పూ.951 | తొయ్యలి 10 పూ 1454 |

/ఈ/ తాలవ్య సంవృత విస్తారిత దీర్ఘస్వరము :
(Close Front Spread long Vowe )

| | | |
|---|---|---|
| ఈవియు 3-589 | కన్నీరు 10 ఉ 344 | చుమ్మీక 4-20 |
| చీకటి 9-132 | పన్నీరు 10 ఉ.241 | |

/ఉ/ సంపూర్ణ సంవృత పశ్చాదోష్ఠ్య హ్రస్వ స్వరము :
(Back Close Rounded Short - Vowel)

| | | |
|---|---|---|
| ఉడుకు 10 పూ.635 | కినుక 10 ఉ 912 | ఎగ్గు 1-517 |
| చుట్టము 3-146 | పడుగు 10 పూ.706 | మఱపు 10.పూ.224 |

/ఊ/ సంపూర్ణ సంవృత పశ్చాదోష్ఠ్య దీర్ఘస్వరము :

(Back Close Rounded long - Vowe )

ఊర్పు 10 ఉ 741

కూడు 9-299 — —

అపదాది దీర్ఘము ఉండవు

/ఎ/ అర్ధ సంవృత విస్తారిత అగ్ర హ్రస్వ స్వరము :

(Half Close Front Spread Short - Vowel)

ఎంత 8-389 — ఒక్కతె 4-47

పెక్కు 10 ఉ 541 —

/ఏ/ అర్ధ సంవృత విస్తారిత అగ్ర దీర్ఘ స్వరము :

(Half Close Front Spread Long - Vowe )

ఏము 9-118

మేలు 10 ఉ.328 — —

అపదాది దీర్ఘము ఉండవు.

/ఒ/ అర్ధ సంవృత పశ్చాదోష్ఠ్య హ్రస్వ స్వరము :

(Half Close Back Rounded Short - Vowel)

ఒరలు 10 పూ.1658

చొక్కు 7-150 — —

/ఓ/ అర్ధ సంవృత పశ్చాదోష్ఠ్య దీర్ఘ స్వరము :

(Half Close Back Rounded Long - Vowel)

ఓడు 7-93 పద మధ్య దీర్ఘము సమస్త

పోడు 8-67 పదములలో మాత్రమే కన్పించును

నెమ్మోము 10 పూ.346

## 1.1.3.2 హల్లులు : (CONSONANTS)

దేశ్య వర్ణములైన క గ చ జ ట డ ణ త ద న ప బ మ య ర ల ళ వ స హ తత్సమ పదఘటిత వర్ణములు మహాప్రాణములైన ఖ ఘ ఛ ఝ ఠ ఢ థ ధ ఫ భ లు ఊష్మములైన శ, ష లు (ఈ తత్సమ పదఘటిత వర్ణములు తెలుగున ప్రయోగవశమున ప్రవేశించినవి అన్యేచ అనుప్రవిశంతి శబ్దయోగ వశాత్, అని వ్యాకర్తలు నుడివిరి) వీనికి చెందిన వర్ణ నిర్ణయముల చర్చ క్రింద చూపబడినవి.

### /క/ జిహ్వామూల హనుమూలీయ శ్వాసవత్ స్పర్శము।

(Unvo ced Unaspırated Dorso-Velar Stop)

| పదాది | అపదాది | ఉపదావర్ణముగా |
|---|---|---|
| కూతురు 3-378 | చక్కని 8-669 | కలికి 10.ఉ 331 |
| కొడుకు 9-44 | చేకులు 4-734 | తోక 10.ఉ.544 |

### /ఖ/ జిహ్వామూల హనుమూలీయ శ్వాసవత్ స్పర్శము :

(Unvoıced Aspırated Dorso – Ve ar Stop)

| | | |
|---|---|---|
| ఖగము 10 పూ.275 | అఖిల 1-62 | రేఖా 3-85 |
| ఖడ్గము 1-121 | దుఃఖము 4-95 | శిఖి 2-260 |
| ఖరము 2-49 | సుఖము 4-282 | శాఖ 1-83 |

### /గ/ జిహ్వామూల హనుమూలీయ నాదవత్ స్పర్శము :

(Voıced Unasp rated Dorso – Velar Stop)

| | | |
|---|---|---|
| గీటు 9-120 | ఎగయు 1-452 | ఈగ 8-0 |
| గెల్పు 8-154 | వగపు 1-224 | మడుగు 9-59 |

/ఘ/ జిహ్వామూల హనుమూలీయ నాదవత్ స్పర్శము

(Voiced Aspirated Dorso - Velar Stop)

ఘనుడు 2-75 మేఘము 3-639 అనఘా 1-104

ఘోరము 3-938 విఘాతు 3-376 అఘ 1-47

ఘూకము 1-342

/చ/ తాలవ్య శ్వాసవత్ స్పృష్టోష్మము :

(Unvoiced Unaspirated Palatal Affricate)

చెడు 10.పూ 534 తోచెను 7-145 కలచు 10 ఉ.929

చెప్పు 3-82 గోచి 1-77

/ఛ/ పైదాని వలె

ఇందలి ప్రత్యేకత మహాప్రాణము

ఛిన్నుడు 2-66 పింఛము 9-599 మూర్ఛ 3-985

/జ/ తాలవ్య నాదవత్ స్పృష్టోష్మము :

(Voiced Unaspirated Palatal Affr cate)

జిలుగు 10.ఉ 804 — —

జేగురు 10.ఉ.742 — —

/ఝ/ అంతయు పైదానివలె. ఇందలి ప్రత్యేకము మహాప్రాణము.

ఝషము 8-212 ఝుంఝూనిల 3-986 —

ఝిల్లి 8-25 —

/ట/ మూర్ధన్య శ్వాసవత్ స్పర్శము :

(Unvoiced Unaspirated Retroflex Stop)

టంకరించు 7-334 అరాటము 1-250 ముచ్చట 1-282

(ధ్వన్యనుకరణము) దాటుల 10 పూ 851 చీకటి 10 ఉ.1306

/ఠ/ పైదానివలె. ఇందలి ప్రత్యేకత మహాప్రాణము.

| | | |
|---|---|---|
| కఠ 9-615 | కంఠము 2-51 | — |
| | పీఠము 3-282 | — |

/డ/ మూర్ధన్య నాదవత్ స్పర్శము ।

(Voiced Unaspirated Retroflex Stop)

| | | |
|---|---|---|
| డప్పి 1-459 | అడరు 1-34 | చెడు 10 పూ.534 |
| డాయు 3-550 | వడపు 1-224 | ఈడు 4-402 |

/ఢ/ పైదానివలె. ఇందలి ప్రత్యేకత మహాప్రాణము.

| | | |
|---|---|---|
| — | మూఢులు 1-84 | — |
| — | రూఢము 8-711 | — |

/ణ/ మూర్ధన్యాను నాసికము ।

(Voiced Unaspirated Retroflex Nasal)

| | | |
|---|---|---|
| — | — | జాణ 8-318 |

/త/ దంత్య శ్వాసవత్ స్పర్శము :

(Unvoiced Unaspirated Dental Stop)

| | | |
|---|---|---|
| తామ 10.ఉ 1026 | నేతులు 10 పూ.899 | తోడుత 10 పూ.774 |
| తాలిమి 10ఉ.10 | మూతులు 10.పూ.523 | వదంతి 4-825 |

/థ/ అంతయు పైదానివలె. ప్రత్యేకత మహాప్రాణము.

| | | |
|---|---|---|
| — | ప్రథమ 8-13 | కథ 1-51 |
| | | వీథి 1-420 |

/ద/ దంత్య నాదవత్ స్పర్శము :

(Voiced Unasp rated Dental Stop)

| | | |
|---|---|---|
| దొంగ 8-648 | పొదుగు 10.పూ.178 | అలంది 10.ఉ.674 |
| దొంతులు 3-415 | మొదలి 10 పూ.807 | వయ్యెద 10.ఉ.170 |

/ధ/ పైదానివలె. ఇందలి ప్రత్యేకత మహాప్రాణము.

ధనము 2-53 క్రోధము 2-130 బాధ 3-71
ధీరులు 1-138 విధాత 2-225 వధ 1-35

/న/ దంత్యాను నాసికము :

(Voiced Unaspirated Dental Nasal)

తెలుగు నందలి 'న' వర్ణము నాలుగు విధములైన ధ్వనులుగా వినిపించు చున్నది. వీని వ్యాప్తి వివరముగా నిర్ణయింపనగును

1 జిహ్వామూల హనుమూలీయాను నాసికము [ఙ]

2 తాలవ్యాను నాసికము [ఞ]

3 దంతమూలీయాను నాసికము [ న ]

4. దంత్యాను నాసికము [న]

ఈ నాల్గింటిలో దంత్యానునాసికము (న) మాత్రమే వర్ణము. తక్కినవి కావు. ఙ, ఞ, ' న ' లు పరిసర నిర్ణీత వ్యాప్తిలో గల సవర్ణములు (Allophones) మాత్రమే పరిసరాలనుబట్టి వీని పాత్రను నిరూపింప వచ్చును.

ఙ, ఞ, ' న ' అను ధ్వనులు, (న) దంత్యానునాసికమునకు సవర్ణములు.

/న/ త, ద లకు పూర్వము వచ్చును :

అంతకుడు 10.పూ.1423 కొంత 10 పూ.429
అందరు 7-32 కొందలు 10.ఉ.1215

'న'. పదాదిని, అచ్చుల మధ్య, ద్విరుక్తస్థితి, పదాంతమందు వర్తించును.

నగవు 10.ఉ 270 కనలు 9-425 కొన్ని 10.ఉ.111
నీవు 4-631 కనరు 10 పూ 123 కన్ను 10 పూ 1667

అనియెన్ 4-687

మొదలన్ 3-361

ప్రస్తుతము దంత్యామ నాసికము : (న)

అంత 3-790

— కొందఱు 7-148 —

/ప/ ఉభయోష్ఠ్య శ్వాసవత్ స్పర్శము :

(Unvo ced Udaspırated Bı ab al Stop)

| | | |
|---|---|---|
| పగలు 8-27 | మాపటి 10 పూ 1129 | చూపు 10 పూ.292 |
| పెక్కు 10.ఉ.544 | ఏపారు 8-170 | వేలుపు 8-269 |

/ఫ/ ఉభయోష్ఠ్య శ్వాసవత్ స్పర్శము :

(Unvoıced Aspırated B labıal Stop)

| పదాది | అపదాది | ఉపదా |
|---|---|---|
| ఫణము 8-211 | కఫము 3-983 | — |
| ఫాలము 1-521 | | — |
| ఫుల్లాంక 9-222 | | — |

/బ/ ఉభయోష్ఠ్య నాదవత్ స్పర్శము :

(Voıced Unasp rated Bı abıal Stop)

| | | |
|---|---|---|
| బిడ్డ 3-983 | ఏబంగ్రుదు 9-497 | ద్రొబ్బు 10.పూ.1143 |
| బొంకు 8-643 | చిబుకము 10.ఉ.1162 | గుబ్బ 19.పూ 213 |

/భ/ ఉభయోష్ఠ్య నాదవత్ స్పర్శము :

పైదానివలె. దీనియందలి ప్రత్యేకత మహాప్రాణము.

| | | |
|---|---|---|
| భారము 1-378 | అభిజ్ఞ 1-34 | ప్రభ 1-34 |
| భిక్షలు 1-114 | లాభము 2-20 | వల్లభ 1-38 |
| భీతి 1-318 | ఏభుదు 1-358 | |

/మ/ ఉభయోష్ఠ్యాను నాసికము :

(Voiced Unaspirated B abial Nasal)

| | | |
|---|---|---|
| మేము 10 ఉ.378 | అమరు 2-460 | తాలిమి 9-462 |
| మేలు 10.ఉ.328 | వేమఱు 10.ఉ.961 | మనసు 10 పూ 11 |

/య/ తాలవ్య అంతస్థ నాదవత్ స్పర్శము :

(Fr ctionless Pa atal Cont nuant Semi – Vowel)

| | | |
|---|---|---|
| పదాది వ్యాప్తి | బయలు 10.ఉ.232 | అరయు 10.ఉ.658 |
| లేదు | కయ్యము 8-626 | తేవియ 10.పూ.951 |

/ద/ దంతమూలీయ తాడితము : (Apico Alveolar Flap)

| | | |
|---|---|---|
| రండు 10 పూ 1209 | తిరుగు 10 పూ 85 | పేరు 10 ఉ 508 |
| రెండు 10 పూ 1228 | వెరవు 4-348 | వేవురు 9-536 |

/ఱ/ దంతమూలీయ అధిక కంపితము :

(Apico – alveolar more tri led - Continuant)

| | | |
|---|---|---|
| ఱట్టు 15.ఉ 492 | కఱచు 1-435 | కొందఱు 7-148 |
| ఱంకె 10 పూ 709 | మెఱుగు 3-604 | చెఱ 10 ఉ 746 |
| ఱేడు 8-401 | వెఱగు 10 పూ 1785 | నూఱు 10 ఉ.295 |

/ల/ దంతమూలీయ పార్శ్వికాంతస్థము :

(Apico – alveolar lateral Continuant)

| | | |
|---|---|---|
| లావు 8-419 | బలియు 9-171 | తేలు 7-150 |
| లేత 9-559 | వలపు 4-146 | బెబ్బులి 10 ఉ 238 |
| లేమి 4-409 | సొలయు 4-228 | మీరలు 10 పూ 1024 |

/ళ/ మూర్ధన్య పార్శ్వికము :

(Retrof ex lateral Continuant)

| | | |
|---|---|---|
| పదాది | తాళము 0 పూ 1381 | కాళ్ళ 8-60 |
| వ్యాప్తిలేదు | | క్రొత్తళ్ళ 10 పూ 1506 |

/వ/ ఉభయోష్ఠ్యాంతస్థము : (Bilabial Semi - Vowel)

| | | |
|---|---|---|
| వదస 10 ఉ.1000 | ఏవురు 9-703 | అవి 3-719 |
| వీడు 7-185 | తవిలి 3-691 | వగవు 1-224 |
| వేడిమి 10 పూ 934 | తవిరి 3-415 | వీవు 7-166 |

/శ/ తాలవ్యోష్మము : (Palatal Fricative)

| | | |
|---|---|---|
| శబ్దము 1-516 | శుకుడు 1-36 | కులిశ 3-85 |
| శరము 1-163 | లేశము 1-160 | ఊర్వశి 2-132 |
| శుభము 2-5 | కేశవు 3-510 | |

/ష/ మూర్ధన్య ద్రోణికోష్మము :

(Retroflex Groove Fricative)

షోడశ 3-263

మేషము 4-157

విషయము

/స/ దంతమూలీయ విస్తారితోష్మము :

(Apico - Alveolar Spread Fricative)

| | | |
|---|---|---|
| సిగ్గు 10 పూ.1033 | ఎసగు 3-138 | దాసి 10 ఉ.849 |
| సెలవు 10.ఉ.533 | కొసరు 10.ఉ.834 | మొనసి 10.ఉ 195 |
| సొబగు 4-562 | ముసలి 9-175 | వెలిసి 10.పూ.1342 |

/హ/ నాద తంత్రీ యోష్మము :

(Glottal Aspirated Fricative)

పోతన వాడిన దేశ్య పదములలో 'హ' కార ఘటిత రూపములు లేవు. తత్సమ తద్భవములలోను, ఎరవు తెచ్చిన పదములలో 'హ'కార ఘటితములు కన్పట్టుచున్నవి

హయము 9-205 ఆహరించు 10.పూ.607 ఉహ 10 ఉ.411
హీనుఁడు 4-574 ఓహటించు 7-391
హేయము 10 ఉ 939 ఆహారము 3-39

1.1 4 తెలుగున పదాదియందు గాని, అపదాదియందు గాని సంయుక్త వర్ణ నిర్మాణము మిక్కిలి అరుదు. మూల ద్రావిడ భాషలోని సంయుక్త వర్ణ నిర్మాణము తెలుగున ఏర్పడుట అర్వాచీనలక్షణము. క గ త ద ప బ మ వ స అను ఈ తొమ్మిది హల్వర్ణములు మొదటి వర్ణములుగాను రేఫ ద్వితీయ వర్ణముగాను రూపొందిన సంయుక్తత దేశ్య పదములందు కన్పట్టును. క, ఫ, ధ, వ, బ, వ, శ అను ఏడు హల్వర్ణములు మొదటి వర్ణములుగాను రెండవ వర్ణము రేఫముగాను, ఖ, ధ, శ, లు మొదటి వర్ణములుగా య రెండవ వర్ణముగాను, త, ధ, శ, స మొదటి వర్ణములుగా 'వ' రెండవ వర్ణముగాను 'శ' వర్ణము అకారముతోను, స వర్ణము ఖ, త, ఫ ల తోను తత్సమములందు పదాదిగా సంయుక్తత చెందును.

ఇవి వర్ణవ్యత్యయము కారణముగా ఏర్పడినవని విజ్ఞుల వివేచనము. ప్రాచీన ద్రావిడ భాషలో నాటి ధాతు నిర్మాణములో మూడవ స్థానమందు ప్రవర్తితమైన రేఫ/ఱ ద్వితీయ స్థానమునకు వర్ణవ్యత్యయము కారణముచే మారి పిమ్మట రేఫగా మార్పుచెంది పదాది సంయుక్తతకు కారణమైనది. అపదాది యందు ట, డ, న, ప, య, ర, ల లు మొదటి వర్ణములుగాను క గ చ డ త వ, మ, ర, వ లు రెండవ వర్ణములుగాను దేశ్యములందు కన్పట్టుచున్నవి తత్సమములందు క, ఖ, గ, ఘ, ఢ, ణ, త, థ, ద, ధ, న, బ, భ, మ ర, ల, శ, ష, హ లు మొదటి వర్ణములుగాను క గ ఘ చ ఛ ట ర ణ త థ ధ న ప ఫ భ మ య ర వ ష లు రెండవ వర్ణములుగా కన్పట్టుచున్నవి. ఇవి యన్నియు పద మధ్యాచ్చు లోపము వలన సిద్ధించిన సంయుక్త వర్ణములు

1. క వర్ణమునకు దేశ్యములందు పదాదిలో పరముగా రేఫము వచ్చును.

| పదాది | అపదాది |
|---|---|
| క్రుస్సి 10.పూ 1117 | — |
| క్రోలు 4-925 | — |

తత్సమములందు పదాదిగా క వర్ణమునకు రేఫము, అపదాదిగా, త, య, ర లు వచ్చుచున్నవి.

| | |
|---|---|
| క్రమము 7-412 | ముక్తి 3-547 |
| క్రోధము 8-624 | రక్తి 3-563 |
| | వాక్యము 10.ఉ.997 |
| | చక్రము 8-109 |

2. ఖ వర్ణమునకు 'య' సంయుక్తత యందు వచ్చును.

| | |
|---|---|
| ఖ్యాతి 4-101 | సౌఖ్యము 1-44 |
| | సాంఖ్యము 10.పూ.1471 |

3. గ వర్ణమునకు దేశ్యములందు పదాదిలో పరముగా రేఫము వచ్చును.

| | |
|---|---|
| గ్రుడ్డి 1-313 | గ్రద్దన 10 పూ.1342 |

తత్సమములందు క వర్ణమునకు అపదాదిగా ధ, న, య, రలు సంయుక్త వర్ణములుగా కవ్పించుచున్నవి.

| పదాది | అపదాది |
|---|---|
| | దగ్ధము 10.ఉ.1206 |
| | అగ్ని 3-342 |
| | యోగ్యుడు 4-379 |
| | ఉగ్రుడు 10.ఉ 1149 |

4. ఘ వర్ణమునకు పదాది యందు 'ర', అపదాదియందు య, రలు సంయుక్తతలో వచ్చును.

ఘ్రాణము 3-963 | శ్లాఘ్యము 4-453
అఘ్రాణము 83-35

5. చ, ఛ, జ, ఝ వర్ణములకు సంయుక్తత లేదు.

6. దేశ్యములందు ట వర్ణము అపదాదిగా న, ర లతో సంయుక్తత చెందును.

— | కట్నము 10 పూ 1208
తొట్రు 9-706

తత్సమములందు అపదాదిగా పర వర్ణముగా 'ట' కన్పించు చున్నది.

కష్టము 7-406
అష్టమి 10 పూ.1429

ఠ వర్ణమునకు సంయుక్తత లేదు.

7. దేశ్యములందు అపదాదిగా 'డ' వర్ణము క, చ, త, ప, య, వ లతో కలిసి సంయుక్తత చెందును.

పదాది | అపదాది
మాడ్కి 10 పూ.787
ఏడ్పు 3-1005
తోడ్తెచ్చు 10.ఉ 981
దాడ్పు 3-821
ఈడ్యము 3-742
ఏడ్వరు 3-830

8. ఢ వర్ణము అపదాది యందు య, ర లతో కలిసిన సంయుక్తత చెందును.

— | ఆఢ్యుడు 1-60
మేఢ్రంబు 3-899

9. తత్సమములందు 'ణ' వర్ణమునకు అపదాదిగా 'య' కారము సంయుక్తత యందు వచ్చును.

| | |
|---|---|
| — | కారుణ్యము 10 పూ.1497 |

దేశ్యములందు అపదాదిగా 'ణ' వర్ణము ద ర, డల ల కలయికతో సంయుక్తత యందు కవిపించును

| పదాది | అపదాది |
|---|---|
| | ఎవమండ్రు 9-722 |
| | పండ్లు 10.ఉ.881 |

10. తవర్ణము దేశ్యములలో పదాది యందు రేఫముతో సంయుక్తత చెందును.

| | |
|---|---|
| త్రవ్వ 8-183 | — |
| త్రాడు 10 పూ 355 | — |

తత్సమములందు తవర్ణము పదాదిగా 'వ' కారముతో అపదాదిగా వ, మ, య, లతో కలిసి సంయుక్తత యందు వచ్చును.

| | |
|---|---|
| త్వక్కువ 3-425 | యత్నము 10 ఉ 74 |
| | ఆత్మ 3-474 |
| | సత్యంబు 4-720 |

11. 'థ' వర్ణము యరలతో కలిసి సంయుక్తత అపదాదిగావచ్చును.

| | |
|---|---|
| — | తథ్యము 7-202 |
| — | మిథ్య 7-135 |

12. దేశ్యములందు 'ద' వర్ణమునకు పదాదిలో రేఫము, అపదాదిగా 'య' కారము సంయుక్తత యందు వచ్చును.

| | |
|---|---|
| ద్రొబ్బు 10 పూ 1159 | అద్యము 10.ఉ.1129 |

తత్సమములందు 'ద' వర్ణమునకు అపదాదిగా ఘ, య కార
ములు సంయుక్తత యందు వచ్చును.

ఉద్ఘాట 8-63
ఉద్యోగము 10 ఉ 124

13. 'ధ' వర్ణమునకు పదాది యందు య, ర, వ లు, అపదాది యందు య, ర, వలు సంయుక్తత యందు వచ్చును

ధ్యానము 3-920
ధ్రువుడు 4-314
ధ్వని 4-99
విధ్యుక్త 4-439
సంధ్య 8-69
రంధ్రము 1-393
అధ్వరము 4-5?9
గంధర్వ 4-29

14. దేశ్యములలో 'న' వర్ణమునకు క, గ, పలు అపదాది సంయుక్తత చెందును.

కిన్క 10.ఉ.579
కన్గవలు 10 పూ.1220
పాన్పు 10 ఉ.1276

15. పవర్ణమునకు దేశ్యములందు రేఫము పదాదియందు, 'ద' కారము అపదాదియందు సంయుక్తత చెందును.

ప్రొద్దు 10.పూ 532
ప్రోచు 3-990
అప్ద 10 ఉ.1253

తత్సమములలో 'ప' వర్ణమునకు పదాదియందు రేఫము, అపదాదియందు 'త' 'ర' కారములు వచ్చును.

ప్రేమ 9-466
ఆప్తుడు 4-823
విప్రవ 3-593

'ఫ' వర్ణమునకు పదాది, అపదాదులందు సంయుక్తత పోతన భాగవతమున కన్పింపదు.

16. బ వర్ణమునకు పదాదియందు రేఫము దేశ్యములందు సంయుక్తతలో వచ్చును.

బ్రదుకు 10 పూ 690

తత్సమములందు అపదాదిగా 'బ' వర్ణమునకు 'ధ' కారము సంయుక్తతయందు వచ్చును.

| పదాది | అపదాది |
|---|---|
| | అబ్ధి 10 పూ 546 |
| | అబ్ధ 10 పూ 582 |
| | స్తబ్ధవు 4-477 |

17. భ వర్ణమునకు పదాది, అపదాదులందు రేఫము సంయుక్తతయందు వచ్చును

| | |
|---|---|
| భ్రష్ట 3-437 | విభ్రమ 4-107 |

18. దేశ్యములందు 'మ' వర్ణమునకు రేఫము పదాది సంయుక్తతయందు వచ్చును.

| | |
|---|---|
| మ్రొక్కు 10.ఉ 963 | — |
| మ్రొగ్గు 10 పూ 1143 | — |

తత్సమములందు 'మ' వర్ణమునకు రేఫము అపదాదిగా సంయుక్తత చెందును.

| | |
|---|---|
| — | వమ్రములు 4-124 |

19. దేశ్యములందు అపదాదిగా 'య' వర్ణమునకు 'వ' కారము కారము సంయుక్తతయందు వచ్చును.

| | |
|---|---|
| — | చెయ్వులు 9-392 |

20 దేశ్యములందు ర వర్ణమునకు అపవాదిగా క, గ, చ, త, ప, మ, వ లు సంయుక్తత యందు వచ్చును

— తార్క్యుని 10 ఉ 846

— అర్గుడు 9-422

— ఊర్పు 10 పూ 1756

— తీర్తును 3 656

— ఏర్పడ 9-183

— అర్మిలి 3-457

— అర్వారు 7-267

తత్సమములందు 'ర' వర్ణమునకు అపదాదిగా గ, ఘ, చ, ఛ, ణ, త, థ, ధ, ప, భ, మ, య, వ, షలు సంయుక్తతయందు వచ్చును.

— దుర్గము 10 ఉ 157

— దీర్ఘ 8-183

— అర్చ్ఛల్ 10 ఉ 521

— మూర్ఛ 3-985

— కర్ణము 10 పూ 1233

— ఆర్తులు 4-456

— తీర్థము 3 9

— వార్ధి 8-201


63 967

— దర్పము 10 ఉ 381

— [illegible]గర్భము 1-181

— ఘర్మము 3-555

— [illegible] 4-823

— సర్వము 4-125

— శీర్షుండు 8-139

21. దేశ్యములందు 'ల' వర్ణమునకు క, గ, చ, త, ద, ప, మ వ లు అపదాది యందు సంయుక్తములుగా వచ్చును.

| | |
|---|---|
| — | మేల్కాని 10 పూ.148 |
| — | వీల్గు 10 పూ 1637 |
| — | తాల్చు 10.పూ.1352 |
| — | కొల్తురు 10 ఉ.699 |
| — | చల్ది 8-489 |
| — | పొల్పారు 10 పూ 772 |
| — | క్రేల్మడి 10 పూ.1715 |
| — | వెల్వడి 10 పూ.1047 |

తత్సమములందు 'ల' వర్ణమునకు క, అపదాదిగా సంయుక్తత యందు వచ్చును.

| | |
|---|---|
| — | శుల్కము 10.ఉ.133 |

22. దేశ్యములందు 'వ' వర్ణము పదాదిగా రేఫముతో కలిసి సంయుక్తత చెందును.

| పదాది | అపదాది |
|---|---|
| వ్రయ్యలు 10 పూ 1174 | — |
| వ్రేటు 10.ఉ 382 | — |

తత్సమములందును 'వ' వర్ణము పదాదిగా రేఫముతో కూడి సంయుక్తత చెందును.

వ్రాతము 10 పూ 919

23. శ వర్ణమునకు పదాదిగా య, ర, ల, వకారములు, అపదాది యందు చ, న, మ, య, ర, వలు సంయుక్తతయందు వచ్చును

| | |
|---|---|
| శ్యామ 10 ఉ 26 | ఆశ్చర్యము 4-87 |
| శ్రోణి 8-506 | ప్రశ్న 8-503 |

| | |
|---|---|
| శ్లాఘ్యము 4-454 | రశ్ములు 10.ఉ 1303 |
| శ్వశుర 3-898 | కశ్యపు 8-495 |
| — | శ్వశుర 3-898 |
| — | ఐశ్వర్యము 4-286 |

24. ష వర్ణమునకు క, ట, ర, ణ, ప, ఫ, మ, య, లు అపదాది యందు సంయుక్తత చెందును

| | |
|---|---|
| — | శుష్కించు 8-376 |
| — | తుష్టుఁడు 1-517 |
| — | నైష్ఠిక 4-214 |
| — | విష్ణుఁడు 1-65 |
| — | పుష్ప 2-68 |
| — | విష్ఫుత 4-240 |
| — | యుష్మ 4-197 |
| — | దూష్య 10 పూ.1414 |

25. దేశ్యములందు 'స' వర్ణమునకు పదాదిలో రేఫము సంయుక్తత యందు వచ్చును.

| | |
|---|---|
| స్రుక్కు 9-564 | — |

తత్సమములందు 'స' వర్ణమునకు ఖ, థ, న, ఫ, వ లు పదాదియందు ధ, ఫ లు సంయుక్తతయందు వచ్చును.

| | |
|---|---|
| స్ఖలిత 3-451 | గృహస్థ 3-789 |
| స్థితి 1-393 | విస్ఫార 4-116 |
| స్నానము 10 పూ 113 | |
| స్ఫురణ 2-239 | |
| స్వామి 3-554 | |

26. దేశ్యములందు 'హ' వర్ణమునకు 'వ' కారము అపదాదిగా సంయుక్తమందు వచ్చును

గహ్వరము 10 పూ 1613

---

1.1 5 భిన్న హల్సంయోగము రెండు వర్ణములకేగాక మూడు వర్ణములకు వ్యాప్తి కలుగవచ్చును. తెలుగు భాషా నిర్మాణములో మూడు హల్లులవరకు ఈ భిన్న వర్ణ సంయోగమము కలుగును.

1. ణ, ద, రేఫము  తండ్రి 3-25
   వాండ్రు 10 పూ 1522
   పిండ్రు 10.పూ 1522
   పెక్కండ్రు 7-19
2. ణ, ద, ల :  వండ్లు 10 పూ 615
   పిడగండ్లు 10 పూ 1558

1.1 6 పదాదియందు ద్విత్వమురాదు అపదాదిగా ద్విత్వములువచ్చు వర్ణములు క గ చ ఛ జ ఝ ట డ ణ ద ధ న ప బ భ మ య ల ళ శ వ శ లు. ఇవి ద్విత్వ పట్టిక యందు చూపబడినవి. తత్సమ వర్ణములైన ఛ ఝ ధ భ అందు ఒక ప్రత్యేకత గలదు క్రింది వర్ణము మహా ప్రాణముగా నున్నను మీది వర్ణము అల్ప ప్రాణముగా లిఖించుట సంప్రదాయము. ఇది లేఖన సౌలభ్యము నిమిత్తము కావ్యములలో లిఖింపదగుచున్నదని గ్రహింప వచ్చును. (తద్భవమైన లెస్స, క్వార్థకములుగా దేశ్యములైన క్రుస్సి, ప్రస్సిలందు, కస్సుమను, బుస్సుమను వంటి ధ్వన్యనుకరణములలో 'స' కారమునకు ద్విత్వస్థితి గలదు. సాధురేఫమునకు ద్విత్వములేదు).

పోతన భాగవతమున గల ప్రయోగములు :

1. క వర్ణము /క్క/  అపదాదిగా  ఉపధా
   ఇక్కడ 10 పూ 1042  చుక్క 10 పూ.1302
   ఒక్కతె 4-7  చొక్కు 7-150
   నిక్కము 10 పూ.162

2. గ వర్ణము /గ్గ/

అగ్గము 10 పూ.1214 ఎగ్గు 10 పూ.332
సిగ్గు 3-472
బెగ్గిలి 10 పూ.22

3. చ వర్ణము /చ్చ/

అచ్చట 4-247 తెచ్చు 4-510
చెచ్చెర .0 ఉ.39 మెచ్చు 4-663
వచ్చని 10 పూ 1316 రచ్చ 10.పూ.1717

4. ఛ వర్ణము /చ్ఛ/

విచ్ఛేదము 3-835 ఇచ్ఛ 1-124
తుచ్ఛ 3-441
మ్లేచ్ఛ 10 పూ.1665

5. జ వర్ణము /జ్జ/

తత్సమమునందు — అజ్జ 10 పూ.848
తద్భవమునందు: బుజ్జగించి 7-159 ఒజ్జ 7-179

6. ఝ వర్ణము /ఝ/

ఉజ్ఝిత 8-49

7. ట వర్ణము /ట్ట/

చుట్టాలు 8-648 అట్టి 4-698
కట్టు 10.ఉ.140
చిట్టు 10.ఉ.1172

8. డ వర్ణము /డ్డ/

అడ్డము 8-464 బిడ్డ 10.పూ.867
ఒడ్డదు 7-194

9 త వర్ణము /త్త/

నెత్తురు 3-604 అత్త 10.పూ.992
ఇత్తు 4-289

10. ద వర్ణము /ద్ద/

ఇద్దఱు 9-722 ఎద్ది 4-240
మద్దుల 10 పూ.1328 పెద్ద 7-132
ముద్దు 10.ఉ.265

11. ధ వర్ణము /ద్ధ/

ఉద్ధవ 3-163 బుద్ధి 1-34
పద్ధతి 1-501 సిద్ధి 1-45

12. న వర్ణము /న్న/

కన్నీరు 10.ఉ 344 అన్న 10.పూ.150
మున్నీరు 10 ఉ.344 చిన్న 8-396

13. ప వర్ణము /ప్ప/

ఇప్పుడు 4-397 కొప్పు 10.పూ.1729
ఎప్పుడు 4-627 మెప్పు 10.ఉ.352

14. బ వర్ణము /బ్బ/

ఉబ్బరిక 10.పూ.1345 అబ్బు 10.ఉ.1193
బెబ్బులి 10.ఉ.238 మ్రబ్బు 10.పూ.565

15. భ వర్ణము /బ్భ/

ఇబ్భంగి 3-757 —
ఎబ్భంగి 7-20 —

16. మ వర్ణము /మ్మ/

కమ్మవి 10 పూ.106
కమ్ముఁడు 8-662 అమ్మ 3-564
ఇమ్మ 4-551

17. య వర్ణము /య్య/

కొయ్యలి 10 పూ.1454 —
తద్భవములలో — అయ్య 9-442

18. ఱ వర్ణము /ఱ్ఱ/

కుఱ్ఱఁడు 9-215 అఱ్ఱు 10.ఉ.605
గుఱ్ఱము 9-207 ఎఱ్ఱ 8-244

19. ళ వర్ణము /ళ్ల/

అల్లుడు 10.ఉ.595 ఎల్లి 10 పూ.93
చెల్లెలు 9-246 తల్లి 10 పూ.55.

20 ళ వర్ణము /ళ్ళ/ :

— ఎదుళ్ళ 10.పూ.462
నదనళ్ళ 9-3'
మొగిళ్ళ 9-33

ఈ ద్విత్వ ళ కారము అకాదమీ ప్రతిలో కన్పించుచున్నది. వావిళ్ళవారి ప్రతిలో ఎదుళ్ళ, నదనళ్ళ, మొగిళ్ళ అవి గలదు

21 'వ' వర్ణము /వ్వ/

అవ్వల 10.పూ.150 త్రవ్వ 3-637
మువ్వురు 9-638 దువ్వ 10 ఉ.223

22 శ వర్ణము /శ్శ/

దుశ్శల 3-477 —
విశ్రేశ్శయ 3-879

## 1.1.7 రేఫశకట రేఫములు (ర. ఱ లు)

ర, ఱ ల వివయమున పట్టింపు సుమారు 11వ శతాబ్ది అవగా నన్నయ కాలముమందియే నడల నారంభించినది. పోతన వాడిన ఉభయ రేఫముల ప్రయోగములు అనవాదుకాదు. తిక్కన తరువాతి కవులు ఈ రేఫ సాంకర్యముగావించిరి. కనుక పోతనాది కవులు దీనిని పాటింపలేదు. చిన్నయసూరి మతము మేరకు ఱ ప్రత్యేక వర్ణముకాదు. కాని నవ్య భాషా విజ్ఞానము మేరకు శకట రేఫము ప్రత్యేక వర్ణము. పోతన ర, ఱ, ల మైత్రి అంగీకారయోగ్యమని ప్రయోగములను బట్టి తెలియుచున్నది. శ్రీనాధునిలో రేఫ శకట రేఫల సాంకర్యము కలదు.

తర్షణి విజ్ఞాన మీ సూక్ష్మ మెఱిగి కామము (కాశీ 3-70)

పోతన ప్రయోగములు :

'వార్థి తలాటముల్ ... .... .... యమ్మహో
'దార్థ పరాక్రమ .... .... .... లాఘవంబు ద
ల్మాటమునతించుచుం .... .... .... పదాతాదిక ప్రదు
క్షోర్ధ గ కోటి వోలె .... .... .... రోషమూర్తులై' 4-326
'వ ర్థ పర .... .... ... భూ
వ ర్థ ధృతరాష్ట్రి ... .... .... యొం
ఫార్దు ల జయింప గోరి.... .... .... లం
దలు పృథు లౌటయున్, .... .... 3-43
'ర్జు పరంపరలఁ గ్రమ్మఱన్ పుతుఁగట్టిన్ 10 పూ.385
క్రి దంతంబులు మూపులందు మెఱయన్ ఘర్మాంబువుల్ మోము
10.పూ.1321

సాధు రేఫ, శకట రేఫములకు అర్థ భేదము గల పోతన ప్రయోగములు :

| | | |
|---|---|---|
| ఏరికిన్ | 3-755 | (ఎవరికైనను) |
| ఏఱు | 10 పూ 656 | (చిన్న ప్రవాహము) |
| కోరు | 10.ఉ 963 | (యాచించు) |
| కోఱు | 10 ఉ 910 | (పండ్ల సంబంధము) |

## 1.1.8 'ఋ–రు' ల సాంకర్యము (యతి మైత్రి)

నన్నయ భారతమున 'ఋ-రి' లకు యతిపాటింప బడినది అందు ఋ వర్ణము రి వర్ణోచ్చారణమును కల్గియున్నది. తరువాత కవులు నన్నయ ననుగుణముగ ఋ- రి యతి పాటించిరి నన్నయప్రాసలోను ఋ-ర లను పాటించెను.

యతి : ఋత్విజాండ్రని విదారించి పూజించితే భార.సభా. 2-11

ప్రాస : ఆ ఋషి పుత్రుఁడుఁ గట్టిన
చీర్ర లు .... .... .... భార. అరణ్య - 3-104

శ్రీనాధుని కావ్య భాష యందును ఋ-రల ప్రాస గలదు.

ఆ ఋషుల జాడ శివునకు ....
దార .... .... .... పరి గ్రహ
దార .... .... ..
పార పు .... .... ... హర 4-44

పోతన భాగవతములోని ప్రయోగములు :

....... .... భూరి సంసారదు
ష్కృతులం ద్రోతురు కాలవక్ర మహితాస్త్రిందట్టి 10 ఉ.1334

ఇది అకాడమీ సంపాదకుల ఉదాహరణము. అకాడమీ వారి ప్రతిలో 'మహితాసింబట్టి' అన్న పాఠము స్వవచన వ్యాఘాతముగ స్వీకరించిరి. వ్రాత ప్రతులలో పెక్కుచోట 'మహితాస్త్రిందట్టి' కనిపించుచున్నది. పీఠికలో సంపాదకులు చెప్పినట్లు 'మహితాస్త్రిందట్టి' పాఠము వ్రాతప్రతులలో నున్నదానిని వారేల స్వీకరింపలేదను ప్రశ్న కలుగును. ఇదిగాక మరొక ఉదాహరణము భాగవతమున లేదు. ఇదియును దశమస్కంధ ఉత్తర భాగమున నుండుట ఆలోచింపదగిన విషయమే.

## 1.1.9 'ఉ-వు' వర్ణముల సాంకర్యము :

పాల్కురికి సోమన వృషాధిప శతకమున 'ఉ-వు' లకు యతిని పాటించెను.

సేవునకు ననుంగు వాడనని యుత్సుకతన్ వృషాధిప. శ-

పోతన ప్రయోగము :

'....... ....... గో
వునగణుతింపధాతయును నోపదు మాధవ యేమి చెప్పుదున్ ..
10.ఉ 462

ఉడిగితి పట్టుగావున దాసఁ జేసి 4-365

## 1.2.0 ధ్వని పరిణామములు (PHONETIC CHANGES)

రూపభేదముండి సమానార్థములు కలిగిన పదములు కొన్ని గలవు. పదమధ్యలోపములు, అచ్చులలో దీర్ఘములు, వర్ణముల వ్యత్యాసములు మార్పులు, ద్విరుక్త అదిరుక్తముల భేదములు మొ॥ ఇందు కనిపించును. పోతన భాగవత మందలి ఈ మార్పులు క్రింద చూపబడినవి.

## 1.2.1 అచ్చులందు కలిగిన మార్పులు :

మొదటి పదమున హ్రస్వముండి తరువాత దీర్ఘములు వచ్చును. శబ్దములో మార్పున్నను అర్థములో మార్పుండదు ఈ మార్పు పదాది, పదాంతములందెక్కడైనను రావచ్చును

| | | | |
|---|---|---|---|
| పదాది మార్పు : | | ఆకారము : | |
| అతడు | 4-82 | ఆతడు | 9-202 |
| అతండు | 10 పూ.1111 | ఆతండు | 4-517 |
| అతని | 4-88 | ఆతని | 4-333 |
| అరయ | 10.ఉ.658 | ఆరయ | 10 పూ 559 |

అపదాది :

| | | | |
|---|---|---|---|
| ఆహరించు | 10 పూ 891 | ఆహారించు | 8-202 |
| ఎవ్వడు | 4-720 | ఎవ్వాడు | 3-561 |
| ఎవ్వరు | 7-69 | ఎవ్వారు | 4-50 |
| వలుమలు | 4-492 | వలుమాలు | 10 ఉ 1317 |
| పెండ్లము | 9-471 | పెండ్లాము | 9-376 |

కారము :

| | | | | |
|---|---|---|---|---|
| పదాది | : ఇతడు | 4-454 | ఈతఁడు | 10 పూ 669 |
| అపదాది | : ప్రతికారము | 4-861 | ప్రతీకారంబు | 10 ఉ.932 |
| | గాండివము | 10 ఉ 1292 | గాండీవము | 10 ఉ 1297 |

కారము :

| | | | | |
|---|---|---|---|---|
| పదాది | : పురుషుడు | 4-862 | పూరుషుడు | 10 పూ.103 |
| అపదాది | : చేకులు | 4-734 | చేకూరు | 10.ఉ.668 |

ఏ కార, ఒ కారముల హ్రస్వ దీర్ఘభేదములు పోతన భాగవతమున కనిపించుట లేదు.

1 2.2. హల్లులందలి మార్పులు కొన్ని పదములలో ఒక హల్లు లోపించి దాని స్థానమున మరొకటి వచ్చి అర్థమున మార్పులేకుండ జరుగును.

పోతన భాగవత ప్రయోగములు

1.2.2 1 'గ-వ' లు వివిమయ వర్ణములు :

'క్వచిద్గ కారోవ : అని లక్షణము. గకార వకారములు పరస్పర వివిమయ వర్ణములు ప్రాచీన రూపములలోగల 'గ' కారమే నేడు 'వ' కారముగా మారుచున్నది కొన్నిచోట్ల 'గ' ప్రాచీనము మరికొన్నిచోట్ల 'వ' అర్వాచీనము.

ఏడ్గురు (అర్వాచీనము) 9-709 ఏడ్వురు (ప్రాచీనరూపము) 10.ఉ.165

కగిలి (ప్రాచీనము) 10 ఉ 943 కవిలి (అర్వాచీనము) 4-918

వలుగురు (అర్వాచీనము) 9-701 వలువురు (ప్రాచీనము) 9-701

*[1]<u>చేగ</u> గల చెలకు వింటను (చేగ > చేవ) 10 పూ.767

<u>కవిలి</u>కావింప వాపవకమూజా (కవిలి > కగిలి) 10 ఉ.771

ధ్రువునిఁ గనుంగొని <u>తివక</u>యాదరింప (తి వక > తిగుచు) 4-219

1.2.2.2 'డ-ద' వర్ణములు :

తెలుగునందలి 'డ' కారాది రూపములు ప్రాచీనములని, 'ద' కారాది రూపములు అర్వాచీనములని వ్యాకర్తలయభిప్రాయము.

---

*1. ఆచార్య టి. దొణప్ప, పోతన భాషా విశిష్టతలు.

పోతన భాగవత ప్రయోగములు :

'........ .. ...... సజ్జన

స్తవ మధురాపురిన్ విడిచి దాగుటకున్ మదిఁ జింతనొందుచున్' 3-92

(డాఁగుట > దాగుట)

తాపము నొంది నెవ్వగల దయ్యుచు గ్రుయ్యుచు విట్టు గూయుచున్

(దయ్యుచు > దయ్యుచు) 10 పూ.267

డించి 10 పూ.494 (డిఁచి > దించి)

దగ్గఱ 9-89 (డగ్గఱ > దగ్గఱ)

డాగడు 10 పూ 1013 (డాగడు > దాగడు)

పై ప్రయోగములందు 'డ' కారము 'ద' కారముగా మారినట్లుఁ గన్పట్టుచున్నది కాని యివి నిర్ధారిత ప్రయోగములు కావు. పోతన సమకాలికుడైన శ్రీనాథుని యందును, భాగవత కర్తలలో ఒకరైన బొప్పన గంగయ రచనా రీతిలో నిది కన్పించుచున్నది. శ్రీనాథుని ఉదాహరణము:

నిర్ధారితము కాదు.

దప్పిగొన్నట్టి వారి కా దప్పి దీఱ
నలిల పూరంబు హితవా? యాజ్యంబుహితవా

(దప్పి > దప్పి)

గంగయ ఉదాహరణము :

కై వడుపుత్రుల వేఁదఱదా యఁ బిలిచి 5-66

(డాయ > డాయ)

1.2.2.3. 'ద-ణ' ల పరస్పర వినిమయము :

కణఁకన్ వారలు వెండి మోక్షనిరపేక్ష ప్స్వారతులై యుండితా

మణి............ 3-880 (కణకన్ > కదకన్)

### 1.2.2.4 ద కారము 'త' కారముగా మారుట ।

తెలుగున 'ద' కార రూపములు ప్రాచీనములు. 'త' కార రూపములు అర్వాచీనములు, పద మధ్య 'ద' కారముండి చివర 'ఉ' వర్ణము గల ప్రయోగములలోని నాద సవర్ణమైన 'ద' కారము శ్వాససవర్ణత కారముగా మారుటకు 'క్వచిత్తోదః' అని వికృతి వివేక కారిక సూత్రించినది. అదుకు, ఉదుకు బ్రదుకు, మెదుకు మొ పదములలోని పదమధ్య 'ద' కారము ప్రాచీనము. అతుకు, ఉతుకు, బ్రతుకు మొ॥ పదములలోని పదమధ్య 'త' కారము అర్వాచీనము.

పోతనకు పూర్వము ద, 7 త గా మారుట నెడు మార్పు తెలుగున కన్పించుటలేదు. పోతన భాగవతమందు గల నిర్ధారక ప్రయోగములలో 'ద' కారము కలదు కొన్ని ప్రతులలో కొన్ని చోట్ల 'త' కార ప్రయోగములు కన్పించుచున్నవి. ఇది లేఖకుల అజాగ్రత్తవలనగాని, పరిష్కర్తల అలసత్వము వలనగాని జరిగి యుండవచ్చును నిర్ధారకములు కాని క్రింది ప్రయోగముల గమనింపనగును

| | |
|---|---|
| బ్రతుకుఁ దలచి మీరు బహు విధముల | 1–207 |
| పసిడి కాయలోని ప్రాణి బ్రతుకు | 2–51 |

క్రింది పోతన ద కార ప్రయోగములు నిర్ధారకములు.

| | |
|---|---|
| 1. నిదురించిన శిశువాకాని<br>కిదుకుచు .. .... .... | 10 పూ 250 |
| 2. చదికిలఁ బడి యొక యంతయు<br>మెదలక మిదుకంగలేక | 10 ఉ.557 |

### 1.2.2.5 'ల–న' గా మారుట ।

తెలుగునందు ల–న పరస్పర వినిమయము బాల ప్రసిద్ధికెక్కిన వర్ణ పరిణామము. ములగ > మునగ, తెలుగు > తెనుగు మొదలగునవి ఇందుకు నిదర్శనములు.

'. . .... .... ...' అ
ర్జున పౌరుషము పూని వగ్గముంచేఁ జోద్యంబుగాఁ బట్టుచున్
'మునికోలన్ వడిఁ దూల్చి ... .......'    1-223

'మునికోల' అను పదము 'ములు గఱ్ఱ' అను అర్థముగల ములుకోల నుండి ఉద్భవించినది. మునికోల ∠ ములుకోల

1.2.3. పద మధ్యమున దీర్ఘ స్వరమున్న రూపములు.

తెలుగున ప్రాచీన దశలో దీర్ఘ స్వరము పదాది యందు మాత్రమే ప్రయుక్తము అపదాది దీర్ఘస్వరము వచ్చుట అర్వాచీనలక్షణమునకు నిదర్శనము పద మధ్య దీర్ఘస్వరమున్న రూపములు రెండు విధములు.

1 సహజ దీర్ఘ స్వరములుగల రూపములు

2. ముపర్ణక లోపము వలన హ్రస్వ స్వరములు
దీర్ఘ స్వరములుగా మారిన రూపములు

1. సహజముగా దీర్ఘస్వరములున్న రూపములు :

'ఆరాటము మదినెలుఁగము
పోరాటము లింద్లు కదలఁబట్టువు... ....'    1-251
కొడుకుల బెండ్లాము జంప గురుదానతియాన్'    9-471

2 ముపర్ణక లోపమువలన హ్రస్వము దీర్ఘమగుట కలవారు చుట్టాలు గారు    10.ఉ.232 [చుట్టము+లు]

వియ్యాన వింత వయినం
గుయ్యాలింపంగదయ్య ... .... . .. 10 పూ 1057 [వియ్యము+న]

లోప దీర్ఘము: పదమధ్యమున వర్ణములోపించి దాని ముందు వర్ణమునకు దీర్ఘము వచ్చును. పువ్వుఁబోడి 9-175 పూబోడి

1.2.4 ఒక పదమందు ఒకే వర్ణము ద్విరుక్తముగాను, అద్విరుక్తము గాను పోతన భాషలో వాడబడినది. ఇందు శబ్దభేదమేకాని అర్థ భేదము లేదు

| | | | |
|---|---|---|---|
| ఇవుడు | 4-259 | ఇవ్వుడు | 4-397 |
| ఎవుడున్ | 4-720 | ఎవ్వుడున్ | 4-720 |
| ఎవండు | 4-846 | ఎవ్వండు | 4-732 |
| ఎఱ | 8-216 | ఎఱ్ఱ | 8-244 |
| ఒకడు | 4-89 | ఒక్కడు | 4-412 |
| ఒకరుండు | 9-110 | ఒక్కరుండు | 4-280 |
| ఒక | 9-142 | ఒక్క | 4-435 |
| పిన | 9-224 | పిన్న | 9-211 |

ద్విరుక్త, అద్విరుక్తములు పదమధ్య పదాంతములందు కవిప్రయుక్తములు. ఎదంతమువన్నవి.

## 1.2.5 ఇయాంతములు, ఎదంతములు :

తెలుగునందు దేశ్య పదములలో ఎదంతములు ప్రాచీనములనియు ఇయాంతములు అర్వాచీనములని శాస్త్రకారులమతము. తద్భవములలో ఈ పద్ధతి వ్యతిరేకము. ఇందు ఇయాంతములు ప్రాచీనములు. ఎదంతములు అర్వాచీనములు.

పోతన ప్రయోగములు : దేశ్య పదములు :

'మృదు గతిఁ బువ్వుదేవియరమించుచు...' 3-194 [అర్వాచీనము]

వరవ గతింబూవుఁ 'దేనెఁఆవిగొను' 4-490 [ప్రాచీనము]

'........ వివిధ వృక్షములఁదేనియలువడిపె 10 పూ.951

అందు తమ్ములఁ తేనెలావి చొక్కుచు మ్రోయు 1-154 [ప్రాచీనము]

తద్భవములు :

........ యశోద యింటికిం

చేడియలేఁగి చూచిరి 10 పూ 187 [ప్రాచీనము]

పీటఁగల చేడెలెల్లను 10-పూ.1248 [అర్వాచీనము]

చేడియ, చేడె ∠ ప్రా. చేడియా ∠ సం. చేటికా

పీఠెలు దండంబులనియు 9-693 [అర్వాచీనము]

పీఠ ∠ ప్రా. పీఢియా ∠ సం. పీఠికా.

పంచవన్నియలు పేలు పేల కనకరజిత పాత్రంబులనించి

10-ఉ-346 [ప్రాచీనము]

వన్నియ ∠ ప్రా. వణ్ణియా ∠ సం. వర్ణికా

పై పోతన ప్రయోగ పద్ధతి

'ఏదంతతా చనమ్మా మన్యతర స్వామి యాంతానాం'

అను చింతామణి సూత్రమున కనుగుణముగా కన్పించుచున్నది.

1.2.6 పదములందు మధ్యాక్షరము తొలగింపబడుట :

| | | | |
|---|---|---|---|
| కావున | 4-419 | కాన | 3-342 |
| బంధువుల | 10 పూ 1707 | బంధుల | 10 పూ.1720 |
| కోడుకావి | 1-374 | కోకావి | 10.ఉ 1157 |

1.2.7 పద మధ్య అజ్లోపము :

పదమధ్యమున డ, వ, వ, య, ర, ల - ల మీది అచ్చులకు లోపము. పోతన భాగవతమందలి లోపరహిత రూపములు, లోపసహిత రూపములు క్రింద ఈయబడుచున్నవి

డ కారము :

| | | | |
|---|---|---|---|
| అడుగు | 7-160 | అడ్గు | 7-160 |
| ఏడుచు | 7-824 | ఏడ్చు | 10 పూ.148 |
| కోడుకాము | 7-155 | కోడ్కాము | 10 ఉ.1316 |
| పీడుకొలుపు | 10.ఉ.1315 | పీడ్కొలుపు | 10.ఉ.1132 |

లోపసహిత రూపములు మాత్రమే కలిగినవి.

| | |
|---|---|
| ఏడ్వురు | 10 ఉ.165 |
| మాడ్కులు | 10-పూ. 045 |
| మాడ్కి | 9-170 |

వ కారము :

| | | | |
|---|---|---|---|
| కనుగవలు | 4-223 | కన్గవలు | 10 పూ.1220 |
| కివుక | 10 ఉ 912 | కివ్క | 10.ఉ.579 |

పానపు 10 పూ 248 పాన్పు 10 ఉ.1276

లోప సహిత రూపములు మాత్రమే కల్గినవి.

చొప్పి 8-183 కన్పొమలు 4-748

ప కారము :

| | | | |
|---|---|---|---|
| అపుడు | 4-375 | అప్డు | 10.ఉ.1253 |
| ఇపుడు | 4-259 | ఇప్డు | 3-569 |
| ఎపుడున్ | 4-720 | ఎప్డున్ | 4-195 |

'కావిపోవు' నందలి మధ్య అచ్చులోపించి' కాన్పోవు. కావలసియుండగా మకముబదులు పూర్ణబిందుపు వచ్చి 'కాంపోవు' అను రూపమేర్పడినది

కావిపోవు 10.ఉ 38 కాంపోవు 3-986

యకారము :

చెయువుల 10.పూ 695 చెయ్వుల 9-392

రేఫము :

కూరిమి 10 ఉ.1729 కూర్మి 4-101

లోపసహిత రూపములు మాత్రమే కలవి

| | | | |
|---|---|---|---|
| కోర్కి | 1-544 | మూర్వురు | 9-156 |
| కోర్కులు | 10.ఉ.638 | మిర్కిట్లు | 10.ఉ 1306 |
| కర్లి | 9-626 [∠ కరలి] | | |

ల కారము :

| | | | |
|---|---|---|---|
| అలిగి | 10.ఉ.1110 | అల్గి | 10.ఉ.892 |
| ఇలువరున | 9-382 | ఇల్వరున | 10.పూ.992 |
| కలుగు | 10.పూ.1702 | కల్గు | 4-884 |
| గెలువు | 10 ఉ.703 | గెల్వు | 10.పూ.1560 |
| చలిది | 7-57 | చల్ది | 10.పూ.493 |
| వలువురు | 9-701 | వల్వురు | 9-677 |

| | | | |
|---|---|---|---|
| విలుపు | 3-432 | విల్పు | 3-439 |
| పలుకు | 3-445 | పల్కు | 3-444 |
| పలుమాఱు | 10 ఉ 1319 | పల్మాఱు | 7-271 |
| పొలుపు | 10 ఉ.1158 | పొల్పు | 9-466 |
| బలిమి | 9-171 | బల్మి | 3-477 |
| వెలుగొండ | 10-ఉ-1211 | వెల్గొండ | 4-181 |
| వేలుపు | 10.పూ 886 | వేల్పు | 10.పూ.1082 |

లోప సహిత రూపములు :

| | |
|---|---|
| పల్దిమఱ్ఱి | 10.పూ 223 |
| చెల్వం | 10 పూ.1010 |

## 1.2.8 స్వరముల కలయిక [సమీకరణము] :

అచ్చు పరస్పర ఆకర్షణముచే పరమైన అచ్చు రూపమునే పొందును. దీనినే ఇదంతములకు బహువచనంబు పరంబగునపుడు త్వంబగు' అని సూరి సూత్రించెను.

గిరి + లు : గిరులు 10.ఉ 400

# 2. సంధి వివేచనము (MORPHO-PHONEMICS)

## 2.0.0

సంధియను పారిభాషిక పదము సంస్కృత వ్యాకరణములనుండి తెలుగులోనికి ఇతర శాస్త్రీయ పదములవలె వచ్చినది. 'సమ్' ఉపసర్గ పూర్వకమైన 'ధా' ధాతువునకు 'కూడు' లేక 'చేరు' అను అర్థము గలదు. సంధి యనగా కూడిక, చేరిక, కలయిక అని భావము. ఈ సంధి సహిత కలిగిన యేర్పడునవి సంస్కృతవ్యాకర్తలు వివరించిరి. సంహిత యనగా సన్నికర్ష అని అర్థము. సంహితకలిగినపుడు సంస్కృతము లోని అచ్చులకు, హల్లులకు నాలుగు విధములైన మార్పులలోనేవైన గలుగవచ్చునని వైయాకరణులంగీకరించిరి అవి ఆగమ, లోప, వికార, ప్రకృతి భావములు.

దీనిని గుర్తించిన తొల్కాప్పియనారు తన వ్యాకరణమున తమిళ పదములను పరిభాషగా నుపయోగించెను [1]

పుణర్చి - సంధి, మెయ్‌పిఱిదాదల్-వర్ణవికారః

మిగుదల్-ఆగమః కున్ఱల్-లోపః, ఇయల్పు-ప్రకృతిభావము.

[2] అచ్చునకు అచ్చు, హల్లున కచ్చు, హల్లునకు హల్లు, అచ్చునకు హల్లు పరమైన సంధి కార్యములు గలుగునని తొల్కాప్పియనారు చెప్పెను. కన్నడ వ్యాకరణమున శబ్దమణి దర్పణకారుడు కేశిరాజు [3] రెండు లేక అంతకంటె ఎక్కువ వర్ణములు పరస్పరము కూడునది సంధి' యని లక్షణమును నిర్వచించెను. [4]కేతన, [5]పెద్దనలు పై విధము

---

1. అవై తామ్ మెయిపిఱిదల్ మిగుదల్ కున్ఱల్ ఎన్ఱు
   ఇవ్వెన మొ వతెరియు మారే, తొల్, ఎత్తు 110
2. తొల్. ఎత్తు 108
3. శబ్దమణి దర్పణ, సూత్రము 49
   'ఎరడుంపల వుంవర్ణం పరస్పరం కూడు వందమదు సంధివలం'
4. మొదలి పదము తుదివర్ణము పదలక పై పదము మొదలి వర్ణము కొరవ్ గదియగ సంధులు నాదగు [ఆం భా]

గనే సంధిని నిర్వచించిరి ఈ లక్షణము కాలక్రమమున మార్పును పొందినది. అధర్వణుడు 'ఆద్యంతవర్ణయోరైక్యం సన్ధి రిత్యుచ్యతే బుధైః । పూర్వస్య పరరూపత్వమత్ర నియతం భవేత్ [సంధి-1] అని సూత్రీకరించెను తెనుగున అధర్వణుని పద్ధతినే పాటించిరి చిన్నయసూరి [6]'పూర్వ పరస్వరంబులకుం బరస్వరంబేకాదేశంబగుట' సంధియనంబడు' అని నిర్వచించెను తొలిపద మందలి చివరి వర్ణము, పర పదమందలి తొలి వర్ణము సంహితను పొందునపుడు రెండు వర్ణములకు బదులు పర పదాది వర్ణము నిలుచుట సంధి సంధి యనగా వర్ణముల సంయోగమని సామాన్యార్థము, దీనినే [7]వర్ణసంహిత అనియు అందురు. రెండు అర్థవంతమైన పదములు లేక పదాంశములు కలయిక వలన భాషాసంప్రదాయమును బట్టి కొన్ని మార్పులు గలుగును వర్ణముల యుచ్చారణములో ముఖయంత్రము వివిధ ప్రయత్నములను గావించును. ఉచ్చారణ త్వరయొక్కటి ఈ ప్రయత్నమునకు సహకరించును. కావున 'చేరిక' లేక 'కూడిక' తప్పనిసరి. [8]కాని యిది అన్ని భాషలకు సమానముగాదు ప్రకృతము పోతన భాగవతమున గల సంధుల స్వరూపమును పరిశీలింతము.

తెలుగు భాష యందు 'ఙ, ఞ, ణ, ఱ 'ఋ, ౠ, ఌ, ౡ, తప్ప మిగిలిన దేశీయములైన అచ్చులు, హల్లు లన్నియు పదాదిలో వచ్చును. బహువచనమున 'లు' వర్ణము దీని పదాంశమైన 'ల్' ను, ద్రుతము తప్ప తక్కిన హల్లులు తెలుగు శబ్దములకు చివర రావు. [9]పదాదిని 'ఋ, ౠ' వర్ణములు సంధిలో 'ర, ల,' లతో సమానము. పదాంతమున కనిపించు 'ల్' వర్ణము బహువచనమును బోధించును.

---

5 అది శబ్దాంత వర్ణంబునంత్య శబ్దపూర్వవర్ణ వర్ణంబుతో గూడ బొత్తు చేత సంధి యగును [కావ్యా. చూ]

6. బా. వ్యా. సంధి. సూ. 1

7. కోరాడ రామకృష్ణయ్య, సంధి, పుట 17

8. 'సూర్యశ్రీ', తెలుగు భాషా చరిత్ర, పుట 213.

9. బా వ్యా, ప్రకీర్ణ, సూ 1.
'పదాద్యంబులు ఋ, ౠ వర్ణంబులు ర, ల తుల్యంబులు'

ఉదా :/ర్/ :

'నరుమాటల్ విని నవ్వులో మఖయ సేనామధ్యమక్షోణిలో' 1-220.
'మీరేతెంచిన జాడ గానక వగన్' .. ... ..
మీరాముల్ మఱదుల్ తనూజులు గురుల్
మీ సోదరుల్ బంధువుల్... ....10 పూ 976.
'మగువల్ సిక్కౖలెతొల్లివల్లభులకున్. ........ .....10. పూ 993.
'మొరసెన్ నిర్జరదుందుభుల్ జలరుహ మోదంబులై వాయువుల్.....'
8-117.

పోతన భాగవతమున రేఫళ కారాంతములైన యుదాహరణములు లభ్యము కాలేదు

తెనుగున సాహిత్య దశ ప్రారంభమగు నాటికే పదములు అజంతము లుగా పరిణత స్థితిని పొందినవి అందువలన తెలుగున అచ్సంధి అధిక ప్రాముఖ్యమును పొందినది సంధికార్యములు రెండు విధము లుగ జరుగును

1. ప్రాతిపదికకు విభక్తి ప్రత్యయము పరమైనపుడు సంధి జరుగును.
2. [10]విభక్తి సంబంధములేని రెండు పదములకు సంధి జరుగవచ్చును. అప్పుడు ఒక వర్ణముగాని ఔపవిభక్తిక ప్రత్యయముగాని ఆగమ మగును. ప్రాతిపదికకు ప్రత్యయమునకు మధ్య సంభవించు దానిని పదమధ్య సంధి యందురు (Internal sandhi)

| | |
|---|---|
| పదవనాడు | 1-473 |
| ఐదవయేట | 10 పూ 487 |
| నాలవ మాసంబు | 3-992 |
| మూడవ బాముస | 10 పూ 131 |
| రెండవ యర్థంబు | 10 పూ 126 |

స్వతంత్ర శబ్దముల మధ్య సంభవించు దానిని పదాంత సంధి యందురు (external sandhi)

10. కోరాడ రామకృష్ణయ్య, సంధి, పుట 33

| | |
|---|---|
| చెక్కుటద్దము | 4-58 |
| తవరియుండు | 1-232 |
| పసిడి యుయ్యెల | 10 ఉ.180 |
| ముద్దరాలు | 9-72 |

**2.1 0** సంధులు నాలుగు రకములు

1 అచ్చు + అచ్చు (Vowel + Vowel)

2 అచ్చు + హల్లు (Vowel + Consonant)

3. హల్లు + అచ్చు (Consonant + Vowel)

4. హల్లు + హల్లు (Consonant + Consonant)

పై నాల్గింటిలో మొదటిది స్వరసంధి, తక్కినవి హల్సంధులుగా విభ యింపవచ్చును

**2.1.1** అచ్చు + అచ్చు (Vowel + Vowel)

[11]స్వరసంహిత యందు (in vocalic junction) మొదటి పద మందలి అంత్యాచ్చు నియతముగ లోపించును.

| | | | |
|---|---|---|---|
| ఓడు + ఇంచు | : | ఓడించు | 4-95 |
| చేరు + ఇక | : | చేరిక | 7-101 |
| తప్పు + ఇంచు | : | తప్పించు | 3-419 |
| మొదలు + ఎడు | : | మొదలెడు | 1-341 |
| రాజు + అట | : | రాజట | 1-211 |

**2.1.2** ఉదంతములు :

ఇందలి పూర్వపదములు ఉదంతములై, పర పదాది యందు అచ్చులు ప్రవర్తిల్లును ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు.

[బా. వ్యా. సంధి 1]

| | | | |
|---|---|---|---|
| -ఉ+అ-<అ : నేరు+అడు | : | నేరడు | 7-54 |
| పొమ్ము+అను | : | పొమ్మను | 4-76 |
| ముగురము+అయ్యు: | | ముగురమయ్యు | 4-20 |
| ఏమను+అది | : | ఏమనది | 3-885 |

---

11. బా. వ్యా. సంధి సూ. 11

-ఉ+ఆ-<ఆ : ఎట్టు+ఆడిన : ఎట్టాడిన 7-144
తనరు+ఆరు . తనరారు 4-58
పొలుపు+ఆరు : పొలుపారు 3-795

-ఉ+ఇ-<ఇ : ఇంచు+ఇంచు : ఇంచించు 1-95

-ఉ+ఉ-ఊ : మృదు+ఉక్తులు : మృదూక్తులు 4-797
రఘు+ఉత్తమ . రఘూత్తమ 2-162

-ఉ+ఏ-<ఏ : పెక్కు+ఏండ్లు : పెక్కేండ్లు 8-70

-ఉ+ఒ-<ఒ : ఇరవు+ఒందు : ఇరవొందు 2-276
నేర్పు+ఒప్పు : నేర్పొప్పు 1-136
పొగడు+ఒందు : పొగడొందు 7-456

-ఉ+ఔ-<ఔ : విష్ణుడు+ఔన్ : విష్ణుడౌన్ 1-64

## 2.1.3 అదంతములు : అత్తునకు సంధి బహుళము

1. పోతన భాగవతమున సంధి జరిగిన రూపములు :

-అ+అ-<అ : చల్లి+అమ్మ : చల్లిమ్మ 10.పూ 688
మేన+అల్లుడు : మేనల్లుడు 1-179
మిథిల+అను : మిథిలను 10.ఉ 1173

-అ+ఆ-<ఆ : పిన్న+ఆతడు : పిన్నాతడు 1-291
మూల+ఆధారము : మూలాధారము 4-653

-అ+ఉ-<ఉ : మిన్నక+ఉండు : మిన్నకుండు 9-386

-అ+ఎ-<ఎ : ఒక్క+ఎద : ఒక్కెద 9-93
వచ్చుట+ఎఱుగదు: వచ్చుటెఱుగదు 10.ఉ 1271

-అ+ఒ-<ఒ : పెద్దల+ఒద్ద : పెద్దలొద్ద 1-43
ప్రొద్దుపోక+ఒకనాడు : ప్రొద్దుపోకొకనాడు 9-1

సంధిరాక యడాగమము వచ్చిన రూపములు :

-అ+అ-<అయ : చేరిన+అట్టైన : చేరినయట్టైన 7-122

-అ+ఇ-<అయి : కలగక+ఇచ్చిన : కలగకయిచ్చిన 10 పూ 47
కావరక+ఇత్తున్ : కావరక యిత్తున్ 10.ఉ 834

_అ+ఉ_<అయు: లేవక+ఉన్న : లేవకయున్న 9-189

2. 'పరమ యౌవరాజ్య మిచ్చితి కురువృద్ధ రాజులొద్ద' ఆది 6-121

'నీ తల్లిదండ్రులొద్ద ధృతిమన్నదానవే' అర 2-133

పై భారత ప్రయోగములను బట్టి పోతన షష్ఠ్యర్థక ఒకారోపరి యకారమునకు సంధి జేసెను.

'తామర నేత్ర తిండ్లు బందారుగారె' అని అల్లసాని పెద్దన ప్రయోగము.[12]

'వివాహార్థం నోసంధిరిత్యౌ తత్త్వమ యోర్లుకి'

అని అధర్వణుడు దీని నంగీకరించెను.

దీని ననుసరించి పోతన ప్రయోగములు :

| | |
|---|---|
| బిచ్చరముక్క | 1-283 |
| చిన్నబిడ్డాటలు | 10.పూ.1212 |
| పుల్లావుశిరంబు | 9-38 |
| మందావు | 9-35 |

పై యాచ్ఛిక సమాసము లందలి యత్వసంధి పైన సూచించిన అధర్వణుని సూత్రము, భారత ప్రయోగములను బట్టి నిరభ్యంతరము చెల్లును.

3. [13]'బహుళ గ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధనాంతములకు సంధిలేదు' అని సూరి సూత్రీకరించెను కాని పోతన భాషలో వీనికి సంధి కనిపించుచున్నది.

| | |
|---|---|
| ముత్తవగు | 9-724 |
| మిత్రార్జున | 1-370 |
| మిథిలాపురమున | 10 ఉ.1177 |
| నంవదేటికి | 9-437 |

12. వికృతి వివేకము సంధి కా. 4.

13. బా. వ్యా. సంధి సూ. 4.

'సంపదేటికి' అను దానికి 'సంపదయేల' అను పాఠాంతరమున్నది. 'మిత్రార్జున' అను దానిని 'మిత్ర!+అర్జున!' అని రెండును సంబోధనాంతములుగా భావించుట యుక్తి యుక్తము.

'విజయ! ధనంజయ! హనుమ
ద్ధ్వజ! ఫల్గున! పాండుతనయ! నర! మహేం
ద్రజ! మిత్రార్జున! యంచును
భుజములు తలకడవ రాకపోకలఁ జీరున్' 1-370

'దిక్కెవ్వఁడురోరి నీకు' 7-261 అని మఱియొక ప్రయోగమును గలదు. కనుక సంబోధనార్థక 'అ'కారమునకు సంధి పోతన కిష్టమే యని చెప్పవచ్చును.

'ముత్తవగు' అను ప్రయోగము ప్రామాణికము. క్రియావాచకముపై 'అ'కారమునకు సంధి అర్వాచీనులు కూడ చేసిరి పోతన కిది సమ్మతమే

[14]'ప్రశ్నతా వాచకంబులగు సార్వనామార్థక శబ్దంబులు పరంబులగుచో పన్ని యచ్చులకును సంధి వికల్పము' అని ప్రౌఢ వ్యాకర్త సూచించెను.
పోతన ప్రయోగములు : కద+అయ్య=కదయ్య 3-250

**2.1.4.** ఇదంతములు : ఇత్తునకు సంధి పాక్షికముగానగు.

పోతన ప్రయోగములు : సంధి జరిగినవి.

| | | | |
|---|---|---|---|
| -ఇ+అ→అ : | ఒకటి+అడుగ | : ఒకటడుగ | 10.ఉ.658 |
| | దధీచి+అవ | : దధీచవ | 10.ఉ.722 |
| -ఇ+ఆ→ఆ : | పది+ఆరు | : పదారు | 1-263 |
| -ఇ+ఇ→ఇ : | పసిడి+ఇట్టి | : పసిడిట్టి | 9-269 |
| | వారి+ఇల్లు | : వారిల్లు | 10 పూ 312 |
| -ఇ+ఒ→ఒ : | మిక్కిలి+ఒదవ | : మిక్కిలొదవ | 9-642 |
| -ఇ+ఓ→ఓ : | పిశాచపతి+ఓట | : పిశాచపతోట | 10.ఉ.1255 |

14. ప్రౌఢ సంధి సూ. 1

సంధి జరుగనివి. యడాగమము వచ్చిన రూపములు :

| | | | |
|---|---|---|---|
| -ఇ+ఇ-->ఇ : | పురిటి+ఇంటి | : పురిటియింటి | 10.పూ.114 |
| | పురిటి+ఇల్లు | : పురిటియిల్లు | 10.పూ.137 |

2. ఏమ్యాదుల, ఇత్తునకు సంధి వైకల్పికముగానగు.
[బా. వ్యా సంధి. సూ. 5]

పోతన ప్రయోగములు : సంధి జరిగినవి :

| | | | |
|---|---|---|---|
| ఏమి : | ఏమి+అంటివి | : ఏమంటివి | 10.పూ.268 |
| | ఏమి+అవి | : ఏమవి | 9-342 |
| | ఏమి+ఏమి | : ఏమేమి | 10.పూ.278 |
| అది : | అదది+అయ్యెను | : అదదయ్యెను | 9-16 |

సంధి జరుగనివి - యడాగమము

| | | | |
|---|---|---|---|
| ఏమి : | ఏమి+అనవుడు | : ఏమియనవుడు | 9-13 |
| | ఏమి+ఆనతి | : ఏమియానతి | 9-159 |
| ఇది : | ఇది+ఏమి | : ఇదియేమి | 9-12 |

పోతనలో 'మధ్యోక్తి' సంధి ఘటిత రూపములు మృగ్యములు.

8. అవి, ఎవ్వి అను సర్వనామముల ఇత్తునకు సంధి పోతన భాగవతమున కనిపించుట లేదు.

| | | |
|---|---|---|
| అవి+అటంచు | : అవి యటంచు | 10.పూ.121 |
| ఎవ్వి+అయిన | : ఎవ్వియైన | 10 పూ 635 |

4. క్రియా పదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగానగు.
[బా. వ్యా. సంధి. సూ. 6]

ఉత్తమ పురుష : బహువచనము

అతి తప్తులమైతిమి+ఇంక : అతి తప్తులమైతిమింక 7-75

5. [16]'మధ్యమ పురుష క్రియలం దిత్తునకు సంధి యగును'

అని సూరి సూత్రించెను. పోతన భాగవతమున మధ్యమ పురుష క్రియల యిత్తున కొకచోట తప్ప తక్కిన యన్నిచోట్ల సంధి కనిపించును.

అవతరించితి+ఈశ : అవతరించితీశ 10 పూ.123

యోగ్యులవైతివి+ఇట : యోగ్యులవైతివిట 7-379

10వ స్కంధ పూర్వభాగమునందొకచోట మాత్రమే సంధిలేని రూపము ప్రయుక్తమైనది.

తలతురంటివి యెట్లు దలతురు వారలు 10 పూ.488

ఇది పోతనగారిచే యని నిర్దుష్టముగ చెప్పవచ్చును. కాని యట్టి ప్రయోగము మరియొకచోట కానరామిచే ఇది లేఖక ప్రమాదమని భావించుట కవకాశమున్నది. 'తలంతురంటివదెట్లు తలంతువారలని' ఇది తేలికగా దిద్ద దగియుండుట కూడ ఈ భావమును దృఢపరచుచున్నది.

6. 1. క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు.

[బా. వ్యా. సంధి. సూ. 8]

పోతన ప్రయోగములో సంధి వచ్చిన రూపములు గలవు.

| | | | |
|---|---|---|---|
| -ఇ+అ-7అ : | కంటిమి+అందురు : | కంటిమందురు | 10.పూ.128 |
| -ఇ+ఆ-7ఆ : | కూడి+ఆడు : | కూడాడు | 3-106 |
| -ఇ+ఇ-7ఇ : | కదిసి+ఇట్లు : | కదిసిట్లు | 3-647 |
| | కోసి+ఇచ్చె : | కోసిచ్చె | 10.ఉ.724 |
| | తగిలి+ఇట్లు : | తగిలిట్లు | 10.ఉ.595 |
| | నిలిచి+ఇట్లు : | నిలిచిట్లు | 4-45 |
| -ఇ+ఉ-7ఉ : | ఒదిగి+ఉండి : | ఒదిగుండి | 10.ఉ.1237 |
| -ఇ+ఎ-7ఎ : | ఎఱిగి+ఎఱిగి : | ఎఱిగెఱిగి | 10.ఉ.931 |
| | పుట్టి+ఎన్నడు : | పుట్టెన్నడు | 10 పూ.1217 |
| -ఇ+ఏ-7ఏ ; | ఎఱిగి+ఏమ : | ఎఱిగేమ | 3-777 |

15. బా. వ్యా. సంధి. సూ. 7.

వీనిలో నవర్ణాచ్ఛరకములైన సంధులు వ్యాకర్తలు అంగీకరించిరి 'క్వాపి నవర్ణేద్వ్యకృతే' [సూత్రాంధ్ర వ్యాకరణము సంధి పుట 3] అని సూరి సూత్రీకరించెను

వెలచిట్లంబుధినాథనందనలు నిర్వ 5-88

వెలసిట్లంబుధివాథనందనులు కొన్ని ముద్రణ ప్రతులలో దిద్దుబాటు దీనిబట్టి సవర్ణాచ్ఛరకత్వమున క్వార్థేకారమునకు సంధి విధించుట పోతన కిష్టముగాదని ధూళిపాళ శ్రీరామమూర్తి "మదాంధ్ర భాగవతానుశీలన" వలన తెలిపిరి ఈ సంధి 1, 2, 7, 8, 9 స్కంధములందు కనిపించకుండుట ఆశ్చర్యమును కలిగించును ఇట్టి సంధి కవకవుల ప్రయోగములందు కనిపించును

| | | |
|---|---|---|
| ఏతెంచారగించె | ఐన | 5-293 |
| కలదన్న వారికి గలిగుండువాడు | | 6-826 |

2 సంధిరాని రూపములు యడాగమము వచ్చినవి అరుదుగా కనిపించును

| | | |
|---|---|---|
| ఏగి+అవట | ఏగియవట | 3-4 |
| కోరి+ఇచ్చె | కోరియిచ్చె | 10 ఉ 47 |
| చేసి+అర్చు | చేసియార్చు | 10 ఉ 18 |
| తనరి+ఉండు | తనరియుండు | 1-232 |
| తెచ్చి+ఇచ్చు | తెచ్చియిచ్చు | 10 పూ 456 |

7 షష్ఠీ సమాసమున ఇత్వసంధి

| | | |
|---|---|---|
| ఒకబోటి+ఇంట | ఒకబోటింట | 10 ఉ 627 |
| వారి+ఇండ్లు | వారిండ్లు | 1-371 |
| వారి+ఇల్లు | వారిల్లు | 10 పూ 312 |
| వీరి+ఇంట | వీరింట | 10 పూ.312 |

'ఒకబోటింట' అను ప్రయోగము పోతనది కాకపోవచ్చు ఈ సంధి రూపములు వున్నాయి, తిక్కనంచే ప్రయోగింపబడలేదు శ్రీనాథాది మహాకవు లిట్టి ప్రయోగములు చేసిరి

మగని+ఆలి 'మగనాలి సరిపోల్పఁ దగదు విధవ' కాశీ 2-83

దివి+అంఘ్రిపుఅ 'పినంఘ్రుఅ' శృం నై 3-202

8 ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు బా వా శబ్దపు 45

గిరి + లు గిరులు 10. ఓ. 400

అచ్చులు పరస్పర ఆకర్షణముచే వర్ణమైన అచ్చు రూపమునే పొందును

2 1 5

1 అచ్చి దీర్ఘాచ్చులకు పరమైన అచ్చునకు ముందు 'య' దాగమము వచ్చును

| | | | |
|---|---|---|---|
| -ఆ+అ-<అయ | . నా + అందు | నా యందు | 1-106 |
| ఆయా | . మా + అంగీకృత | మాయాంగీకృత | 1-206 |
| -ఆ+ఈ- | . ఆ + ఈశు | ఆయీశు | 2-85 |
| -ఈ+అ- | నీ + అంఘ్రి | నీయంఘ్రి | 8-385 |
| | నీ + అనుజ్ఞ | నీయనుజ్ఞ | 9-12 |
| -ఈ+ఇ- | ఈ + ఇరుపురు | ఈ యిరువురు | 3-554 |

2 ఏవార్థకమైన- ఎ మీది అచ్చునకు ముందు యదాగమము వచ్చును

| | | | |
|---|---|---|---|
| -ఎ+అ- | అంకడె + ఏ | అంచె యే స్థలంబులు | 7-34 |
| -ఎ+ఆ- | వారలె + ఆ | వారలె యాదిశి | 3-598 |

## 2.2.0 అచ్చు + హల్లు (Vowel + Consonant)

ఆ : దూరవర్తి సర్వనామాంగము
(remote demonstrative base)

ఈ : సమీపవర్తి సర్వనామాంగము
(Proximate demonstrative base)

ఏ : ప్రశ్నార్థ సర్వనామాంగము (interrogative base)

2.2.1. ఆ, ఈ, ఏ అను సర్వనామములు త్రికంబు నాబడు
[బా. వ్యా. సమాస. 4]

త్రికము మీది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు [బా వ్యా సమాస 14]

ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడు ఆచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు [బా. వ్యా. సమాస 13]

| | | |
|---|---|---|
| ఆ + చోట | అచ్చోట | 10.ఉ 113 |
| ఆ + మూటి | అమ్మూటి | 4-541 |
| ఆ + విదురు | అవ్విదురు | 3-348 |
| ఈ + కాలము | ఇక్కాలము | 3-461 |
| ఈ + తెలుంగ | ఇత్తెలుంగు | 3-213 |
| ఈ + మగువ | ఇమ్మగువ | 10 పూ 315 |
| ఏ + విధానము | ఎవ్విధానము | 8-353 |

[అ] మహాప్రాణ స్పర్శముతో సాధారణముగా ద్విత్వము నొందును

| | | |
|---|---|---|
| ఈ + భంగి | ఇబ్భంగి | 3-757 |
| ఏ + భంగి | ఎబ్భంగి | 7 - 20 |

[ఆ] సంధి వికారకమగు యకారము పై వాని వలె ద్విత్వము పొందు చున్నది.

| | | |
|---|---|---|
| ఆ + ఉవిద | అయ్యువిద | 9-621 |
| ఏ + అది | ఎయ్యది | 1-44 |
| ఆ + ఇంతి | అయ్యింతి | 10.ఉ 974 |

2 2 2 హల్లు పరమైనపుడు పదాంతములయి యసంయుక్తంబులయిన డు, ము, లు, రుల యత్వంబునకు, - టి వర్ణ మందలి ఇత్తునకు లోపంబు పాక్షికముగా నగును

–డ్ :

| | | | |
|---|---|---|---|
| [ర్కా] : | పీడు + కావి | పీడ్కావి | 10 ఉ 811 |
| | పీడు + కొలువు | పీడ్కొలువు | 10 ఉ 1132 |
| [ర్త] : | కోడు + తెచ్చు | కోడ్తెచ్చు | 10 ఉ.370 |
| [ర్ప] : | కీడు + పాటు | కీడ్పాటు | 3-662 |

–న్ :

| | | | |
|---|---|---|---|
| [న్గ] | కను + గవం | కన్గవం | 10 పూ 1220 |
| [న్మ] . | మేను + మఱచు | మేన్మఱచు | 8 – 740 |

–ర్ :

| | | | |
|---|---|---|---|
| [ర్కా] . | మూరు + కొను | మూర్కొను | 7 – 102 |

–ల్ :

| | | | |
|---|---|---|---|
| [ల్కా] . | మేలు కాంచు | మేల్కాంచు | 4-758 |
| [ల్ది] | వలు + దిక్కులు | వల్దిక్కులు | 4-103 |
| [ల్ప] : | కోలు + పడు | కోల్పడు | 1-173 |
| | పాలు + పడు | పాల్పడు | 3-407 |
| [ల్మ] · | వలు + మాఱు | వల్మాఱు | 7-271 |
| [ల్వ] . | వెలు + వడు | వెల్వడు | 3-435 |

2.2 3 ప్రథమ మీది పరుషములకు గసడదవలు బహుళముగా నగు,

[బా వ్యా సంధి 13]

1. పై సంధిగతములైన మార్పులు పోతన భాగవతమున కలవి

| | | | |
|---|---|---|---|
| క 7 గ . | విప్పులు + క్రిక్కు | విప్పులు గ్రిక్కు | 10 ఉ.939 |
| చ 7 స | క్రొవ్వు + చూపు | క్రొవ్వుసూపు | 8-104 |
| | మహిమ + పెదర | మహిమపెదర | 10 పూ 984 |
| త 7 ద | వెలి + తమికి | వెలిదమికి | 10 ఉ 1211 |
| ప 7 వ | [సిద్ధాంత ప్రయోగములు] | | |



| | | |
|---|---|---|
| మొల + పెట్టు | మొలపెట్టు | 9-408 |
| సిగ్గు + పడు | సిగ్గుపడు | 9 338 |
| ము_క్తి + పడు | ము_క్తిపడు | 9-711 |

[విర్ధారక ప్రయోగములు కావివి]

| | | |
|---|---|---|
| విద్రి + పోవు | విద్రపోవు | 7-53 |
| పాలు + పెట్టు | పాలుపెట్టు | 8-39 |
| మునుగు+పడు | మునుగుపడు | 10 పూ 811 |

కొన్ని యెడల ద్వంద్వంబునం బదంబుమీది పరుషంబులకు పరపలు గావంబడవు [ప్రౌఢ సంధి 6]

పోతన ప్రయోగము

| | | |
|---|---|---|
| రాక + పోకలు | రాకపోకలు | 10పూ 109 |

2. సంఖ్యా వాచకములమీద గసడదవాదేశము వచ్చిన రూపములు :

| | | |
|---|---|---|
| ఇరు +కడలు | ఇరుగడలు | 10 ఉ 401 |
| ఇరు + పది | ఇరువది | 10 ఉ 64 |
| ఎను + పది | ఎనుబది | 10 ఉ 278 |
| నను + పది | నలువది | 9-156 |

3 ఏ వార్తికము పిమ్మట నీ మార్పు కనిపింపదు

చననె + తరంగిణులకు · చననె తరంగిణులకు 7-150

వలంపె + చెపుమా వలంచెపుమా 4-549

4 [16] ద్వంద్వంబునం బదంబు పయి పరుషములకు గసడదవలగు అవి మారి స్వీకరించెను

త > ద : అన్న + తమ్ములు . అన్నదమ్ములు 10 పూ 1122

5 కొన్ని శబ్ద పల్లవములందు గసడదవా దేశము వచ్చును

| | | |
|---|---|---|
| అరుగు + తెంచు | అరుగుదెంచు | 3-540 |
| ఏగు + తెంచు | ఏగుదెంచు | 3-17 |
| చక్కా + చేయు | చక్కాసేయు | 10 పూ 1544 |

---

16 బా వ్యా సంధి.15

2 2 4 పద్యాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోప పూర్ణ బిందువులు విభాషనగు (బా వ్యా సంధి 46)

కల్లరము + పదు కల్లరపదు 1-399

పదము + పడి పదంపడి 2-105

భయము + పడి భయపడి 8-212

2.3.0 హల్లు + అచ్చు [Consonant + Vowel]

ద్రుతమగు పొల్లునకారము సంధి లోపించినపుడు అర్థమునం దెట్టి మార్పును ఉండదు ద్రుతాంతములైన పదములు ద్రుత ప్రకృతికములు

2 3 1 ప్రథమేతర విభక్తి శత్రర్థక చువర్ణంబులందున్న యుకారంబునకు సంధి వైకల్పికముగానగును (బా వ్యా సంధి 2)

-ఉ + అ -> అ అంచున్+అరిగి వరిసెనంచరిగెదవేని 10 పూ.42

లేచుచున్ + అనవరతంబు లేచుచనవరతంబు

10 పూ 85

- ఉ + ఆ -7 ఆ అంచున్ + ఆలాపించు అంచాలాపించు

10 పూ 256

-ఉ + ఇ -> ఇ వర్తింపుచున్+ఇట్లున్న వర్తింపుచిట్లున్న 2-224

-ఉ + ఒ -> ఒ మూపురమంచున్ + ఒలగందు

మూపురమంచొలగందు 3-414

2 3 2 ద్రుత పరకస్వరమునకు ద్విత్వము వచ్చును

నోవాద్విత్వం క్వచి ల్లిప్తః పరప్రాణేన సంగతే

ద్రుతాద్ధ్రిత . క్వచిద్వాత్ర దృశ్యతేకవిభాషితే

(వికృతి అజ 28 కా) ఇట్టి అధర్వణీయ వివరణమువలన, భారత ప్రయోగములవలన ద్విత్వాకారము దుష్టమనరాదు అనంతుడు, అప్పకవి పీవిని దువ్వంధులనిరి అన్నిష్టనబినూడియున్న దాని ఆది వ 3-140 వందివి యన్నేటి తరంగలన్ ఆది వ 8-79

పీవియందు అన్+ఏటి, అన్+ఇష్ట అని విడదీయుట కవిసమ్మతమని బాల వ్యాకరణమతము కాని పూర్వ రూపము 'అన్న' అని పఠించినచో

ఈ చర్చకు తావులేదు నాచనసోముడు, అల్లసాని పెద్దనలు ఈ ద్విత్వన కార సంధికి చెందిన రూపములు వాడిరి

తోయజ లోచను దాకెన్నాయత శరవర్షమొప్ప (ఆకెన్+ఆయత)
ఉ హరి 6-207

రతి వయ్యోదకున్నమపైన చేతులన్నవి మను చ 2-53
(వయ్యోదకున్+అమపైన)

చిన్నయసూరి ఈ ప్రయోగములను గ్రహింపలేదు కాని ప్రౌఢ వ్యాకర్త దీని నంగీకరించి[17] కొన్ని యెడల ప్రామాణిక ప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరంబగుచో ద్విత్వంబు చూపఁబడెడిఅని తెలిపెను.

పోతన భారతాది ప్రయోగములను దృష్టియందుంచుకొని ఈ ద్విత్వనకార సంధినధికముగా ప్రయోగించెను భాగవతమందలి ప్రయోగములు

-న్+అ- : అధర్మమున్నరచు : అధర్మమున్+అరచు 2-198
అచ్యుతున్ననఘుని అచ్యుతున్+అనఘుని 3-844

-న్+ఆ : ధృతిమంతులకున్నాయు . మంతులకున్+ఆయు 4-213
పెలుచన్నాబోతు : పెలుచన్+ఆబోతు 10 ఉ 521

-న్+ఈ- : సమన్నీశ్వరున్ సమన్+ఈశ్వరున్ 1-123
విత్తమేమియున్నీని తెలుంగు : విత్తమేమియున్ +
ఈని తెలుంగు 10 ఉ 1019

-న్+ఉ- : పూరింపుచున్నువిదా పూరింపుచున్+ఉవిదా 10 పూ 771
ప్రేవలెకున్నుద్ధవా ప్రేవలెకున్+ఉద్ధవా 10 పూ 1440

-న్+ఊ- : మఱియున్నూహించి మఱియున్+ఊహించి
10 పూ.1228

-న్+ఎ- మాటలన్నెఱుకల · మాటలన్+ఎఱుకల 8-78
విరోధికిన్నెదురు . విరోధికిన్+ఎదురు 10 ఉ 916

17 ప్రౌఢ సంధి 3

-న్+ఏ- : ఒవ్పన్నేగి . ఒవ్పన్+ఏగి 10 ఉ 1190

పంచన్నేటికి : పంచన్+ఏటికి 8-186

-న్+ఐ- : పాషండులన్నైన 2-193 పాషండులన్+ఐన

బాలురున్నైన 4-26 బాలురున్+ఐన

-న్+ఒ- ఉండవలయున్నొవ్పగ ఉండవలయున్+ఒవ్పగ 8-172

-న్+ఓ- . ఈ మల్లులకున్నోచెల్ల ఈ మల్లులకున్+ఓచెల్ల 10 పూ.135

కదియన్నోహో : కదియన్+ఓహో 10 ఉ 1243

2 3 3 పెన్వాదుల కడ హల్లునకు ద్విత్వము వచ్చిన రూపములను గలవు పెనునకు పర్యాయరూపము పెన్

పెన్+ఇక్క : పెన్నిక్క 1-11

పెన్+ఉద్దులు పెన్నుద్దులు 10 పూ 730

పెన్+ఉరము : పెన్నురము 10 పూ 235

దీనినే ప్రౌఢ వ్యాకర్త కర్మధారయమున పెను శబ్దము తుది హల్లున కచ్చు పరమగునపుడు కలుగా ద్విత్వము కనబడునని (ప్రౌఢ సంధి 9) సూచించెను.

2.3.4 ఆశీరర్థక - ఎడున్ ప్రత్యయమునకు అచ్చు పరమగునప్పుడు మకార మాదేశమగును

పాపెడున్+అంచు . పాపెడుమంచు 3-313

2.3.5 ధ్వన్యను కరణమందలి అంతిమ హల్లునకు అచ్చుపరమైన ద్విత్వము వచ్చును

ఫల్+అని . ఫల్లని 8-393 10 పూ 368

జల్+అని : జల్లని 10 ఉ 62

ఝమ్+అని · ఝమ్మని 10 పూ 601

హుమ్+అని : హుమ్మని 8-55

హుమ్మనుచు 10 పూ 517

హుమ్మంచు 8.62

**2.40 హల్లు + హల్లు (Consonant + Consonant)**

హల్లుకు హల్లు పరమగునపుడు వచ్చు సంధిని హల్సంధియందురు తెలుగు హల్సంధికి సంస్కృత హల్సంధికి భేదమున్నది ప్రాచీన ద్రావిడభాషలు హలంతములు అట్లే తెలుగున కొన్ని హలంతశబ్దములు గలవు హల్లుకు హల్లు పరమగునపుడు సంయోగము వచ్చును

మూడ్+మూర్తుల ముమ్మూర్తులు ౬-669

మొదటి పదము నంతమందుగల హల్లు లోపించుట పరపదమందలి మొదటి హల్లు ద్విత్వమును పొందుట గమనింపదగినది క్రమముగా ఇట్టి మార్పు అజంతములపై హల్లు చేరినపుడు సంభవించును

వీడ్ (వీడు) + కొలుపు . వీడ్కొలుపు 10 పూ 211

కోల్(కోలు) + పడు . కోల్పడు 10 ఉ 752

పదాంతమందలి అచ్చునకు లోపము గలిగి పిమ్మట పూర్వమువలె హల్సంధి జరుగుచున్నదని భావము

**2.41** తెలుగునందు ద్రుతమగు పొల్లు నకారము శబ్దాంతమున వచ్చుచున్నది ఈ ద్రుతమునకు పరుషములు పరమువైన సరళములుగా మారును దీనినే సూరి ద్రుతప్రకృతికముమీది పరుషములకు సరళములగు [బా వ్యా సంధి 6] అని సూత్రించెను ఇదియే సరళాదేశ సంధి ఇందుగల 'న' పై కల్పికముగ లోపించును లోపించిన ద్రుతమును లేఖనమున అర్ధాను స్వారముగ గుర్తింపబడుచున్నది

| | | | |
|---|---|---|---|
| క > గ , | వేడ్కన్+కొలుచు | వేడ్కఁగొలుచు | 1-56 |
| | పన్నపున్+కిన్క | పన్నపుఁగిన్క | 10పూ 1637 |
| | పటికంపున్+కంబళముల్ | పటికంపుఁగంబళముల్ | 10 ఉ 602 |
| | సింగపున్+కొదమ | సింగపుఁగొదమ | 10 పూ 291 |
| చ > జ | కల్గన్+చేయు | కల్గఁజేయు | 4-284 |
| | చేయన్+చాలక | చేయఁజాలక | 10 పూ 249 |
| | గారవపున్+చూపుల | గారవపుఁజూపుల | 10 పూ 657 |

| | | | |
|---|---|---|---|
| త 7 ద | కూఁతున్+తమ్ము | కూఁతుఁదమ్ము | 10 పూ 930 |
| | చల్లన్+తనము | చల్లఁదనము | 8-136 |
| | పాపవున్+తృష్ణ | పాపవుఁదృష్ణ | 9-575 |
| ప 7 బ | ఎదన్+పాపు | ఎదఁబాపు | 1-325 |
| | కట్టన్+పంపు | కట్టఁబంపు | 7-198 |
| | పువ్వున్+పోఁడి | పువ్వుఁబోఁడి | 1-268 |
| | ముద్దున్+పల్కులు | ముద్దుఁబల్కులు | 10 పూ 265 |

242 క్రియాపదంబునందలి తుది హల్లునకు హల్లు పరంబగునపుడు మీఁది హల్లుతో కలిసి వచ్చును

కన్+కొను కఙ్గొను 10 ఉ 1255

243 [18]సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దము ధ్యవర్ణంబునకు లోపంబును మీఁది హల్లునకు ద్విత్వంబునగు

ముల్లోకములు 4-271

[19]కొన్నియెడల నవర్ణంబు పరంబగునపుడు పూర్వపదాంత్య డకారంబు నకారంబగునని ప్రౌఢ వ్యాకర్త సూచించెను

మూఁడు+నూరు మున్నూరు 9-262

## 25.0 ఆగమ సంధులు (AUGMENTS IN SANDHI)

సంధిలేనిచోట స్వరంబుకంటె పరంబయిన స్వరంబునకు యడాగమంబగు (బా వ్యా సంధి 3) నని సూరి స్పష్టీకరించెను సంయుక్త పద నిర్మాణమున కొన్ని వర్ణములు ఆగమములుగా వచ్చును. అవి -అి -టు -న్న, -పు, -ము, -రు

18 బా వ్యా 17

19 ప్రౌఢ సంధి 15.

2 5 1 ఁ-అరిగాగమము . (అందుఁ, అందరి)

[20]అంద్వాదులం దరిగాగమంబు సమాసంబునందగు నని సూరి సూత్రించెను

పోతన ప్రయోగములు 'దనుజారి లీలావతారంబులందరి కార్య కర్మములు సద్గుణములు' 7-240

'వామదేవుని యందరి ప్రేమయు' 7-239

'హరియందుఁ బక్షపాతంబుగాదు' 7-360

విష్ణుదేవుని యందుఁ బక్షపాతంబుగాదు" 7-239

2 5 2 టుగాగమము

[21] కర్మధారయంబులందుత్తునకచ్చు పరంబగునపుడు టుగాగమంబగునని సూరి సూత్రించెను

పోతన ప్రయోగములు

| | | |
|---|---|---|
| ఎక్కు+అద్దంబు | . ఎక్కుటద్దంబు | 9-65 |
| చూపు+అంపర | చూపుటంపర | 8-405 |
| చెక్కు+అద్దము | చెక్కుటద్దము | 10 పూ 1082 |
| తప్పు+అడుగులు | . తప్పుటడుగులు | 8-183 |
| బెడిదపు+అంపర | . బెడిదపుటంపర | 10 పూ 185 |

2 [22]కర్మధారయంబునందు పేర్వాదిశబ్దములకచ్చు పరంబగునపుడు టుగాగమంబు వికల్పమగునని సూరి పేర్కొనెను

టుగాగమము వచ్చిన రూపములు .

| | | |
|---|---|---|
| అఱు+అమ్ముకం | అఱుటమ్ముకం | 9-609 |
| చిగురు+ఆకుం | చిగురుటాకుం | 10 పూ 609 |

20 బా వ్యా సంధి. 44

21. బా వ్యా సంధి. 28

22 బా వ్యా సంధి. 29

టుగాగమమురాని రూపములు :

చిగురు+ఆకు : చిగురాకు 9-389
పొదరు+ఇంటిలో : పొదరింటిలో 10 పూ 1032
పేరు+అడవి : పేరడవి 9-24
పేరు+ఉరంబు · పేరురంబు 3-666

చిగురాకు అను టుగాగమ రహిత రూపము నన్నయ, తిక్కనలో గన్పింపదు నాచనసోముడు 'చిగురాకు జొంపంబని [ఉ హరి 5-56] ప్రయోగించెను పోతన ప్రయోగముల కిది ఆకరము పోతనయందు పేరు శబ్దమునకు టుగాగమము చేయలేదు [పేరడవులందు, పేరురము] దీనికి కారణము భారతప్రయోగములు లేకపోవుటయే

3. పెక్కు శబ్దమునకు టుగాగమము వచ్చిన రూపములు పోతన భాగవతమునలేవు

పెక్కు+అర్థములు : పెక్కర్థములు 3-132
దీనికి మూలము తిక్కన ప్రయోగము 'పెక్కెడల' కావచ్చు

4. పోతన సంఖ్యా వాచకములకు టుగాగమము చేయలేదు
ఏడు+అహములు : ఏడహములు 1-505

5 షష్ఠీసమాసమునందు టుగాగమము వచ్చిన రూపములు పోతనలో గలవు.
చూపు+అంవలు - చూపుటంవర 8-405
పువ్వు+అంవర - పువ్వుటంవర 9-388

2.5 3 ముగాగమము ·

1. ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమునకచ్చు పరమగునపుడు ముగాగమం బగు బా వ్యా సంధి 33
తొరగెడు+అశ్రుపూరములు : తొరగెడునశ్రుపూరములు 4-77
పుట్టెడు+ఎరిగింపు - పుట్టెడు నెరిగింపు 1-45
వరిపెడు+అవహూత్కృతి - వరిపెడున వహూత్కృతి 3-303

2 షష్ఠీ సమాసమునం దుకారమునకు అచ్చు పరమగునపుడు మగాగమం బగు.

వేరుడు+కొండలు : వేగురుఁగొండలు 10 ఉ 742

3 సమాసంబులయందంతంబులగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు మగాగమంబగు (బా॥ వ్యా॥ సంధి 25)

| | | |
|---|---|---|
| కట్టు+పంపు | కట్టుఁబంపు | 7-198 |
| నెయ్యంపు+చూపులు | నెయ్యంపుఁజూపులు | 1-248 |
| పిసుగు+పెంటలు | పిసుగుఁబెంటలు | 10 ఉ 519 |
| ముద్దు+పల్కులు | ముద్దుఁబల్కులు | 10 పూ 265 |
| పన్నపు+కిన్క | పన్నపుఁగిన్క | 10 పూ 1637 |

కొన్నిచోట్ల పదాంతమైన ఉత్తునకు సరళములు పరమైనను మగాగమము రాదు

| | | |
|---|---|---|
| ఉత్తరపు + గాలి | ఉత్తరపుగాలి | 10 పూ 799 |
| ఉత్తరపు + దిశ | ఉత్తరపుదిశ | 10 ఉ 710 |

4 [23] ఉదంతస్త్రీసమంబులకును బుంపులకును వరంబగు వాచకంబులకును తనంబు పరంబగునపుడు మగాగమంబగు నని సూరి పేర్కొనెను

| | | |
|---|---|---|
| చల్లి+తనము | : చల్లిఁదనము | 8-156 |
| పరుచు + తనము | : పరుచుఁదనము | 4-422 |

పుంపులకుదాహరణములు కనిపించుట లేదు.

5 ఉదంతములకందు వర్ణకము పరంబగునపుడు మగాగమంబగు

| | | |
|---|---|---|
| కార్చిచ్చు + అందు | కార్చిచ్చునందు | 9-40 |
| నవకంబు + అందు | నవకంబునందు | 4-767 |
| లోకము + అందు | : లోకమునందు | 10 పూ. 1143 |

6 ఉదంతములకు కు, కై వర్ణకంబులు పరంబగునపుడు మగాగమంబగు

అడుగు + కు . అడుగునకు : అడ్గునకు 7-160

---

23. బా॥ వ్యా॥ సంధి 35.

ఉద్యానవనము + కున్ ఉద్యానవనమునకున్ 10 ఉ 454
ప్రభావము + కు : ప్రభావమునకు 10 ఉ 816
విరహము + కు విరహమునకు 3-145
అనుగ్రహము + కై · అనుగ్రహమునకై 3-295

నగాగమయుక్తాది రూపములను పోతనలో గలవు.

ఆత్మసదనము + కు + అరిగెన్ ఆత్మసదనము కరిగెను
3-409

భూతలము + కు భూతలముకు 9-218
వనము + కు వనముకు 4-358
పరిహారము + కై పరిహారముకై 3-955
మోక్షము + కై : మోక్షముకై 3-861

కు వర్ణక పరకత్వమున కవిత్రియము వారిలో నగాగమము విక్కటయ
అథర్వణుని మతమున నగాగమము ప్రాయికము
సర్వేషా మేవచో దంత శబ్దానాం కౌ పరేకపేత్
సంప్రాయః సాదృకారాచ్ఛనర్వ సంజ్ఞితసమ్మతేః
చిన్నయసూరి మతమున నగాగమము విక్కము ప్రౌఢవ్యాకర్త
నగా గమాభావమును సూత్రీకరించెను [ప్రౌఢ శబ్ద 197]
నగాగమాభావమునకు మహాకవుల ప్రయోగములు
సంగరంబవిన మత్సవమున కేగెదు క్రియసాతవకసనియెడి కురు
లార [ఉ హరి 6 140]
కమవిాదవు కెగసి [భాస్కర సుందర 382]
పరుసదనంబుకోర్చి [భార కర్ణ 2 299]
దుమంతంబునకున్ వలన ప్రత్యయములు పరంబగునపుడు విగాగ
మముపై కల్పికముగ వచ్చును

దక్షుడు + న్ - దక్షువిన్ 4-109
పయోధినాధుడు + న్ - పయోధినాధువిన్ 3-617
హయగ్రీవుడు + న్ - హయగ్రీవువిన్ 8-732
అతడు + వలన - అతవి వలన 4-257

8 కంటె వర్ణక పరకత్వమున వగాగమము

పోతన ప్రయోగములు

ఘూర్పువన్న్వశ్లోకముంకంటె 3-352

కంటె నందు వర్ణకంబులు పరంబులగునపుడు గొన్నియెడల నమ హత్తులకు వగాగమంబగు [ప్రౌఢ శబ్ద 20] వని ప్రౌఢవ్యాకర్త తెలిపెను

2 5 4 పుగాగమము

[24]తామర కాకుపరంబగునపుడు పుగాగమంబగునని

ప్రౌఢ వ్యాకర్త సూత్రీకరించెను

తామర + ఆకు తామరపాకు 9-390

2.5.5 ముగాగమము

[25]ధ్వన్యమ కరణ శబ్దములకు అను ధాతువు పరమైనపుడు కొన్ని యెడల ముగాగమము వచ్చునని ప్రౌఢ వ్యాకర్త తెలిపెను

కల కల + అని . కలకలమని 10 ఉ 999

గుటుకుగుటుకు + అని గుటుకుగుటుకుమని 10 పూ 225

చిదుకు చిదుకు + అని చిదుకు చిదుకుమని 10 పూ 755

2 5 6 రుగాగమము

1 పేదాది శబ్దంబులకాలు శబ్దము పరంబగునపుడు కర్మధారయంబు నందు రుగాగమంబగు [బా వ్యా సంధి 30]

పోతన ప్రయోగములు

కోమ + ఆలు కోమరాయి 9-72

ముద్ద + ఆలు ముద్దరాలు 9-72

జవ + ఆలు జవరాలు . 9-72

సుద్ద + ఆలు సుద్దరాలు 9-355

---

24 ప్రౌఢ సంధి 17

25 ప్రౌఢ సంధి 19

2 కర్మ ధారయంబు సందర్భమంబులకాలు శబ్దము పరంబగునపుడ
త్వంబున కుత్వంబును రుగాగమంబునగు    బా వ్యా సంధి 31

ప్రియ + ఆలు    ప్రియురాలు    9-23

రక్కస + ఆలు.  రక్కసురాలు    10 పూ 423

## 2.6.0 ఆదేశములు

పోతన భాగవతమున -పు, -ంపు, -ట్ట
అను వర్ణములు ఆదేశములగును

## 2.6.1 పుంప్వాదేశము .

1 కర్మధారయంబులందు మువర్ణకంబునకుఁబుంపులగు

[బా వ్యా సంధి. 32]

| | | |
|---|---|---|
| కవ్వము + కొండ | కవ్వపుగొండ | 8-200 |
| సన్నము + నడుము | సన్నపునడుము | 9-306 |
| బలవంతము + దైవము | బలవంతపు దైవము | 8-200 |
| ప్రాయము + కొమరుడు | ప్రాయంపుగొమరుండు | 9-176 |
| పారము + ముద్ద | పారంపుముద్ద | 10 పూ 1303 |

2. కొన్ని యెడల షష్ఠీ సమాసమునందలి మువర్ణకంబునకు పువర్ణ మా
దేశమగును

| | | |
|---|---|---|
| ఉత్తరము + గాలి | ఉత్తరపుగాలి | 10 పూ 799 |
| ఉత్తరము + దిశ | ఉత్తరపు దిశ | 10 ఉ 710 |

## 2.6.2 ద్విరుక్త టకారాదేశసంధి .

[26] కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దముల అచ్చు పరంబగు
నపుడు ద్విరుక్తటకారంబగు నని సూరి సూత్రీకరించెను.

| | | |
|---|---|---|
| కడు + ఎలుక | కట్టెలుక | 7-59 |
| నిడు + ఊర్పులు | నిట్టూర్పులు | 9-520 |

## 2 7 0 ఆమ్రేడితములు (Diteratives)

ద్విరుక్తము యొక్క పర రూపము ఆమ్రేడితము తెలుగున విధి
సహజము

---

26 బా వ్యా సంధి 12.

2 7.1 అందదుకు ప్రకృతులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు
[బా వ్యా సంధి 42]

తుముడు + తుమురు తుత్తుమురు 1-287
ఇల్లు + ఇల్లు ఇల్లిల్లు 10 పూ 212
చెర + చెర చెచ్చెర 1-253

2 7 2 కొన్ని యెడల అంతిమాక్షరలోపము కనిపించు చున్నది
పోకుము + పోకుము . పోకుపోకుము 10 పూ 1022

2.8 0 ప్రాతాదుల సంధి

2.8 1 [27] సమానంబున ప్రాతాదుల తొలియచ్చుమీది వర్ణంబులకెల్లలోపంబు బహుళంబుగానగువవి సూరి పేర్కొనెను పోతన ప్రయోగములు

పూవు + బోడి పూబోడి 10 ఉ 183
లేత + జెమట లే జెమట 10 ఉ 333
లేత + వగవు లేవగవు 10 పూ.917

2 8 2 లుప్త శేషంబునకుం బరుషంబులు పరములగునపుడు నుగాగమంబగు నవి సూరి తెలిపెను [బా వ్యా సంధి 37]

పూ + బోడి పూబోడి 10 ఉ 183
లే + జెమట లేజెమట 10 ఉ 333

2.8 3 పరుషేతరంబులు పరంబులగునపుడు నుగాగమ ప్రాప్తిలేమింజేసి వానికి ద్విత్వంబగు

క్రొత్త + కారు క్రొక్కారు 1-431
క్రొత్త + తరుకు క్రొత్తరుకు 8-266
క్రొత్త + మావి . క్రొమ్మావి 9-514
క్రొత్త + మెరుగు క్రొమ్మెరుగు 1-285

2 8.4 అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచో గానంబడియెడి
[బా వ్యా సంధి 39]

తొమ్మిది + పది తొంబది 3-986

27. బా వ్యా సంధి 36

నె ఱ + మనము . నెమ్మనము 3-85
నెఱ + మొగంబు . నెమ్మొగంబు 8-304

29.0– ఇతరములు

2 9 1 మొదటి పదమందలి చివరి యక్షరము, రెండవ పదము తొలియక్షరము సమానమైన రెండు పదముల కలయికలో మొదటిది లోపించినట్లు కనిపించును
ఇవ్ని + నాళ్లు : ఇన్నాళ్లు 10 పూ 1389
కను + నీరు , కన్నీరు 10 పూ 161
కొన్ని + నాళ్లు : కొన్నాళ్లు 9-549

2 9 2 తద్ధర్మ పకారమునకు లోపము
వైష్ణవ తేజోంశమున బుట్టి వారట 10 పూ 1227
క్షితిరక్షింపఁబనించినాడు 10 పూ 872
ఇట్టి తద్ధర్మ పకారలోపము నన్నయలో గానరాదు తిక్కనాదులలో కనిపించును
'కల్పించినాడఁగావున' ద్రో 2-170
'తొంటి భావమున కలిగినారు' అను 5-97
నన్నయలో నిలోపము అట్టి, ఇట్టి శబ్దములలో కనిపించును
పేనలు పెట్టిన యట్టి నైరి ఆది. 12 220

2 9.3 ధాతుజ విశేషణముల మీదఁ దద్ధర్మలోపము
ఆకలి దీఱు కొఱకు 9- 16
చేయు కొఱకు 1-405
మగవాడయ్యెడు కొఱకు 9-29
శాపించుకొఱకునై 9-729

2 9 4 పితృ ఋణంబులు 10 ఉ 1125
పోతనలో ఈ ప్రయోగము గలదు
పితృ + ఋణంబులు – పితౄణంబులు అని సవర్ణదీర్ఘ సంధి కావలసి యుండగా ఏసంధినే ప్రయోగించెను

—)o(—

# 3. నామరూప విజ్ఞానము (NOUN MORPHOLOGY)

## 3.1.0 నామ ప్రాతిపదికలు (NOMINAL STEMS)

తెలుగు నందలి నామ ప్రాతిపదికలు దేశ్యములు, దేశ్యేతరము లని రెండు విధములు దేశ్యేతరములలో తత్సమ తద్భవములతో పాటు అన్య దేశములును చేరియు దేశ్య నామ ప్రాతిపదికలకు ప్రత్యయమేదియనంతమున ప్రాయికముగా చేరదు కాని కొన్నిటికి లింగవచన సూచక ప్రత్యయములు (Gender - Number Markers) చేరును

మహదేక వచనమున -ండు

మహద్బహు వచనమున -అలు/ - ఆలు/ - అరి

మహతీతర అమహదేక వచనము -ంబు/ -ము/ -మ్ము/ -వు

ప్రత్యయములు చేరుచుండును. తత్సమ నామ ప్రాతిపదికలకును సామాన్యముగా పై ప్రత్యయములే చేరుచుండును కాని 'ఇ' వర్ణాంత మహద్వాచక ప్రాతిపదికలపై, ఇ/ఉ వర్ణాంత మహద్వాచక ప్రాతిపదికలపై పై ప్రత్యయములు చేరవు

దేశ్య ప్రాతిపదికలను ప్రాథమిక [Primary] నిష్పన్న [Derivative] ములని రెండు భాగములుగా విడదీయవచ్చును. ప్రాథమిక నామ ప్రాతిపదికలందు ధాతు ప్రత్యయములను ప్రత్యేకముగా వివరించుటకు వీలు పడదు. క్రియానామ ధాతువుల నుండి నిష్పన్న నామములు కలుగవచ్చును అన్ని భాషలందును కొన్ని నామములు సహజ సిద్ధముగా నుండును మరికొన్ని నామ, క్రియాది ధాతువుల నుండి జనించును తెలుగునందు సహజ సిద్ధమగు నామములు గలవు. వానికి ప్రకృతి ప్రత్యయ విభాగము చేయుటకు వీలు లేదు ఇట్టి విభాగము చేయుటకు వీలుగానున్న నామములు కొన్నిగలవు అల్లుడు వంటి నామములకు బహువచనమున అల్లురు అని వచ్చుటచే ఏకవచన మందలి చివరి 'డు'ను వ్యాకర్తలు 'డుజ్' వర్ణకముగా విడదీసిరి ఇట్లు తెలుగుభాషయందుకొన్ని

టికి మాత్రమే ఈ విధానమును వర్తింపజేయవచ్చును లింగ భేదము నెరుగుటకు అర్థమును గ్రహించుట తప్ప వేరొక యాధారము లేదు. ఇట్టి నామములను ప్రాథమిక [Primary] నామములని పిలుతురు

### 3 1 1.1 ప్రాథమిక నామములు (PRIMARY NOUNS)

పోతన భాగవతమున గల ప్రాథమిక నామములు

లింగ వచన ప్రత్యయములు చేరనివి :

మహద్వాచకము

| | | |
|---|---|---|
| | కొడుకు | 3-375 |
| | అన్న | 8-596 |
| | తండ్రి | 1-79 |
| | మఱది | 10 పూ 20 |
| | మేనమఱంది | 1-524 |
| మహతీవాచకము : | అత్త | 10 ఉ 106 |
| | అక్క | 9-582 |
| | అమ్మ | 1-506 |
| | తల్లి | 1-119 |
| | ఇంతి | 3-484 |
| | చేడియ | 9-378 |
| | తరుణి | 8-269 |
| | పుత్రి | 1-365 |
| | భార్య | 3-460 |

మహతీతరామహద్వాచకము :

| | |
|---|---|
| తమ్న | 3-415 |
| తవి | 1-120 |

లింగ వచన ప్రత్యయములు చేరినవి :

మహదేకవచనము .

| | |
|---|---|
| కుఱ్ఱఁడు | 9-215 |
| తమ్ముఁడు | 7-30 |
| బల్లి దుండు | 8-685 |
| మేనల్లుడు | 1-180 |
| కొమరుడు | 9-195 |
| తనయుఁడు | 1-204 |
| బాలు డు | 3-232 |

మహతీ వాచకము :

| | |
|---|---|
| ఇల్లాలు | 2-53 |
| కోడలు | 10 ఉ 106 |
| చెలియలు | 7-19 |
| తొయ్యలి | 10 పూ 1454 |
| జవరాలు | 9-72 |
| ముద్దరాలు | 9-72 |
| ప్రియురాలు | 9-23 |

మహతీత రామహద్వాచకము

| | |
|---|---|
| సొమ్ము | 10 ఉ 479 |
| కాలంబు | 9-136 |
| దివంబు | 7-136 |
| ఇంగలము | 8-725 |
| కర్మము | 4-264 |
| పీతమ్ము | 4-97 |
| ఊరువు | 8-165 |

## 3.12 నిష్పన్ననామములు (SECONDARY NOUNS)

క్రియాధాతువులనుండి నిష్పన్నమైన నామములను సర్వసాధారణముగా కృదంతములని వ్యవహరింతురు.

3 1 2 1 తెలుగునందలి మూలధాతువులు కొన్ని నామవాచకములుగాను, క్రియా వాచకములుగాను కొన్ని ఉభయవాచకములుగాను గన్పట్టుచున్నవి

పోతన ప్రయోగములు

| పదము | క్రియార్థము | నామార్థము |
|---|---|---|
| 1 ఉక్కు | చచ్చు 10 ఉ 403 | శౌర్యము 10 పూ 667 |
| 2 ఉబ్బు | పొంగు 9-231 | సంతోషము 3-185 |
| 3 ఒప్పు | ప్రకాశించు 1-35 | సౌందర్యము 10 ఉ 179 |
| 4. కట్టు | ధరించు 10 పూ 328 | కూర్పు 7-97 |
| 5 చల్లు | వెదజల్లు 10 ఉ 693 | జలక్రీడావిశేషము 8-630 |
| 6 చిక్కు | దొరకు 10 పూ.1635 | మెలిసంకటము 7-364 |
| 7 చూపు | ప్రదర్శించు 3-31 | దృష్టి 10 పూ 408 |
| 8 తలంపు | ఆలోచింపుము 3-321 | ఆలోచన 10 పూ 1696 |
| 9 నవ్వు | హసించు 9-331 | హాస్యము 8-301 |
| 10 నేర్పు | నేర్చుకొనునట్లుచేయు 9-6 | నేర్పరితనము 10 ఉ 381 |
| 11 పలుకు | వచించుట 4 884 | మాట 9-571 |
| 12 పండు | ఫలవంతమగు 7-438 | పరిపక్వము 10 పూ 615 |
| 13. పొందు | అనుభవించు 8-681 | అనుకూల్యము 4-398 |
| 14 పోరు | పోరాడుట 10 పూ 431 | యుద్ధము 9-335 |
| 15 బొంకు | అబద్ధమాడు 8-588 | అబద్ధము 8-643 |
| 16 బ్రదుకు | జీవించు 7-322 | జీవితము 10 పూ 79 |
| 17 మ్రొక్కు | నమస్కరించు 3-302 | నమస్కారము 4-651 |
| 18. వెలుగు | ప్రకాశించు 10 ఉ 1079 | కాంతి 9-171 |

3 1.2 2 క్రియా ప్రాతిపదికలనుండి ఏర్పడిన నామ వాచకముల రూప నిష్పత్తిలో కొన్ని సంధిగతమైన మార్పులు గలవు కృత్ప్రత్యయములు చేరుటకు పూర్వము సామాన్యముగా ధాతువుల అంత్యాక్షరములు లోపించుట జరుగుచుండును ధాతుగత అచ్చులు దీర్ఘమును పొందినపుడు అంత్య హల్వర్ణములోపించును కొన్నిచోట్ల ధాతువునందలి హ్రస్వము కృదంత మైనపుడు దీర్ఘమును పొందును కొన్ని ప్రాథమిక ధాతువులు ద్వితీయా వస్థ యందు హ్రస్వమునొంది కృదంతమునందు మరల దీర్ఘమునొందును

కుడు 7 కుదు [మ] 10 పూ 85 ↗ కూడు 8-206
నో 7 నొ [చ్చు] 7 నొచ్చి 10 ఓ 20 ↗ నొవ్వు 3-525

3 1 2.3 కృత్తద్ధితముల వివేచనము :

సంస్కృత ప్రభావముచే తెనుగున ప్రవేశించిన సుప్ప్రత్యయములు, తిఙ్ప్రత్యయములకంటె భిన్నములైనవి కృత్తద్ధితములనెడు ప్రత్యయములు

[1]కృత్తులు క్రియా ధాతువులపై విధింపబడును వీనిని (Primary Suffixes) అని వ్యవహరించిరి తద్ధితములు నామ వాచకములపై విధింపబడును వీనిని (Secondary Suffixes) అందురు చిన్నయసూరి దీని ననుసరించి కృదంత పరిచ్ఛేదము, తద్ధిత పరిచ్ఛేదమని రెండు విధముల విభజించెను ధాతువునకు విహితంబగు తిఙ్భిన్న ప్రత్యయంబు కృత్తునాఁబడు కృత్తులకు వక్ష్యమాణంబులకు భావ కర్తృకరణాద్యర్థంబులు మహా జనవ్యవహారానుసారిగా నెఱుంగునది అనియు తద్ధితపరిచ్ఛేదమున విభక్త్యంతములైన శబ్దములమీఁద భావార్థమత్వర్థాదులయందు బ్రయోగించు ప్రత్యయంబులు తద్ధితంబులనంబడును అని సూరి బాల వ్యాకరణమున సూత్రీకరించెను ఈ ప్రణాళిక పాణినీయానుకూలముగానుండుట నిర్వివాదమైన విషయము ప్రాచీన కాలమున ఈ కృత్తద్ధిత భేదము స్పష్టముగా నుండి యుండవచ్చును నేఁడు వ్యాఖ్యానము ఎక్కువగా కలదు అందువలన చిన్నయసూరి రెండుగా విభజించి యుండవచ్చునని ఊహింపవచ్చును.

పోతన భాగవతమునగల కృత్తద్ధితముల స్వరూప స్వభావములను గూర్చి గమనింతము

---

1 కృదతిఙ్ 3-1-98 సన్నిహితే ధాత్వధికారే తిఙ్భిన్నః ప్రత్యయః కృత్సంజ్ఞః స్యాత్' సమీపమునవున్న ధాతోః అను నధికారమున ధాతువుకంటె విహితమై తిఙ్భిన్నమైన ప్రత్యయము కృత్సంజ్ఞ కలదగును

1. కృత్ప్రత్యయములు . వీనినే విష్పాదక ప్రత్యయములందురు.

(Derivative Suff xes or Pr mary Suff xes)

1. -అ పాట (∠పాడు) 10 ఉ 373

1ఎ. -అమి కానమి 3-510 కోరమి (కోరు)4-296 పొందమి (పొందు) 4-398

చెప్పమి (చెప్పు) 3- 89

2. -ఇక కినుక [∠కినియు] 10 ఉ 912
కిన్క [∠కినియు] 10 పూ 1637
చేరిక [∠చేరు] 7-101

3 -ఇకి/ -కి కూర్మి [<కూర్చు] 10 ఉ 327
కోర్కి [<కోరు] 10 ఉ 117
పోల్కి [<పోలు] 3-1049

4. -ఇమి కూరిమి/కూర్మి/ [∠కూర్చు] 10 పూ 11451
తాలిమి/తాల్మి [∠తాల్చు] 3-620
బలిమి [<బలియు] 3-656
వేలిమి [<వేల్చు] 9-505

5 -క . ప్రాతిపదికం చివరగల -గు, -చు, -వుల స్థానమున ఈ ప్రత్యయము ఆదేశముగా వచ్చును
అలుక [<అలుగు] 10 పూ 736
పోక [<పోవు] 10 పూ.92
రాక [<వచ్చు] 10 పూ 756

6. -కడ విలుకడ [<విలుచు] 8-280

7. -ట ఆట [<ఆడు] 9-70
పాట [<పాడు] 9-70

8 -టు పాటు [<పడు] 10 ఉ.26

9. -త మేత [<మేయు] 10 పూ 787
రోత [<రోయు] 10 పూ 977

| | | | |
|---|---|---|---|
| 10. | -పు | ఇడుపు [<ఇడుచు] | 10 పూ 1590 |
| | | ఓపు [<ఓచు] | 3-242 |
| | | కడపు [<కడచు] | 9-196 |
| | | కలపు [<కలచు] | 10 పూ 1689 |
| | | కొలపు [<కొలచు] | 8-719 |
| | | గెలపు [<గెలచు] | 10 ఉ 297 |
| | | చూపు [<చూచు] | 10 పూ 1019 |
| | | తడపు [∠తడచు] | 7-162 |
| | | నేర్పు [∠నేర్చు] | 10 ఉ 381 |
| | | పాపు [<పాయు] | 3-103 |
| | | మేపు [∠మేయు] | 10 పూ 849 |
| | | మోపు [∠మోయు] | 9-317 |
| | | వగపు [<వగచు] | 1-175 |
| | | వెలపు [<వెలచు] | 10 పూ 224 |
| 11 | -బడి | . చెల్లుబడి [<చెల్లు] | 10 పూ 139 |
| 12 | -వడి | వడవడి [<వడచు] | 10 పూ 1764 |
| 13 | -వు | : ఇరవు [<ఇరగు] | 10 ఉ 241 |
| | | కొలవు [<కొలయు] | 3-15 |
| | | చావు [<చచ్చు] | 7-46 |
| | | వగవు [<వగు] | 1-224 |
| | | నవ్వు [<నగు] | 10 ఉ 1197 |
| | | వరవు [<వరగు] | 1-459 |

## 3.1.3 భావార్థకములు (VERBAL NOUNS)

స్వార్థమున ప్రాతిపదికకు 'ట' వర్ణము చేర్పగా భావార్థకము కలుగును పోతన ప్రయోగములు

| | | | |
|---|---|---|---|
| -ట | . కోరుట | [<కోరు] | 3-380 |
| | కొమట | [<కొమ] | 7-214 |
| | తిమట | [<తిమ] | 10 పూ 1300 |

| | | |
|---|---|---|
| తివుచుట | [<తిగుచు] | 10 ఉ 177 |
| తీర్పుట | [<తీర్పు] | 3-453 |
| తొడుగుట | [<తొడుగు] | 10 ఉ 177 |
| వలుచుట | [<వలుచు] | 9-193 |
| వ్రగ్గుట | [<వ్రగ్గు] | 9-477 |

**3.1.3.1 వ్యతిరేక భావార్థకములు (Negative Verbal Nouns)**

| | | | |
|---|---|---|---|
| -అమి : | కావమి | [<కవు] | 3-510 |
| | చెప్పమి | [<చెప్పు] | 3-189 |

**3.1.2.4. తద్ధితములు : (నామముల నుండి విష్పన్నములైన నామ వాచకములు)**

నామములపై వాడబడు ప్రత్యయములు తద్ధిత ప్రత్యయములు కాల క్రమమున భాషా పరిణామములో కొన్ని తద్ధితములు తెలుగున ఏర్పడి నవి. అవి చాల తక్కువ. ఏకాల ప్రమాణికగల, బహ్వర్థ బోధకములు నైన సంస్కృత తద్ధితములకు, తెలుగు తద్ధితములకు సంబంధములేదు

-తనము -ఇమి మున్నగునవి త్వార్థంబునందును,
-ఇక -ఉక మొదలైనవి ప్వార్థంబునందును,
-అరి, -అడి -ఇడి మొదలైనవి మతుబర్థమునందును,
-ఎడు, -కొలది మానార్థమునందును
-ఒంటి దఘ్నార్థంబునందును వచ్చునవి వ్యాకరణకారుల నిరూపణము. పోతన భాగవతమునగల తద్ధిత ప్రత్యయముల వివరణము క్రిందనీయ బడినది

| | | | | |
|---|---|---|---|---|
| 1 -అరి | : తక్కరి | 10 పూ 537 | (<తక్కు) |
| | నేర్పరి | 10 పూ 933 | (<నేర్పు) |
| 2. -అలు | : చెలియలు | 7-19 | (<చెలియ) |
| 3. -ఆలు | : ఇల్లాలు | 9-640 | (<ఇల్లు) |
| | మూలాలు | 9-640 | (<మూల) |
| | వెలయాలు | 3-477 | (<వెల) |

కొమరాలు 9-72 (∠కొమరు-)
ముద్దరాలు 10 ఉ 183 (∠ముద్దు)
రక్కసురాలు 10.పూ.423
సుద్దరాలు 9-355
ప్రియురాలు 9-357

4. -అరిక : ఉబ్బరిక 10 పూ 1345

5. -దిమి : పోడిమి 9-24
పేదిమి 9-505

6. -కత్తియ : చెలికత్తియ 9-25
-కత్తె : పేరుకంకత్తె 9-381

7. -కాఁడు : చెలికాఁడు 1-369
వన్నెకాఁడు 1-218
విలుకాఁడు 10 పూ 1057
వేడుకకాఁడు 10 పూ 446
వేలుపుగమికాఁడు 10.పూ.543

8. -తనము : క్రిందుతనంబు 9-116
సొంపతనము 10.పూ 146
గొంటుతనము 10.పూ.1148
తల్లిదనము 8-156
బూటాలితనము 8-501
చెలితనము 8-190
జాణతనము 8-266
నేర్పరితనము 10 పూ.933
మగతనము 10.ఉ.189
మగువతనము 8-389
వెఱ్ఱితనము 1-519
బంటుతనము 3-680
పంగడివితనము 9-235

9. -టీకము : పెద్దటీకము 10 పూ.1073
పెద్దటీకంబు 10.ఉ 188
పేదటీకము 8-525

## 2.20 తత్సమపద నిర్మాణము (సంస్కృత సమ నిర్మాణము) (FORMATION OF TATSAMAS)

చిన్నయసూరి తెలుగునందలి పదజాలమును మూడు భాగములుగ విభజించెను. 1. తత్సమములు 2. తద్భవములు 3 దేశ్యములు.

1. సంస్కృత ప్రాకృత సమమైన భాష తత్సమము.
2. సంస్కృత ప్రాకృతభవమైన భాష తద్భవము.
3. త్రిలింగ దేశ వ్యవహార సిద్ధమైన భాషదేశ్యములని మూడు విధములు.

ఇంచుమించు ప్రాకృత వ్యాకరణములు శబ్దములను తత్సమ, తద్భవ, దేశ్యములని మూడు భాగములుగా విభజించినవి. కాని ప్రాకృత లాక్షణికుల దృష్టిలో తత్సమతద్భవములను పరిభాషలోని తత్పదము సంస్కృతమునకు మాత్రము పరిమితము తెలుగునందలి తత్పదము ఆద్య ప్రకృతియైన సంస్కృతమునకును, ద్వితీయ ప్రకృతియైన ప్రాకృతమునకును వర్తించును ఈ విభజన ప్రాకృతలాక్షణికుల మతమును అనుసరించి చేయబడినదని భాషా చరిత్రకారుల నిర్ణయము. మిగిలిన పదజాలము గ్రామ్యమని సూరి యభిప్రాయము. కనుక లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యమని పేర్కొనట జరిగినది సంస్కృత, ప్రాకృతములనుండి తత్సమ, తద్భవములు గ్రహింపబడినవని సూరి మతము. [illegible] ప్రౌఢ వ్యాకర్తయు అంగీకరించెను చింతామణియందు "తత్సా, సమా, దేశ్యా, గ్రామ్యా" యని తెలుగు పద సముదాయము నాలుగుభాగములుగా విభజింపబడినది. కేతన తత్సమము, తద్భవము, అచ్చతెనుగు, దేశ్యము, గ్రామ్యమని ఐదువిధములుగా తెలుగు పద జాలమును విభజించినాడు. కేతన [1]"తత్సమంబునాగ, దద్భవంబనగ అచ్చ తెనుగు నాగ మఱియు దేశ్యమనగ గ్రామ్య భాషనాఁగఁగల నైదు తెలుగులు వేఱె వేఱెవాని వివరింతు."

---

1. ఆం భూ వ 18, 19

విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో తత్సమ, తద్భవ, సహజాంధ్ర దేశ్య భవ దేశ్యోద్భవము- అని తెలుగుపలుకు జాతము పంచవిధములని పేర్కొనినాడు ఇంచుమించుగా ఇదే ఆధారముగా అప్పకవియు పలుకుజాతమును వింగడించినట్లుగా విస్తరింపవచ్చును అప్పకవి తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్యములని నాలుగు విధములుగా శబ్దములను విభజించి దేశ్యములను మరల రెండు రకములుగా శుద్ధాంధ్ర దేశ్యములు, అన్య దేశ జాంధ్రములు అని విడదీసి పరిభాషించినాడు

ద్రావిడ భాషలకు మొదటిదైన తమిళమందు తొల్ కాప్పియమున పదములు నాలుగు భాగముగా విభజింపబడినవి 1 ఇయఱ్చొల్ 2 తిరిచొల్ 3 తిశైచ్చొల్ 4 వడచ్చొల్

1. ఇయఱ్చొల్ : తమిళమున స్వాభావికములైన పదములు అనగా దేశ్యపదములు
2. తిరిచొల్ ...... ప్రకృతి, ప్రత్యయములందు కావ్యములలో గణబంధమునకై మారుపడిన పదములు అనగా అరవ పదముల రూపాంతరములు
3. తిశైచొల్ అన్యదేశములు కావచ్చు ఇతర దిశలనుంచి అనగా ఇరుగు పొరుగుభాషలనుంచి ఎరువుతెచ్చినవి

వడచ్చొల్ తత్సమ, తద్భవములని యర్థము

పై వానిలో ఇయఱ్చొల్, తిరిచొల్ దేశ్యములకు సమానము తిశైచ్చొల్లో అనునది అన్యదేశ్యములు వడచ్చొల్ అనుదానిలో సంస్కృత, ప్రాకృత సమములుకూడ చేర్పబడినవి తమిళమునగల ఇయఱ్చొల్ (స్వాభావిక పదములు), తిరిచొల్ (మారుపడిన పదములు) అను విభాగము తెనుగునలేదు కాని అప్పకవి సూచించిన తెలుగు పలుకులు అనునొక క్రొత్త విభాగమును చూపకపోలేదు వ్యాకర్తలందు తెనుగున (1) సంస్కృత ప్రాకృత సమములనియు, (2) సంస్కృత ప్రాకృత భవములనియు రెండు మతములు గలవు కన్నడమున శబ్దములను తత్సమ (సంస్కృత సమ) తద్భవ (సంస్కృత భవ), దేశియము (దేశ్యము)అను మూడు రకములుగా విభజించిరి

తెలుగునందు సంస్కృత ప్రాతిపదికలు తెలుగునందలి లింగ బోధక ప్రత్యయములు చేరి సంస్కృత సమములుద్భవించుచున్నవి.

పోతన భాగవతమునగల సంస్కృత సమపద విశ్లేషణము పరిశీలింతము.

సంస్కృత సమ పదములను రెండుగా విభజింపవచ్చును.

1. అజంత ప్రాతిపదికలు 2. హలంత ప్రాతిపదికలు.

3.2.1. అజంత ప్రాతిపదికలు : వీనిలో అకార, ఇకార, ఉకార, ఋకార మొదలగు అంత ప్రాతిపదిక లుండును. మరల ఇందు ఉక్త్యుక్తాదితో మహద్వాచక, మహతీవాచక, మహతీత రామహద్వాచకములను మూడు భాగములుగా విభజింపబడినవి.

3.2.1.1 అకారాంతమహద్వాచకములు :

సంస్కృతమందలి అకారాంత పుంలింగ ప్రాతిపదికలు సాధారణముగా తెలుగు నందు మహద్వాచకములుగా మారి ఏకవచనమునైతే 1డు/-ండు అనెడు లింగ బోధక ప్రత్యయమును చేర్చునపుడు స్వరసామ్యము (VOWEL HARMONDY) వల్ల ప్రాతిపదిక యందలి 'అ' కారమునకు 'ఉ' కారము వచ్చుచున్నది.

శంకర -> శంకరుడు 1-36
కృష్ణ -> కృష్ణుడు 1-53
ధర్మజ -> ధర్మజుండు 1-211
నారద -> నారదుండు 2-70
సూర్య -> సూర్యుండు 1-226

బహువచనమున :

నృప -> నృపులు 1-225
పుత్ర -> పుత్రులు 4-826
పౌత్ర -> పౌత్రులు 4-826

ప్రత్యయము చేరని రూపములను కలవు.

తాత -> తాత 9-215
బ్రహ్మ -> బ్రహ్మ 2-19

3.2.1.2 ఇకారాంత మహద్వాచకములు :

సంస్కృతమున 'ఇ' కారాంత పుంలింగ ప్రాతిపదికలు తత్సమము లగునపుడు ఏక వచనమున ఎట్టి మార్పును పొందవు. లింగ బోధక ప్రత్యయములు చేరవు

ఏకవచనము :

| | | | | |
|---|---|---|---|---|
| | అగ్ని | – 7 | అగ్ని | 9-420 |
| [illegible] | పతి | – 7 | పతి | 1-265 |
| [illegible] | మరీచి | – 7 | మరీచి | 4-7 |
| [illegible] | మారుతి | – 7 | మారుతి | 1-333 |
| | యోగి | – 7 | యోగి | 1-214 |
| | హరి | – 7 | హరి | 1-287 |

బహువచనము :

[illegible] బహువచన ప్రత్యయమైన 'లు – చేరునపుడు ప్రాతిపదిక చివర [illegible] 'ఇ' కార స్థానములో వర్ణ సామ్యముచే 'ఉ' కారమగును.

| | | | | |
|---|---|---|---|---|
| [illegible] | అగ్ని | –> | అగ్నులు | 10 & 1019 |
| | పతి | –> | పతులు | 9-425 |
| | ముని | –> | మునులు | 8-243 |
| | యోగి | –> | యోగులు | 7-152 |

3.2.1.3 ఉకారాంత మహద్వాచకములు

ఏకవచనములు

సంస్కృతమందలి 'ఉ' కారాంత పుంలింగ ప్రాతిపదికలు సంస్కృత్సమములగునపుడు ఏకవచనమున – 'వు' గాని, – డు/ – ండు గాని అంతమందు చేరును.

'– వు' వర్ణకము :

| | | |
|---|---|---|
| ఆయువు | 9-425 | 'రాహు, భృగు' శబ్దములు |
| [illegible] గురువు | 9-239 | తత్సమములుగా మారునపుడు |
| [illegible] జటాయువు | 9-221 | విధిగా 'వు' వర్ణక మందును – |

ప్రత్యయము 9-422 డు/ — ఉదు ప్రత్యయము

భృగువు 9-200

రాహువు 8-334

"డు/ — ండు" చేరిన రూపములు :

| | |
|---|---|
| గురుడు | 1-358 |
| విభుడు | 1-358 విభువు అని ఉండదు. |
| కురుండు | 1-252 |
| విభుండు | 3-31 |
| విష్ణుడు | 1-301 |

ప్రాతిపదిక ఎట్టి మార్పును పొందక మహద్వాచకపేక పదవ ప్రత్యయమైన — డు/ — ండు చేరని రూపములు పోతన భాగవతమున కలవు.

| | |
|---|---|
| సగ్గజిత్తు | 10.ఉ.138 |
| రాజా | 10.పూ 55 |
| విశ్వజిత్తు | 9-681 |
| సత్యజిత్తు | 9-681 |
| సత్రాజిత్తు | 10 ఉ 84 |

—వు/ — డులు వ్యావర్తకముగా ప్రవర్తించునవి.

| | | | |
|---|---|---|---|
| గురువు | 9-239 | గురుడు | 1-358 |
| విష్ణువు | 10 పూ.1762 | విష్ణుడు | 2-101 |

— డు/ — ండు ప్రత్యయము విధిగా ఉకారాంత మహద్వాచకములపై చేరుచున్నది.

| | | |
|---|---|---|
| విభుడు | 1-358 | విభువు అను రూపము పోతన |
| విభుండు | 3-31 | భాగవతమున ప్రయుక్తము కాలేదు. |

బహువచనము :

| | |
|---|---|
| పుత్రులు | 4-826 |
| రాజులు | 10.పూ.55 |

**9.2.1.4 ఋకారాంత మహద్వాచకములు :**

**ఏకవచనము :**

ఋకారాంత పుంలింగ సంస్కృత ప్రాతిపదికలు తత్సమములుగా మారునప్పుడు ప్రథమైక వచన మందలి దీర్ఘాచ్చు హ్రస్వముగా మారును.

| | | | | |
|---|---|---|---|---|
| కర్తృ - 7 | కర్తా : | కర్త | | 10.పూ.438 |
| భర్తృ - 7 | భర్తా : | భర్త | | 9-492 |
| శ్రోతృ - 7 | శ్రోతా : | శ్రోత | | 10.ఉ.1025 |

**9.2.1.5 మహతీవాచకములు : అకారాంతము**

ఏకవచనము : సంస్కృతమందలి ఆ కారాంత ప్రాతిపదికలు తత్సమములై నపుడు ప్రాతిపదికలంత మందలి దీర్ఘాచ్చు హ్రస్వములుగా మారును.

'దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్' అని చింతామణి, నామాంతంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వమగు' అని సూరియు సూత్రీకరించిరి.

| | | | |
|---|---|---|---|
| అనసూయా - 7 | అనసూయ | 4-10 |
| అంబికా - 7 | అంబిక | 9-671 |
| భద్రా - 7 | భద్ర | 10 ఉ 148 |
| భార్యా -> | భార్య | 9-242 |
| శర్మిష్ఠా -> | శర్మిష్ఠ | 9-524 |
| సత్యభామా -> | సత్యభామ | 10.ఉ.148 |
| సీతా -> | సీత | 9-269 |

**ఈకారాంత మహతీవాచకములు :**

| | | |
|---|---|---|
| ఊర్వశీ -> | ఊర్వశి | 9-389 |
| కుంతీ -> | కుంతి | 9-698 |
| ధారిణీ -> | ధారిణి | 4-34 |
| దేవకీ -> | దేవకి | 9-724 |
| రమణీ -> | రమణి | 1-236 |
| రాజ్యలక్ష్మీ -> | రాజ్యలక్ష్మి | 1-228 |

రుక్మిణీ -> రుక్మిణి 3-51
వాణీ -> వాణి 9-463

ఈ కారాంత ప్రాతిపదికలంతమందు గల ఏకాచ్క సంస్కృత ప్రాతిపదికలు తత్సమములగునపుడు ఎట్టి మార్పును పొందవు

శ్రీ 10 పూ 677

3216 మహతీతరామహద్వాచకము.

అదంతములు అదంత సంస్కృత ప్రాతిపదికలు తత్సమము అగునపుడు -ంబు/ -ము/ -మ్ము అనెడు ప్రత్యయములు చేరుచున్నవి

—ంబు' ప్రత్యయము

| | | | |
|---|---|---|---|
| చిత్ర- | > | చిత్రంబు | 7-363 |
| తేజస్- | > | తేజంబు | 1-173 |
| దాన- | > | దానంబు | 8-580 |
| దాహ- | > | దాహంబు | 7-12 |
| ధర్మ- | > | ధర్మంబు | 3-13 |
| పాన- | > | పానంబు | 4-279 |
| మోహ- | > | మోహంబు | 9-357 |
| యజ్ఞ | > | యజ్ఞంబు | 7-34 |
| రేఖా- | > | రేఖంబు | 3-429 |
| సత్య- | > | సత్యంబు | 3-1006 |
| హర్ష- | > | హర్షంబు | 3-[illegible]42 |

—ము' ప్రత్యయము :

| | | | |
|---|---|---|---|
| చిత్ర | > | చిత్రము | 1-210 |
| జయ- | > | జయము | 1-219 |
| తపస్- | > | తపము | 2-245 |
| దుఃఖ- | > | దుఃఖము | 4-922 |

| | | | |
|---|---|---|---|
| దేహ- | > | దేహము | 4-656 |
| ధన- | > | ధనము | 1-174 |
| నాశ- | > | నాశము | 1-305 |
| భాగ్య | > | భాగ్యము | 1-449 |
| మోహ- | > | మోహము | 3-732 |
| యశస్- | > | యశము | 1-293 |
| రోష- | > | రోషము | 4-35 |
| శోక- | > | శోకము | 4-890 |
| సుఖ- | > | సుఖము | 2-27 |
| హర్ష- | > | హర్షము | 3-40 |

'—మ్ము' ప్రత్యయము

| | | | |
|---|---|---|---|
| పీఠ- | > | పీఠమ్ము | 4-97 |
| వాల- | > | వాలమ్ము | 9-410 |

మహాశీశరా మహద్వాచకములైన అదంత ప్రాతిపదికలగు చిత్ర, దేహ, మోహ, రోష, సత్య, హర్ష మొదలగు వానికి-ము/ంబు ప్రత్యయములు రెండును చేరుచున్నవి

| | | | |
|---|---|---|---|
| చిత్రము | 1-210 | చిత్రంబు | 7-363 |
| దేహము | 4-656 | దేహంబు | 3-825 |
| మోహము | 3-732 | మోహంబు | 9-357 |
| రోషము | 4-35 | రోషంబు | 4-515 |
| సత్యము | 2-3 | సత్యంబు | 3-1006 |
| హర్షము | 3-40 | హర్షంబు | 3-742 |

2. ఇదంతములు : ఇదంత ప్రాతిపదికలు మార్పును పొందవు.

| | | | |
|---|---|---|---|
| ఉర్వి | > | ఉర్వి | 7-199 |
| ధరణి | > | ధరణి | 10 పూ 14 |
| ధరిత్రి | > | ధరిత్రి | 10 పూ 3 |

3. ఉదంతములు : ఉదంత సంస్కృత ప్రాతిపదికలు సంస్కృత సమములగునపుడు 'వు' ప్రత్యయము ఆగమముగా వచ్చి చేరును

క్రతు > క్రతువు 10 పూ 855
తమ > తమవు 4-429

4 ఓకారాంతములు ఓకారాంతగో శబ్దము సంస్కృత సమమగునపుడు 'వు' ప్రత్యయము ఆగమముగా వచ్చును

గో > గోవు 10 పూ 921

3 2.2. హలంత ప్రాతిపదికలు

సంస్కృత ప్రథమైక వచన రూపము నుండియే సంస్కృత సమ హలంత ప్రాతిపదికలుద్భవించుచున్నవి ద్వితీయైకవచన మందలి చివర 'మ' వర్ణము లోపించి తత్సమ ప్రాతి పదికలుగా పిలువ బడుచున్నది నకారాంత సంస్కృత ప్రాతి పదికలే తత్సమ ప్రాతి పదికలుగా చలామణి యగుచున్నవి.

3 2.2.1. పుంలింగ ప్రథమైకవచనము :

నకారాంత ప్రాతిపదిక పులింగ ప్రథమైకవచన రూపమందలి తుది దీర్ఘము హ్రస్వమై 'డు' ప్రత్యయము చేరును

భూతాత్మన్ > భూతాత్మ భూతాత్ముడు 3-932
మహాత్మన్ > మహాత్మ మహాత్ముడు 4-241

కొన్నియెడల 'న' కారాంత సంస్కృత ప్రథమైకవచనము యొక్క తుది దీర్ఘము హ్రస్వమై తత్సమ రూపమును పొందుచున్నది

బ్రహ్మన్ > బ్రహ్మ : బ్రహ్మ 1-170

3 2 2.2. పుంలింగ ద్వితీయైకవచనములు

తకార, దకార, నకారాంత ద్వితీయైకవచన రూపము లందలి తుది మ కారములోపించి ప్రాతిపదికాంతమైన అకారము ఉదంతత్వమును పొందిడు ప్రత్యయము చేరుచున్నది

త ఇంద్రియవత్ > ఇంద్రియవంతుడు 7-53
జాంబవత్ > జాంబవంతుడు 8-632
బుద్ధిమత్ > బుద్ధిమంతుడు 9-386
ద. క్రుద్ధ > క్రుద్ధుడు 7-316

ప్రహ్లాద > ప్రహ్లాదుండు 8-584

స అంగిరస్ > అంగిరసుండు 9-37

3.2.2.3. నపుంసకలింగ ప్రథమైకవచనము :

సకారాంత శబ్దము తత్సమములగునపుడు క్రింది మార్పులను పొందును

1 కొన్నిచోట్ల తుది హల్లునకు ఉత్వద్విత్వములు కలుగును

తపస్ > తపస్సు 7-53

శ్రేయస్ > శ్రేయస్సు 4-738

2 కొన్నిచోట్ల తుది హల్లు లోపించి - ము/-ంబు ప్రత్యయములు చేరును

తపస్ > తపము 2-245

యశస్ > యశము 1-293

తేజస్ > తేజంబు 1-173

3 కొన్నిచోట్ల సకారాంత శబ్దముల తుది హల్లు లోపించి వు ఆగమముగా వచ్చి చేరును

ఆయుస్ > ఆయువు 9-422

3 2 3 ఈ క్రింది పుంలింగ మహద్వాచక రూపమునకు బహువచనమైన ప్రత్యయము పరమైనపుడు వు వర్ణము లోపించును.

బంధులు [బంధువులు] 10 పూ 1509

## 3 3 0 వైకృత పద నిర్మాణము (FORMATION OF VAIKRITAS)

సంస్కృత సమ, దేశ్యములుగాక తక్కిన పదముల సముదాయమునకు వైకృతమను పరిభాషను మొట్టమొదట ఉపయోగించిన లక్షణ కర్త మంచెళ్ళ వాసుదేవకవి[1] 'సంస్కృతభవ, ప్రాకృత సమభవములు వైకృతములని తేటపరచి ఈ పరిభాషకు విస్తృత ప్రచారమును సాగించిన శాబ్దికుడు బహుజనపల్లి సీతా రామాచార్యులు

---

1 ఆచార్య టి దోణప్ప · వైకృత పదస్వరూప నిరూపణము, అముద్రిత సిద్ధాంత గ్రంథము పు 11

తద్భవ దేశ్యముల సమాహార స్వరూప భాషను వైకృతమని పిలుచుటకు పునాది వేసిన వారు ఆంధ్ర చింతామణి కర్త

[2] 'స్వస్థాన వేషభాషాభిమతాన్పంతో రసన్రవలక్షితియః
లోకే బహుమన్యంతే వైకృత కావ్యానిచాన్య దవహాయ' వైకృతమును
గూర్చి పలువురు వ్యాకర్తలు గావించిన నిర్వచనములను పరిశీలింతము.
వైకృత కావ్యములనగా దేశ భాషాకావ్యములని బాలసరస్వతీయమున కలదు

'వికృతౌ క్వచిచ్చ లోపో ద్రాగ్ద్విత్యాత ఆదిమన్య - భవేత్[3] అను
చింతామణి సూత్రమునకు
'అత్ర వికృతావిత్యనేన సంస్కృత సము పర్యుదాసః[4] క్రియతే' అని
అహోబలపండితీయ వ్యాఖ్య
వికృతౌ సర్వే శబ్దా క్లీబసమాపి స్త్రీ నమూళ్చనాన్యేను [5]
ఇందలి వికృతి శబ్దము సంస్కృత సమేతరపరమని బాల సరస్వతీయ రూపణము

'సంక్రిర్తక్వమ్ వికృత్యాద్యానుకృత్యా మంజులంభవేత్ '[6]
'వికృతాత్ పరుషాశ్చాస్యు '[7]
'వికృతౌ వత్రలా వస్ప్రాత్పంబుద్ధ్యా ఖవదేతు '[8]

పై సూత్రములనుబట్టి వికృతి వివేకకర్త వికృతి శబ్దమును అచ్చిక మను వర్ధమున వాడినట్లు తెలియుచున్నది చిన్నయసూరి కూడ ఈ యర్థమందే గవయోగించినట్లు స్పష్టమగుచున్నది

---

2 ఆంధ్ర శబ్ద చింతామణి సంజ్ఞా 5
3 ఆం శ. చిం అజంత 43
4 అహో. పు 173
5 ఆం శ చిం. అజంత 22
6 వికృతి వివేకము . సంజ్ఞ 26
7 వికృతి వివేకము . సంధి 16
8. వికృతి వివేకము అజంత 1

'వికృతి యందికారాంతముల ఉపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగునపుడు దుత్వంబగు' [9] అను వికృతి శబ్దము సంస్కృత సమేతరమని గ్రహింప వచ్చునని సూరి అభిప్రాయము

పై వివరణమునుబట్టి ఆంధ్ర భాషా సర్వస్వము నందేక దేశమునకు వికృతి అను పేరు వ్యవహారమున కలిగినది వైకృతమను పరిభాష తద్భవము లను, ప్రాకృత సమములను కలసమాహార పద సముదాయమునకు చర్చా సౌలభ్యము పరిమితార్థమున ప్రయుక్తము

వాసుదేవ కవి, సీతారామాచార్యులు ఈ యర్థమునందే వైకృత శబ్దమును వాడియుండుట విమర్శక లోకవిదితము [10] వైకృతములకు సమీప మాతృకలను నిర్దేశించుటలో ఆంధ్ర వ్యాకర్తలలో రెండు వర్గములున్నట్లు విశదమగు చున్నది. సంస్కృత భవములకు సంస్కృత ప్రకృతులనుండి ప్రాకృత సమ ప్రాకృత భవములను ప్రాకృత ప్రకృతులనుండి నిరూపించు వారు ఒక వర్గము, వారు సంస్కృత ప్రాకృతమతానుయాయులు ఈ కోవకు చెందినవారు చింతామణి కర్త, బాలసరస్వతి, అప్పకవి, వాసుదేవ కవి, అహోబల పండితుడు, చిన్నయసూరి బహుజనపల్లి సీతారామాచార్యులు, కందుకూరి వీరేశలింగము పంతులు మొదలగువారు వైకృతములను సంస్కృత భవ ప్రాకృత సమ ప్రాకృత భవము లను అన్నింటిని సంస్కృత ప్రకృతులనుండి నిరూపించువారు కేవల సంస్కృత మతానుయాయులు వీరు మరియొక వర్గము మూలఘటిక కేతన, చిన్నకోట పెద్దన అనంతుడు, గణపవరపు వేంకటకవి, వికృతి వివేక కర్త, తిమ్మకవి, అడిదము సూరకవి, ఏనుగులక్ష్మణకవి, కస్తూరి రంగకవి, రావిపాటి గురుమూర్తి శాస్త్రి, నాదెళ్ళ పురుషోత్తమ కవి మొదలగువారు రెండవ వర్గమునకు చెందినవారు [11]

---

9 బాల వ్యా తత్సమ 46

10 ఆచార్య టి దోణప్ప వైకృత పదస్వరూప నిరూపణము, అముద్రిత సిద్ధాంత గ్రంథము పుట 47

11 ఆచార్య టి దోణప్ప . వైకృత పదస్వరూపణము, అముద్రిత సిద్ధాంత గ్రంథము పుట 135, 136

ప్రాచీన కాలము నుండి ఆర్య భాషా సంపర్కము, రాజకీయ పరిణామము, ఆనాటి వైదిక, జైన, బౌద్ధమతముల సంసర్గము మొదలగు వాని ప్రభావము తెలుగు భాషపై ముద్రవేయబడిన[1] వాని అధివక్యము తెలుగుభాషపై అంతటితో ఆగక కాలక్రమముగ ఎన్నెన్నో మార్పులకు లోనైనది అప్పుడు పదముల ప్రాతిపదికలలో శాబ్దిక పరిణామముల పొందియు, కొన్ని పొందకయు తెలుగున ప్రవేశించినవి

మార్పులు పొందని పదములు తత్సమములని శాబ్దికుల తలంపు సంస్కృత ప్రాతిపదికలలో ధ్వని సంబంధమైన మార్పులు లేనివి సంస్కృత సమములు మార్పులు గలవి సంస్కృత భవములు అట్లే ప్రాకృత ప్రాతిపదికలలో ధ్వని పరమైన మార్పులు లేనివి ప్రాకృత సమములు, మార్పులు పొందినవి ప్రాకృత భవములు సంస్కృత భవ, ప్రాకృత సమ, ప్రాకృత భవములు వైకృతములను నభిప్రాయము ప్రస్తుత సమీక్షలో అనుసరింపబడినది

పోతన భాషలోని వైకృత పదములు దాని సమీప మాతృకలు క్రింద చూపబడినవి ఇందలి వైకృత పదములు వాని సమీప మాతృకలతో కూడిన పద పట్టిక అనుబంధమున చూపబడినది ఆద్య ప్రకృతి సంస్కృతము, ద్వితీయ ప్రకృతి ప్రాకృతము తెలుగు వికృతి తెలుగునకు సమీప మాతృకలు కనుక ప్రాకృతసమ, ప్రాకృత భవ ధ్వనిపరిణామములు ఒక ప్రకరణమున, సంస్కృత భవ ధ్వని పరిణామములు ఇంకొక ప్రకరణము నందు చూపబడినవి ఇవి ఆచార్య తూమాటి, దొణప్ప గారి 'వైకృత పదస్వరూప నిరూపణము' అను అముద్రిత సిద్ధాంత గ్రంథమున చూపబడిన పద్ధతులనాధారముగా స్వీకరించి వివరింపబడినవి

### 3. 3. 1 ప్రాకృత సమ, ప్రాకృత భవ సంబంధి ధ్వని పరిణామములు

పరిణామమునందు, ప్రాధాన్యమునందు ప్రాకృత సమ, ప్రాకృత భవములు ప్రథమస్థానీయములగుటచే తత్సంబంధి ధ్వని పరిణామ ప్రక్రియ మొదటి ప్రకరణముగ రూపింపబడినది

### 3. 3. 1 1 పదాది వర్ణములు : స్వరములు

పదాది స్వరములుగా పదాదియందు అచ్చులు నిల్చినవియు, పదాది వ్యంజనములతో గూడినవియు అని అర్థము తులనాత్మక పరిశీలన నిమిత్తము సంస్కృత మూల రూపము కూడ ఈయబడినది

1 అ - ∠ అ - పదాది అచ్చులు తెలుగున ప్రాయికముగ మార్పునకు లోను కావు

| తెలుగు | | ప్రాకృతము | సంస్కృతము |
|---|---|---|---|
| అగ్గము | 10 పూ 1214 | అగ్గ- | అగ్రియ- |
| అగ్గించు | 10 పూ 748 | అగ్ఘ- | అర్ఘ- |
| అని | 4-381 | అణియ- | అనేక- |
| అప్పళించు | 8-55 | అప్ఫాల- | ఆస్ఫాల |
| అయ్య | 4-91 | అయ | ఆర్య |

(1) వ్యంజనములతో కూడిన అ కారము.

| | | | |
|---|---|---|---|
| కంచెల | 10 ఉ 803 | కంచులిఆ | కంచులికా |
| గంత | 10 పూ 357 | గంతా | గంతు |
| చల్లడము | 10 పూ 1339 | చల్లాణగ- | చల్లానక- |
| జడ | 10 ఉ 655 | జడా | జటా |
| తపసి | 9-623 | తవస్సి | తపస్వి |

(2) కొన్నిచోట్ల మార్పులకు లోనగును

| | | | |
|---|---|---|---|
| కనవు | 10 పూ 625 | ఘూవ- | ఘూన- |

2. ఆ - ∠ ఆ- : సమీప మాతృకయందలి పదాది 'ఆ' కారము తెలుగున 'ఆ - కారముగానేయుండును

| | | | |
|---|---|---|---|
| ఆస | 10 పూ 46 | ఆసా | ఆశా |
| ఆకసము | 4-329 | ఆకాస- | ఆకాశ- |
| కాన | 4-220 | కాణం | కాననం |
| చాయ | 8-448 | ఛాయా | ఛాయా |

3. ఇ- ∠ ఇ- సమీపమాతృక యందలి 'ఇ' కారము తెలుగున 'ఇ' గానే ఉండును

ఇచ్ఛ 7-408 ఇచ్ఛా ఇచ్ఛా
థిరము 10 పూ 1428 థిర- స్థిర-
సిరి 10 పూ 900 సిరి శ్రీ

4 ఈ - ∠ ఈ - . సమీకమాతృకల వి 'ఈ' కారము తెలుగున 'ఈ' గానే ఉండును

వీరము 10 ఉ 416 వీర- వీర-

5 ఊ - ∠ ఊ - సమీప మాతృకయందలి పదాది 'ఊ' కారము తెలుగు 'ఊ' కారముగానే ఉండును

ఊసర 10 ఉ 458 ఊసర- ఊషర-
జూదము 10 ఉ 291 జూద- ద్యూత-

6 ఎ - ∠ ఇ - సమీపమాతృక యందలి పదాది ఇకారము తెలుగున ఎ- కారముగ మారును

దెస 1-511 దిసా దిశా
వెన్నుండు 10 పూ 335 విణ్హు- విష్ణు

7. ఎ - ∠ ఏ - సమీప మాతృకయందలి పదాది ఏ కారము తెలుగున ఎ- కారముగా నిలిచిపోవును

ఎక్కటి 10 ఉ 870 ఏక్కట్ఠ- ఏకస్థ-

8. [1] ఏ - ∠ ఎ - సమీపమాతృకయందలి పదాది 'ఎ' కారము తెలుగున ఏ - కారముగా మారును.

ఏకతము 10 పూ 1019 ఎక్కంత- ఏకాన్త-

[2] ఏ - ∠ ఏ - సమీప మాతృకలోని ఏకారము తెలుగున ఏకారముగా నిలుచును

చేడియ 10 పూ 222 చేడిఆ చేటికా

9 [1] ఒ - ∠ అ - సమీపమాతృకలోని పదాది 'అ' కారము తెలుగున 'ఒ' కారముగా మారును.

బొమ్మ 3-665 బంభ బ్రహ్మన్

[2] ఒ - ∠ ఒ - . సమీప మాతృకయందలి పదాది 'ఒ' తెలుగున 'ఒ' గానే ఉండును

ఒజ్జ 7 - 179 ఒజ్ఝాఅ-, ఉవజ్ఝాఅ- ఉపాధ్యాయ-
గొంతి 1-209 కొంతీ కుంతీ

[3] ఒ - ∠ ఓ - సమీపమాతృకలోని పదాది 'ఓ' తెలుగున ఒ-గా మారును.

సొబగు 4-562 సోభగ్గ సౌభాగ్య

[4] ఓ - ∠ ఓ - సమీప మాతృకయందలి పదాది 'ఓ' తెలుగున 'ఓ' గానే ఉండును

ఓగిరము 10 ఉ 723 ఓగిర- అవగిర-
తోరము 10 పూ 431 దోరి దోర-

3.3.1 2 అపదాది స్వరములు।

1 [1] -అ- ∠ -ఆ-

| తెలుగు | ప్రాకృతము | సంస్కృతము |
|---|---|---|
| అనతి 4-108 | అణత్తి | అజ్ఞప్తి- |
| ఊసర 10 పూ.458 | ఊసర- | ఊషర- |
| రోసము 10 ఉ 20 | రోస- | రోష |

[2] -అ- ∠ -అ-

| | | |
|---|---|---|
| అకసము 4-329 | అకాస- | ఆకాశ· |
| ఇంగలము 8-725 | ఇంగాల- | అంగార. |

[3] -అ- ∠ -ఓ-

| | | |
|---|---|---|
| సంతసము 9-600 | సంతోస- | సంతోష- |

2 -అ- < -అ-

| | | |
|---|---|---|
| బంగారము 8-725 | బింగార- | శృంగార- |
| సింగారము 9-338 | సింగార- | శృంగార- |

3 -ఇ- < -ఇ-.

వేదియ 10 పూ 222 వేదిఅ వేదికా

4 -ఉ- < -ఊ- .

సిందురము 10 పూ 1318 సిందూరం సిందూరమ్

5 -ఎ- < -ఋ- :

సంకెల 10 పూ 161 సంఖలా శృంఖలా

3 3. 1. 3. పదాది వర్ణములు వ్యంజనములు

1 [1] క- < క- · సమీప మాతృక యందలి పదాది 'క' కారము తెలుగున 'క' గానే ఉండును

కంచము 10 పూ 495 కంసం కాంస్య-

కదిమి 10.పూ 129 కయంబ కదంబ

[2] క- < ఘ - · సమీప మాతృకలోని పదాది 'ఘ' కారము తెలుగున 'క' కారముగా మారును

కవవు 10 పూ 625 ఘూవ- ఘూవ

2 [1] గ- < క- : సమీపమాతృకలోని పదాది 'క' కారము తెలుగున 'గ' కారముగా మారును

గొంతి 1-209· కొంతి కుప్తి

[2] గ- < గ- : సమీప మాతృకయందలి పదాది 'గ' తెలుగున 'గ' గానే ఉండును

గారవ 1-373 గఉరవు గౌరవ-

[3] గ - < ఘ సమీప మాతృకలోని పదాది 'ఘ' తెలుగున 'గ'గా మారును

గరిత 3-56 ఘరత్తో గృహస్థ

3 [1] చ- < చ- సమీపమాతృకలోని పదాది 'చ' తెలుగున 'చ' గానే ఉండును

చేడియ 9-378 చేడి ఆ చేటికా

చొక్క 9-93 చొక్క- చోక్ష

[2] చ- < ఛ- . సమీపమాతృకయందలి పదాది 'ఛ' తెలుగున 'చ' గా మారును

చాయ 8-448 ఛాయా ఛాయా

[3] చ- < త- సమీపమాతృక యందలి పదాది 'త' కారము తెలుగున 'చ' గా మారును

చెమట 10 పూ 387 తిమ్మ- తిమ్-

[4] చ- < థ- సమీపమాతృక యందలి పదాది 'థ' కారము తెలుగున 'చ' కారముగ మారును

చను 1-74 థణః స్తన-

[5] చ- < స- సమీప మాతృకలోని పదాది 'స' కారము తెలుగున 'చ' గా మారును

చుక్క- 19 పూ 1302 సుక్క- శుక్రః

4 [1] జ- < జ- సమీప మాతృకలోని పదాది 'జ' కారము తెలుగున 'జ' కారముగానే ఉండును

జముడు 10 పూ 1427 జమో యమ

జూదము 10 ఉ 291 జూద [అ]- ద్యూత-

[2] జ- ∠ ఝ- సమీపమాతృకలోని పదాది 'ఝ' తెలుగున 'జ' గా మారును

జాడించు 10 పూ 1345 ఝాడణం ఝాటన

5 ర- < ర- సమీపమాతృకయందలి పదాది 'ర' తెలుగున 'ర' గానే ఉండును

రావు 8-90 రావ స్థావ —

6 [1] త- < థ- సమీపమాతృకలోని పదాది 'థ' కారము తెలుగున 'త' కారముగ మారును.

తిరము 3-54 థిరం స్థిరమ్

[2] త- < ద- సమీపమాతృక యందలి పదాది 'ద' తెలుగున 'త'గా మారును.

తోరము 10 పూ 431 దోరో దోరః

7 ద- ∠ ద- సమీపమాతృక యందలి పదాది 'ద' తెలుగున 'ద' గానే ఉండును

| | | | |
|---|---|---|---|
| దొనగు | 8-316 | దోన- | దోషః |
| దెస | 1-511 | దిసా | దిశా |

స- < ఙ- . సమీపమాతృకలోని పదాది 'ఙ' కారము తెలుగున 'స' కారముగా మారును

| | | | |
|---|---|---|---|
| విచ్చ | 4-137 | ఙిచ్చ | విశ్వ |
| విచ్చరము | 8-447 | ఙిబ్బర- | విశ్వరమ్ |
| విద్దము | 8-447 | ఙిద్ధ | స్నిగ్ధమ్ |

9. [1] ప- < ప- సమీపమాతృకలోని పదాది 'ప' తెలుగున 'ప' గానే ఉండును

| | | | |
|---|---|---|---|
| పవడము | 9-327 | పవాఅ- | ప్రవాల- |
| పలవరము | 2-47 | పలావ- | ప్రలాప- |
| పరికించు | 3-224 | పరిక్ఖా | పరీక్ష |

[2] ప- ∠ ఫ- సమీపమాతృక యందలి పదాది 'ఫ' తెలుగున 'ప' గా మారును

| | | | |
|---|---|---|---|
| పటికము | 9-327 | ఫడిగ- | స్ఫటిక- |

10 [1] బ- < భ- సమీపమాతృకలోని పదాది 'భ' కారము తెలుగున 'బ'గా మారును

| | | | |
|---|---|---|---|
| బొమ | 3-65 | భమయా | భ్రువ- |
| బంగారు | 9-321 | భింగార- | భృంగార- |

[2] బ- ∠ వ- సమీపమాతృకలోని పదాది 'వ' కారము తెలుగున'బ' కారముగా రుమారును

| | | | |
|---|---|---|---|
| బావి | 10 ఉ 838 | వావీ | వాపీ |
| బిత్తర | 10 ఉ 804 | విత్థార | విస్తార |

ఈ ధ్వని పరిణామము తెలుగున కన్నడ ప్రభావము వలనను ప్రత్యేకముగను ఏర్పడి యుండవచ్చునని పరిశీలకుల అభిప్రాయము [12]

---

12. ఆచార్య తూమాటి దొణప్ప, వైకృత పదస్వరూపనిరూపణము పు 212

11 మ- < మ- . సమీపమాతృక యందలి పదాది 'మ' తెలుగున 'మ' గానే ఉండును

| | | | |
|---|---|---|---|
| మచ్చరము | 19 పూ 56 | మచ్ఛర- | మత్సర- |
| ముత్తియము | 8-447 | మోత్తియ- | మౌక్తిక- |
| ముద్దియ | 10 పూ 980 | ముద్ది అ- | ముద్రా |

12 ర- < ర- రేఫము దంతమూలీయము కావున మూల ద్రావిడ భాషలో పదాది యందుండదు [13] అర్వాచీన దశలోను దేశ్యక్రియల యందు రేఫాది రూపములు చాల తక్కువ వానిలో ఎక్కువ భాగము వర్ణవ్యత్యయము వలన ఏర్పడినట్టివి ప్రాచీన ద్రావిడ భాషలో పదాది స్వరములకు పరముగ వచ్చిన రేఫము వర్ణవ్యత్యయము వలన పదాదిని నిలుచుట అనంతర దశ యందలి ధ్వని పరిణామము కాని అర్వాచీన కాలములో రేఫాది పదములు మార్పులేకుండ వైకృతములుగా తీసికొనబడినవి

| | | | |
|---|---|---|---|
| రక్కసి | 10 పూ 1 28 | రక్ఖసీ | రాక్షసీ |
| రచ్చ | 10 ఉ 273 | రచ్ఛా | రథ్యా |
| రొద | 4-41 | రుద | రుతా |
| రోసము | 10 ఉ 20 | రోస- | రోష- |

13 అ- ∠ అ- . సమీపమాతృకలోని పదాది 'అ' తెలుగున 'అ' గానే ఉండును

| | | |
|---|---|---|
| అచ్చి | 9-115 | అచ్ఛి | అక్షి |
| లెస్స | 7-410 | లేస్సా | లేశ్యా |

14 [1] వ- ∠ వ- . సమీపమాతృకలోని పదాది 'వ' తెలుగు 'వ' గా నుండును

---

13. R Ca dwe , A Comparat ve Gramar of the Dravidian or South Ind an fam y of Languages, London, 1913 PP. 143 144.

వివరు 10 పూ.1170 వివర- వివరః

వెన్నుండు 10 పూ 335 విణ్హు విష్ణు

[2] వ- < స- సమీపమాతృకలోని పదాది 'స' తెలుగున 'వ' గా మారును

వేయి 9-423 సహస్స- సహస్ర

సహస్ర శబ్ద సంబంధముగా కన్నడమున సాయిర, సావర, సావిర, సాసిర్ మొదలగు రూపములును, తమిళ మలయాళములలో 'ఆయిరమ్' అను రూపము, తుళు భాషలో సాయిర, సావిర, సారలను కన్పట్టుచున్నవి. తెలుగు నందలి వేయి రూప నిష్పాదన క్రమము సువిచారితము కావలసి యున్నది.[14]

15 స- < శ- సమీప మాతృకలలోని పదాది 'శ' కారము తెలుగున 'స' గా ఉండును.

సిరి 3-483 సిరి శ్రీ

సింగారము 9-338 సింగార- శృంగార-

3.3.1.4 అపదాది వ్యంజనములు [అజ్మధ్యములు]

[1] -క- < -క-. సంస్కృత భవేతరములగు వైకల్పితములలో ఈ పరిణామము మిక్కిలిగా కన్పించుచున్నది.

ఆకసము 9-192 ఆకాస- ఆకాశ-

పటికము 9-327 ఫలిక- స్ఫటిక-

[2] -క- < -ఖ- సమీప మాతృకలోని అపదాది 'ఖ' కారము తెలుగు 'క' గా మారినది

రేక 10 పూ 877 రేఖా- రేఖా-

[3] -క- < -క్ఖ- సమీప మాతృకలోని అపదాది 'క్ఖ' కారాది ద్విత్వ రూపమందలి ద్విత్వము లోపించి తెలుగున 'క' కారముగా మార్పును చెందినది

పరికించు 3-224 పరిక్ఖ- పరీక్ష-

---

14. The Telugu word for hcu and Velu is a purely Drav d an word . . "Ca dwel , Ogo C f P 354

[2] 1 -గ- < -గ్గ- సమీప మాతృకయందలి-అపదాది ద్విత్వ 'గ' కారము తెలుగున ద్విత్వములోపించి 'గ' కారముగ నిల్చిపోవును

పొదగు 4-562 సోభగ్గ సౌభాగ్య

2 -గ- < -వ- సమీప మాతృక యందలి అపదాది 'వ' కారము తెలుగున 'గ' కారముగ మారును.

తెగడు 0 పూ 721 తివుడ- త్రిపుట

3 -గ- < -హ- సమీప మాతృక యందలి అపదాది 'హ' కారము తెలుగున 'గ' కారముగా మారి తత్పూర్వ స్వరమందలి ఉ 'ఒ' గా మారును

మొగము 10 ఉ 443 ముహం ముఖమ్

3 -చ- < -చ- ఇది చాల అరుదైన ధ్వని పరిణామము.

రాచ- 9-512 రాచ- రాజ-

4 -జ- < -జ్ఝ- సమీప మాతృకలోని అపదాది ద్విత్వ 'ఝ' కారము తెలుగున 'జ' గా మారును

ఓజ 4-48 ఒజ్ఝఅ ఉపాధ్యాయ

గుజ [గుజగుజలు] 10 ఉ 376 గజ్ఝఅ గుహ్య-

5 1 -ట- < -ట్ట- సమీప మాతృక యందలి అపదాది ద్విత్వ 'ట' కారము తెలుగున ద్విత్వము లోపించును.

| తెలుగు | | ప్రాకృతము | సంస్కృతము |
|---|---|---|---|
| వివ్వటిల్లు | 2-227 | వివ్వట్ట- | వివర్త- |

2 -ట- < -ట్ఠ- సమీప మాతృకలోని అపదాది ద్విత్వ 'ఠ' కారము తెలుగున 'ట' కారముగా మారును

కటిక 10 ఉ 84 కట్ఠ- కాష్ఠ-

3 -ట- < -ఠ- సమీమాతృకలోని అపదాది 'ఠ' తెలుగు 'ట' గా మారును.

పటికము 9-327 ఫలిక- స్ఫటిక-

6 1 -డ- < -డ- సమీప మాతృకలోని అపదాది 'డ' తెలుగున 'డ' గానే ఉండును

అడవి 9-202 అడవీ అటవీ

చేడియ 10 పూ 222 చేడిఅ చేటికా

జడ 10 ఉ 655 జడా జటా

2 -డ- < -ణ- సమీప మాతృకలోని అపదాది 'ణ' తెలుగున 'డ' గా మారును

చల్లడము 10 పూ 1339 చల్లాణగ- చల్లానక-

3 -డ < -ల- సమీప మాతృకలోని అపదాది 'ల' తెలుగున 'డ' గా మారును

పవడము 9-327 పవాల- ప్రవాల-

పుత్తడి 3-415 పుత్తలీ పుత్తలీ

7. -ణ- < -ణ- సమీప మాతృక యందలి అపదాది అద్విత్వ 'ణ' కారము తెలుగులో 'ణ' కారముగానే నిల్చిపోవును

జాణ 8-318 జాణ- జ్ఞాన-

8 1. -త- < -త్త- సమీప మాతృకలోని అపదాది ద్విత్వ 'త' కారము తెలుగున 'త' కారముగా మారును

ఆనతి 4-108 ఆణత్తి ఆజ్ఞప్తి

2 -త- < -త్థ- సమీప మాతృకయందలి అపదాది 'థ' కారము తెలుగున 'త' గా మారును.

గరిత 3-56 ఘరిత్థీ గృహస్థ

9. -ద- < -ద- . సమీప మాతృకలోని అపదాది 'ద' కారము తెలుగున 'ద' గానే నిల్చిపోవును.

జూదము 10 ఉ 291 జూద ద్యూత-

10 1 -న- < -ణ- ఈ మార్పు పదాదియందు నిత్యము అపదాదిగా వైకల్పికము.

ఆనతి 4-108 అణత్తి అజ్ఞప్తి

2 -న- < -ణ్ణ- · సమీప మాతృకలోని అపదాది ద్విత్వ 'ణ' కారము తెలుగున ద్విత్వము లోపించిన 'న' కారముగా మారును

కాన 4- 220 కాణ్ణం కాననమ్

11 -వ- < -వ్వ- సమీప మాతృకలోని అపదాది ద్విత్వ 'వ' కారము తెలుగున ద్విత్వము లోపించును

జాపరము 10 పూ 468 జవ్వ- యావ్య-

12 1 -బ- < -భ- సమీప మాతృకయందలి అపదాది 'భ' కారము తెలుగున 'బ'గా మారును

సొబగు 4- 562 సొభగ్గ- సౌభాగ్య-

2 -బ- < -బ- సమీప మాతృకలోని అపదాది 'బ' తెలుగున 'బ' గానే నిల్చిపోవును

నిబ్బరము 3-447 ణిబ్బరం నిర్భరమ్

13 -మ- < -మ్మ- సమీప మాతృకలోని అపదాది ద్విత్వ 'మ' కారము తెలుగున ద్విత్వము లోపించును

చెమట 10 పూ,387 తిమ్మ- తిమ్-

14 య- < -య- సమీప మాతృకలోని అపదాది 'య' తెలుగున 'య' గానే నిల్చినది

ఛాయ 8-448 ఛాయా ఛాయా

దాయ 3-724 దాయాద- దాయాదః

15 -ర- < -ర- సమీప మాతృకలోని అపదాది 'ర' తెలుగున 'ర' గానే నిలిచిపోవును

| తెలుగు | ప్రాకృతము | సంస్కృతము |
| --- | --- | --- |
| తిరము 10 పూ 1428 | థిర- | స్థిర- |
| నిబ్బరము 8-447 | ణిబ్బరం | నిర్భర |
| సిరి 10 పూ 990 | సిరి | శ్రీ |

16 -ల- < -ల- : సమీప మాతృకలోని అపదాది 'ల' తెలుగున 'ల' గానే ఉండును

| | | |
|---|---|---|
| అగ్గలము 10 పూ 1577 | అగ్గల- | అగ్ర- |
| ఇంగలము 8-725 | ఇంగాల- | అంగార- |

17 1 -ళ- < -ల- సమీప మాతృకలోని అపదాది 'ల' తెలుగున 'ళ'గా మారును

| | | |
|---|---|---|
| అప్పళించు 8-55 | అప్ఫాల- | ఆస్ఫాల- |

2 -ళ- < -డ- సమీప మాతృకయందలి అపదాది 'డ' కారము తెలుగున 'ళ'గా మారును

| | | |
|---|---|---|
| పవళించు 10 పూ 607 | పవాడ- | ప్రపాత- |

18 -వ- ∠ -వ- . సమీప మాతృకలోని అపదాది 'వ' తెలుగున 'వ' గానే ఉండును

| | | |
|---|---|---|
| గారవ 1-373 | గారవ | గౌరవ |
| బావి 10 ఉ 838 | వావి | వాపి |

19 1 -స- < -స- : సమీప మాతృకలోని అపదాది 'స' తెలుగున 'స' గానే ఉన్నది

| తెలుగు | ప్రాకృతము | సంస్కృతము |
|---|---|---|
| ఆస 3-898 | ఆసా | ఆశా |
| ఊసర 10 ఉ 456 | ఊసర | ఊషర- |
| దొసగు 8-316 | దోస- | దోష- |

2 -స- < -స్స- సమీప మాతృకలోని అపదాది ద్విత్వ 'స' కారము తెలుగున ద్విత్వము లోపించును

| | | |
|---|---|---|
| దూసరి 1-219 | దుస్సర- | దుస్సరః |

3 3.1 5. అపదాదివ్యంజనములు అనునాసిక యుక్త స్పర్శములు

ఇందు అనునాసికములకు పరముగ నుండు స్పర్శ వర్ణముల ధ్వని పరిణామ విధానము వివరింపబడినది

1. -ంక- < -ంఖ- బిందు పూర్వక 'ఖ' కారము

సంకెల 10 పూ 161 సంఖలా శృంఖలా

2 1 -ంగ- < -ంగ- బిందు పూర్వక 'గ కారము

ఇంగలము 8-725 ఇంగాల- అంగార-

బంగారు 9-321 భింగార- భృంగార-

సింగారము 9-338 సింగార- శృంగార-

2 -ంగ- < -ంక- బిందు పూర్వక 'క' కారము

| తెలుగు | ప్రాకృతము | సంస్కృతము |
|---|---|---|
| సంగడి 7-211 | సంకడ- | సంకట- |

3 1 -ంచ- < -ంస- బిందుపూర్వక 'స' కారము

కంచము 10 పూ 495 కంస- కాంస్య-

2 -ంచ-<-ంచ- బిందుపూర్వక 'చ' కారము

కంచల 10 ఉ 803 కంచులి అ కంచులికా

4 -ంట- < -ంఠ- : బిందుపూర్వక 'ఠ' కారము

గొంటు 10 పూ 1148 కుంఠ- కుంఠ-

5 -ండ- ∠ -ండ- బిందుపూర్వక 'డ' కారము

గుండె 10 పూ 400 కుండియా కుండికా

6 -ంత- < -ంత- బిందుపూర్వక 'త' కారము

గొంతి 1-209 కొంతీ కుంతీ

మంతనము 10 ఉ 377 మంతణం మంత్రణ-

సంతసము 9-600 సంతోస సంతోష-

7 -ంద- < -ంధ- బిందుపూర్వక 'ధ' కారము

సందడి 4- 19 సంధణ సందావ

8 -ంబ- < -ంబ- బిందుపూర్వక 'బ' కారము

కంబళి 10 ఉ 682 కంబల- కంబల-

3 3.1.6 అపదాదివ్యంజనములు ద్విరుక్తములు

1 1 -క్క- < -క్క-

| తెలుగు | ప్రాకృతము | సంస్కృతము |
|---|---|---|
| కుక్క 3-604 | కుక్కుర- | కుర్కుర- |
| చక్క 10 పూ 544 | సక్క— | శల్క- |
| చుక్క 10 పూ 1302 | సుక్క— | శుక్రః |
| చొక్కము 9-93 | చోక్ఖ— | చోక్షః |

2 -క్క- < -క్ఖ-

| | | |
|---|---|---|
| రక్కసుడు 8-470 | రక్ఖసో | రాక్షసః |

2 1 -గ్గ- < -గ్గ-

| | | |
|---|---|---|
| అగ్గము 10 పూ 1011 | అగ్గ- | అగ్రియ- |
| వగ్గము | వగ్గహ- | ప్రవగ్రాహ- |

2 -గ్గ- < -గ్ఘ-

| | | |
|---|---|---|
| అగ్గించు 10 ఉ 881 | అగ్ఘ- | అర్ఘ— |

-చ్చ- < -చ్చ-

| తెలుగు | ప్రాకృతము | సంస్కృతము |
|---|---|---|
| విచ్చ 4-137 | విచ్చ- | విశ్య- |

2 -చ్చ- < -చ్ఛ-

| | | |
|---|---|---|
| అచ్చర 3-535 | అచ్ఛరా | అప్సరాః |
| ఇచ్చ 4-408 | ఇచ్ఛా | ఇచ్ఛా |
| అచ్చి 9-115 | అచ్ఛి | అక్షి |
| మచ్చరము 10 పూ 610 | మచ్ఛరో | మత్సర- |

1. -జ్జ- < జ్ఝ-

| | | |
|---|---|---|
| ఒజ్జ 7 79 | ఒజ్ఝా అ | ఉపాధ్యాయ- |

2 -జ్జ- < -జ్

| | | |
|---|---|---|
| అజ్జ 3 643 | అజ్జా | ఆజ్ఞా |



| | | | |
|---|---|---|---|
| 5 | 1 -ట్ట- < -ట్ఠ- | | |
| | కట్టె 2-51 | కట్ఠియా | కాష్ఠమ్ |
| | బిట్ట 10 పూ 4 8 | సిట్ఠ- | పృష్ఠ- |
| | 2 -ట్ట- < -ట్ట- | | |
| | వట్టిన 10 పూ 1345 | వట్టిసో | వట్టిక- |
| | మట్టి 10 ఉ 683 | మట్టి ఆ | మృత్తికా |
| 6. | -ద్ద- < -ద్ద- | | |
| | తెలుగు | ప్రాకృతము | సంస్కృతము |
| | అద్ద 1-260 | అద్ద- | ఆర్ద్ర— |
| 7 | 1 -త్త- < -త్త- | | |
| | ముత్తియము 8-447 | ముత్తియ- | మౌక్తిక- |
| | 2 -త్త- < -త్థ- | | |
| | పొత్తరము 8-716 | పత్థర- | ప్రస్తర- |
| | విత్తర 10 ఉ 804 | విత్థార- | విస్తార- |
| 8 | [1] -ద్ధ- < -ధ్- | | |
| | విద్ధము 8 447 | ణిద్ధ- | స్నిగ్ధ- |
| | ముద్ధ[రాలు] 10 ఉ 183 | ముద్ధా | ముగ్ధా |
| | [2] -ద్ద- < -ద్ద- | | |
| | ముద్దియ 10 పూ 795 | ముద్దిఅ | ముద్రికా |
| 9 | -న్న- < -ణ్హ- | | |
| | తిన్న 10 6 273 | తిణ్హ-- | తీక్ష్ణ- |
| | వెన్నుండు 10 పూ 335 | విణ్హూ | విష్ణుః |
| 10 | 1 -ప్ప- < -ప్ప- | | |
| | అప్పళించు 8-55 | అప్ఫాలం- | అస్ఫాలం- |
| | 2 -ప్ప- < -ప్ప- | | |
| | కప్పము 10 ఉ 355 | కప్ప- | కల్ప- |
| | కొప్పరించు 3-637 | కొప్పరు | కూర్పర- |
| | రొప్పు 10 పూ 1728 | రుప్పణ- | రోపణ- |

11 [1] -ఱ్వ- < -ఱ్వ- :

| | | |
|---|---|---|
| గఱ్వ 1-173 | గఱ్వ- | గర్వ- |
| పఱ్వము 10 పూ.252 | పఱ్వ- | పర్వ- |

[2] -ఱ్ప- < -ఱ్ప-

| | | |
|---|---|---|
| విఱ్పరము 8-447 | విఱ్పర- | విర్పర |

12 [1] -య్య- < -య్య- :

| | | |
|---|---|---|
| అయ్య 4-491 | అయ్య | ఆర్యః |

[2] -య్య- < -ఇ-

| | | |
|---|---|---|
| దయ్యము 3-626 | దఇవ | దేవః |

[3] -య్య- < -హ- :

| | | |
|---|---|---|
| నెయ్యము 3-823 | ణేహ- | స్నేహ- |

13 -ల్లి- < -ల్లి-

| తెలుగు | ప్రాకృతము | సంస్కృతము |
|---|---|---|
| చల్లిదము 10 పూ 1339 | చల్లాణగ | చల్లానక |

14. [1] -వ్వ < -వ- సమీపమాతృక యందలి రెండవ యక్షరము 'వ' కారమై తత్పూర్వ స్వరము దీర్ఘమైనచో తెలుగున 'వ' కారము ద్విరుక్తమగును

| | | |
|---|---|---|
| దవ్వు 3-1041 | దావ- | దావ- |

[2] -వ్వ- < -వ్వ-.

| | | |
|---|---|---|
| వివ్వటిల్లు 2-227 | వివ్వట్ట- | విర్వర్త |

15. -వ్వ- < -వ్వ- ప్రాచీన ద్రావిడ భాషా వినర్గ నిర్మాణ రీతికి విజాతీయ మగు లక్షణమును ప్రదర్శించునవి ఈ వకార ద్విత్వరూపములు ప్రాచీన ద్రావిడ భాషయందు 'వ' కారము లేదనియు అర్వాచీన దశలో కొన్ని భాషలందు ఏర్పడిన దనియు భాషా శాస్త్రజ్ఞుల యభిప్రాయము ప్రాచీన

ద్రావిడ భాషయందు లేత, క్రొత్త, అనుమా
లార్థములు గల పచ్-/పయ్-ధాతుజన్యములుగా
తెలుగున పచ్చ, పచ్చని, పచ్చిక, పయిరు,
పగురు, పసిడి మొదలగు రూపము లేర్పడినవి,
ఇందలి మూల ధాతు భాగము పచ్-/ పయ్-
కాలక్రమమున 'చ' కారము 'స' కారమగుట
అర్వాచీన లక్షణము కాని ద్విత్వమున నేటికివి
'చ' కారమే వాడబడుచున్నది 'స' కార
ప్రభావముగల నేడు 'స' కార ద్విత్వ ఘటిత
రూపములు యధాతథముగ వైకృతములైనవి

| తెలుగు | ప్రాకృతము | సంస్కృతము |
| --- | --- | --- |
| లెస్స 3-410 | లేస్సా | లేశ్యా |

16. బిందులోపము సమీప మాతృకబిందు ఘటితమైయుండగా వైకృతము విబిందు ఘటితముగా నున్నది.

| | | |
| --- | --- | --- |
| ఏకతము 10 పూ 10.9 | ఎక్కంత- | ఏకాంత- |

17 బింద్వాగమము బిందువులేని సమీపమాతృక వైకృతమున బిందువుతో కూడుకొని వచ్చును

| | | |
| --- | --- | --- |
| పోఁక 1-68 | పూగ- | పూగ- |

18 అపదాది హకారలోపము సమీప మాతృకలోని అపదాది హకారము వైకృతమున లుప్తమగు చున్నది.

| తెలుగు | ప్రాకృతము | సంస్కృతము |
| --- | --- | --- |
| ఆరగించు 10 పూ 242 | ఆహారగ- | ఆహార- |
| నెయ్యము 3-566 | ణేహ- | స్నేహ- |
| వగ్గము 1-223 | పగ్గహో | ప్రగ్రహ- |
| మొగము 10 ఉ 443 | ముహం | ముఖమ్ |
| లేక 10 పూ 877 | లేహ | లేఖా |

## 3.3 2 సంస్కృత భవముల ధ్వనిపరిణామ చరిత్రము :

సంస్కృత భవములు చాల భాగము వహజ రీతులకంటె కృతకమార్గ ములలో ఎక్కువగా నేర్పడినట్లు స్పష్ట పడుచున్నది సంస్కృత భవేతరములగు వైకృతములలోని కొన్ని ధ్వని పరిణామ పద్ధతులను దృష్టియందుంచుకొని ఆంధ్ర భాషా వ్యవహర్తలు ముఖ్యముగా కవులు, పండితులు సంస్కృత పద ములను సంస్కృత భవములుగా పంతరించినట్లు కన్పట్టుచున్నది

1 విప్రకర్ష (ANAPTYXIS) వలన ఏర్పడిన రూపములు.

| తెలుగు | సంస్కృతము |
|---|---|
| జాతర 10 పూ 809 | యాత్రా |

2. పదాది 'య' కారలోపము సంస్కృత భవములలోని ఒక విశిష్ట లక్షణమిది తెలుగున సంస్కృత భవములలోని పదాది 'య' కారము లోపించిన రూపములు చాలా స్వల్పము

ఆయవారము 7-410 యాయవార-

### 3.3.2.1 పదాది వర్ణములు : స్వరములు

1 అ-<రేఫమునకు ముందు చేరెడి అ-, ప్రాచీన ద్రావిడ భాషలో రేఫాది రూపములుండవనియు, వీనివి తక్కిన భాషలనుండి ఎరవు తెచ్చునపుడు రేఫమునకు ముందు ఒక అచ్చుచేరుట సర్వ సాధార ణము తులనాత్మక పరిశీలన నిమిత్తము ప్రాకృత రూపము కూడ ఇచ్చుచున్నాను

| తెలుగు | సంస్కృతము | ప్రాకృతము |
|---|---|---|
| అరదము 10 ఉ 1104 | రథ- | రహ- |

2 ఆ-<య- , పదాది 'య' కారలోపము

| తెలుగు | సంస్కృతము | ప్రాకృతము |
|---|---|---|
| ఆయవారము 7-410 | యాయవార- | |

3. ఇ- < ఇ-

| | | | |
|---|---|---|---|
| చింత | 3-827 | చింతా | చింతా |
| చిక్క- | 7-243 | చిక్కణ | చిక్కణ |

4. ఈ- < ఈ-

| | | | |
|---|---|---|---|
| కీరితి | 10 పూ 175 | కీర్తి | కిత్తి |

5 ఒ- < ఉ-

| | | | |
|---|---|---|---|
| మొగము | 10 ఉ 443 | ముఖమ్ | ముహం |

6 ఓ- < - ఓ-

| | | | |
|---|---|---|---|
| జోడు | 3-498 | యోధ. | జోహో |

33.22. పదాది వర్ణములు వ్యంజనములు :

1 క- < క- :

| | | | |
|---|---|---|---|
| కీరితి | 10 పూ 175 | కీర్తి | కిత్తి |

2 గ- < ఘ- :

| తెలుగు | | సంస్కృతము | ప్రాకృతము |
|---|---|---|---|
| గీఁక | 8-407 | ఘింకార- | —— |

3. జ- < య- :

| | | | |
|---|---|---|---|
| జాతర | 10 పూ.809 | యాత్రా | జత్తా |

4 త- < ధ-,

| | | | |
|---|---|---|---|
| తాత | 9-2 5 | ధాతా | ధాఅ- |

5. వ- < వ- :

| | | | |
|---|---|---|---|
| వరువు | 10 పూ 894 | వర్ష | - |
| పాతర | 10 పూ 1381 | పాత్రమ్ | - |

6 వ- < వ-

| | | | |
|---|---|---|---|
| వదినె | 8-318 | వధూపి | వహూణీ |

7. హ- < హ-

| | | | |
|---|---|---|---|
| హితవు | 10 పూ 609 | హిత- | హియ- |

### 3.3.2 3 అపదాదివ్యంజనములు

.1 -డ- < -ద- :

| తెలుగు | | సంస్కృతము |
|---|---|---|
| కడిమి | 10 పూ 129 | కదంబ |

2 1 -ద- < -థ- .

| | | |
|---|---|---|
| అరదము | 4-307 | రథ- |

2 -ద- < -ద- :

| | | |
|---|---|---|
| మరియాద | 10 పూ 979 | మర్యాదా |

3 -బ- < -బ- :

| | | |
|---|---|---|
| ప్రబలు | 8-298 | ప్రబల |

4 -య- < -య-

| | | |
|---|---|---|
| అయవారము | 7-410 | యాయవార— |

5 -ర- < -ర- :

| | | |
|---|---|---|
| అదర | 10 పూ 187 | అధర— |

## 3.4 0 అన్య దేశ్యములు : (LOAN WORDS)

[ఈ అంశము కర్ణాట, మహారాష్ట్ర భాషా పదముల వరకే పరిమితము చేయబడినది]

తెలుగుభాష తత్సమ తద్భవ దేశ్య పదజాలముతో పరిపుష్టమైనను మధ్య యుగముల నుండి ఇతర భాషల సాహచర్యముచే వచ్చి చేరిన పదములును దీని భావ ప్రకటన సామర్థ్యమునకు దోహదము చేసినవి నన్నయ తన రచనలో సంస్కృత పద జాలముననధికముగా ప్రయోగించెననియు తిక్కన ఆ పరిమాణమును తగ్గించెననియు పండితుల యభిప్రాయము. తెలుగు ద్రావిడ భాషా జన్య మన్నది స్థితి స్థాపకాంశము మూల ద్రావిడ భాష నుండి సంక్రమించినవి దేశ్యములనియు ఇతరములు దేశ్యేతరములనియు పరిభాషించుట పరిపాటి

దేశ్యేతరములలో సంస్కృత, ప్రాకృతముల నుండి తెలుగున చేరిన తత్సమ తద్భవములును తెలుగున కల సజాతీయములైన తమిళ కర్ణాటాది ద్రావిడ భాషల నుండియు, అరబ్బి తుర్కి పారసీకాది మధ్య ప్రాచ్య భాషల

నుండియు, ఉర్దూ మరాఠీ, ఒరియా మున్నగు నవీనోత్తరాహ భాషల నుండియు ఇంగ్లీషు, పోర్చుగీసు మొదలైన యూరపియన్ భాషల నుండియు ఆయా యుగములలో సంసర్గ వశమున తెలుగున ప్రవేశించిన పదజాలమును దేశ్యేతరములని చెప్పవొప్పును

ఇంచుమించు తిక్కన కాలము నుండి అన్య దేశ్యములు తెలుగున చోటు చేసికొన్నవి దీనికి పూర్వము మహమ్మదీయుల పరిపాలనలోగల అరబ్బి పారశీక పదములు సామాన్య జనులకు అంతగా ఒంటబట్టి నట్టు లేదు కాని అక్కడక్కడ ఆపద జాలములు తెలుగున ప్రవేశింప మొదలైనవి విధి నిర్వహణలో గల ఉద్యోగులు కొందరు విధిగా పర్షియను భాషను నేర్చుకొన దొడగిరి పారసీకాద్యన్యదేశ భాషలనుండి పరోక్షముగా మరాఠీ భాషా ముఖమున తెలుగున చేరిన పదములు, మరాఠీ భాషకు విసర్గములై సంసర్గ వశమున తెలుగున ప్రవేశించిన పదములును అన్య దేశ్యములని ఆధునికుల నిర్ణయము

అన్యదేశ్యములు రెండు రకములు అరబ్బి, తుర్కీ, పారసీకాద్యన్యసీమల యొక్క వాగ్వ్యవహార రూపములలో స్వతస్సిద్ధములై వాని నుండి ప్రత్యక్షముగాను పరోక్షముగా మరాఠీ మొదలైన హింద్వార్య భాషా శాఖా జన్యముల ద్వారా తెలుగుచేరినవి ఒక వర్గము హింద్వార్య భాషా శాఖా జన్యములైన నవీన ఔత్తరాహ భాషలలో విసర్గములై, సంసర్గవశమున తెలుగున ప్రవేశించినవి రెండవ వర్గము వీనితోపాటు పరిసర సీమ అయిన కన్నడ దేశము నుండి అనేక పదములు వివిధ దశలలో వివిధ కారణములచే తెలుగున ప్రవేశించినవి

పోతన కాలము [క్రీ శ 15 వ శతాబ్దము] నాటికి తెలుగు భాషతో అధిక సంబంధము కలిగిన భాషలు కన్నడ మరాఠీ భాషలు కన్నడము తెలుగునకు సజాతీయ భాష (COGNATE LANGUAGE) మరాఠీ విజాతీయభాష (NON-CONGNATE LANGUAGE) మరాఠీ ఆర్య భాషా కుటుంబమునకు చెందినది కన్నడ మరాఠీ భాషా ప్రాంతములు తెలుగు నాటికి ఇరుగు పొరుగు సీమలు ఈ సీమల భాషలు భౌగోళిక సాన్నిధ్యమే కాక సంస్కృతి పరమైన ప్రచార సంబంధమును నెరపినవి అందుచే, పోతన ప్రయోగ ఫణితిలో ఈ రెండు భాషా పదములు కన్పట్టుచున్నవి

శ్రీనాథ యుగము నాటికి 'తర్దూ' అలయాలు లేని సోమలింగము మరాఠ్వాడా-తెలుగునాడులకు గల సంబంధ బంధవములు ఇక్ష్వాకుల తాత ముత్తాతం నాటివి తెలుగు మరాఠీ భాషలు భోగోళకముగా పరిసర భాషలు శాతవాహన చక్రవర్తులనాడుఇంచుమించు నాలుగువందల సంవత్సరములపాటు మరఠ్వాడా తెలుగు నాడులు ఒక గొడుగు నీడలో నున్న వనెదు విషయము జగమెరిగిన చరిత్ర [1]

మరాఠ్వాడాను ఏకాత పత్రముగా శాసించిన పశ్చిమ చాళుక్య వంశీయుల ఒక రెమ్మయే గదా సాగరాంధ్రసీమల వేంగి రాజమహేంద్రపురములు ఆలవాలము లుగా ప్రాచ్య చాళుక్య శాఖగా జనించుట తెలుగు మరాఠీల పరాపరి సంబంధము లకు ఒక చక్కని నిదర్శనము తెలుగువాడు 'రావు' దరు తమ పేర్ల చివర తగిలించు కొను రావు మరాఠీవారిది ఈ విధముగా తెలుగు పదములు మరాఠీ నోళ్ళలో నలుగుదువడి వ్యావహారిక రూపములుగా కోశములకెక్కి, పండిత సమ్మతిని బడసి సాహిత్య స్థాయిని సంపాదించి అక్షరరూపమున చిరస్థాయిగా నిలిచిపోయినవి [2]

పోతనకు సమకాలికుడైన శ్రీనాథుడు ఇతర భాషాపదములను ప్రయోగించుటలో ప్రముఖుడు తన రచనలో అరబ్బీ పారసీ మొదలగు మధ్య ప్రాచ్య భాషాపదములను వాడినను పోతన ఎందువలననో వానిని పరిహరించినట్లు కవిపించుచున్నది పోతన కన్నడ మరాఠీ భాషలనుండి మాత్రమే అవశ్యకమైన పదములను స్వీకరించినట్లు విదితమగుచున్నది ఈ ప్రకరణమునందు ఆచార్య తూమాటి దొణప్పగారి 'పోతన భాషా విశిష్టతలు' అను వ్యాసమునందు దవలంబించిన పద్ధతుల నాధారముగా ఏ తత్పదజాల నిరూపణము జరిగినది

### 3.4.1 పోతన భాగవతమున వాడిన కన్నడ పదములు

1 అజ్జలు . అడుగులు, పాదములు

"గజ్జెలు ఘల్లని మ్రోయగ నజ్జలు ద్రొక్కుటలు మాని "

10 పూ 368

ఇది కన్నడములో హజ్జనుండి వచ్చి పదాది హకారము లోపించి అజాదితను పొందినది దీనికి ప్రాచీన కన్నడభాషలో పజ్జ అనునది పూర్వరూపము

---

1 ఆచార్య టి దొణప్ప, భాషాచారిత్రక వ్యాసావళి పు 147

2 ఆచార్య టి దొణప్ప, భాషాచారిత్రక వ్యాసావళి పు 151

సంస్కృత పాద్య-శబ్దభవముగ ప్రాకృతములో కనిపించుచున్న 'పజ్జ'- పాత కన్నడములోని పజ్జకు సమీప మాతృక

అజ్జ<కన్నడ. హజ్జ పజ్జ<ప్రా పజ్జ<

సం పాద్య . పాదసంబంధి

2 కైవారము చేయెత్తి స్తుతించుట

'సన్నయ మూరిఁ గైవారముసేసి' 1-10

'కోదలి గుణంబులు కైవారంబులుసేసి' 10 ఉ 42

'బహువారంబులు కైవారంబులుసేయ' 10 పూ 596

ఈ కైవారము కన్నడము నందలి 'కైవార' నుండి వచ్చినది ఇది శుద్ధదేశ్యమైనను సంస్కృత సమాసగతముగను ప్రయుక్తమైనది ఇట్టి తీరు మనకు శ్రీనాథుని ప్రయోగములందును గలదు

3 జళుకు భయము

'ఉళుకుపెడి జళుకు పొరక యెదురనిదుర గదిరిన '

10 పూ 224

కన్నడములో ఇదే అర్థముగల 'జళుకు' దీనికి మూలము

జళుకు < క జళుకు

4 దేవర . దేవుడు, ప్రభువు, స్వామి

'మంతనమున దేవర కన్యంతఃపుర ' 10 ఉ 377

'దేవా దేవర యదుగులు భావంబున నిలిపి ' 8-132

సంస్కృతమునందలి 'దేవ' శబ్దము కన్నడ భాషలో పూజ్యతలో ప్రథమై కవచనముగా 'దేవరు'గా రూపెత్తి నంబుద్ధిలో 'దేవర'గా మారి నది ఇది తెలుగులోనికి వచ్చినది. దేవర<క. దేవర

5 హత్తు అదుముకొను

'బత్తుదరసి వత్రికలను హత్తుదురు కృతాంతభటులు ' 2 25

'అటమీద మరమందు హత్తించి ' 2-29

'మారాకు హత్తించి . 8-65

కన్నడమున ఇదే అర్థముగల 'హత్తు' శబ్దమునుండి వచ్చినది.

హత్తు<క హత్తు<వత్తు జోడించు జతకలుపు
(DED 3220 TVB 234

తెలుగు నందలి పట్టు దీనికి జ్ఞాతిరూపము.

6 హెచ్చు అధికము

కర్మవశంబునన్ జగము గల్గును హెచ్చు నడంగుచున్నచో 4-581

పాత కన్నడములో అతిశయార్థకమైన 'పెచ్చు' క్రొత్త కన్నడములో 'హెచ్చు'గా మారినది అది తెలుగులోనికి వచ్చినది అతిశయము, ఆధిక్యము అను అర్థములుగల 'పేర్' అను మూల ద్రావిడ రూపము దీని మూల మాతృక

హెచ్చు<కొ క హెచ్చు <పా క పెచ్చు

తెలుగు పెచ్చు పెచ్చు పెరగ అవి వాడుకలు

7 హేరాళము పెద్ద విస్తృతము

'హేరాళమైన పిఱుందు ' 10 పూ 213

కన్నడములో ఇదే అర్థముగల 'హేరాళ' శబ్దము దీనికి సమీప మాతృక దీనిని శ్రీనాథుడు పసియించున్ హేరాళ క్రీడాసంచారిణినూకాంబ అని సంస్కృత సమాసగతముగా ప్రయోగించుట అతని పదప్రయోగ విరంకుశత్వమునకు నిదర్శనము

హేరాళము<క హేరాళ<పా క పేరాళ

3.4.2 మరాఠీ భాషనుండి వచ్చిన మాటలు .

మరాఠీ లేక ఆరె భాష మాట్లాడు దేశము తెలుగునాడునకు పరివర ప్రాంతము తెలుగు మరాఠ్వాడల సంబంధము ఇక్ష్వాకులకే పూర్వకాలిక ములు పరస్పరము పదవినిమయము జరుగుట అతి స్వాభావికము.

పోతన ఎరవు తెచ్చిన భాగవత మందలి మరాఠీ పదములు

1 గొంగడి . ఉన్నితో నేసిన కంబళి

'గొంగడు లెగరవైచుచు ' 10 పూ 437

ఇది 'ఘొంగడీ' అను మరాఠీ మాటనుండి వచ్చినది

2 ఫే . ప్రశంస, స్తుతి

' కుసుమబాణుడు ఫేయని ఘంట ప్రేయగన్ ' 9-177 స్తుతి అను అర్థముగల మరాఠీభాషలోని 'ఫే' అను పదము దీనికి సమీప మాతృక 'జయ జయ ఫేయు ఫేజయు జయ యనుచు ' [పండితా 2 291] అని పాల్కురికి సోమనాథుని ప్రయోగము

ఫే< మ ఫే

3 చావడి • హజారపు ముందుభాగము, సామాన్యుల ఇంటిలో వడసాలకు ముందు వసారా భాగము, రచ్చకూటము

'ద్వారదేశంబుల పావళ్ళంగా వళ్ళుండి ' 8-447

ఇదే అర్థముగల మరాఠీభాషలోని 'చావడీ' శబ్దముమండి ఎరవు తెచ్చుకొన్నది ప్రాకృతములోని చ ఉవాడ' సంస్కృతము నందలి 'చతుర్వాట' మరాఠీభాషకు క్రమముగా సమీప మూలమాతృకలు

చావడి< మ చావడీ< ప్రా చఉవాడు< సం చతుర్వాట

4. పురే ప్రశంస లేక ఆశ్చర్యము

'చాలుఃబురే వరోజభవ ' 3-380

'బా నాఁగడే బాపురే ' 8-203

పురే, బాపురే అను రెండును ప్రశంసార్థకములు

బాపురే అను మరాఠీ ప్రశంసార్థక రూపముమండి ఇవి ఏర్పడినవి

పురే < మ బాపురే

5 భళీ భళీ : మేలు మేలు అను అర్థము భళికి అమ్రేడిత రూపము. ఇదియును ప్రశంసార్థకమే

'భళీ భళీ యని పొగడె భూతపంచకము ' 8-614

మరాఠీభాష యందలి భళా, భళీ, భళీ, భళీరే అను వాడుక పదములు ప్రాకృత 'భల్ల'-శబ్దభవములు శుభము అనెడు అర్థముగల సంస్కృత 'భద్ర-' శబ్దము వీనికి మూలమాతృక

6 రాహుతులు పైదికులు, అశ్వారోహకులు

'అడ్డంబులేని యార్పులంబులు గల బాణపర్షపూరితంబులతో రాహుతులం గోపానలంబున కాహుతులు సేయుచు' 9-449

ఇది మరాఠీభాషలోని రాహుత్త-, రావుత్త-శబ్దముల ఆధారముగా రూపొందినది సంస్కృతములోని 'రాజపుత్ర-' శబ్దము ప్రాకృతములో 'రాయఉత్త రాఉత్త-'గా మారి మరాఠీ మాటలకు మూలమైనది

రాహుత్తు<మ రాహుత్త, రావుత్త<ప్రా రాఉత్త-రాయఉత్త-<సం రాజపుత్ర-

3.4 3 పోతన ప్రయోగించిన క్రింది ప్రాకృత సమములను తెలుగు లాక్షణికులు అన్యదేశ్యములుగా చెప్పుట శాస్త్రీయముగా కనిపించుట లేదు

ఠవణింప కావించు

' పరాశర సుతుండు
చతుర వర్ణాశ్రమాచార ధర్మంబులు ఠవణింప లోకవిలంబునంబు
అగు గ్రామ్య కథలు ' 3-189

'. రాజసూయ మహాధ్వరంబువిష్ణు
ఠవణింపలోక విడంబనార్థముగాక పరికింప' 10 ఉ 661

దీనికి సంస్కృత 'స్థాపన-' శబ్దము మూలము ప్రాకృతమున ఠావణ-శబ్దసంబంధము

ఠవణింప<ప్రా ఠావణ-<సం స్థాపన-

2 ఠవర : ముదుసలి, నేర్పరి, ప్రముఖుడు

'వేయుఁగమ్ముల ఠవర' 7-218

ప్రాకృతములోని 'ఠవిర-' శబ్దసంబంధి సంస్కృతములోని స్థవిర-శబ్దము దీనికి మూలము

ఠవర<ప్రా ఠవిర-<సం స్థవిర-

3 ఠాణలు : ఠావులు

'ఇట్లిద్దఱునుద్దవిడిమన్నత విషమంబుల గురాఖలిడి కరికరియును హరి హరియును ' ఠాఁకు పీకందలపడి 10 పూ 1345

ఠాణ<ప్రా ఠాణ-<సం స్థాన

4. లావు : ఠావు

'వలిలములు లేని లావున' 10 ఉ 825

'రావుల్ దప్పెను, మూర్ఛవచ్చెను' 8-90

లావు∠ప్రా. రావ-∠సం స్థావ-

5. లేవ : పద్ధతి, రీతి

'కుమార చరిత్రంబు రేవను' 9-229

రేవ∠ప్రా రేమ-, రేవ- [శక్తి, రీతి] ∠సం స్తేమ-

## 3.50 స ర్వ నా మ ము లు (PRONOUNS)

సర్వనామమను పరిభాష సంస్కృత లక్షణ గ్రంథముల నుండి తెను గునకు వచ్చినది సర్వనామములు నామములలోని ఒక అంతర్భాగము పాణినీయ మున ఈ శబ్దమునకు వాచ్యములైన వానిని [1] 'సర్వా దీని సర్వనామాని' యను సూత్రమున శమబంధముగా నిబంధించిరి సర్వమొదలైన ముప్పదియైదు శబ్దములు సర్వ నామములని దీని భావము. [2] అన్ని ప్రకృతులు సర్వనామం బులు' అని బాల వ్యాకర్త పేర్కొనెను

సర్వనామములను ప్రాథమికముగా నిర్మాణక్రమమును బట్టి ముఖ్య ముగా విశేష్యములయందే అంతర్భవింప జేయవచ్చును

1 పురుష వాచక సర్వనామములు (Personal Pronouns)
2 ఆత్మార్థక సర్వనామములు (Reflexive Pronouns)
3 నిర్దేశ సర్వనామములు (Demonstrative Pronouns)
4. ప్రశ్నార్థక సర్వనామములు (Interrogative Pronouns)
5. సంఖ్యా వాచక సర్వనామములు (Numeral Pronouns)

ఉత్తమ, మధ్యమ పురుష వాచక సర్వనామములు, ఆత్మార్థక సర్వ నామములు అన్ని లింగముల యందు సమానముగా నుండును. లింగ బోధన విషయమున నిర్దేశ, ప్రశ్నార్థక సర్వనామములు భిన్నముగా నుండును. సర్వ నామముల ద్వితీయాదివిభక్త్యంగ ప్రాతి పదిక ఇతర నామముల ద్వితీయాది

1 సర్వాదీని సార్వనామాని 1-1-27

2. బా వ్యా అచ్ఛిక -24

విభక్త్యంగ ప్రాతిపదిక కంటె భిన్నము పోతన భాగవతమున గల సార్వనామిక రూపములు క్రింద చూపబడినవి

### 3.5 1 పురుష వాచక సర్వనామములు (Personal Pronouns)

| ఉత్తమ పురుష | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్రథమా విభక్తి | ఏ 2-61 | ఏము 10 పూ.686 |
| | ఏఁ 3-885 | మేము 4-20 |
| | ఏను 1-214 | మనము 8-152 |
| | నేను 7-359 | [ఉభయార్థకము] (Inclusive) |

పోతన ఉత్తమ పురుష ప్రథమా విభక్తి ఏకవచనమున 'ఏను' ను చాలాసార్లు ఉపయోగించెను పద్య, వచనములందు ఈ ప్రయోగము కనిపించు చున్నది దీని స్థానమున సమానార్థకమైన పదము 'నేను' కూడ ఇంచుమించుగా ప్రయోగింప బడినది దీనిని బట్టి పోతన 'ఏను' పదమును ప్రయోగించెననుట సమ్మతము.

పోతన ప్రయోగములు

ఉత్తరాభిముఖుండనై యేను వెడలి 1-120
అఖిల దేవోత్తములఁదెవ్వేళఁ బ్రాణంబు లేను విడుతును 1-214
దివ్య చరిత్రునకేను మ్రొక్కెదన్ 2-109

| ఉత్తమ పురుష | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ద్వితీయావిభక్తి | నన్ 3-957 | మము-న్ 10 పూ 587 |
| | నను 4-480 | మము 10 ఉ 652 |
| | నను-న్ 1-123 | మముఁ 3-530 |
| | ననుఁ 9-529 | మముం 7-132 |
| | ననుం 3-759 | మమ్ము 1-116 |
| | నన్ను 9-392 | మమ్ముఁ 4-711 |
| | నన్ను-న్ 7-261 | మమ్ముం 10 ఉ 234 |
| | నన్నుం 8-93 | |

మనల-న్ 8-156 ఉభయార్థక సర్వనామము (Inclusive Pronouns)
తృతీయాది విభక్త్యంగము నా- [9-14] మా- [8-19]
మన- [7-249] [ఉభయార్థక సర్వనామము
(Inclusive Pronouns)

| మధ్యమ పురుష | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్రథమా విభక్తి | ఈవు 4-931 | మీరు 9-13 |
| | నీవు 7-88 | మీరల్ 10 పూ 134 |
| | | మీరలు 1-303 |
| | | [పునరుక్త బహువచనము] (Double Plural) |
| | | మీఱు 7-67 |

'ఈవు' అను ప్రయోగము శ్రీనాథుని శ్లోకమందు 'మీఱు' అనునది శకట రేఫ ఘటితముగా వావిళ్ళ ప్రతియందు ముద్రితము అకాడమీ ప్రతియందు సాధురేఫ ఘటితముగా ముద్రితము. శకట రేఫ ఘటిత ప్రయోగిము నిర్ధారకము కాదు విశేషించి ఇతర కవుల ప్రయోగములలోగాని, తక్కిన ద్రావిడ భాషలలో గాని యుష్మదర్థక బహువచనమైన 'మీరు' శకటరేఫఘటితము కాదు ఇదియు ముద్రణ దోషము

| | | |
|---|---|---|
| ద్వితీయా విభక్తి | ని-న్ 10.పూ 154 | మిము 1-449 |
| | నిను 3-870 | మిముఁ [1-72] |
| | నినుఁ 8-225 | మిము-న్ 9-58 |
| | నినుం 7-83 | |
| | నిను-న్ 1-249 | మిమ్ము 4-906 |
| | నిన్ను 4-87 | మిమ్ము-న్ 10 పూ 1079 |
| | నిన్ను-న్ 10 ఉ 529 | మిమ్ముఁ 1-301 |
| | నిన్నుఁ 7-44 | మిమ్ముం 8-777 |
| | నిన్నుం 10 పూ 151 | |

తృతీయాదివి భక్త్యంగము

| ఏకవచనము | బహువచనము |
|---|---|
| నీ-2-258 | మీ- 4-733 |

ప్రథమ పురుష రూపములు నిర్దేశసర్వ నామ విభాగమునఁజూడనగును

మహద్వాచకము

ప్రథమా విభక్తి వాఁడు 8-77 వారు 7-25

వార-లు 2-26

వారలు-న్ 10 ఉ 985

వారలు-ను 1-459

వాండ్రు 10 పూ 1522

వారల్ 9-221

[పునరుక్త బహువచనము]

ద్వితీయావిభక్తి వారి-న్ 10 పూ 142

వాని 1-143 వారల-న్ 8-590

వానిఁ 8-299

వాని-న్ 10 పూ 1774

వాని-ని 3-883

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ద్వితీయాది విభక్త్యంగము | వాని- [4-606] | వారి- 8-159 |

మహతీవాచకము :

ప్రథమా విభక్తి అది 10 పూ 780 మహత్యర్థమున దీనికి బహువచన రూపములుండవు.

ద్వితీయాది విభక్త్యంగము దాని 3-395

పోతన భాగవతమున ఆమె కానరాలేదు మహద్వాచక బహువచన రూపములే మహతీవాచకమున కూడ బహువచన మునవచ్చును

| మహతీతరామహద్వాచకము । | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్రథమా విభక్తి | అది 4-867 | అవి 8-336 |
| | అది 9-126 [నవార్థకము] | |

అద్ది, అయ్యది అయ్యవి రూపములు పోతన భాగవతముప్రయోగములలో కానరావు.

ద్వితీయా విభక్తి    దాని  2-5    వాని  10 పూ  430
దానిఁ  9-10
దాని-న్  3-395

ద్వితీయాది విభక్త్యంగము  దాని - 10 ఉ 1249

3 5.2. ఆత్మార్థక సర్వనామములు (Reflexive Pronouns)

ప్రథమా విభక్తి  తను  1-264  తము  4-125
తా  3-342  తాము  7-148
తాన్  8-543  తారు  10 పూ.525
తాను  10 పూ 599

ద్వితీయావిభక్తి  తన్  3-981  తము-న్  7-456
తాముఁ  10 ఉ 675
తన్ను-న్ 10 పూ864
తమ్ము-న్  10 పూ 1434
తాను-న్ 7-417
తాను-ను 8-153

ద్వితీయాది విభక్త్యంగము తన-  9-578  తమ  10 ఉ 1065

3.5.3. నిర్దేశ సర్వనామములు (Demonstrative Pronouns)

నిర్దేశ సర్వనామ ప్రాతిపదికలకు, లింగ వచన ప్రత్యయములు చేరుటచే ఇవి ఏర్పడుచున్నవి పోతన ప్రయోగ పక్కిలో ఇవి రెండు విధములు

1. ఆ-/అ/- దూరవర్తి నిర్దేశ సర్వనామ అంగము
(Remote Demonstrative Pronominal base)

2. ఇ-/ఈ- సమీపవర్తి నిర్దేశ సర్వనామము
(Proximate Demonstrative Pronominal base)

ము తెలియజేయును. దీనిపై 'తన్' వర్ణము చేరుటచేత సర్వనామ మహా ద్వాచక ప్రాతిపదిక లేర్పడును 'తన్' ఆత్మార్థక సర్వనామ విభక్త్యంగ మిది యని కొందరి తలంపు

1. దూరవర్తి నిర్దేశ సర్వనామములు

| మహద్వాచకము . | ఏకవచనము | | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమావిభక్తి | అతఁడు | 2-284 | |
| | అతండు | 9-114 | |
| | ఆతఁడు | 7-38 | |
| | ఆతండు | 4-400 | |
| | వాఁడు | 3-537 | |
| ద్వితీయావిభక్తి | అతని న్ | 4-390 | |
| | అతనిం | 10 పూ 348 | |
| | ఆతని-న్ | 10 ఉ 1 65 | |
| | వాని-న్ | 7-30 | |
| ద్వితీయాదివిభక్త్యంగము | అతని - | 8-295 | |
| | ఆతని - | 9-499 | |
| | వాని - | 1-131 | |

ప్రథమ పురుష మహద్వాచక బహువచన రూపములే దీని యందున్ను వచ్చును

2. సమీపవర్తి నిర్దేశ సర్వనామములు .

మహద్వాచకము

| | | | | |
|---|---|---|---|---|
| ప్రథమా విభక్తి | ఇతఁడు | 7-33 | వీరు | 3-704 |
| | ఇతండు | 10 ఉ 779 | వీరల్ | 10 పూ 1367 |
| | ఈతఁడు | 10 పూ 1766 | వీరలు | 9-503 |
| | వీఁడు | 8-452 | వీండ్రు | 10 పూ 1522 |
| | ఏకవచనము | | బహువచనము | |
| ద్వితీయావిభక్తి | ఇతని-న్ | 1-418 | వీని-న్ | 10.ఉ.44 |

| | | | | |
|---|---|---|---|---|
| ద్వితీయాదివిభక్త్యంగము | ఇతని- | 4-459 | వీరి- | 7-46 |
| | వీనిఁ | 1-223 | వీరల | 3-565 |
| | వీనిం | 10 పూ 40 | | |
| | వీని- | 7-13 | | |

మహతీవాచకము :

| | | | | |
|---|---|---|---|---|
| ప్రథమా విభక్తి | ఇది | 2-104 | బహువచనములేదు [మహన్మహతీ బహువచనములలో జూడనగును] | |
| ద్వితీయావిభక్తి | దీని-న్ | 10 పూ 959 | " | |
| ద్వితీయాది విభక్త్యంగము | దీని- | 7-53 | వీరి - | 10 పూ 312 |

మహతీతరామహద్వాచకము

| | | | | |
|---|---|---|---|---|
| ప్రథమా విభక్తి | ఇది | 1-148 | ఇవి | 4-68 |
| ద్వితీయా విభక్తి | దీని-న్ | 1-111 | | |
| ద్వితీయాది విభక్త్యంగము | దీని | 7-531 | వీని | 3-962 |

### 3.5.4. ప్రశ్నార్థక సర్వనామములు (Interrogative Pronouns)

నిర్దేశ సర్వనామము లేర్పడినటులే ప్రశ్నార్థక సర్వనామములుకూడ నేర్పడుచున్నవి

| మహద్వాచకము | ఏకవచనము | | బహువచనము | |
|---|---|---|---|---|
| ప్రథమా విభక్తి | ఎవ్వఁడు | 8-85 | ఎవ్వరు | 7-106 |
| | ఎవ్వండు | 4-207 | ఎవ్వారు | 4-311 |
| | ఎవ్వాఁడు | 10 పూ 877 | ఎవ్వారలు | 7-92 |
| | | | ఏరు | 3-755 |

ఎవడు, ఎవరు మొదలైన అద్విరుక్త రూపములు పోతన భాగవతమున గానరావు.

ద్వితీయా విభక్తి ।

| ఏక వచనము | | బహువచనము | |
|---|---|---|---|
| ఎవ్వని-న్ | 10 పూ 833 | ఎవ్వరి-న్ | 7-439 |
| ఎవ్వాని-న్ | 3-703 | ఎవ్వారి-న్ | 3-781 |

ద్వితీయాది విభక్త్యంగము :

| | | | |
|---|---|---|---|
| ఎవ్వని - | 1-212 | ఎవ్వరి- | 2-112 |
| ఎవ్వాని - | 8-273 | ఎవ్వారల- | 10 పూ 1635 |
| | | ఎవ్వారి- | 7-92 |
| | | ఏరి- | 3-755 |

| మహతీ వాచకము . | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్రథమా విభక్తి | ఎవ్వతె 10 పూ 1273 | |
| ద్వితీయా విభక్తి | -- | -- |
| ద్వితీయాది విభక్త్యంగము | -- | -- |

మహతీతరా మహద్వాచకము

| | | |
|---|---|---|
| ప్రథమా విభక్తి | ఎద్ది 10 పూ 782 | ఎవ్వి 10 పూ 635 |
| | ఏది 8-725 | |
| | ఎయ్యది 1-44 | |
| | ఎట్టిది 4-290 | |
| ద్వితీయా విభక్తి | - | - |
| ద్వితీయాది విభక్త్యంగము | - | - |

### 3.5 5 సంఖ్యావాచక సర్వనామములు . (Numeral Pronouns)

3 5 5 1 సంఖ్యా వాచక శబ్దములు నిర్మాణ క్రమములో విశేష్యములు వంటివి ఇవి ప్రాథమిక సంఖ్యా వాచకములు సార్వనామిక విశేషణములని రెండు విధములు సర్వనామములకు సంఖ్యా వాచకములు చేరుటచే సంఖ్యావాచక సర్వనామములందురు పోతన

భాగవతమునందుపయోగించిన సంఖ్యావాచక సర్వనామములు ఈ క్రింద ఉదాహరింపబడుచున్నవి

1. మహద్వాచకములు : ఒక-/ఒక్క- అను ప్రాతిపదికం మీద మహదేకవచన ప్రత్యయము చేరును

ఒకఁడు 8-205, ఒకండు 10 పూ.1671

ఒక్కఁడు 7-124 ఒక్కండు 10 ఉ 1284

ఒకరు- / ఒక్కరు- మీద మహదేక వచన ప్రత్యయము చేరును.

ఒకరుండు 9-110, ఒక్కరుఁడు 8-407

ఒక్కరుండు 4-280 ఒక్కరుఁడవు 10 పూ 91

2. మహతీవాచకము .

ఒకతె 10 పూ 1020 ఒక్కతె 4-28

3 మహతీతరా మహద్వాచకము : ప్రాథమిక సంఖ్యావాచక రూపములే మహతీత రామహద్వాచక సర్వనామములుగా ఉపయుక్తములగుచున్నవి

ఏకవచనము . ఒక 9-376, ఒక్క 10 పూ 738

బహువచనము : రెండు 2-11 నాలుగు 10 ఉ 444

పదుమువ్వురు 4-28

3 5.5 2 వచనముతో కూడిన అనుబంధనామములు :

(APPELLATIVE NOUNS OF NUMBER)

కుటుంబ రూపముగల సంఖ్యావాచకములకు -వురు, -గురు, -రు అను ప్రత్యయములు చేరుటచేనివి యేర్పడుచున్నవి

ఇరు-వురు : 'మొగసాలనున్న పురుషులిరువురు వారుం జూచి 7-21

'ఇతని పెంపుడు కొడుకులిరువురు జనియించిరి' 9-640

ముగురు 'నలువురు ముగురు మేనత్తల కావందమే' 1-347

ముగ్గురు : 'ముగ్గురు కొడుకులనేఁబండ్రుఁగూతులను జనియించి పెరుగుచున్న యెడ 9-172

ముప్వురు · భృగు మహాముని నముత్రివ్వురు వేల్పుల కదకుంబంపిన
10 ఉ 1268

నలువురు హిరణ్య కశిపునకు విచిత్ర చరిత్రులు నలువురు పుత్రులుద్భవిం
చిరి 7-114

నలుగురు · మొదమేనలుగురు ముగురుమేనత్తల కానందమే 1-347

ఏవురు . ' ఊర్మిళుందు నమవారేవురు బ్రిదికిరి' 9-703

అర్గురు . 'కట్టా యార్గురు కొడుకులఁ బట్టి వధించితివి' 10 పూ 151

అర్వురు ఈ కల్పంబున మనువులు ప్రాకటముగ నార్వురైరి 8-6

ఏడ్గురు . ' మహాభోజుండును వననేడ్గురు పుట్టిరి' 9-709

ఏడ్వురు · 'ఇల మీద మనువు లేరేడ్వురుఁ జనువేళ' 2-31

పదుగురు . పదుగురు రాజులు పురందరుడను వాదిందుర్రిందు 8-412

పదురు : పదురు గొడుకులు గలరంద్రు 9-3

3553 ఇద్దఱు- అను అనుబంధనామమును ఇర్- ఠారు అను విధముగ విర్ణయింపవచ్చును 'నరనారాయణులను ఋషులిద్దఱను సంభవించిరి.
4-28

3554 పది సంఖ్యా వాచకమునకు-రు ప్రత్యయము చేరునపుడు తుదినున్న 'ఇ' వర్ణము 'ఉ' వర్ణముగా మారును
'పదురు గొడుకులు గల రందుర్రి' 9-3

3555 ఎనిమిది, తొమ్మిది, పది సంఖ్యావాచకములకు కొన్ని సంధిగతమైన మార్పులచే అనుబంధముగ-ండుర్రి వచ్చును.

ఎనిమిది > ఎనమంద్రు : 'అవ్విధంబున నెనమంద్రుసుతులు మృతులైన . 10 ఉ 1283

తొమ్మిది > తొమ్మండ్రు అతి సౌందర్యవతులయిన కన్య లందొమ్మండ్రింగను 3-759

పది > పదుండ్రు సత్య ధర్మాదులు పదుండ్రు ధరణిపతులు
8-421

556 ఇరు ఎనిమిది తొమ్మిది సంఖ్యా వాచకములకు మహద్వాచకము
లలో గురు పోతన భాగవతమున వాడలేదు

356

1 ద్వితీయావిభక్త్యంక ప్రత్యయములైన -ను, -ముల ద్విత్వమునొందు నపుడు విభక్త్యంగములోని దీర్ఘాచ్చు ద్వితీయా విభక్త్యంగములో హ్రస్వము కాగా నన్ను-, మమ్ము-, నిన్ను-, మిమ్ము- అను రూపము లేర్పడుచున్నవి

ఏలకుమార శోషిలఁగ నీజనవంబున నన్నుఁ గానఁగాఁ జాలవు 4-177

నీవు మాకుఁ జూపి మమ్ముఁ గృతార్థులంజేయుము 4-711

మమ్ముఁ గాచుట చిత్తంబు మంగళాత్మ 8-672

నేఁడు భీష్ముని జంపుదు నిన్నుఁగాతు 1-222

మిమ్ముఁ బొదగని భాషించు 1-301

2 నే-ను, మే-ము, నీ-వు, మీ-రు అను ప్రథమా విభక్తి సర్వనామము లందు గల అంత్య వర్ణములు లోపించి పరిణతి పొందగా ఉత్తమ, మధ్యమ పురుష ఏక, బహువచనములందలి తృతీయాది విభక్త్యంగ రూపములైన నా-, మా-, నీ-, మీ- అను రూపము లేర్పడు చున్నవి

నా కున్ 8-572

నీ కున్ 3-661

మాకున్ 4-451

మీకు 7-30

3 ఉత్తమ, మధ్యమ పురుషల ఏకవచన విభక్త్యంగము నా-, నీ- రూపములు, ఆత్మార్థక సర్వనామముల ఏక వచన విభక్త్యంగము తన- అనురూపము సర్వసాధారణముగా ప్రయుక్తమైనను షష్ఠీ విభక్తి ఏక వచనమున నాదు-, నీదు-, తనదు- అను ప్రత్యేక రూపములు కనిపించుచున్నవి

నాదు భక్తి బాలకవించె 1-126

నాదు వాక్యముల సంగతిఁగాదె సరోజ సంభవా 2-244

వదలంజాలఁదునాదు కౌగిలియు 9-405

నీదు కోర్కి కొనసాగుటకై నిజమూర్తిఁ జూపితిన్ 1-125
నీదు తనుజాతనన్ మది సిగ్గు పుట్టెడిన్ 4-94
తనదు లావణ్య రూపంబుఁ దలచిచూడ 8-40
తనదు ముఖము ప్రాణద ఋతు జూచి 8-284

తాను-, తాము- అను ఆత్మార్థక సర్వనామముల ప్రథమావిభక్త్యంగము లోని దీర్ఘాచ్చు ద్వితీయా విభక్త్యంగములో హ్రస్వమై, ప్రాతిపదికపై -అ ప్రత్యయము చేరుచున్నది

తాను 7 తన    తనకుఁ దక్కుఁడున్ విడిచి దానవవైరి పదార వింద
మున్ 1-100
తాన తనమూర్తి నిజశక్తిఁ దగ ధరించి 3-89
తనకు సంతాన విస్తరార్థంబుగాఁగ 4-3

తాము > తమ    ఎవ్వారు బ్రాహ్మణజనులు దమకు సన
కృతుల్ సేసిరేని 3-561
ఇతఁడు దమకుఁ బ్రాణములగుటన్ 7-33
సన్నలందమలోనఁ దద్విభుసౌకుమార్యము చూప
చున్ 1-256

4 మీరు, వారు, వీరు అనునవి బహువచనములైనను వానికి పూర్ణార్థమున మీరలు, వారలు, వీరలు అను ద్విగుణీకృత బహువచనము (Double Plural) తోడి ప్రయోగములు పోతన భాగవతమున కలవు

మీరలు    దాసీపుత్రుని మీరలు దాపీనుంజేయకు 3-35
ధరణీదేవతలార మీరలు మహాధర్మ్యల్ 1-72

వారలు    మృతి బొందిన వారలు చేరవత్తురే 7-67
తిరిగి వారలసమయంబు దీర్చి యేగుదెంచి 3-17

వీరలు ·    వీరలు క్షత్రివృద్ధుని వంశంబువంగల రాజులు 9-503
వీరలువంతట కావముఁ దీరమదీయ ప్రసాద
ధీయుతులగుచున్ 10 ఉ 1157

గౌరవ వాచకముగ ఏకవచనమునకు బదులు బహువచ
నము వాడబడుచున్నది

మిము    మిము బోటి పెద్ద వారలు కమలాక్షుని చరితమడుగ
1-449

మదిం గోరకా
తురయైనారద నంపునన్ మిము పరాకున్నంచునే తెంచిన
3-781

మిమ్ముఁ    వేలు తీర్థంబులవనిపై వెదకనేల, మిమ్ముఁ బొడగని
భాషించు మేలచాలు    1-301

మీ  :  మీ యంతటి వారి కొండు మేరయుఁగలదే   9-12
ప్రజా, వృత్తిమీమాంస మతమును, వృత్తిమతినొవరించు
చున్న వా రటవించే    4-59

మాకు    వీరికిం, దనయ శ్రేణికి మా దిక్కుఁగలదే దాత్రీకవీకోటి
కింజనునే    7-43

మీకు    మీకు సర్వంబు నెఱిగెఁడు మేధగలదు    1 301

మీరు    ఏ వర్తనంబున వింతకాలము మీరు సంచరించితిరయ్య
జగతిలోన    1-301

5. వాన్-, వార్-, దాన్-, దీన్-, వీన్- అను సర్వనామ ప్రాతిపదికలకు -ఇ అను ప్రత్యయము చేరుటచే ద్వితీయాది విభక్త్యంగములు ఏర్పడుచున్నవి

వాన్ + ఇ    వాని    వానికి ప్రొక్కుఁదముగాక వగ వగ నేలా
8-150

విశ్వసంయుక్తుండునైన వానికి నంభ
వించు    4-867

వార్ + ఇ    వారి    వారికెబ్బంగినీ, జలజన్మంబులుపచ్చె
7-20

కాలము విచిత్రముదుస్తరమెట్టి వారికిన్
1-210

| | | |
|---|---|---|
| దాన్ + ఇ | దాని | సురలు మనములఁ దనికిరి దానికిని |
| | | ప్రతివిధానము లేమిన్ 10 ఉ 1249 |
| దీన్ + ఇ | దీని | దీనికిఁ జింతదక్కుఁడు 3-588 |
| | | బ్రహ్మసత్యమెఱుంగఁడే యము వడిన్ |
| | | బ్రహ్మపుత్రమున్ దీనిపై 1-150 |
| ఏన్ + ఇ | ఏని | కొడుకునీవు మరలఁ గొనిపొమ్ము వసు |
| | | దేవ వెఱపు లేదు నాకు ఏని వలన |
| | | 10 పూ 50. |
| | | భగవదు ద్దేశ స్వధర్మ కలితుండై ఏని |
| | | వలన పరిశుద్ధగతిం దనిలిన 3-962 |

6 ప్రథమపురుష మహద్వాచక బహువచన 'వాండ్రు' అను రూపము, సమీప నిర్దేశ సర్వనామ ప్రథమ పురుష మహద్వాచక బహువచన మున 'ఏండ్రు' రూపముపోతనచే ప్రయోగింపబడినది

వాండ్రున్ ఏండ్రును రాజులేయనుచు గర్వ వృత్తిలో
యాదవుల్ 10 పూ 1522

ఏరల్, ఏరలు అను ప్రథమా విభక్తి మహద్వాచక బహువచన రూప ములు పోతనచే ప్రయుక్తము మన, మల్లవరులు పెనగినేడు మడిసిరి ఏరల్ బల్లిదులు కలఁడు కలఁడని 10 పూ 367

ఏరలు క్షత్రివృద్ధుని వంశంబునంగలరాజులు 9-503

ఏరల - అను సమీప నిర్దేశ సర్వనామ, మహద్వాచక ద్వితీయా విభ క్త్యంగ బహువచన రూపము పోతన భాగవతమున ప్రయోగింపబడినది తద్దోష ఫలము ఏరల -కు సంప్రాప్తమయ్యె 3-565

7 మహద్వాచక ప్రథమ పురుషైకవచన సర్వనామములైన వాఁడు, ఏఁడు, ప్రశ్నార్థకమున, మహతీవాచకమున అది అదునికాంధ్ర భాషలో వ్యవహరింపబడినట్లుగా నీచార్థమున పోతన భాగవతమున ప్రయోగింపబడిన రూపములు అగౌరవ సూచకములు కావు

వాడు రాజవర్య మరల రాఁడు వాఁడు 2-31

దివ్య పదము వాఁడు దిక్కు వాకు 8-77

వీఁడు కోమలులార వీ డునల కూబరుఁ డోమరుఁడో

జయంతుఁడో 9-177

హరికిన్ వైరినటంచు వీఁడు పటు రోషాయత్తుఁడై

యెప్పుడుం, దిరుగుం 7-12

ఎవ్వఁడు. పారిజాతమెవ్వఁడు గొనివచ్చి సత్యభామకిచ్చెమ

1-349

ఎవ్వరి దానవుజనకుండెవ్వడు పేరేమి 4-749

అది అది సత్పుత్రిత్రుని గన్న తల్లి పగిదిన్ 10 పూ 780

పరిపాకము పొందక యెవ్వఁడేనిఁజచ్చిన

మఱి మేననైన నది సిద్ధివహించు 1-100

8 నిర్దేశ, ప్రశ్నార్థక సర్వనామములకు బౌ పవిరక్తిక ప్రత్యయమైన 'ఇ' వర్ణముచేరి ద్వితీయాది విభక్త్యంగ మేర్పడుచున్నది

అతని మనము వాలం, గంటెం జేకొంటి మతనికరుణను కాదే

1-359

అతనికిని విశ్వకుఁ డాదిగాఁగఁ బదురు గొడుకులు గల

రంద్రు 9-3

ఇతని గురుశక్తిన్ విదళింతుఁ జూడు మితనిన్‌గోమూర్తి

1-418

ఎవ్వని అతిభక్తి నెవ్వనియందుఁ జిత్తముఁ జేర్చి 1-214

ఎవ్వనిఁగని మోహించితిరి 10 పూ 833

ఎవ్వరి అపకారంబులు సేయ మెవ్వరికి నేకాంతంబులం దుండు

10 పూ 850

9. సమీప వర్తి దూరవర్తి నిర్దేశ ప్రాతిపదికలకు అన్నకు రూపాంతర మైన 'అన' చేరి ఈయన, ఆయన అను రూపము లేర్పడిన పదములు పోతన భాగవతమున కనిపింపవు

10. ఎయ్యది [ఏ+అది] అను రూపము పది తోపాటు నిర్దేశ ప్రశ్నార్థక సర్వనామముగా వాడ బడినది ఎయ్యది సర్వ సౌఖ్యమై యలవడు 1-44

11 ఇదియె అను సమీప వర్తి నిర్దేశ సర్వనామము పోతన వాడెను

ఇదియె కేళిపులలో నిదియె మంచి కేళిపు 10 పూ 433

ఇదియె ధర్మంబు గాఁగ నీమదిఁదలంపు 10 పూ 1123

## 3 6 0 సంఖ్యా వాచకములు (NUMERAL PRONOUN)

సంఖ్యా వాచక శబ్దములు విగ్రాణ క్రమములో విశేష్యములం వంటివి ఇవి ప్రాథమిక సంఖ్యా వాచకము (CARDINALS) అవి, సార్వనామిక విశేషణము (ORDINALS) అని రెండు విధములు ప్రాథమిక సంఖ్యా వాచకములకు అగు అనుధాతు ూపములను చేర్చియు, అన్యతంత్ర సంఖ్యా వాచక విశేషణ ప్రాతిపదికలకు లింగ, వచన బోధక ప్రత్యయములను చేర్చియు రెండురకములుగ సార్వనామిక విశేషణములను నిర్మింపవచ్చును లింగ వచనాదులందు ఈ సంఖ్యా వాచక ూపములు భిన్నములుగా కన్పట్టుచున్నవి. వానికి విభక్తి పరమగు నపుడు రూప భేదము కలుగుచున్నది అవి విశేష్యములుగను, విశేషణములుగను రెండు విధములుగ నుండును. ఒకటి నుండి పదివరకు గల సంఖ్యా వాచకములు, నూఱు, వేయి అనునవి స్వతంత్ర పదాంశములు పోతన భాగవతమునందు ప్రయోగించిన సంఖ్యా వాచకములు క్రింద ఉదహరింపబడుచున్నవి

## 3 6 1 ప్రాథమిక సంఖ్యా వాచకములు (CARDINALS)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఒకటి | 8-566 | ఒక్కటి | 3-1025 | రెండు | 2-11 |
| మూడు | 1-176 | నాలుగు | 10.ఉ 444 | ఐదు | 3-78 |
| ఆఱు | 3-349 | ఏడు | 9-560 | ఎనిమిది | 10 పూ 91 |
| పది | 8-516 | నూఱు | 10 పూ 397 | వేయి | 10 ఉ 10 |

## 3 6.1.2 ద్వితీయాది విభక్త్యంగము

ఔపవిభక్తిక ప్రత్యయములు చేరికవలననే ఈ సంఖ్యా వాచకములకు ద్వితీయాది విభక్త్యంగ మేర్పడుచున్నది.

ఒకటి-కి 'అంబుము ఖావరణంబు లొక్కొటికి దశ గుణితంబులై కవిరి
3-897

రెంట-ను 'రెండు చేతుల భీముని వారించి కడమ రెంటను ద్రుపద పుత్రి
కను దలంగించి 1-169

రెంటి-వి 'మాఖింతమైన యమనియమంబుల రెంటి నాచరించెను 2-254

రెంటి కి ' అటుసేయఁగనోపదేవిఁదాఁ బొలియుట యొప్పు రెంటికిఁ
బ్రిథుత్వము పాలమి 4-90

మూటి-వి 'రజస్సత్త్వతమో రూపంబులగు మలంబుల మూటివి
హరించి 1-328

మూటి-తోడ 'వాయువు వలన రూపస్పర్శ శబ్దంబులని యెదు గుణంబులు
మూటితోడఁ దేజంబు గలిగె 2-86

నాల్గిట-ం 'అరితనువప్టబాణముల నాగ్రిహవృత్తిఁ బగిల్చి నాల్గిటం
దురగములన్ వధించి 10 ఉ 880

ఆఱింటి-వి 'మనస్సహితంబులైన చక్షురాదీంద్రియం బులనాఱింటివి విష
యంబులంబ్రి వర్తింపనీక 1-328

ఏ డింటి-వి 'కనక కలశమణి వసన విభాలంబు లైన తిలశైలంబు
లేడింటివి భూదేవతలకిచ్చినా' 10 పూ 173

ఏడింటి-కి 'కలఁగుచెల్లను మానెఁగంధులేడింటికిఁ జలనంబుమానె'
9-333

ఇరువదేడింటి-విన్ 'సాక్షిత్వంబున నీయిరువదేడింటివి నాశ్క గూడి
యుందు' 7-237

ఇన్నూటి-కిన్ 'విలాసవతులయిన దాసీజనంబుల విన్నూటికివిచ్చి యవి
చినం' 10 పూ 21

నన్నూటి-వి 'సముత్తుంగంబులయిన మాతంగంబుల నన్నూటివి
ఇచ్చి యవిచినం 10.పూ 21

వేయి రూపమునకు బదులు 'వేవురు' రూపము పోతన భాషలో కలదు

వేవురు : 'పదునాలుగు వేవురు నఱువది యేవురునరులు ము_క్తివడసిరి'
9- 64

'లావు మెరసి యిరువది యొక వేవురునంద నులు 9-164

## 3 6 2 సంయు_క్త సంఖ్యా వాచకములు ·

(COMPOUND NUMERALS)

3 6 2.1 సంకలనము (ADDITION) చే, గుణకారము (MULTIPLI-CATION) చే సంయు_క్త సంఖ్యా వాచకము లేర్పడుచున్నవి ఒక సంఖ్యకు మరొక సంఖ్య వచ్చి చేరినపుడు ఆ సంఖ్య అధికమై సంకలనమేర్పడుచున్నది పదికి -ఒకటి నుండి తొమ్మిది వరకు గల సంఖ్యలు కలిసిన సంకలన మేర్పడును పోతన భాగవత ప్రయోగములు

పదునొకండు · [10+1 11]

'ఇంద్రుండు మిక్కిలి వర్షింప బ్రివర్షణాఖ్యంబై పదునొకండు యోజనం బుల పొడవును' 10 పూ 1671

పండ్రెండు . [10+2 . 12]

'వసిష్ఠుండు పండ్రెండేండ్లు రక్కసుండవై యుండుమని నియమించె
9-328

పదమూడు [10+3 13]

తమ్మునెదిర్చిన యక్షకోటి కెచ్చెరబదు మూడు వేలనొక చీరికి గైకొన 4-325

పదునాలుగు [10+4 . 14]

'పల్లవి యేనుగులందదు నాలుగు లక్షల నొసంగె 9-635

పదునాల్గు [10+4 14]

లక్ష్మణుడు దాని ముక్కు గోయపదిపిని ఖర దూషణాదులు పదునాల్గు వేల వచ్చిన 9-269

పదునేను : [10+5 15]

'అహర్నిశంబులు గూడ మర్త్యులకొక దివసంబగునవి పదునేనైన నొక పక్షంబగు 13-346

పదాఱు [10+6 : 16]

' గోవిందు శుద్ధాంత స్త్రీలు బదాఱు వేలు పదరాగా
యత్తులై లాకి . 1-374

తొల్లి నేను మధురా పురంబు మీద బదియేడు మాఱులు
పరా(క్రంబున విడిసి '10 పూ 1759

పదునెనిమిది . [10+18]

' జరాసంధుడు పదునెనిమిది మార్లు ధరణిపాలుర
పవ్వన్' 10 ఉ 653

నూట ముప్పది మూడు : [100+30+3 : 133]

'ఇట్లునూటముప్పది మూడశ్వమేధ యాగంబులు పద
క్షిణంబులు గా నొనర్చి' 9-635

వేయునెనమన్నూటికి · [1000+800 : 1800]

పార్థింబులయిన రథంబుల వేయునెనమన్నూటికి సముత్తుంగంబుల
యిన మాతంగంబులను 10 పూ 21

పై ఉదాహరణములందు 11, 13, 14, 15, 16, 17, 18, సంఖ్యలకు 'పది'కి బదులు 'పదు' రూపము వచ్చుచున్నది

రెండు ఇద్దఱు సంఖ్యా వాచకములు పదికి చేరునపుడు 'పది' కి బదులు 'పన్' అను విశేషణ రూపము చేరును [పండ్రెండు, పన్నిద్దఱు]

1. పదికి ఏడు చేరినపుడు మార్పులేదు

పదియేడు మాగధుడుసేవలతో బదియేడు రోయముల్
దిక్కులబాఱదే 10 ఉ 86

2 పది సంఖ్యకు పూర్వము రెండు నుండి ఏడు దాక అంకెలు చేరుటచే గుణకారము చెంది 20 కి పైగా గల కొన్ని సంఖ్యలు ఏర్పడు చున్నవి మరల కొన్ని అంకెలు చేరి క్రింది రూపములు వచ్చు చున్నవి.

ఇరువదొక్క : [2×10+1 : 21]

· రాముడలయక రాజుల
నిరువ దొక్కమాఱువరసి చంపె 9-486

ఇరువది యేడు [2×10+7 27]

ఇరువది యేడు దినంబులతి ఘోరంబుగాఁబోరున్ 10 ఉ 886

ముప్పది తొమ్మిది [3×10+9 39]

శ్రీద్ధా కీర్తిమాన గర్వాభావంబుతమ

వవియెడి ముప్పది తొమ్మిది గుణంబులు 1-402

ఏబదియయిదు 5×10+5 55]

గంగా తీరంబున యేబదియయిదును 9-635

అఱువది ఆఱు [1C×6+6 66]

అతదేలనేల నఱువరి యాఱువే లేండ్లు వావి లంగి 9-500

డెబ్బది యెనిమిది [7×10+1 78]

పురోహితుండు నాడెబ్బది యెనిమిదియును

గంగాతీరంబున అశ్వమేధయాగంబులు

వదక్షిణంబులుగా నొనర్చి 9-635

3 వదికి 6 సంఖ్య చేరునప్పుడు 'వది'కి బదులు 'వద' రూపము వైకల్పికముగా వచ్చుచున్నది

వదియార్వురు 4-27

వదాఱు 1-374

'నూరు' సంఖ్యకు పరముగా ఒకటి మొదలైన సంఖ్యలు చేరునపుడు 'నూరు' ఔపవిభక్తిక రూపమును పొందును

[100+1 : 101]

నూటొక్క . ధర నూటొక్క కులంబై

వరగిరి 10 ఉ 131

నూటముప్పది మూడు [100+30+3] 133]

నూట ముప్పది మూడశ్వమేధయాగంబులు

వదక్షిణంబులుగా నొనర్చి 9-635

## 3 6 2.2 గుణకారము (MULTIPLICATION)

ముయ్యేడు : [3×7 21]

భూరివి

స్ఫురితో దారకుఠార ధారంగలనన్ ముయ్యేడుమాఱుల్ పొరిం
పొరిం మర్చింది 2-153

ముప్పది [3×10 30]
తరమ ముప్పది యద్దంబుల వింద్రియంబులచేత
బట్టునది 7-123

నలువది [4×10 40]
ఎండేవి నలువది యెనిమిది దివసముల్ చరియించ 9 642

ఏబది [10×5 50]
గంగాతీరంబున నేఁబదియయిదును 9-635

అరువది [10×6 · 60]
ముందట నరువది యాఱువేలేండ్లు వనం 4-290

డెబ్బది [10×7 : 70]
యుగములోలివి డెబ్బది యొక్కమాఱు
నవిన 3-352

తొంబది · [10×9 90]
తొంబది తొమ్మిదివేల యోజ
నముల దూరంబుగల యమనగరమునకు 3-986

రెండునూఱు [2×100 200]
రెండు మాఱేదులనువిల్చి యుండు 3-349

మున్నూఱు [3×100 300]
ఒక మున్నూఱుగదల్చి తెచ్చిన 9-262

నన్నూఱు : [4×100 400]
నముత్తుంగంబులయిన మాతంగంబుల నన్నూటికి 10.పూ.21

ఏనూఱు : [5×100 500]
ఒక యేనూఱు తరంబుగన్ ధనువులత్యుగ్రాకృతిందాల్చి
10 ఉ 421

ఆఱునూఱు [6×100 600]
. తదీయ సంధ్య లాఱునూఱేడులనగు 3-349

ఎనిమిదినూఱు : [8×100 800]

తదీయ సంధ్య

లెనిమిది నూఱేండ్లు వినుము 3-349

మూడువేలు : [3× 000 3000]

విచిత్రాంబరాభరణ భూషితలైన యువతులు

మూడువేలును 10 ఉ 141

నాలుగువేలు : [4×1000 4000]

అనఘకృతయుగ సంఖ్య నాలుగువేలు దివ్యవర్షములు 3-349

ఐదువేలు [5×1000 5000]

తనయులు నైదువేలట 9-187

ఆఱువేలు [6×1000 6000]

కాం

చనరథములు నాఱువేలు సమ్మతినిచ్చెన్ 10 ఉ 596

తొమ్మిదివేలు . [9×1000 9000]

యువతులు మూడువేలును తొమ్మిదివేలు గజంబులును

.. భట సమూహంబునునిచ్చి 10 ఉ 141

పదివేలు [10×1000 10000]

దుర్వాసుడొకనాడు దుర్యోధనుడు సంప బదివేలు

శిష్యులు భక్తిఁగొలువ 1-364

పదమూడు వేలు [13×1000 . 13000]

. . చె

చ్చెరఁబదమూడు వేలు నొక చీరికిఁగైకొనక 4-325

అరువది వేలు · [60×1000 60000]

అప్పాపాత్ముండు అఱువదివేలు సంవత్సరంబులు

మఱి కూపంబునం గ్రిమి రూపంబున వర్తించు 10 ఉ.481

వేయినూఱు · [1000×100 100000]

వినుముదుమవు కులము వేయినూఱేండ్లును

బరగ విస్తరించి 9-6

పదునాలుగు లక్షలు [14×100000 1400000]

ఏమంగులం బదునాలుగు లక్షల నొసంగె 9-635

మూడు కోట్లు [3×10000000 30000000]

గురుజనంబులు విను మూడు కోట్లు మీద 10 ఉ 278

పదివేల లక్షలు . [10000×100000 000000000]

వ

తక్కకలుండై పదివేల లక్షలు సుపుత్రు భక్తిసేయం 9-704

3 6 3. సంఖ్యావాచక విశేషణములు

(NUMERAL ADJECTIVES)

సంఖ్యావాచకములు నామములందు విశేషణములుగ ప్రవర్తించును. సంఖ్యలలో ఒకటి అనుశబ్దమునకు ఒక, ఒక్క అనునవి విశేషణ రూపములగుచున్నవి మిగిలినవి కూడ యథాతథముగ విశేషణములుగ ప్రయోగములో నున్నవి నామములకు పూర్వము ఒకటి నుండి అనేక సంఖ్యావాచకములు వాడబడినపుడు ఆ సంఖ్యలు విశేషణములుగ సూచింప బడుచున్నవి

3.6 3.1. కుఱుచ రూపములతో కూడిన సంఖ్యావాచక విశేషణములు :

1 ఒక ఒకచోట 10 ఉ 619

ఒక బొట్టు 8-324

ఒక యేడు 3-345

ఒక పాదంబు 8-625

ఒక సమయము 3-789

ఒక చేడియ 10 పూ 1092

ఒక్క ఒక్కచోటు 10 ఉ 619

ఒక్కమాటు 10 పూ 738

ఒక్కమాఱు 4-270

ఒక్క దినంబు 8-490

ఒక్క క్షణము 9-70

ఒకరు : దైవ మొకరు 10 ఉ 1032

2. ఇరు . ఇరువంకలు 4-415
ఇరుకెలంకులు 10 పూ 1082
ఇరుదెసలు 9-319

రెండు : రెండు చేతులు 1-169
రెండు పుట్టంబులు 9-342
రెండు పంక్తులు 8-17
రెండు గడియలు 2-11
రెండు దెసలు 1-235

3 మూడు : ముయ్యేడు 2-153
ముమ్మాటు 4-215
ముమ్మాఱు 2-35
ముజ్జగముల్లు 8-617
ముగురు మేనత్తలు 1-347
ముగ్గురు గొడుకులు 9-172
మువ్వురు గొడుకులు 4-26

4 నాలుగు : నాలుగు చెలుగులు 9-585
నాలుగు పాలు 8-433
నాలుగు పాదములు 1-401
నాలుగు యుగములు 9-73

నాల్గు : నాల్గు వంకలు 4-767
నాల్గు భుజములు 1-214
నలుగడలు 8-216
నల్దిక్కులు 4-29
నల్దిశలు 4-648

5. అయిదు : అయిదేండ్లు 10 పూ.488

ఐదు . ఐదేండ్లు 9-200

ఐదువేలు 9-187

ఏను . ఏనేండ్లు 1-116

6 ఆఱు ఆఱేండ్లు 7-21

7 ఏడు ఏడువారలు 9-560

ఏడు దీవులు 2-9

ఏడు దినంబులు 1-513

8. ఎనిమిది : ఎనిమిది కన్నులు 10 పూ 543

ఎనిమిది ప్రంగలు 10 పూ 91

9 తొమ్మిది : తొమ్మిది గవకులు 4-767

తొమ్మిది మడుగులు 9-487

10 పది : పది దివములు 8-516

11. పదునాలుగు : పదునాలుగు నామంబులు 10 పూ 61

12 పదియేడు : పదియేడు మాటలు 10 పూ 1759

13 ముప్పది తొమ్మిది : ముప్పది తొమ్మిది గుణంబులు 1-402

14 నూఱు : నూఱు దివ్యవర్షంబులు 10 పూ 397

15. వేయి : వేయి దాగులు 10 ఉ 10

16 ఐదువేలు . తనయులు నైదువేలు 9-18

17. పదునాలుగు ఆక్షలు . నల్లవి యేమంగులంబదు నాలుగు ఆక్షం నొనంగె 9-635

### 3.6.4. సార్వనామిక విశేషణములు . (ORDINALS)

సార్వనామిక విశేషణ ప్రత్యయములైన—అగు, -ఔ/-అవు/అవ, చేరుటచే సార్వనామిక విశేషణ సంఖ్యావాచకము లేర్పడుచున్నవి అగు/ఔ/అవు అనునవి అగుయొక్క అనిర్దిష్ట కాలవిశేషణము అవు

రూపమేర్పడిన తరువాత దానిపై విశేషణ ప్రత్యయమైన 'అ' చేరితో 'అవ' రూపమేర్పడుచున్నది కావ్యభాషలో సామాన్యముగా కనబడు రూపమిదియే పోతన భాగవతమున 'అవ' అనువానితోకూడిన రూపములు గలవు

| | | | | |
|---|---|---|---|---|
| అవ : | రెండ | 4-270 | ఏ-దవ | 1-473 |
| | మూడవ | 8-16 | ఎనిమి-దవ | 10 పూ 1759 |
| | నా-లవ | 3-992 | తొమ్మి-దవ | 10 ఉ 1283 |
| | ఐ-దవ | 10 పూ 487 | పదునొకం-డవ | 8-421 |
| | ఆ-అవ | 9-200 | పంౘ్రెం-డవ | 8-423 |
| | | | పదుమూ-డవ | 8-425 |
| | | | పదునా-లవ | 8-427 |
| | | | పదునెనిమి-దవ | 10 పూ.1632 |

మొదలి : ఇట్లువిశాంతంబగు హేమంతంబున మొదటి నెల తొలిదినంబునందు 10 పూ 807

తొలి : మొదలి నెల తొలి దినంబునందు 10.పూ 807

3 6.5. విభాజక సంఖ్యా వాచకము :

(DISTRIBUTIVE NUMERAL)

-ఏసి అను ప్రత్యయము సంఖ్యా వాచకముల చివర ప్రయోగింపబడి పరిమాణమును తెలుపుచున్నది

-ఏసి : ఆవేసి దినంబులకొక్క- పరికృత తీర్థ కృత్య వర్షాహారుండగుచు 4-270

పదుగురేసి భద్రమూర్తులైన కుమారులుదయించిరి. 10 ఉ 275

పదురేసి కొడుకుల బడసె 10 ఉ 1328

3 6 5 1 పలు, పర్వ, పకల, కొందఱు, పెక్కు- బహు సంఖ్యావాచకముల స్థానమున వచ్చి పరిమాణములను తెల్పును

| | | | |
|---|---|---|---|
| పలువేలు | 9-564 | కొందఱు విరోధులు | 3-71 |
| పర్వకాలంబులు | 2-253 | పెక్కు- విధంబులు | 2-56 |
| పకల జనంబులు | 3-181 | బహుప్రకారంబులు | 3-184 |

## 370 విశేషణములు (ADJECTIVES)

'శబ్దములు విశేష్యములు, విశేషణంబులని ద్వివిధంబులు' అని ప్రౌఢ వ్యాకర్త నామప్రకరణమున నిరూపించినాడు ప్రాచీన లాక్షణికులు పదములను నామములు, ఆఖ్యాతములు, అవ్యయములని మూడుగా విభజించుటనుబట్టి చూడగా విశేషణమును భాషాభాగములలో ఒకటిగా అంగీకరింపలేదనుట స్పష్టపడుచున్నది అనగా, విశేషములు నామములలో ఏకాదేశమని భావింపవగును విశేషణము అనునది సంస్కృత వ్యాకరణము నుండి తెలుగు వ్యాకరణమున ఉపయుక్తమైన పారిభాషిక పదము విశేషణము అనగా విశేషించునదని యర్థము విశేషించుట అనగా ఒక శబ్దము వలన తెలియదగిన యర్థము సంశయంబె సంకుచితపరచి లేక స్పష్టపరచి తెలియజేయుట స్పష్టపరుపబడునది "విశేష్యము"

విశేష్యముల అర్థమును విశదీకరించునది లేక క్లుప్తపరచునది విశేషణము ప్రధానముగా విశేషణములను మూడు భాగములుగా విడదీయవచ్చును. [ఈ విభజన భావముల స్థానములబట్టి విభజింపబడినది]

1 వ్యావర్తకము  2 విధేయము  3 హేతుగర్భము

1 వ్యావర్తకము ఇతరుల వస్తువుల నుండి భేదించు స్వభావము కలది
ఉదా॥ తెల్ల, నల్ల మొదలగునవి

2 విధేయము తెలియదగినది విధేయము.

ఉద్దేశ్యము, విధేయము అని విషయము రెండు విధములుగా విభజింపబడినది ఉద్దేశ్యము వక్తృ శ్రోతల కిరువురకును తెలియును విధేయము వక్తకు మాత్రమే తెలియును

3 హేతుగర్భము . 'జూదరి యవమానము చెందును

ఈ జూదరి శబ్దమందు గల జూదము అనునది హేతుగర్భ విశేషణము

'యథా సులావః పతతీత్యా దౌ సురాపానం హేతుగర్భమ్ విశేషణమ్ విశష్యతే భేద్యతే గుణాదిభిరపౌకర్మణిల్యట్' —వాచస్పత్యము

పై విశేషణములు మూడును భేదకధర్మములను వివరించుచున్నవి ఇట్టి ధర్మములు గుణ, జాతి, క్రియాదులేమైన కావచ్చు ప్రౌఢ వ్యాకర

ణము వలన విశేషణములు జాతి క్రియాగుణ ద్రవ్య సంఖ్యా సంజ్ఞా ప్రయుక్తంబులని యారువిధములుగా చెప్పబడినవి ఈ విభజన సంస్కృత వ్యాకరణ మర్యాదననుబట్టి చేయబడినది ఆంగ్లమున గుణ, పరిమాణ, సంఖ్యా, నిర్దేశ, ప్రశ్నార్థకములని యైదు భాగములుగా గుర్తించిరి విశేషణములు స్థానమునుబట్టి ప్రయోగమునుబట్టి తాత్కాలిక విశేషణత్వ మును పొందునేకాని వేరుగాదు [1] విశేషణముల విషయమున సంస్కృతము నకు తెలుగునకు భేదము కలదు సంస్కృతమున నివి లింగ, విభక్తి, వచనములందు విశేష్యములతో సమానము తెలుగున విశేషణములకు లింగ విభక్తి వచనములు లేవు తెలుగునందలి అనేక పదములు విశేష్య ములుగను, విశేషణములుగను అవి ప్రయుక్తమైన స్థానమునుబట్టి నిర్ణీత మగుచుండుట కలదు

3 7.1 విశేషణములు రెండు విధములుగ తెలుగున విభజింపవచ్చును

1 స్వతస్సిద్ధ విశేషణములు    2 నిష్పన్న విశేషణములు

3 7.2. స్వతస్సిద్ధ విశేషణములు .

వీనిని గుణ, పరిమాణ, సంఖ్య నిర్దేశ, ప్రశ్నార్థక, ప్రకార, పరిగణన అనిశ్చిత, స్థల వాచకములని తొమ్మిది వర్గములుగా వర్గీకరింప నగును

విశేషణములు ఎక్కువ భాగము సమాసముల పూర్వపదములుగ కన్పించును వీనియందు ఒకటే పదము ముందు నిల్పుటవలన విశేషణమును తర్వాత నిచ్చుట వలన విశేష్యముగాను పనిచేయుట స్పష్టము

---

1 Substantives and adjectives are interchangeable in all languages and from a grammatical points of view there is no clear cut boundary between them They may both be grouped together in a single category of the noun —Laungage Vendreys, Page 117.

## దేశ్యము + దేశ్యము

| | |
|---|---|
| ఎలనవ్వు | 10 ఉ 665 |
| కడకన్నులు | 10.పూ 199 |
| కడచూలు | 9-659 |
| కడుసిగ్గు | 8-200 |
| కనుమాయ | 10 ఉ 378 |
| కార్చిచ్చు | 2-180 |
| కెంగేలు | 8-303 |
| కొమరాలు | 9-172 |
| క్రొక్కారు | 1-431 |
| క్రొంజెమట | 8-208 |
| క్రొమ్మావులు | 8-447 |
| క్రొమ్మెఱుఁగు | 1-205 |
| గండ్రగొడ్డలి | 10 ఉ 1242 |
| చిన్నికుఱ్ఱఁ | 10 పూ 154 |
| చిన్నితమ్ముండు | 10 ఉ 484 |
| చిఱుచప్పుడు | 10 పూ 148 |
| చిఱునగవు | 8-307 |
| చెంగావి | 10 ఉ 804 |
| తక్కరిగొంటు | 10 పూ 537 |
| దొడ్డబుద్ధి | 7-214 |
| దొరగాయ | 8-447 |
| నడురేయి | 10 పూ 712 |
| నెచ్చెలి | 10 పూ 496 |
| నెత్తమ్ములు | 10 పూ 799 |
| నెమ్మొగంబు | 10 పూ 78 |
| పట్టుజీరలు | 9-321 |
| పిన్నతమ్ముఁడు | 1-346 |
| పినతల్లి | 4-221 |

| | |
|---|---|
| పినతండ్రి | 7-185 |
| పురిటిసాల | 10 పూ 140 |
| పెద్దతనము | 3-380 |
| పెద్దత్రోవలు | 9-322 |
| పెనుగాలి | 7-189 |
| పెనుదిబ్బ | 10 పూ 230 |
| పెనుమొనల్లు | 8-700 |
| పెనుగడ | 10 ఉ 918 |
| పెంజీకటి | 8-705 |
| బాకినోరు | 9-207 |
| మాఱుమాట | 4-85 |
| ముద్దుకొడుకు | 9-168 |
| ముద్దుపలుకు | 10 పూ 289 |
| వెంచేడియ | 9-378 |
| వెఱ్ఱితనము | 1-519 |
| వేడిచూపులు | 10 పూ 35 |

దేశ్యము + తత్సమము

| | |
|---|---|
| దొడ్డమహిమ | 1-240 |
| పెద్దకాలంబు | 1-307 |
| పెనుదుఃఖము | 1-398 |
| పెనుదెరలు | 1-454 |

3 7.2 1 గుణ వాచక విశేషణములు

వ్యక్తులు, వస్తువులు మొదలగువాని గుణములను తెలియజేయునది.

| | |
|---|---|
| రూపము | [ఆకారము] |
| విడుదయేఱులు | 9-230 |

రంగు [వర్ణము] - రంగును తెలియజేయును

| | |
|---|---|
| తెలికన్నుగవ | 8-301 |
| తెల్లవియేనుగు | 8-252 |
| నల్లచెవులు | 9-423 |
| పచ్చని పటము | 1-285 |

స్థితి [దశ] మానవుల జంతువుల స్థితి గతులను వయస్సు దృష్ట్యా, ధనము దృష్ట్యా వ్యక్తము చేయు విశేషణములు వచ్చును

| | | | |
|---|---|---|---|
| పేద జగతి | 4-608 | వెఱ్ఱివాడు | 9-459 |
| ముసలెద్దు | 3-981 | | |

స్థానము : బయట, వెలుపల మొదలగు స్థానములను విశేషణములు తెలుపును

పృష్ఠభాగంబు 2-89

గుణము వ్యక్తులు, వస్తువుల గుణములను తెలియజేయును మంచి, చెడు, సత్య, అసత్యము మొదలగు వానిని తెలియజేయు విశేషణములు వచ్చును

| | | | |
|---|---|---|---|
| మంచివారు | 10 పూ 93 | చెడురీతి | 3-401 |
| మెత్తదనము | 10 పూ 223 | నిర్మలతనువు | 8-121 |
| మేలిరుచులు | 8-554 | సత్యలోకంబు | 2-89 |
| మేలు కట్లు | 9-321 | | |
| మేలు కుప్ప | 10 పూ 127 | | |

### 3.7.2 2 పరిమాణాత్మక విశేషణములు

(Quanti tative Adjectives)

ఇందు అంత, ఇంత, ఎంత మొదలగు పరిమాణములు విశేషణముగా ప్రయోగింపబడును

| | | | |
|---|---|---|---|
| అంతకడవు | 1-78 | ఎల్లప్రజలు | 4-456 |
| అంతియవెడలుపు | 8-23 | కొంత కడవు | 3-637 |

| | | | |
|---|---|---|---|
| ఇంత ప్రొద్దు | 10 పూ.184 | కొంత కాలము | 9-350 |
| ఎంత బరువు | 1-181 | | |

3.7.2.3 సంఖ్యా వాచక విశేషణములు · (Numeral Adjectives)

విశేషణముల స్థానమున సంఖ్యలు ప్రయుక్తములగును

| | |
|---|---|
| ఒక మార్యుడు | 1-226 |
| ఒక్క పగలు | 8-705 |
| రెండు మార్గంబులు | 7-467 |
| ముప్వురు కొడుకులు | 4-34 |
| పలు దిక్కులు | 2-226 |
| నాల్గు పంక్తులు | 4-767 |
| ఆర్గురు కొడుకులు | 4-24 |
| ఏడువాదలు | 9-560 |

3.7.2.4 నిర్దేశాత్మక విశేషణములు

(Demonstrative Adjectives)

| | | |
|---|---|---|
| దూరవర్తి | అచ్చోటు | 10 ఉ 953 |
| | అవ్వేలది | 4-78 |
| | ఆ చీకటి | 10.పూ 1293 |
| | ఆయజ్ఞము | 4-61 |
| | ఆరివము | 4-103 |
| సమీపవర్తి · | ఇక్కాలంబు | 1-237 |
| | ఇచ్చెలువ | 10 పూ 317 |
| | ఇబ్బంగి | 10 పూ 1622 |
| | ఈపావదు | 7-154 |

3.7.2.5 ప్రశ్నార్థక విశేషణములు

(Interrogative Adjectives)

ప్రశ్నార్థకమును బోధించు ఎ, ఏ అనునవి విశేషణములగ వచ్చును

| | | | |
|---|---|---|---|
| ఎయ్యది | 4-113 | ఏ దివసము | 1-383 |
| ఎవ్వడు | 3-561 | ఏ ప్రొద్దు | 1-240 |
| ఎవ్వారు | 3-816 | ఏ రీతి | 10 ఉ 976 |
| ఏ దేవుడు | 10 ఉ 226 | ఏ రీతిన్ | 10 పూ 507 |

3 7.2 6 ప్రకారార్థక విశేషణములు (Qualitative Adjectives)

| | | | |
|---|---|---|---|
| అట్టిచోటుల | 7-449 | | |
| అట్టిదోషము | 4-416 | | |
| అట్టి ధర్మంబు | 4-421 | ఇట్టిమేను | 8-701 |
| అట్టి మేలు | 1-101 | ఇట్టిసంపదలు | 10 ఉ 1029 |
| అట్టి వారు | 4-698 | ఎట్టిచోద్యము | 3-572 |
| ఇట్టి బుద్ధి | 4-556 | ఎట్టి తపము | 10 పూ 576 |
| ఇట్టి భక్తి | 4-597 | ఎట్టినోములు | 10 పూ 1352 |

3.7.2 7 పరిగణనార్థక విశేషణములు (Adjectives of Totality)

| | |
|---|---|
| సమస్తము అందఱు | 10 ఉ 1132 |
| ఇందఱము | 4-195 |
| కొందఱు సూక్ష్మదృక్కులు | 10 ఉ 1214 |

3.7 2.8 అనిశ్చిత విశేషణములు (Indef ni e Adjectives)

ఇవి అన్నియు అమహద్వాచకములుగా ప్రయుక్తములు

| | |
|---|---|
| అన్ని రంగులు | 10 ఉ 1132 |
| ఇన్ని దినంబులు | 1-406 |
| కొన్ని కథలు | 10 ఉ 929 |
| కొన్ని దినములు | 1-279 |
| కొన్ని నెలలు | 1-233 |
| పెక్కు జన్మంబులు | 4-240 |
| పెక్కు దినంబులు | 7-441 |
| పెక్కు దీవనలు | 4-535 |
| పెక్కు రూపములు | 3-320 |
| బహు ప్రకారంబులు | 3-184 |

3 7.2.9 స్థల వాచక విశేషణములు

అవ్యంతకరు 4-378

3.7.3 నిష్పన్న విశేషణములు (Derived Adjectives)

ఇంచుమించుగా ద్రావిడ భాషంలో పదములన్ని ఒకే రీతిగా ఉండును కాని అవి వాక్యములందలి స్థానమునుచే భిన్న వర్గమునకు చేరి భిన్న భాషా భాగముల పనిని చేయును ఇట్టి పదములు కాలక్రమమున ప్రత్యయాంతతను పొందుట, రూపాంతరములుగా మారుట సంభవించును తెలుగు సంయోగాత్మక అవస్థలో ఉండుట వలన పై లక్షణములు ఎక్కువగా శబ్దముల రూపములందు కన్పట్టుచున్నవి అట్టి మార్పు విశేష్య, విశేషణముల భాగమున కలుగుచున్నది ఈ నిష్పన్న విశేషణములు నామ క్రియా ప్రాతిపదికలకు ప్రత్యయములు చేరుటచే కలుగు చున్నవి.

పోతన భాగవతమున ఈ నిష్పన్న విశేషణము లెంతవరకు చోటు చేసికొన్నవో పరిశీలింతము.

3 7 3 1 స్థానమును బట్టి విశేష్యములకు ముందున్న నామధాతు రూపములు విశేషణములగునని తెలుపుటకు పోతన భాగవతమున కొన్ని ప్రయోగములు

| | | | |
|---|---|---|---|
| అఖిల ధనము | 9-192 | రాచపేట | 10 పూ 377 |
| దీర్ఘశీల | 9-22 | రాసక్రీడ | 10 పూ 1085 |
| మందబుద్ధి | 3-876 | హేమకుంభము | 10 పూ 1303 |

3 7 3.2 విశేష్యములనుండి జనించిన విశేషణములు .

నామ, క్రియాధాతువుల ప్రాతిపదికలకు అంతమందు అ, ఇ మొదలగు ప్రత్యయములు చేరుటచే విశేషణములుగా మారుచున్నవి. [ఇవి ధాతువులపై వచ్చునవి గావున ధాతుజ విశేషణములు అందురు]

'-అ' ప్రత్యయము : కొన్ని అకారము చేరుటచే తుది హల్లు ద్విత్వమై తెలుగున విశేషణములుగ ఏర్పడుచున్నవి

| | | | |
|---|---|---|---|
| వల్లిచెవులు | 9-423 | పిన్నచోట | 7-11 |
| పిన్న తండ్రి | 1-320 | పిన్నవాండ్రు | 9-211 |
| పిన్నతల్లి | 4-232 | | |

వామ క్రియారూప ధాతువుల అదంత ప్రాతిపదికలకు 'వ' ప్రత్యయము చేరి దానిపై మరల 'ఇ' ప్రత్యయము వచ్చి విశేషణములుగ మారుచున్నవి

| | | | |
|---|---|---|---|
| కమ్మవి కొమ్మలు | 8-447 | వెచ్చవి గాడ్పులు | 10 పూ 716 |
| చల్లవి నీరు | 10 పూ 851 | పల్లవి దేహము | 9-732 |
| తియ్యవి పండ్లు | 8-447 | పచ్చవి పటము | 1-222 |
| పచ్చవి గటికి | 10 పూ 499 | | |
| పచ్చవి పలువ | 10 పూ 1231 | | |

-టి/-ంటి ప్రత్యయములు

| | | | |
|---|---|---|---|
| కడపటి చూలు | 8-684 | తొంటి కర్మరాశి | 10 పూ 30 |
| తొల్లిటి బాముల | 1-241 | తొంటి విధము | 10 పూ 148 |

3733 మువర్ణాంత శబ్దముల తుది నున్న మువర్ణమునకు బదులు -పు/ంపు అను వర్ణములలో నొకటి యాదేశమగుట వలన నయ్యది విశేషణమగు చున్నది ఉవర్ణాంత సమాసముల మొదటి యవయవము విశేషణమై పరుషములు పరమగునపుడు మగాగమ సరళాదేశములు వచ్చును,

'-పు/-ంపు'ల ఆదేశము :

| | | | |
|---|---|---|---|
| కడిదపు వ్రేటు | 9-569 | ప్రాయపుబాలురు | 7-212 |
| గుబ్బపు దొంగ | 9-207 | | |
| చొక్కపురక్కసికులము | 7-254 | | |
| దట్టపు దోహంబు | 1-480 | నీలంపు మెఱుపు | 8-396 |
| విక్కపు మక్కువ | 7-254 | ప్రాయంపు బాలకులు | 7-21 |

మగాగమ, సరళాదేశము

ముద్దు గుబ్బడు 10 పూ 315

పుంప్వాదేశ మగాగమ పరకాదేశములు

అచ్చపు జీకటి 7- 81 నెయ్యంపుఁజూపులు 1-248
కపపుఁగొండ 8-192 బల్లిదంపుఁదోడు 8-683
కవ్వంపుఁగొండ 8-200
కవ్వపుఁదాడు 10 పూ 355 మాంసపుఁగన్నులు 10 పూ 128
తోరపుఁబలుకుల్ 10 పూ 40

తిక్కన కవిత్వమున పు ంపుల ప్రయోగమధికము నన్నయ
వ, ంపు ల స్థానమున 'ంబు' వాడుట కలదు లక్ష్మిమందుదెన అర
3 273

కపంబు గౌరవంబు అర 1-34

తరువాతకవులు తమ గ్రంథములందు -పు/-ంపు ల నధికముగా
ప్రయోగించిరి శ్రీనాథుని ప్రయోగములలో ముపర్ణ కాంత రూపములు
కలవు.

పుట్టముచెఱంగు శృం నై 6-131

3 7 3 4 ఉదంత రూపముల కచ్చువరమైన ట్ అను విశేషణ ప్రత్యయము
సామ్యము (ANOLOGY) ననుసరించి సంధి యందాగమముగా
వచ్చుచున్నది

చిగురుటడిదము 9-27 చొక్కపుటన్నము 9-93
చిగురుటాకులు 10 పూ 609 పువ్వుటంపర 9-540
చెక్కుటద్దము 4-58

ట్ రాని రూపము

చిగురాకు 9-27

3 7 3.5 అగు, అయిన అనుశబ్దములను చేర్చుట వలన విశేష్యములు తెలు
గున విశేషణములుగా మార్పు చెందుచున్నవి

[ఎ] నామ ప్రాతి పదికకు 'అగు' ధాతువు ప్రత్యేకముగ చేరుట వలన
తద్ధర్మార్థకమగును

తిరవగువిష్ణ 4-809

దెప్పరమగు, కాలము 1-399
బెట్టిదమగు శాపము 1 480
భయంకరమగు క్షత్రధర్మంబు 4-241
విశ్వరూపుండగు హరి 10 పూ 58
సాధ్యంబగు ఫలంబు 2-84

[బి] అగుధాతువుమ'చేర్పుటచే సంఖ్యావాచకములు విశేషణములగుచున్నవి అట్టి సమయమున 'అగు'కు బదులు 'అవ' చేరుచున్నది

| | | | |
|---|---|---|---|
| రెండవ మానంబు | 7-24 | ఆఱవయేట | 10 పూ 487 |
| మూడవవాడు | 8-16 | ఏడవవాడు | 1-473 |
| నాలవవాడు | 8-18 | ఎనిమిదవ దూలు | 10 పూ.40 |
| ఐదవ యేట | 10 పూ 487 | | |

[సి] నామ ప్రాతిపదికకు 'అగు' ధాతువునుండి పుట్టిన అయిన, ఐనలు చేరుటచే భూతార్థక విశేషణ రూపములు వచ్చుచున్నవి

జనితమయిన ధరణి 8-154
అమలినంబైన పులినంబు 10 పూ 1069
విరుపాయంబైన కాలంబు 1-310
ప్రియుండైన వైకుంఠుడు 7-3
మందబుద్ధులమైన మనుష్య 1-320
విభుండైన ఈశ్వరుండు 4-86
స్వరూపంబైన తిరస్కారంబు 4-86

[డి] అగు, అయిన శబ్దములకు అట్టి ప్రత్యయము చేరుటచే విస్తారిత విశేషణము లేర్పడుచున్నవి.

విహితంబులగునట్టి వీరుడు 7-357
మహత్తరములైనట్టి కర్మంబులు 4-519

[ఇ] ఉదంత క్రియలపై అట్టి ప్రత్యయము చేరుటచే విస్తారిత విశేషణము లేర్పడుచున్నవి.

| | |
|---|---|
| ఇచ్చునట్టి దైవము | 10 ఉ 1240 |
| చంపునట్టి విరుపాయము | 1-310 |
| చేయునట్టి సత్రము | 4-37 |
| వెలుగునట్టి యజ్ఞము | 4-53 |

3736 సంధిలో మొదటి పదాంత మందలి '-ట' వర్ణము ద్విత్వటవర్ణముగా మారి విశేషణమగును

| | |
|---|---|
| కట్టలుక | 10 ఉ 501 |
| విట్టూర్పు | 4-77 |

3737 క్రియాధాతువులకు కొన్ని ప్రత్యయములు చేరుట వలన క్రియాజన్య విశేషణములు ఏర్పడుచున్నవి

వర్తమానకాలిక విశేషణములు

| | | | |
|---|---|---|---|
| ఒవరించుచున్నవారు | 4-59 | | |
| ఒప్పించుచున్నాడు | 7-185 | | |
| కమగొనుచున్నవారు | 4-101 | కోరుచున్నారము | 3-203 |
| గుఱుతుపెట్టువారు | 8-687 | | |
| చూచుచున్నవారు | 10 పూ 1350 | | |
| చేయుచున్నవారు | 1-434 | | |
| ప్రగ్గువారు | 1-278 | | |

భూతకాలిక విశేషణములు .

| | |
|---|---|
| అడిగినవారలు | 1-269 |
| అపహరించినవాడు | 10 ఉ 1234 |
| అపవర్తించినవాడు | 4-48 |
| ఎగ్గుచేసినవాడు | 3-65 |
| ఎఱిగినవారలు | 10 పూ 94 |
| పాలుందోలినవారు | 4-104 |

వ్యతిరేక విశేషణము

| | |
|---|---|
| ఎఱుగనివాని | 1-99 |
| కాననివాని | 7-345 |
| కొల్వనివారలు | 10 ఉ 1227 |
| చూవనివాడు | 1-517 |

తద్ధర్మార్థక విశేషణము

| | |
|---|---|
| చంపెడి వీరుడు | 10 పూ 154 |
| మాటలాడెడి చేడియ | 10 పూ 222 |

3 7 3 8 అవ్యయములు విశేషణము లుగ కూడ ప్రయుక్తము

| | |
|---|---|
| ఇంచుకసిగ్గు | 10 ఉ 104 |
| కడుసిగ్గు | 8-200 |

పై విధమును పరిశీలించినచో తెలుగునందలి విశేషణ రూపనిర్మాణము చాలా అసంకీర్ణమని స్పష్టముగా చెప్పవచ్చును

[1] పదమునకు ముందు ప్రయోగించుటచే విశేష్యము విశేషణముగా గుర్తింపబడుచున్నది

[2] అ, ఇ' టి/ంటి ప్రత్యయములు చేర్చుటచే విశేషణము అగుచున్నవి

[3] అగు, అయిన అనువానిని మొదటి పదము చివర చేర్చుట.
ఈ మూడు విధములను బట్టియే విశేషణము లేర్పడుచున్నవి. తక్కిన మార్పులు కాలక్రమమున పరిణామమును పొందినవని నిర్ధారణ చేయుట కాస్కారము గలదు

## 3.7.4 తర-తమ భావనిరూపణము :

ఆంగ్లమున విశేషణములలో Positive, Comparative, Superlative అను మూడు విధములైన తర, తమ ప్రణాళిక గలదు. ఆంగ్లమున Tall అను పదము విశేషణము ఇద్దరి పొడవులను పరిపోల్చి చూడవలసి వచ్చినపుడు Taller అను రూపము నుపయోగింతురు

He is taller than Rama

[అతడు రామునికంటె పొడవు కలవాడు]

He is the tallest boy in the class

[అతడు తరగతిలో అందరికంటె పొడవైనవాడు]

ఆంగ్లమునందీ ప్రత్యయములు విశేషణములపై మాత్రము చేరును. సంస్కృతమున సామాన్యమును Positive Degree అనియు, తర ప్రత్యయమును Comparative Degree అనియు, తమ ప్రత్యయమును Superlative Degree అనియు వ్యవహరింతురు సంస్కృతమున నివి విశేష్యములపై చేరును ఉదాహరణమునకు బుద్ధిమాన్ అనగా బుద్ధిమంతుడు

బుద్ధిమత్తర : అనగా ఇద్దరిలో బుద్ధిమంతుడు

బుద్ధిమత్తమ అనగా అనేకులలో బుద్ధిమంతుడు

అని అర్థము సంస్కృతమందు గల ఈ తర, తమ ప్రత్యయాంతముల ప్రయోగము తెలుగు కావ్యములలో అధిక వ్యాప్తిని పొందినది 1180 ప్రాంతమున గల పిఠాపురము శాసనములో పటుతర, ప్రియతర మొదలగు ప్రయోగములు కలవు

తెలుగున ఈ ప్రణాళిక స్వతస్సిద్ధముగా కలిగినది తర ప్రత్యయార్థమున కంటె, తమ ప్రత్యయార్థమున లో, లోపల అనువానిలో ఒకటి చేర్చుట జరుగును చిన్నయసూరి వీనినే నిర్ధారణ పంచమి, నిర్ధారణ షష్ఠి అని పరిభాషించిరి

పోతన భాగవతమున గల తర, తమ ప్రత్యయాంతముల భావ నిరూపణము, వాని స్వరూప స్వభావములను ఇంచుక పరిశీలింతము

3 7 4 1 ఇన్నన్నంతముపై తమ చేరిన "సర్వోత్కృష్టము" అను అర్థము వచ్చునని సంస్కృత వ్యాకర్తల అభిప్రాయము

కావున శ్ర+ఇష్ఠన్ గుణసంధి వచ్చి 'శ్రేష్ఠ' అను రూపము వచ్చును దీని ప్రకారము ప్రయోగమును కావించిన తెలుగు కవులలో మొట్టమొదటివాడు పోతన

క్షితిపతీ ప్రశ్నంబు శ్రేష్ఠతమంబగు 2-3

మరికొన్ని ప్రయోగములందు ఇష్టన్నంతము :

| | |
|---|---|
| దర్శనీయతముడు | 4-251 |
| పుణ్యతముడు | 3-962 |
| ప్రియతముడు | 3-561 |
| మూఢతముండు | 3-244 |

3 7 4 2. తమ ప్రత్యయమును వ్యాకరణము నిర్దేశించిన యర్థమున ప్రయోగించుటయు కొన్ని సందర్భములందు గలదని తెలియుచున్నది

పోతన ప్రయోగములు :

అగు : గరిష్ఠంబగు నీ పురాణ కథ సంక్షేపంబునం జెప్పితిన్ 2-212

లోన శీలవంతులలోన శ్రేష్ఠుండు 4-36

3.7 4 3 ఈ యస్ అను ప్రత్యయము ఆదియందచ్చును కలిగి యున్నందున విశేషణములపై మాత్రమే చేరదగియున్నది కాని ఆ ప్రత్యయాంతమునకు విశిష్ట రూపముండగా దానిని కాదని తర ప్రత్యయమును విశేషణమునకు చేర్చి సాగించిన ప్రయోగము అసంఖ్యాకముగా తెలుగు కావ్యములలో కలవు అల్ప అను విశేషణమునకు ఈ యస్ అను ప్రత్యయము చేరగా అల్పీయస్ అను రూపము నిష్పన్నమగును హలంత రూపమునుగాక అల్ప తర రీతిని అల్ప తరమ చేర్చి అకారాంత రూపమును కవుల సంఖ్యాకముగా పోతన ప్రయోగించెను [2]

| | |
|---|---|
| అల్పతరమైన సుఖముల నందుచు | 3-263 |
| మందబుద్ధి బలులల్పతరాయువులు | 1-44 |

2 డా॥ శాస్త్రి సూర్యనారాయణ తెలుగు కవుల సంస్కృత ప్రయోగములు పేజీ 44

గరీయన్ అను ఈ యనంతమునకు బదులు గురుతర అతితర ప్రత్య యాంతమునకు పోతన భాగవతమున ప్రయోగములు గలవు

గురుతర వృత్తితో మెలగు కోవిదుడు 7-424

గురుతరానేక కల్యాణ గుణ విశిష్టుడనగ నొప్పు 3-963

3744 విశేష్య విశేషణములందు రేఫము చివరగల నామము తర ప్రత్యయము చేరుటచే రేఫల ద్వయము పదమునకు సొగసును, ఉచ్చారణలో శ్రుతి మధురత్వమును చేకూర్చును

విశేష్యములందు.

అస్థిరతర తుచ్ఛ సౌఖ్యములు సేకుఱుటల్ 3-441

ఉగ్రతర తాపసముందెగి చేయరు 4-788

తర సహస్రమున భీకర తరాసి, తర 10 ఉ 434

చిరతర జ్ఞాన విద్యాభ్యాసిగాకున్న 4-587

విశేషణములందు :

భారతర ధర్మరాశికి భారకుడగు 1-53

భూరితర చరాచర భూత సృష్టిఁజేయుట 2-261

సింధుర భంజన పూరిత, బంధుర తర కంఠ

నినద భారమొసర 10 పూ 1539

3745 రేఫకు సజాతీయములైన ద, శ, ల అనునవి పూర్వపదములో ఉన్న తర ప్రత్యయములు

ద : చందతర విశ్వాసంబుతో 10 పూ 40

చందతర పాయక సంపదఁజూపి 10 ఉ 283

శ : తరళతర ధూమకేతు పతాక లొసఁగ 3-808

బహుతరంబైన బంధంబు 7-464

ల : చటులతర కాలపాశవశంగతాత్ముడగుచు 3-983

పీలతర పీఠికలందు 10 ఉ 115

పటుచటుల తరమగు పిడికిట 10 పూ 736

పై విధముగా తర, తమ ప్రత్యయములు ప్రయోగింపబడినవి.

## 3.8.0. లింగము (GENDER) — వచనము (NUMBER)

భారతదేశీయ భాషలకు పెంపుడుతల్లి వంటిదైన సంస్కృతమున లింగము మూడు విధములుగ విభజింపబడినది 1 స్త్రీలింగము 2 పుంలింగము 3 నపుంసకలింగము ఈ మూడు లింగములును శబ్దధర్మాశ్రయములే కాని అర్థధర్మాశ్రయములు కావు సంస్కృతమునందు స్త్రీవాచకములు స్త్రీలింగములు, పురుష వాచకములు పుంలింగములు, తక్కిన జడవాచకములు నపుంసక లింగములు కావలెనను సూత్రములేదు ఒకే అర్థమును బోధించు కళత్రమ్, దారా భార్యా శబ్దములలో మొదటిది నపుంసకము, రెండవది పుంలింగము, మూడవది స్త్రీలింగములుగా నిరూపింపబడినవి శబ్దముల చివరలను గూర్చి, వానికి చేరు విభక్తి ప్రత్యయములను బట్టి సంస్కృతమున లింగమును నిర్ధారింపవచ్చును. కనుక సంస్కృతమందు లింగము శబ్దాశ్రయమే కాని అర్థాశ్రయము కాదు

ద్రావిడ భాషలలో ప్రాచీనమైన తమిళమందు లింగము రెండు విధములు 1 ఉయర్‌తిణై [ఉన్నత జాతి] మనుష్యులు, దేవతలు, నరకవాసులు అనువానికి చెందిన శబ్దములు 2. అ . ఱిణై [అల్+తిణై] అన్యములు

(అవి కాని జాతి, వీనికి భిన్నమైనవి]

అనగా ఉయర్‌తిణై కాక తక్కినవని తాత్పర్యము.

ఉయర్‌తిణై లోనే ఆణ్‌పాల్ [పుం వాచకము] పెణ్‌పాల్ [స్త్రీవాచకము] అను విభాగము కలదు ఇదియును ఏకవచనమున మాత్రమే పలర్‌పాల్ [మహన్మహతీ బహువచనము] బహువచనమున నిట్టి భేదము లేదు. ఆణ్‌పాల్ అనగా పుంవాచక భాగము, పెణ్‌పాల్ అనగా స్త్రీవాచక భాగము వీనిని తెలుగు లాక్షణికులు- పరిభాషించిన మహద్వాచకము మహతీ వాచకము అనువానితో పరిపోల్పవచ్చును మహన్మహతీ వాచకము గాక తక్కినవి అ ఱిణై విభాగమునకు చెందినవని పేర్కొనవచ్చును అనగా ఈ విభాగము తెలుగునందలి మహతీతరా మహద్వాచకములకు సమ్మగ సరిపోవును

ఉదా॥ ఆణ్‌పాల్ : అవన్, ఇవన్, యావన్, ఇలక్కుమణన్ మొదలగునవి ఈ కోవకు చెందినవి

పెణ్‌పాల్ : అవళ్, ఇవళ్, యావళ్, మగళ్ మొదలగునవి

అ॥ టిణై : అదు, ఇదు, అవయ్, ఇవయ్ ప్రభృతులు

ఏకవచనములో మహద్వాచకములొక వర్గము. అమహద్వాచకము లింకొక వర్గము

బహువచనమందు మహన్మహతీ వాచకములొక వర్గము, మహతీతరా మహద్వాచకములు ఇంకొక వర్గము

ప్రాచీన ద్రావిడ భాషలో లింగవచన బోధక ప్రణాళిక లేదని విజ్ఞుల యభిప్రాయము ద్రావిడభాషా వికాసమున మొట్టమొదటి పుంవాచకములు, భూత ప్రేత పిశాచ రాక్షసములతో మానవ పురుషులు కూడ చేరినవి ఒక వర్గము తక్కినవి రెండవ వర్గముగా గుర్తింపబడినవి అనంతర దశలో శబ్దముల అర్థమును బట్టి తెలుగున లింగ ప్రణాళిక ఆధారపడి యున్నది

కన్నడ సంప్రదాయమును తెలుగుభాష కల్గియున్నను కొంత భేదమిందు గలదు శబ్దములన్నియు రెండు విధములు [1] మహద్వాచకములు

[2] అమహద్వాచకములు స్త్రీ తిర్యగ్జడములు, తద్విశేషణములు అమహద్వాచకములు మిగిలినవి మహత్తులు. వీనిని చింతామణి కూడా అంగీకరించెను చిన్నయసూరి 'స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు'[1] నని పేర్కొనెను దీనిని బట్టి స్త్రీ, తిర్యక్కులు, జడములు, వాని విశేషణములు అమహత్తులనియు ప్రత్యేకముగా స్త్రీలను తెలుపునపుడు మహతీవాచకములనియు, స్త్రీతిర్యగ్జడ భిన్నంబులు వాని విశేషణంబులు మహద్వాచకములనియు స్పష్టముగా తెలియుచున్నది తెలుగున పై వాచకములనామ ధాతువులకే లింగబోధక ప్రత్యయములు చేరుట సామాన్య లక్షణము [స్వాభావికము] కాని కొన్నిచోట్ల లింగవచన ప్రత్యయములు చేరని ప్రయోగములు కలవు ఉదా అన్న, అమ్మ,

1 బా వ్యా తత్స. 17.

తండ్రి మొదలగునవి శబ్దములకు ముందును, వెనుకను కొన్ని పదములు చేర్చుటచేత స్త్రీ పురుష భేదము తెలియుచున్నది

ఉదా . ఆడుమనిషి, మగకుక్క మొదలగునవి

పోతన భాగవతమున గల లింగబోధక స్వరూపమును పరిశీలింతము

3.8 1 లింగ బోధక ప్రత్యయములు చేరిన భాగవత ప్రయోగములు :

మహద్వాచకము :

| | |
|---|---|
| అన్న | 7-92 |
| తండ్రి | 1-79 |
| బావ | 10 పూ 51 |

మహతీవాచకము ·

| | | | |
|---|---|---|---|
| అక్క | 9-592 | తల్లి | 1-119 |
| అమ్మ | 1-506 | | |

కాలక్రమమున సంస్కృతము వ్యవహార దూరమై ప్రాకృతములు ఏర్పడునాటికి ఆ భాషా వ్యవహర్తలలో ద్వివచనములోపించి ఏక వచన, బహువచనములే నిలిచినవని పరిశోధకుల నిర్ధారణము ఆర్య భాషాజన్యములైన ఉత్తర భారతీయ భాషలలో వచనములు రెండుగా స్థిర పడినవి ఏకవచనము, బహువచనము

అతి ప్రాచీన దశలో మూలద్రావిడములో వచన వ్యవస్థ లేదనియు క్రమ క్రమముగ ఏర్పడినదనియు పరిశోధకుల నిరూపణము ఏకవచన, బహువచనములను రెండు విభాగములే నాటికి నేటికి కన్పట్టుచున్నవి

ద్రావిడ భాషలలో ప్రాచీన మనదగు తమిళయందు ఏకవచన, బహువచనములవి రెండు విధములు ఏక వచనము మూడు రకములు

1 అవ్‌పాల్ : మహదేక వచనము

2 పెణ్‌పాల్ మహత్యేక వచనము

3 ఒన్ఱన్‌పాల్ , మహతీతరా మహద్వాచకము

బహువచనము రెండు విధములు .

1 పంఠర్‌పాల్ మహన్మహతీ బహువచనము

2 పంఠిన్‌పాల్ మహతీతరామహద్బహు వచనము

వచన వివేచనమునందు సంస్కృతమునకు, ద్రావిడ భాషలకు సంబంధము లేదు తెలుగునందలి వచనము మహత్తులను ఆశ్రయించి ఉండును తెలుగునందు వచనములు రెండువిధములు

1 ఏకవచనము . ఒక వస్తువును లేక ఒక వ్యక్తిని గూర్చి తెలుపునది

మహతీత రామహద్వాచకము

| | |
|---|---|
| కను | 1-119 |
| కమ్న | 4-40 |
| కొంద | 10 పూ 920 |

3 8 2 లింగ బోధక ప్రత్యయములు చేరిన పోకన ప్రయోగములు :

మహద్వాచకము -(డు ప్రత్యయము.

| | |
|---|---|
| అల్లు(డు | 10 పూ 150 |
| కముక్డు | 10 పూ.465 |
| కుమారు(డు | 4-304 |
| పురుషు(డు | 3-238 |

మహతీవాచకము అలి, -అలు, -ఆలు :

| | | |
|---|---|---|
| -అలి | కోమలి | 7-61 |
| -అలు | చెలియలు | 7-19 |
| -ఆలు | ఇల్లాలు | 2-53 |
| | కొమరాలు | 9-72 |
| | చూలాలు | 9-582 |
| | జవరాలు | 9-72 |
| | ప్రియురాలు | 10 ఉ 226 |

| | | |
|---|---|---|
| -కత్తియ | చెలికత్తియ | 9-25 |
| -కత్తె | వేడుకలకత్తె | 9-381 |
| -తె | ఒక్కతె | 4-7 |
| -బోడి | పువ్వుఁబోడి | 10 పూ 1730 |
| | మెఱుగుఁబోడి | 10 పూ 110 |
| -వతి | గుణవతి | 10 ఉ 126 |

మహతీతరా మహద్వాచకము.

| | | |
|---|---|---|
| -ంబు | జూదంబు | 3-17 |
| | ధర్మంబు | 4-515 |
| -ము | కాలము | 1-210 |
| | దుఃఖము | 4-922 |
| -మ్ము | పీఠమ్ము | 4-97 వాలమ్ము 9-410 |

3 8 2 1 -అడు, -కాడు, -వాడు మొదలగు పదములు నేరు పురుష వాచకములుగా తద్ధిత ప్రత్యయములుగా వాడబడుచున్నవి

| | | |
|---|---|---|
| -అడు | కోరఁడు | 1-486 |
| | చిక్కఁడు | 10.పూ 383 |
| | నేరఁడు | 9-188 |
| -కాడు | : పగయకాఁడు | 10 ఉ 751 |
| | విలుకాఁడు | 10 పూ 1057 |
| -వాడు | అదరువాఁడు | 8-87 |
| | అలరువాఁడు | 3-537 |

3 8 2 2 మగకు తనము చేర్పుటవలన లింగ భేదము నిరూపింపబడుచున్నది.
మగతనము 8-131

## 3 8.3 వచనము (NUMBER)

సంస్కృతమున మూడు వచనములు గలవు అవి ఏకవచనము, ద్వివచనము, బహువచనము ఆర్య భాషా వ్యవహర్తలు వృష్టియందు జంటలుగా నున్న చేతులను కన్నులను పాదములను మొదలగువానిని గాంచి వానిని ఏకముగా నున్న వానికంటె భిన్నముగా తలంచిరనుట

2 బహువచనము రెండు అంతకంటె ఎక్కువ వస్తువులను గాని ఇద్దరు అంతకు ఎక్కువమంది వ్యక్తుల మధ్దేశించి తెలుపునది

ఏకవచనమున లింగవచన ప్రత్యయములు కొన్నిచోట్ల చేరుట, మరికొన్నిచోట్ల చేరకపోవుట కలదు

బహువచనమున విధిగా ప్రాతిపదికకు ప్రత్యయములు చేరును ఏకవచనమున నామరూపములం ప్రాతిపదికలకు లింగ బోధక ప్రత్యయములు చేరకపోవుట చేరుటను పద్ధతిని లింగము ప్రకరణమున వివరింపబడినది పోతన భాగవతమున గల వచన ప్రత్యయముల పరిశీలింతము గ్రంథ విస్తరణ భీతిచే ఉదాహరణములను ఒకటి రెండుకు మించి ఇచ్చుటలేదు

### 3.8.3.1 -ము ప్రత్యయము

ఆత్మార్థక సర్వనామ, ఉత్తమ పురుష బహువచనములందు వాడబడుచున్నవి

ఉత్తమ పురుష బహువచనము :

| | | |
|---|---|---|
| ఏము | 7-148 | |
| మేము | 3-435 | |
| మముఁ | 4-717 | ముద్వితీయరూపము కూడ గలదు. |

ఆత్మార్థక సర్వనామములు :

| | |
|---|---|
| తాము | 2-133 |

### 3.8 3.2. -డు ప్రత్యయము :

ఏకవచనము ప్రయుక్తము

| | |
|---|---|
| కొడుకఁడు | 10 ఉ 32 |
| పావఁడు | 9-626 |
| బిడ్డఁడు | 9-474 |
| పాపకర్ముఁడు | 10 ఉ 15 |

### 8.8.3.3. -లు ప్రత్యయము .

లువర్ణంబు బహువచనంబు[2] అని సూరి సూత్రీకరించెను నన్నయ భారతమునందును, చింతామణి యందును పరిశీలించినను లువర్ణము బహువచనమే లింగవచనములతో సంబంధము లేకుండ లు ప్రత్యయము అన్నింటియందును బహువచనముగా ప్రయుక్తమగును. పోతన భాషలో గల -లు ప్రత్యయము వాని రూపాంతరములను గమనింతము.

1 అ/-ఉ వర్ణాంత నామప్రాతిపదికలు బహువచన ప్రత్యయమైన లు-చేరునపుడు మార్పును పొందవు

**మహద్వాచకము :**

| | |
|---|---|
| కొడుకు>కొడుకు-లు | 9-481 |
| గురువు>గురువు-లు | 8-646 |

**మహతీ వాచకము**

| | |
|---|---|
| అత్త>అత్తలు | 10 పూ.992 |
| అబల>అబల-లు | 10 పూ 997 |
| ముదిత>ముదిత-లు | 10.పూ 1086 |
| ముద్దియ>ముద్దియ-లు | 3-988 |

**మహతీతరా మహద్వాచకము**

| | |
|---|---|
| ఎగ్గు>ఎగ్గు-లు | 10 పూ 3[illegible]2 |
| కాయ>కాయ-లు | 10 పూ 496 |
| కుక్క>కుక్క-లు | 3-604 |
| గోడ>గోడ-లు | 9-324 |
| చూపు>చూపులు | 10 పూ 1711 |
| మంట>మంటలు | 3-988 |

2. నామప్రాతిపదికల అంతమందు డు-వర్ణము ఏకవచనమున రాగా బహువచనమున లు ప్రత్యయము వచ్చును

---

2. బా. వ్యా తత్స 12

అస్త్ర-డు→అస్త్రులు 4-283

కుమార-డు→కుమార-లు 9-480

కమ్మి-డు→కమ్మి-లు 8-596

నృప-డు→నృపులు 1-225

ఇదంత ప్రాతిపదికలకు బహువచనమైన -లు పరమైనపుడు -ఇ వర్ణస్థానమున ఉ వర్ణము వచ్చును ఇత్తునకు బహువచనంబు పరంబగునపుడు ఉత్వంబగు[3]నని సూరి సూత్రీకరించెను

మహద్వాచకము :

మఱది→మఱదులు 10.పూ 976

మహతీ వాచకము :

చెలి→చెలులు 7-55

మహతీతరరా మహద్వాచకము :

కోర్కి→కోర్కు-లు 3-656

చెవి→చెవులు 9-423

దొంతి→దొంతులు 3-415

విభక్తి పరంబగునపుడు గోయి ప్రభృతుల తుది యక్షరంబు తివర్ణంబగు[4]నని సూరి పేర్కొనెను

చేయి→చేతులు 10 ఉ 436

4. బహువచనంబు పరంబగునపుడు రేయి ప్రభృతుల తుది యక్షరంబు లోపించు[6]నని సూరి సూత్రించెను

రాయి→రాలు 10 ఉ 555

---

3 బా. వ్యా తత్సమ 45

4 బా. వ్యా అచ్చిక 35

6. బా. వ్యా అచ్చిక 21

5 బహువచనము పరంబగునపుడు -ద, -ల, -ట, -ర ల యుత్వంబు నకు లోపంబు బహుళంబుగానగు[7]

పండు · పండ్లు 9-196
కాలు : కాళ్ళు 8-202
చీకటి · చీకట్లు 10.ఉ 425
ఎదురు · ఎదుళ్ళు 10 పూ 464

ఔప విభక్తికంబుల లివర్ణ వంబు వర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణంబు బహుళంబుగానగు[8]

వాకిలి>వాకిలు-లు>వాకిండ్లు 9-327

7. బహువచన శ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన దకార లకారంబు లకు అఘు అకారంబు వికల్పంబుగనగు[9]

క్రొమ్మడి>క్రొమ్మళ్ల 10 ఉ 803
పడపడి>పడపడులు>పడపళ్ల 10 పూ 3
వాడు>వాడులు>వాళ్ల 9-378
చెక్కిలి>చెక్కిళ్లు 7-411

8 పోతన భాగవతమున పొల్లుతో కూడిన అంతరూపములు కనిపించు చున్నవి

గొల్లల్ 10 పూ.900
నేరుపుల్ 10 పూ 1459
వేలుపుల్ 8-159
మఱదుల్ 10 పూ 976

9. లు, లు, న-లు పరంబగునపుడు ద్రుతాంతేతర ముగాగమంబునకు లోపంబును దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాషనగు[10]

చుట్టము+లు - చుట్టాలు 10.పూ 1642

---

7. బా. వ్యా. అచ్చిక 12
8. బా వ్యా అచ్చిక 16
9. బా వ్యా. తత్సమ 43
10. బా వ్యా. తత్సమ 43

10 కలన్వాదుల సువర్ణంబుకు ణగు, బహువచనము పరంబగునపుడు నిత్యముగానగు[11]

తెలను తెలంకులు 10 పూ 1082

11 సమాస పదంబునందు సంయోగంబు పరంబగునపుడెల్లచో ఖండ బిందువునకు పూర్ణంబగు[12]

3 8.3 4 -రు ప్రత్యయము

మహద్వాచకము

1 సగళాదుల బహువచన లకారంబునకు రేఫంబగు అల్లుఁడు>అల్లురు 4-283

2 కొన్ని డుమంతంబుల బహువచన లకారంబునకు రేఫంబును దానికి ముందు పూర్ణబిందుపూర్వక దకారంబునగు [14]
అల్లుఁడు>అల్లుండ్రు 10 పూ 1511

3 అదంతంబయి దీర్ఘపూర్వలోపధంబయిన మహత్తుమీది విభక్తి లకారంబునకు రేఫంబగు[15]నని సూరి సూత్రీకరించెను

బాలురు 10 పూ 441

4 ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును ముందరి అవర్ణంబునకు బిందుపూర్వక దకారంబగు[16]

ఇల్లాలు > ఇల్లాండ్రు 1-332
కోడలు 7 కోడండ్రు 8-486
చెల్లెలు 7 చెల్లెండ్రు 8-470
వెలయాలు 7 వెలయాండ్రు 9-417
జవరాలు 7 జవరాండ్రు 9-58

---

11. బా వ్యా అచ్చిక 18
12 బా వ్యా అచ్చిక 15
13 బా వ్యా అచ్చిక 5
14 బా వ్యా అచ్చిక 6
15 బా వ్యా. తత్సమ 38
16 బా వ్యా అచ్చిక 11

5. సర్వనామములలో .

| | | | |
|---|---|---|---|
| వాఁడు | వారు 4-326 | వాండ్రు 9-24 | |
| వీఁడు | వీరు 3-704 | వీండ్రు 10 పూ 1522 | |

6 సంఖ్యా వాచకములు

1 అపదాద్యంబయి యసంయుక్తంబయిన గ కారంబునకు 'వ' కారంబగు'[17]

| | | | |
|---|---|---|---|
| పదుగురు | 1 347 | పదువురు | 2-124 |
| ఏగురు | 10 పూ 1566 | ఏవురు | 1-376 |

సంయుక్తతలో 'గ' కారమునకు కొన్నియెడల 'వ' కారము వచ్చును

| | | | |
|---|---|---|---|
| అర్గురు | 10 పూ 496 | అర్వురు | 4-679 |
| మార్గురు | 9-699 | మార్వురు | 9-703 |

ద్విత్వగ కారమునకు ద్విత్వవకారము వచ్చును

| | | | |
|---|---|---|---|
| ముగ్గురు | 9-165 | మువ్వురు | 1-320 |

దీనిని పరిశీలించిన 'వ' కారము ప్రాచీన రూపము [వురు]
'గ' కారము పరిణత రూపము [గురు]

2 రు, రవర్ణకంబులు పరంబులగునపుడు కొన్నింటికి నిత్యముగాను కొన్నింటికి వైకల్పికముగాను బిందు పూర్వక ద కారంబులాగమంబగు [18]

| | |
|---|---|
| ఎనమండ్రు | 9-722 |
| ఏడండ్రు | 9-172 |
| తొమ్మండ్రు | 9-722 |
| పెక్కండ్రు | 10 పూ 1598 |

---

17 బా వ్యా అచ్చిక 27

18 ప్రౌఢ వ్యా శబ్ద 93

3.8.3 5 'ఱ' ప్రత్యయము .

1, కా ప్రత్యయంబు మీది బహువచన అకారంబునకు అప్పుల మురేఫంబులును అవు రేఫంబునకు ముందు బిందు పూర్వక మగు దకారంబునగు [19]

చెలికాండ్రు 8-646

2 నిర్దేశక విశేషణముల నుండి ఉత్పన్నించిన సాముదాయిక విశేష్యములు

అందఱు 3-97

ఇందఱు 8-306

కొందఱు 4-118

3 8 3 6 పోతన భాగవతమున మిడుగురు శబ్దముపైని వర్ణము పరమగు నపుడు సంయుక్తమ రాని రూపము, వచ్చిన రూపము కనిపించుచు సంయుక్తతలో సాధు రేఫము, లేనపుడు శకట రేఫము వచ్చు చున్నది

మిడుగురు మిడుగుర్లు 3-662

మిడిగుఱులు 3-603

3 8 3 7 పోతన భాగవతమున గల విశ్వ బహు వచనములు

అందఱు 3-97 [బహ్వర్థకము]

ఇందఱు 8-306 [బహ్వర్థకము]

కొందఱు 4-118 [కతిపయార్థకము]

## 3.9 0 నామ విభక్తి ప్రత్యయములు - రూపనిష్పత్తి

## (Case Suffixes and Derivation)

నామ శబ్దము చింతామణి యందు కేవల ప్రాతి పదికము అను అర్థ మున వాడబడినది ఆంగ్లమున NOUN [1] అను పదము కలదు దీనికి నామవాచకము అను పేరు కూడ వాడుచున్నారు ఎట్టి ప్రకృతికైనను ప్రత్య

---

19. బా. వ్యా అచ్చిక 7

1. A Noun is the name of a person, place or a thing, wren and Martin Grammar

యము చేర్పకయే ప్రయోగింపరాదు. సంస్కృతమున ప్రథమా విభక్తి ప్రత్యయమును చేర్చి [రామ+సు] రామ అను రూపమును ప్రయోగించుచున్నారు ఒకప్పుడు ప్రాతిపదిక ప్రథమా విభక్తి ఏకవచన రూపము అభిన్నమైనచో ప్రథమా ప్రత్యయము వచ్చి లోపించినదని శాస్త్రకారుల రూపనిష్పాదన క్రమము లోని ఒక రీతి ఇది సంస్కృత వ్యాకరణ మర్యాద

తెలుగున శబ్దములకు ప్రథమా విభక్తి ఏకవచన ప్రత్యయము లేకయే ప్రాతిపదికతుల్యములనే వాడుదురు ఉదా అన్న, అమ్మ, కన్ను, కాలు, తండ్రి, తల్లి, రాయి, చెట్టు మొదలగునవి నామ ప్రాతిపదికలపై చేరు ప్రత్యయములను నామ విభక్తి ప్రత్యయములందురు

తెలుగు వ్యాకర్తలు నిర్దేశించిన నామ విభక్తి ప్రణాళిక తెలుగు భాషా నిర్మాణమునందలి నిసర్గ రీతికనుగుణమైనది కాదు సంస్కృత భాషా వ్యాకరణ మర్యాదలను ఆమూలచూడముగా ఆకళించుకొనిన తెలుగు శాస్త్రకారులు సంస్కృత మర్యాదానుసారముగా తెలుగునందలి నామ విభక్తి ప్రణాళికను రూపొందించిరనుట స్థితి స్థాపకాంశము సంస్కృత భాషలోని విభక్తి విధానము ఆధారముగా ఆయా అర్థములు గల విభక్తి ప్రత్యయములను, ప్రత్యయ స్థానీయములైన ప్రత్యేక పదములను వేర్పరచి వానినే విభక్తి ప్రత్యయములుగా పేర్కొని సప్తవిధ విభక్తి ప్రణాళికను తెలుగు వ్యాకరణ కారులు ప్రదర్శించుట జరిగినది అనుకరణ పారవశ్యములో తెలుగు భాషా తత్త్వము పూర్తిగా విస్మరింపబడినది వాస్తవముగా సప్త విధ నామ విభక్తి ప్రణాళిక తెలుగు తత్త్వమునకు అతుకదు లింగ వచనములనుబట్టి సంస్కృతమున ప్రత్యయములు మారుట నిసర్గలక్షణము తెలుగున ఈ భేదము కన్పట్టదు అయినను ప్రాచీనాంధ్ర లాక్షణికులు నిర్దేశించిన క్రమమున పోతన భాగవత భాగమున ప్రయుక్తమైన విశేషములు సోదాహరణముగా దిగువ నిరూపింపబడుచున్నవి

### 3.9.1 ద్వితీయాది విభక్త్యంగ నిర్మాణము

(Formation of the oblique stem)

ఇ, టి, తివర్ణంబులు విభక్తి నిమిత్తంబులయి యాదేశాగమాత్మ
కంబులయినవి యౌపవిభక్తికములనంబడునని చిన్నయసూరి మతము
వీనినే అధర్వణుడు ఉపవిభక్తులనివ్యవహరించెను ఇట్టి ఉపవిభక్తులు

చేరునట్టి ప్రకృతులకును ఔప విభక్తికంబులని వ్యవహారము కలదు. టి, ంటి మొదలగు వర్ణములు ఔప విభక్తిక సంజ్ఞ కలవిగా నాంధ్ర భాషయందు గలుచున్నవి యని చింతామణి సూత్రీకరించెను

పై విధముగా నేర్పడిన ఇ.టి, తి, ంటి అను వర్ణములు అంత మందుగల రూపములన్నియును ఔపవిభక్తికముల యొక్క ద్వితీయాది విభక్త్యంగములుగా నేర్పడి ఇ, టి, తివర్ణంబులు ప్రత్యేకముగా వైయా కరణులచే గుర్తింపబడినవి ఈ ఔపవిభక్తికములు-అనౌప విభక్తికములు గను, అనౌప విభక్తికములు ఔపవిభక్తికములుగను మారుట జరిగియుం డును. ఔప-విభక్తికమైన ప్రకృతి రూపము ద్వితీయాది విభక్త్యంగమువలు చేయును. పోతనభాషలో గల ద్వితీయాది విభక్త్యంగమున చేరిన ఔప విభక్తికముల ప్రకృతిస్వరూప వ్యాపములను పరిశీలింతము.

3.9 1.1 ఔపవిభక్తికములు : (Inflexional Increments)

ఏకవచనము .

-ఇ- : ఏరి-కిన్ [< ప్రథమ : ఏరు] 3-755
ప్రియురాలివలన [< ప్రథమ : అలు] 10 పూ 481
చూలాలి-వి [< ప్రథమ అలు] 9-640
చోటి-కి [< ప్రథమ : చోటు] 2-129

-టి- : అప్పేటికిన్ [< ప్రథమ : పేడు] 10 పూ 1719
ఇనూ్నటి-కి [< ప్రథమ · ఇనూ్నఱు] 10 పూ 21
రెంటి-విం [< ప్రథమ : రెండు] 1-414
మున్నీటి-లోపల [< ప్రథమ : నీఱు] 8-175

-ంటి- : అఱింటి-వి [< ప్రథమ : అఱు] 1-328
ఇంటి-కి [< ప్రథమ : ఇల్లు] 10 పూ 115
ఏడింటి-గూర్చి [< ప్రథమ : ఏడు] 10 ఉ.126
ఏడింటి-వి [< ప్రథమ : ఏడు] 10 పూ 17
ఏవింటి-లోపల [< ప్రథమ : ఏమ] 7-19

-తి-

మాతి-లోపలం [<ప్రథమ . మాయి] 7-142

మాతి-లోపలికి [<ప్రథమ . మాయి] 9-568

బహువచనము :

సార్వనామిక రూపములలో

: వారి-కి [<ప్రథమ : వారు] 7-20

వారి-తోడ [<ప్రథమ . వారు] 10 ఉ 572

వీరి-కిన్ [<ప్రథమ . వీరు] 3-704

అ- : ఇ, టి, తి అనువాని యందు 'ఇ' వర్ణము సామాన్యము. ఇక తృతీయాది విభక్తులందు 'అ' వర్ణము వచ్చునని వైయాకరణులు వివరించిరి

కరల - చేత 1-297

క్రేపుల - తోడ 10-పూ 170

జగముల - కున్ 1-112

తోయముల - లోపల 4-648

యాదవుల - వెంట 3-86

లోకుల చే 1-304

వేదుకల కొఱకున్ 10 పూ 727

3.9.2. ప్రథమాది విభక్తుల నిర్మాణము .

(Formation of oblique cases)

3.9.2.1. ప్రథమా విభక్తి ·

పోతన భాగవతమున కనిపించు ప్రత్యయములు

-డు/ -ము/ -వు/ -లు/ -రు/

-ండ్రు/ -ళ్ళు

-డు ప్రత్యయము · ఏకవచనము

అదంతములపై :

కొడుకఁడు :

కొడుకఁడు నా పొదిగిటిలో, జెడిపోయిన వాఁడమంది 10.ఉ 32

పావఁడు :

వట్టిపురాజా ఏ మగడు పావఁడు వచ్చిన నెక్కుడు 9-626

బిడ్డడు :

అర్ధము పెన్పక కదపటి, బిడ్డడు రాముండు 9-474

మాదుకఁడు :

చదువుల మాదుకఁడు గూరుకఁ జదువుల 8-715

ముద్దుఁగుఱ్ఱడు :

"... అమ్మాయీ ముద్దుఁగుఱ్ఱఁడెవ్వడె చెపుమా 10 పూ 315

ఉదంతములపై :

తక్కరుఁడు : చదువుల తక్కరుఁడు పొచ్చె 8-715

పాపకర్ముఁడు :

పాపకర్ముఁడు వీఁడు వచ్చిటఁ బట్టితెచ్చిన లేచి 10 ఉ 15

-ము ప్రత్యయము :

అచ్చతెనుగు శబ్దములు తలచగ పుంవచనంబులను, క్లీబ వచనంబులను వచనములచేత వీనియందుఁ గొన్ని శబ్దములు మువర్ణాంతములు సాధారణముగా నున్నవియే యనుట నిశ్చయము ఈ మువర్ణమునకు నేఁడు వాడుకలో ము, ంబు, మ్ము అను రూపములు కలవు

కాలము 1-210

మోహము 1-223

సత్యము 2-3

'-ంబు' :

కర్మంబు 1-174

నాదంబు 3-17

దావంబు 8-580

పాపంబు 4-279

-మ్ము :

హితమ్ము : 4-97

వాలమ్ము : 9-410

-వు ప్రత్యయము 'ఉ'కారాంత గో శబ్దముతో కంతట వువర్ణకమైనది
వని సూరి సూత్రీకరించెను

గోవు : పాయని వేడ్కతో నువికివట్టుంతుం ఆని గోవు లెల్లన్
10 పూ 519

-లు ప్రత్యయము లువర్ణంబు బహువచనంబు అను సూరి సూత్రము
ప్రకారము నేటి తెనుగున బహువచనార్థమున వాడ
బడు ప్రత్యయము 'లు' అనునది వన్నయ కాల
మును బట్టి చూచినను, చింతామణిని బట్టి పరిశీలించి
నను లువర్ణమే బహువచన ప్రత్యయ మనుట
నిస్సంశయము.

మహద్వాచకము :

అంత గోపకులు గోవుల వారింప నలవిగాక 10 పూ 524
వెలచి నలుమాటుఁ బాడెడి విప్రభటులు 8-636

మహతీ వాచకము :

కనక పీఠములపైఁ గొరవకాంతలు గుసుమవర్షంబులు గోరి 1-234
ంత గోపకాంతలంతయు గని రోదనంబులు మాని 10 పూ 276

మహతీతరా మహద్వాచకములు .

దారు ప్రసన్న వక్త్రాద్రిరుల లోచనములు గల్గి 3-879
అనంత్యంబులగు మూకలుగట్టి 10.ఉ.1105

-లు ప్రత్యయ రూపాంతరములు :
-ర్ :

మహద్వాచకము :

| | |
|---|---|
| కంద్రుర్ | 9-215 |
| మలదుర్ | 10 పూ 976 |
| పుణ్యాత్ముల్ | 8-71 |

---

2 దా వ్యా కల్ప 48

3. దా వ్యా కల్ప 12

మహతీ వాచకము .

| | |
|---|---|
| ఇంతుల్ | 10 పూ 829 |
| మగువల్ | 10 పూ 993 |

మహతీతరా మహత్తులు :

| | |
|---|---|
| మాటల్ | 1-220 |
| వాయువుల్ | 8-117 |

-రు :

| | |
|---|---|
| అల్లురు | 4-823 |
| నగతురు | 10 పూ 71 |
| బాలురు | 10 పూ 441 |

ప్రథమా విభక్తి బహువచన రూపమైన మల్లులు అను రూపము నిర్ధారక ప్రయోగములలో కనిపించును 'మల్లులతో రిపుమానవ భల్లులతో' [10 పూ 340] అను శబ్దాలంకార విన్యాసమునుబట్టి ఇక్కడ మల్లులు అను రూపము కవి హృదయానుసారి యని నిర్ణయింపవచ్చును మల్లుడు నగరాది గణములలోలేదు నూచల్లిదము క్రింద దూలిని మల్లులు లేరెందు ధరణీ మండలమందున్ 10 పూ 1339 కాని ముద్రిత ప్రతులలో -రు- కనిపించుచున్నది

అంచితవజ్రసారులు మహాద్రి కఠోరులునైన మల్లురన్ 10 పూ 1350

ఈ మల్లురకున్ ఓచెల్లి యీడుగాదని 10 పూ 1351

అనునవి నిర్ధారక ప్రయోగములు కావు

-ండ్రు .

మహద్వాచకము :

| | |
|---|---|
| చెలికాండ్రు | 8-646 |
| తరిగాండ్రు | 8-205 |

మహతీ వాచకము :

| | |
|---|---|
| ఇల్లాండ్రు | 1-332 |
| కోడండ్రు | 8-486 |
| చెల్లెండ్రు | 8-470 |
| అవరాండ్రు | 9-58 |

-ళ్ళు :

ఎదుళ్ళు 10 పూ 464　　క్రొమ్ముళ్ళు 10 ఉ 803

మొగిళ్ళు 9-34

## 392.2. ద్వితీయా విభక్తి ।

పోతన భాగవతమున ప్రయోగించిన ద్వితీయా విభక్తి ప్రత్యయములు

ఏకవచనములు - -న్/ -ని/ -నిన్/ -ను

బహువచనము -లన్

ఏకవచనము :

-న్ ప్రత్యయము :

పరమ మహాపాశబద్ధ పాణిన్ ద్రోణిన్ 1-158

బాలున్ హరిపద చింతా, శీలున్ సుగుణాలవాలు 7-27

అలోక శరణ్య గానసరి గిరిశీన్ 4-274

-ని ప్రత్యయము

అట్టి దేవు-ని త్రిపురసంహారకరుని 4-117

దాసీపుత్రు-ని మీరలు, దాసీపుంజేయ కిటకు దగునె 3-35

నారదుండు వ్యాసమునీంద్రుని వీడ్కొని 1-133

అన్నఁదల్లిని, జనకునాజ్ఞయైనఁ జంపఁదగదు ' 9-476

-నిన్ ప్రత్యయము :

కొందరాతుదురు గర్వాలాపముల్ కృష్ణునిన్ 10 పూ 1568

తపనసంరంభ నరేంద్ర దార శుభసూత్ర ఛామునిన్ రాము-నిన్' 9-446

ఇందిరా పరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణు-నిన్' 8-105

-ను ప్రత్యయము :

శ్రుతదేవుండు-ను మోదియై 10 ఉ 1190

భవలక్ష్యంబును మానినేఁ గొలువఁగా సంప్రీతులైనవారు 1-109

-మున్ ప్రత్యయము

అపారమహావేగ విశేషనన-మున్ యన-నున్
దూరముగొనిచని 10 పూ 1631

గురునంద-నున్ దోర్బాని కృష్ణుండు 1-157

బహువచనము

-అన్ ప్రత్యయము .

సుతు-అన్ ·

కరుణాసంగములేక శిష్యసుతులన్ ఖండింపగాఁ జూచియే 1-160

పశువు-లఁ :

పీదలు మానవు పశువులఁ గూడవు 1-340

భూతము-లఁ .

తనయందున నిఖిలభూతంబుల గనుచు 3-946

-కూర్చి ప్రత్యయము :

ఇతని-కూర్చి . ఏమి చేసితినో పుణ్యమితనిఁగూర్చి 1-215
తమ్ముల-గూర్చి . నాతమ్ములఁగూర్చి యంతటను 4-97

-గురించి ప్రత్యయము ·

'దివిజాధిపు గురించి వాని కొఱకై దీపింప ' 3-113

చిన్నయసూరి కూర్చి గురించి ప్రత్యయములను గూర్చి వివరింప లేదు నన్నెచోడుని భాషలో ప్రయోగములు లేవు. నన్నయగారు అశమీక పుత్రులందఱ సంభవుఁగూర్చి భక్తితోడ ఘోరతపము సేయుచున్న మున్ప్రసిద్ధుండు ' అని 2-169 అని ప్రయోగించెను

పై పోతనగారి ప్రయోగములకిది పునాది ఇట్టివికాక కేవలోద్దేశార్థమున వచ్చు కూర్చి, గురించి విభక్తి ప్రత్యయములు లోపించుటయు జరుగుచుండును

ఉదా॥ అగుగా తమ్ము వికుక్షి పేటనని ఘోరారణ్య భూమిం దగన్ 9-157
[గురించి లోపము]

పుణ్యుఁడు రామచంద్రుఁడట వోయి ముదంబునఁగాంచె

[కూర్చి లోపము]

కర్మ ప్రవచనీయే కూర్చి అని చింతామణి కూర్చి విభక్తి విధానమును విశిష్టార్థమునఁ జేసెను కర్మ ప్రవచనీయార్థక కూర్చి ప్రభృతులు ద్వితీయా విభక్తిమీద వచ్చునని ప్రౌఢ వ్యాకర్త చెప్పెను ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱిచియును ప్రయుక్తంబగునని ప్రౌఢవ్యాకర్త సూత్రించెను

కావునఁ గూర్చి విభక్తి ప్రత్యయమగుట ద్వితీయపై విలువదు శ్రీనాథుని భాషలో కూర్చి, గుఱిచి, గుఱించి, గుఱియించి ప్రయోగములు కలవు

3.9.2.3. తృతీయా విభక్తి

పోతన భాగవతమున ఈ క్రింది ప్రత్యయములు కన్పట్టుచున్నవి.

-చే/ -చేన్/ -చేత/ -చేతన్/ -చేతను
-తో/ -తోన్/ -తోడ/ -తోడన్/ -తోడను/ -తోడి/
-తోడవ/ -తోడుతన్/ -తోన [తోడు]

-చే ప్రత్యయము .

| | |
|---|---|
| రాజుచే | 4-257 |
| మధుసూదను-చే | 3-496 |
| కర్మవాంఛల-చే | 1-131 |
| శరపాతము-చే | 10.ఉ.413 |

-చేన్ ప్రత్యయము :

ఆయుధ విద్యలన్నియును ద్రోణాచార్యు-చే నభ్యసించిరి 1-160
దిన ఫలమొందు భాగవతదివ్య కథా శ్రవణానురక్తి-చేన్ 3-39
గురు యోగ శక్తిచే నంబర తలమున కెగసి 3-1050

-చేత ప్రత్యయము

అట్టి వీరుండు నీ-చేత నిమిషమాత్రంబున నేడు మడిసె 7-357
గర్గుండు మున్న కంసునిచేత వ్రేటువడి 10 పూ.286

మాయ-చేత మునిగి మనువారలకు 1-147

కాలం-చేత రాజ్యాగ్రమమునఁ బరిపూర్ణుడైన భంగి 1-297

-చేతన్ ప్రత్యయము :

నా-చేతన్ 2-273

మాధవు-చేతన్ 2-71

పాపంబు చేతన్ 1-483

విశ్వాసంబుచేతన్ 3-883

-చేతను ప్రవ్యయము .

తల్లిదండ్రగురులం సు-చేతను బాధనొందుచు 1-189

పెనిమిటిచేతనుఁ బెండ్లాం, మనికాదు 4-230

అనయము మూర్ఛనొందు చున కావలి చేతను 3-985

ప్రత్యయము :

ద్రోణునితో శిఖిందరక ద్రోణకుటుంబిని 1-165

హరితోబద్ధ విరోధముండొదరు 4-75

దక్షుండు తనకూఁతుతో విరోధంబు పొంత 4-115

రమణతో హరి పరాక్రమములెల్ల వినుతిసేయు 1-102

చతురతతో నిజమాయాగతి జూచి 3-140

రోగ నిదాన దేహముతో విరక్తుడు గాక 7-358

-తోన్ ప్రత్యయము :

ఆమైత్రేయుండు పలికెనవ్విదురునితోన్ 4-10

హరి పరమ పదుండు మానవాకృతితోని, ధ్ధరఁబుట్టి 3-68

ఓటమితో నెల్లప్పుడు, ఁబాటవమున జమలసేసి 1-104

విప్రుడు, సిద్ధితితో నొదలు గద్దుపెడి 1-173

-తోడ ప్రత్యయము :

“. భూపాలురతోడ భూరి బలభవ్యులతోడ భయంబుదక్కి” 9-448

పరీక్షిజ్జన పాలుని తోడ యోగిచంద్రుడు పలికెన్ 2-216

ఉవిదకోఁద మింటి నుండి కదలి 10 ఉ 25

  క్రేపుల కోఁద గోవులం గ్రుంపుచుమే 10 పూ 170

మహారోషము కోఁద భృగుమహాముని 4-103

వారికోఁద బలుఁడు ధార్తరాష్ట్రులు 10 ఉ 572

-కోఁదన్ ప్రత్యయము

వాకోఁదన్ వైరము వచ్చెన్ 7-185

గోపాలసుతులఁ గృష్ణునికోఁదన్ 10 పూ 468

భాగ విభుఁడు సుందరి కోఁదన్ 9-573

పుష్పవర్షములనయముఁ గురియింప ధ్రువుడు హర్షముకోఁదన్ 4-377

  నాకది యెఱిగింపు కరుణకోఁద, నముచు 3-7

-కోఁదను :

నా కోఁదను స్నేహముగల, మాతను 4-63

గోపాలకృష్ణుకోఁదను, గోపాలన వేళలందు 10 పూ.1354

కరిమ కరికోఁదమద్దండకరాత్రులు పలిపెంబోరు 8-69

వివరింపు వరునకోఁదను 9-4

రాజుల కీర్తుల్

హరిమద్య పిగ్గుకోఁదను 10 పూ 1752

-కోఁద ;

పీవికోఁది విరోధంబునందమునకు మృత్యువు సిద్ధించు 7-205

కొడుకుకోఁది మోహంబున ప్రొద్దుగడవఁచుండె 9-196

మెఱుఁగు దీగె కోఁది మేఘంబుకైవడి 10.ఉ.25

-కోఁదన ప్రత్యయము :

కృష్ణునికోఁదన మరుఁగుఁజొత్తము చత్రము 10 పూ.659

బొందికోఁదన యాకాశమునకు మాయఁజెందెన్ 10 ఉ.1293

మేనికోఁదన పుట్టు మృత్యువు 10 పూ.29

సంగమంబు విడువని వాఁడు వాని కోఁదన 2-30

**-తోడుతన్ ప్రత్యయము**

నీతోడు తనేఁ బెనగెదఁ 10 పూ 1335

నీతోడుతఁ బలికించెద 10 పూ 774

పలికెన్ నా తండ్రి నాతోడుతన్ 10 ఉ 119

బ్రాహ్మణుడు గర్వముతోడు తమన్నవాడు 1-461

**-తోడ ।**

అతని తంపు తోడ యతఁడు వచ్చె 9-28

392.4 చతుర్థీ విభక్తి పోతన వాడిన ప్రత్యయములు :

-కొఱకు/-కొఱకున్/-కొఱకై/-కొఱకునై/
-కొఱకును/-కై/-కైనన్/-కైనను

**-కొఱకు ప్రత్యయము :**

ఇంద్రునికొఱకు దైత్యేంద్రుల నేటికి .. ..... చంపె 7-3

బ్రహ్మణుల కొఱకు బ్రహ్మాండ ఘటమున. .తెచ్చి 10 పూ 717

దుఃఖిని, రామము గావించు కొఱకు 3-409

వనము కొఱకు వారి దనము నొచ్చి 1-491

**-కొఱకున్ ప్రత్యయము :**

'సురలంకొఱకుఁ గ్రిదసూపె గాక' 9-359

ప్రియురాలి వేడుకల కొఱకు పిల్లని వక్కాణించె 9-23

ప్రాణమైన విడుచు భార్య కొఱకు, వట్టి భార్య 7-446

జగద వనము కొఱకుఁ గాక జగదా దారా 10 పూ 674

**కొఱకై ప్రత్యయము :**

జలరుహ నాభు కొఱకై, జల తర్పణమాచరించి 8-737

అయ్యా కొడుకుల కొఱకై యియ్యాగము. 9-12

వనవాది సిద్ధి కొఱకై, తపిలి 4-494

అవనములలోన పర్ధి వరయుట కొఱకై 3-280

వానకొఱకై దీపింప 3-113

-కొఱకునై ప్రత్యయము :

ఫలము కొఱకు, నై సఖ్య ధర్మమునందు సిద్ధింపవు 10 పూ 1075

వార్త లాకర్ణించు కొఱకునై రాముడు... తిరుగుచో 9-346

జగముల గలిగించు నమయించు కొఱకునై 8-78

వృష్టి దుష్కర్మ వృత్తి జరగనీకుండు కొఱకునై 4-31

-కొఱకున :

భవోన్మూలనము సేయు కొఱకున 1-407

తత్త్వ బోధంబు కొఱకున 3-859

ప్రత్యయము

ద్రోహిందున్రించుటకై యుత్సాహంబునలేచి 4-102

నీదు కోర్కి కొనసాగుటకై విజమూర్తి జూపితిన్ 1-125

వానికై యెవ్వండు వాకి నెఱిచె 10 ఉ 10

ఉదరాంతర్గత గర్భ దాహమునకై యుగ్రౌ ప్రభన్ నేచ్చు 1-178

తన దేహంబునకై యనేక మృగనంతానంబు జంపించు 1-202

ఈతండు తన లీలకై తను దాన్పృజించె 3-342

-కైనన్ :

ఉరగపతి పినాకులకైనన్ 3-323

కమల సంభవాది ఘనులకైనన్ 10 పూ 1619

కైనను :

కర్మముల బ్రహ్మకైనను, గర్మ గురుడైనరు 10 పూ 32

గోపాలదరులకైనను, వావోవఁగ 3-106

పైన ప్రయోగించిన 'కొఱకు, కొఱకై, కొఱకునై, కై' అను వాన్నింటికి మూలము 'కు' ప్రత్యయమని తెలియుచున్నది పోతన క్రొఱకై, కొఱకునై మొదలగు ప్రత్యయములు వాడినను వానితో కొఱ

[కొఱ – ప్రయోజనము]

శబ్దమును విడదీసి-కై, -కునై అనునదియే ప్రత్యయముగవి భావింపదగును కున్ అను దానిని చతుర్థీ విభక్తి ప్రత్యయమనుట

వ్యాకరణ కర్తలకు అసమ్మతము ఉద్యాద్యర్థక ప్రయోగమున సంప్రదాయమునకు కు ప్రత్యయము వచ్చును ప్రేమకు వచ్చు దాను అనుగ్రించు తనంబున నెగ్గు సేసితిన్ 9-116 తక్కినచోట్లను ఇట్టి ప్రయోగములు పోతన భాగవత భాగమున కలవు

మామకు యాగంబు సేయించి 9-67

తనయకున్ మోహించి 1-145

నన్నయ ఇట్టి ప్రయోగమును చేసెను నిపుణుడైన నీమఱదికినపరాధ కరంబు సైపుమయ్యయుపేంద్రా [సభా 2-59] ఈ ప్రయోగములను పరిశీలించిన పోతన వాడిన తువర్థకము విచిత్ర ధోరణిని కలిగియున్నది.

నిఖిలాత్మమయుండగుటకు

ముఖమందుంగాక భూమి సురుడివ్వేకన్ 9-138

ఇచ్చుటకు వర్ణకము హేత్వర్థకము

ఈ పరిపాటి ద్రోహమున కిట్లు తపింపగనేల బాలకా [1-482]

[హేత్వర్థక షష్ఠి]

పాపంబునీచేత బ్రాపించె మనకు 1-483

ప్రాపణార్థక ధాతు యోగమున నిచ్చుట నస్మచ్ఛబ్దము కర్మ సంజ్ఞకమై ద్వితీయను తెంపవలసి యున్నను చతుర్థి వచ్చినది కారక విభక్తికి మన పర విభక్తి వచ్చుట తెలుగులో విశేషము

గత్యర్థ యోగమున బాశిక చతుర్థి ·

— అడవి నుండి, యింటికి వచ్చుచు 9-200

విరహములలోన ముక్తి కేఁగఁ గవిచటన్ 1-505

—కైవల్య శ్రీ

కబ్బుదుఁగట హరి పోషణ

మన్నిన తల్లి దండ్రులె చటికబ్బు దురాతుదిన్ 10.పూ 351

— ముక్తి పద్ధతికిఁ జెప్పెరఁ బోవఁగ వచ్చు జెప్పరే 1-501

3925 పంచమీ విభక్తి పోతన భాగవత భాగమున ఈ విభక్తి ప్రత్యయములు కనిపించుచున్నవి

— వలన/ - వలనన్/ - వలనను/-

— కంటె/ - కంటెన్/ - కంటెను

పంచమీ విభక్త్యర్థమున వాడబడు ఇతర ప్రత్యయములు

. ఉండి/ - కోలెన్/ - కతమున మొదలగునవి

- వలన ప్రత్యయము

యాదవుల వలన రాజ్య, శ్రీ దొలగెను 3-86

పరమేశ్వరుని వలన సర్వంబునగుచుండు 1-427

భార్యవలన దోషంబు లేకుండుట 9-313

ఆకాశంబు వలన నో జన్మ హో బలములయ్యె 2-269

ఊరువుల వలన వైశ్యులను నైపుణ్యంబును 8-155

- వలనన్

అలవడ నాకు మీవలన నబ్బిన 3-556

ఆరాధనము సేసి యతనివలన బరి సంధిజయమును

దశో, త్తర శతదుహితలను గాంచె దక్షుని-వలనన్ 4-802

దాని, వలనధర్మ విప్లవలన వయిన 2-5

నాత్మమోహంబు వలన బాసి 4-203

భూతముల వలన నెప్పుడు, భూతములకు జన్మ మరణ పోషణములు

నిర్మిముతలు సేయుచుండును 1-377

- వలనను :

ఆతని వలనను సంభూతమైన యట్టిసృష్టి 2-278

అమాత్యులవలనను దస్కరులవలనను ప్రజలు నాశంబు నొందకుండ4421

తన ధర్మపత్ని వలనను, మనుకొని 3-455

అమ్మేటి వలనను గుణత్రయంబును జనించె 3-718

ప్రతిక విన్యాస భావ, గతులవలనను భేదంబు గలదె 2-221

భూమి వలనను, ధనముల మర్యాద గొనుచు 4-64

- వలని :

సంసారంబు వలని తగులంబు విడిచి ౧-89

ఇచ్చటను వలను దిగ్వాచకముగాని విభక్తి యవరాదు

దిగ్వాచకమైన పదము సప్తమ్యర్థకమై పరిణమించును. అందుచేత పంపా రము యొక్క పదము పందు దగునని విగ్రహము చెప్పుకొనవలెను అటుకాక మానవమనుకొని పదవ వర్ణకమున్నచో గారక విభక్తితో సమానము కుదరదు పంచమి యిచట విడిచి యను క్రియతో సమన్వయించునుగాని తగులముతో సమన్వ యించదు కనుక పై పోతన ప్రయోగము లేఖ కులచే ప్రక్షిప్తమై

ప్రచారములోనికి వచ్చి యుండునని తోచుచున్నది

- కంటె ప్రత్యయము

మీకంటె మిక్కిలి తీర్థంబులున్నవె 1-301

ఆత్మజాల కంటె దయామతి జూచు 10-ఉ-42

అగ్నిముఖము కంటె ధరామరేంద్ర ముఖము పరిశుద్ధము 4-590

చైతన్య వృక్షములకంటె ఘనరస ఉత్తములు 3-966

కంటెన్ :

నీ కంటెన్ ఘను డొక్క రాజు గలడో 2-75

నాకంటె నన్యుల గైకొని 3-886

తన కంటెనితర మొకటెఱుగని 4-389

కులదైవత ద్విజకులము కంటె, పంగ న్ప్రాణ 9-254

సమరమున నుండి తిరుగక చచ్చుకంటె బలికి 8-588

- కంటెను :

విష్ణుని కంటెను వేఱేమియును లేదు 1-102

నా కంటెను, బిరుసుడు మరియెవ్వడు 4-427

నీతమాటనను దుఃఖము కంటెను జచ్చుట 4-95

విపరీతతి సొమ్ము కంటెను విషము మేలు 10-ఉ-479

ప్రత్యేక పదము :

విప్రుఁజంపు కంటెను పాపంబు 9-464

- ఉండి :

అడవి నుండి యింటికి వచ్చుచు 9-20(

గాలిలోన నుండి కదలు కపము 2-51

ప్రశాన తీర్థమున నుండి, యాతలోదరి కోడి 10-ఉ-1165

బ్రహ్మలోకమున నుండి వసుధకేతెంచి 4-812

'ఉండి' ఉండు ధాతువు యొక్క క్త్వార్థక రూపము. పంచమ్యర్థమున వాడ బడుచున్నది ఉండి శబ్దము పరంబగునపుడు దానికి ద్వితీయా సప్తములు ప్రాయికంబుగనగునని సూరి సూత్రీకరించెను ఇది సరిగాదు నన్నయలో సప్తమి నిత్యముగా కలదు కాన ద్వితీయకు ప్రయోగములేదు ఉండి పదములోపించిన పంచమ్యర్థమున ద్వితీయా సప్తములు నన్నయాదులు ప్రయోగించిరి

ఉండిలోపమున పంచమ్యర్థమున ద్వితీయా సప్తములు

పోతన ప్రయోగములు :

కమ్రగేహ నిప్పుకల్, పొట పొట రాలి 9-102

ముఖంబుల రక్తమాంసంబులు మియుచుఁ గన్నుల

విషంబు గ్రక్కుచును క్రుక్కెడి 10 పూ 667

నన్నయాదులను పోతన యెంత శ్రద్ధగా అధ్యయనము చేసెనో పైన చూపిన ప్రయోగములు విశదీకరించుచున్నవి

కోలెన్ :

పిన్నవాడను గోలెఁ బెరిగినాడ 10 పూ 841

నేఁటఁగోలెన్, మాయీ ప్రాణంబులు మాకునీవే 10 పూ 6 లో

—కతము ,

దీనికి రూపాంతరములు క్రింది రూపములు

-కతన/ -కతనన్/ -కతనమున/ -కతంబున/

-కతమున/ -కతమునన్

కృష్ణుండువచ్చు టేమికతము 3-7

—కతన :

మీ యందు నిష్టుండు మెఱయు కతన 1-301

---

5 బా వ్యా కారక 11

.. నీవు, నాకు బుట్టిన కతన   3 856

. చిత్రమవ్విధునందు చేర్చియున్న కతన  4-271

—కతనన్ .

దక్షకోడిపై రము కతనన్  4-99

దుర్భగురా, అన గం నాకుక్షినుదయ మందినకతనన్  4-230

—కతంబున

కూద్రిదైన కతంబున 1-306

—కతమున

అనోన్య మిత్రిత్వమందకున్న కతమున  3-204

ఇచ్చిన కతమున  8-416

-కతమునన్

తొంటి మాట కతమునన్  9-24

నేడు మీ కతమునన్  9-496

-కన్నన్ :

నీకన్నన్ ఘనుండైన రాజమ్యుండెవ్వడు  10 ఉ 135

అను విశిష్టరీతి ప్రయోగము పోతన భాషలో కనిపించుచున్నది

39.26 షష్ఠీవిభక్తి

తెలుగు వైయాకరణులు నిర్దేశించిన ప్రకారము పోతన భాగవతమున గల షష్ఠీవిభక్తి ప్రత్యయములు

-కి/ -కిన్/ -కు/ -కున్/

-లో/ లోన్/ -లోపల మరియు వీని రూపాంతరములు -లోన/- -లోనన్/ -లోని/ -లోపలన్/- లోపలికి అనునవి సంబంధమును గురించి తెలియజేయవలసినపుడు షష్ఠివచ్చును దీనినే శేష షష్ఠి యందురు. -కిన్/ -కున్ అను వానిని తెలుగు వ్యాకర్తలు షష్ఠీ విభక్తి ప్రత్యయములనిరి -కున్ ప్రత్యయమును కేశవ చతుర్థీ షష్ఠీ ప్రత్యయముగా పేర్కొనెను తరువాత తెలుగు వైయాకరణులు దీనిని షష్ఠిగా పేర్కొనిరి  కై : కు+అయి కొఱకు కొఱ+కు వీని యందలి 'కు'

షష్ఠీ విభక్తి ప్రత్యయము తులనాత్మక దృష్టితో పరిశీలించినప్పుడు కి, కు రెండును చతుర్థీ విభక్తికి చెందినవి కాని తెలుగు లాక్షణికులు వీనిని షష్ఠి క్రింద చూపించిరి

– కి :

తండ్రికి మకవ్యకయిట్లనియె 9–53

మరలు హరికి మొఱలు పెట్టిరి 8–297

తరుణికి మంగళస్నానంబు సేయింతమని 8–269

వజ్జన ప్రతతికి సంతతము న నెగ్గొనరించుకు 4–961

–కిన్ :

గిరికిన్, ఖరదళితమేరుగిరికిన్ హరికిన్ 3–647

మొక్కిరి మింట నక్రికింఱక్రికిన్ 8–107

వేద వాదులయింటి దాదికిం బుట్టి 1–103

సిరికిం జెప్పదు 8–96

వివదంబు రాశికిన్ విక్రమము 1–324

ఏగె విజనిర్మల పుణ్య వివాన భూమికిన్ 3–595

తముజాని గొని పోవకున్నె తన లోపలికిన్ 10 పూ 484

–కు :

పావవర్తనులైన పార్థివులకు, ధృతి బొందరాని 3–806

వేతేమియును లేదు విశ్వమునకు 1–102

తత్పద, వనజములకు మొక్కి 4–696

పేర్మికు వచ్చు దానులకు ఎగ్గుసేసితిన్ 9–116

– కున్ :

బాల పూతకున్ విడువుమటంచు 1–168

మగ వారలకున్, దగునమయమెఱు గవలదే 8–181

అతని చరణంబులకున్, వినతులయిరి 4–142

వరసిజజని చెప్ప యజితునదనంబునకున్ 8–152

యోగిజనులకుం బరిచర్య సేయుచోట 1–103

తమ్ములకుఁజూడ బరువై, యున్నది 10.పూ 79

[ఎ] అదంత, ఉదంత ప్రాతిపదికంపై -కు/ -కున్ ప్రత్యయములు పోతన ప్రయోగములలో కనిపించుచున్నవి

[బి] -కు/ -కున్ ప్రత్యయములు పరమగునపుడు ఉదంతములకు ఏకవచనమున నవర్ణాగమముగా వచ్చుచున్నది -కు : నవర్ణాగమము :

అవ్యయు-న-కు 8-121

విశ్వము-నకు 1-102

కొన్నిచోట్ల అదంతములకు నవర్ణాగమమురాదు

ప్రేమకు 9-116

-కున్ :

నవర్ణాగమము : ఏకవచనము

ధరణీ రాజ్యమునకున్ 1-230

మోక్ష మార్గంబు-న-కున్ 4-242

వన ప్రస్తు-న-కున్ 7-426

పదవంబు-న-కున్ 8-152

ల వర్ణము :

బహువచనము

కన్న-ల-కు 10.పూ 79

జగము-ల-కున్ 1-112

జనుల-కున్ 1-103

-యొక్క :

అన్ని యెడల యొక్కకు లోపము. పూర్వకావ్యములందు యొక్క విభక్తికెల్ల యెడల లోపంబు నిత్యము యొక్కకు ప్రయోగము అధునాతనుల వచన రచనములందు మాత్రమే కలదు కాని పూర్వ కావ్యము లందు మాత్రమే ప్రయుక్తముకాలేదు నన్నయ్య ప్రయోగములందు యొక్కకు లోపము నెమ్మి వి ధర్మజునలువురు దమ్ములు

సభా. 2 261

ఇప్పాండవుల యు ద్రౌపది యుపవస్త్రముల వహరింపుము వళా 2 229

పోతన ప్రయోగములలో అన్ని యెడల యొక్క కు లోపము

నీవు మా

తండ్రివి దల్లివింటివి దైవమవున్ సఖివిన్ గురుండవుం 1-250

వారల బిడ్డల వారలమను మల

వారలగోత్రంబువారినైన 9-73

మందం గల్గిన వత్స బాలకుల నామాయాగుహాసుప్తలై 10 పూ 530

లోన్, లోపల ప్రత్యయములు వాని రూపాంతములను తెలుగు వైయాకరణులు షష్ఠీ విభక్తి ప్రత్యయములుగా గుర్తించిరి కాని, తులనాత్మక దృష్టిలో ఇవి సప్తమీ విభక్తి ప్రత్యయములు

-లో.

ఇందు వదన కడుపులో బాలుపేరలకు రూపు మెఱసి 10 పూ 73

ఘన పాతక మను గంగానదిలో, నెట్టిరి 3-13

భూ దారములు నేల బొఱియలలో దాగు 8-29

సంసారంబను, వనధిలో మునిగి 1-131

-లోన్

పలికిరందఱు దమలోన్ 3-727

సకలలోకైకపాలకులలోనతి బలాధికుడు 3-619

ధరలో, సవపత్న్యందగు బొప్పను 4-404

స్మరించునొవ్వడు మదిలోన్ 7-204

-లోన :

కలలోన జీవుండు కౌతూహలంబున 2-18

మునికులములోన మిక్కిలి, వినుకులు గలవారవు 1-112

తనలోన మాటలాడు 7-240

కురుకుమారుల భూరి సంగరములోన, హతుల గావించి 3-60

-లోనన్.

యాదవులలోన నొక్కడు మెఱసి 10 పూ.1581

కలలోనందను మన్నెఱుంగని 10 ఉ.971

తొల్లి రెండు గడియంలోపన్ 2-11
మీరు వంచరించి తిరయ్య జగతిలోన 1-301

-లోవి

ఆపై కుంతములోవి ధర్మమణి 9-115
వసిడికాయలోవి ప్రాణిబ్రతుకు 2-51

-లోపల

ఎల్లింటిలోపల నీవదుమను వచ్చి 10 పూ 1589
క్షణములోపల భూరిగజ ప్రమాణ మయ్యె 3-407
తన తల్లి కడుపులోపలం, మును చూచిన 1-296
కుశస్థల యమపురంబు, నీరధిలోపల విర్మించి 9-70

-లో/- లోపల విభక్తి ప్రత్యయముగా గుర్తింపబడినవి
దా-పల, పల-పల, వెలు-పల అలోవి పల స్థలవాచకము

-లోపలన్ :

ఏవింటి లోపలనొక్కటియైన 7-19
కడుపు లోపల నున్న పాపడు 10 పూ 558
చిత్తములోపల నామువి, వత్తము 9-600
చీకటి మాతిలోపలం, ద్రెళ్లక 7-142

-లోపలికి :

కొలువులోపలికిడ్చిరి కుచ్చితమున 3-15
-- కర్మ ఫలమున నూతిలో పలికి జారి 9-568

3927 సప్తమీ విభక్తి ప్రత్యయములు .

భాగవతమున పోతన చేవాడబడిన సప్తమీ విభక్తి ప్రత్యయములు వా
రూపాంతములను వరిశీలింతము

-అందు/ - అందున్/ - అందును/ - అందుం/ -అందుఅన్/
-అందులో/ - అందలి/ - అందె/ - అందులోపన్
- న/ - నన్

-అందు:

శుద్ధనాథులందు సురలందు విప్రకోటియందు 7-111

వర్తించును, హరిలోకమునందు సంతతా నందమునన్ 7-417

అటమీద ఉరమందు హత్తించి 2-29

విమల బృందావన వీధి యందు 2-188

అందు అనునది స్థల వాచకము దీనిని అవ్యయమని వైయాకరణులు పేర్కొనిరి దీని రూపాంతరములయిన అందును, అందుల, అందులన్, అందులో, అందలి అనునవి వాడుకలో నున్నవి

-అందున్ :

మాముప్పురయందు నెవ్వండు వేలు 4-207

నీయందు భక్తి, శ్రుతి పుత్రాదిక వాంఛలన్ సలిపి 10 పూ 987

ఊరువులందుం, బ్రకాశింపగ 3-2 8

వెలిచెం దక్షిణ దిమధ్య భాగమునందున్ 3-6 5

-అందును :

వగవారి సుతులయందును, దగయించుకలేక 10 పూ 674

నాయందును నీమాయ యధివసించును 8-407

గోపికలందును సంచరించు 10 పూ 1108

• బంధువులందును రాజభావమొంది 9-340

వారికివిరయమందును వలెలు 4-282

-అందుల

నాయందుల భక్తి లక్షణము దెలిపితివన్ 3-957

-అందులన్

[అందు+లన్]

పురుష భూషణునందులనీ వమస్త 4-627

-అందులో : [అందు+లో]

వర గంగ నంచులో భగవద దీక్షితుండై 3-720

అందులో యక్షరక్షస్సులవ జనింప 3-721

-అందరి . [అందు+అరి]

దానవకులవైరి నాకుఁదన యందరి విజ్ఞానము విచ్చెను 1-111

-అందె : [అందు+ఏవార్థకము]

హరియందెలయంబునొందును 4-957

-అందులోనన్

పుర ద్వారనవకంబునందులోన, నర్థి 4-767

-న

తొల్లిటి జన్మంబున వేదవాదుల యింటి దాసికిం 1-103

తల్లిదండ్రుల గృహంబున లేరు మహాత్మ 1-324

మావనంబున భయం బొక యింతయులేక 3-627

వికుంఠపురంబున నేడు లేదు 3-630

-నన్

అతిభక్తి వేద యాదు వంశమునన్ 3-49

కౌతూహలమొప్పఁ దిరిగె కడు బాల్యమునన్ 10 పూ 520

పూజసేసెను మహా శైలాగ్రభాగంబునన్ 8-122

పోతన భాగవతమున ఉపయోగించిన ఇతర ప్రత్యయములు

-కడకు

బాలుర కడకేయాటలకు బోక 1-104

శిబిరంబుకడకు వచ్చి 1-157

-కడకున్ :

వనమీ కడకుంగృష్ణుడు 10 పూ 1467

బంధించి శిబిరంబు కడకుం గొని చని 1-153

-క్రిందట

కాలంబు క్రిందట గడ గినష్టుండైన వాడు 4-313

-చందంబునన్ :

హంతాళుచందంబునన్ 8-203

అతురేళుచందంబునన్ 10 పూ 481

-మీఁదన్ :

హరిమీదన్ దితిసంతవుదు 3-689
వెలపె మమవు వలువుర మీఁదన్ 8-138
దేహంబు మీదం గమండలు జలంబులు ప్రోక్షించిన 7-84

-మీది

పురుషోత్తముని మీఁది 7-169
తనమీఁది యనుగ్రహంబునంజేసి 4-548

-మీదికిన్

కాంచన చారురథంబు మీదికిన్ 10 ఉ 1102

3.9.2.8. సంబుద్ధి

ఈ విషయములో పోతనకు ప్రత్యేక దృష్టి ఉన్నట్లు కన్పింపదు

| | |
|---|---|
| వల్లియలార | 1-208 |
| ఆర్య భూషణ | 4-94 |
| కుటిలాత్మక | 4-94 |
| యోగి భూషణ | 1-523 |
| వంశ పావన | 2-17 |
| శీతాంశుబింబానవా | 1-143 |

మొదలగు ప్రయోగములు సందర్భశుద్ధితో కూడినవి తల్లియైన దేవహూతిపట్ల కపిలుడు వాడిన

| | |
|---|---|
| అబ్జాక్షి | 3-965 |
| కమలనయన | 3-1040 |
| తరళాక్షి | 3-966 |
| నళినాయతాక్షి | 3-951 |

మొదలగు సంబోధనములు అంతగా రుచించినట్లుగా కన్పింపవు మరుజన్మలో వికి దాక్షాయణియైన తన సతిని శివుడు 'ఉమ' అని సంబో

ధించుట యుక్తము కాదు మనమున మోదమందుచు మాతరుణీమణి గాంచి 4-81 అని పోతన కూడ 'ఉమ' అని ప్రయోగించుటయు అంత సబబుగా లేదు.

సంబోధనా విభక్తి ప్రత్యయములు వచ్చు తీరును పరిశీలింతము

1 అదంత ప్రాతిపదికలపై సంబోధనమును తెలియజేయునపుడు మహతీ, మహద్వాచకములలోని అంత్యాచ్చుదీర్ఘముగా మారును

| | |
|---|---|
| శీతాంశుబింబానన | 1-143 |
| సరోజలోచనా | 3-152 |
| కృష్ణా | 3-154 |
| ధరణినాథా | 2-37 |
| పరాశరాత్మజా | 1-89 |
| మునినాథా | 1-91 |

దీర్ఘము వైకల్పికముగా వచ్చు రూపములు

| | |
|---|---|
| కమలనయన | 3-1040 |
| నీరజాక్ష | 1-188 |
| ఆర్యభూషణ | 4-156 |
| మునినాథచంద్ర | 4-262 |
| మానవేంద్ర | 8-424 |
| విమల చరిత | 2-204 |

2 ఇదంత ప్రాతిపదికల తుది యచ్చుకు సంబోధనమును తెలియజేయునపుడు దీర్ఘము వైకల్పికముగా వచ్చును

| | | |
|---|---|---|
| ధరిత్రీ | 10 పూ 3 | |
| హరీ | 10 పూ 96 | |
| శీతాంశుముఖీ | 10 పూ 314 | హ్రస్వ |
| మృగాక్షీ | 10 పూ 319 | |
| అబ్జాక్షీ | 3-965 | |
| వళినాయతాక్షీ | 3-951 | |

సంబోధనమున ముందుగా ఓ శబ్దము పోతన భాషలో కందు

ఓకంజేక్షణ 10 పూ 1128

ఓరి అనునది సంబోధనమున ముందుగా ప్రయోగింపబడినది

ఓరిగుహ్యక 10 పూ 1124

బహువచనమున సంబోధనయందు నామములకు చివర-ఆర ప్రత్యయము పోతన ప్రయోగించెను

చతురులార 4-591

సంబుద్ధిలో సంవాద సరణి . శబ్దాలంకార ప్రియుడుగా, అక్షర రమ్యతాపక్షుడుగా పోతన పేర్గాంచెను భక్త్యావేశపు చిందులలో పోతన రచన పెలయేటి ధారాప్రవాహమువలె సాగుచుండును భగవంతుని సంబోధనమునందున, భక్తుల సంబోధనమువల్లను పోతన కూర్చిన వివిధాఖ్యానములలో సంవాదము విచిత్రమైన ధోరణిలో నడచినది వానికి కొన్ని యుదాహరణములు

విమలగుణశీల మాటలు వేయునేల 4-365
ధ్రువునితో యక్షేశ్వరుడు

విమలగుణశీల మాటలు వేయునేల 7-150
చండామార్కులతో ప్రహ్లాదుడు

విమలగుణశీల ! మాటలు వేయునేల 3-1003
కపిలునితో దేవహూతి

విమలగుశీల ! మాటలు వేయునేల 4-490
వృధు చక్రవర్తితో భూదేవి

వత్స్యాపామూర్తి యోదేవ చక్రవర్తి 3-311
విష్ణువుతో బ్రహ్మ

దారుణరమూర్తి ! యోవృధు 4-484
వృధుతో భూదేవి

దారుణతరమూర్తి ? యోవృధు 4-533
ఋత్విక్కులు వృథునితో

దారుణతరమూర్తి　రాజన్య చక్రవర్తి　4-559
పృథునిగూర్చి వందిమాగధులు

ప్రవిమలాకార　సంసారభయ విదూర　3-308
బ్రహ్మ విష్ణునితో

ప్రవిమలాకార　సంసారభయ విదూర　4-286
భగవంతునితో ధ్రువుడు

ప్రవిమలానంద　సంసారభయ విదూర　4-179
దేవునితో బ్రహ్మ

భక్త మందార　దుర్వారభయ విదూర　3-304
భగవంతునితో బ్రహ్మ

భక్త మందార　దుర్వారభయ విదూర　10 ఉ 257
రుక్మిణి శ్రీకృష్ణునితో

భక్త జనలోక మందార　భవవిదూర　4-557
భగవంతునితో పృథుడు

విమూతమందార　గుణహారవేదపార　8-483
దేవునితో అదితి

5 అవ్యయానంద　గోవింద　హరిముకుంద　4-287

అవ్యయానంద　గోవింద　హరిముకుంద　4-714

అచ్యుత　మాధవ　గోవింద !　హరిముకుంద　4-171

పుండరీకాక్ష !　సంతతభువనరక్ష　3-309
దేవునితో పృథుడు

పుండరీకాక్ష　సంతతభువనరక్ష　4-193
దేవునితో యోగీశ్వరులు

పుండరీకాక్ష　గోవిందభువనరక్ష　10 ఉ 760
కృష్ణునితో ధర్మజుడు

7 చిరశుభాకార ! యిందిరా చిత్తచోర 3-422
బ్రహ్మాదుల యజ్ఞవరాహమూర్తిని గూర్చి
చిన్మయాకార ! విశ్వలక్ష్మీవిహార 4-171
చిరశుభాకార విశ్వలక్ష్మీవిహార 3-304
దేవునితో వృధుదు
చిరదయాకార యిందిరాచిత్తచోర 4-203
దేవునితో విద్యాధరులు
చిర శుభాకార విశ్వలక్ష్మీ విహార 4-287
దేవునితో ధ్రువుడు

## 39.3. విభక్తుల మార్పు (Inflectional Syncretism)

తెలుగు వ్యాకరణ కర్తలు ప్రథమ మొదలు సప్తమి వరకు గల విభక్తులను వాని స్వరూప స్వభావములను అందలి ప్రత్యయములను విర్ధారించిరి తులనాత్మక దృష్టిలో ఏ విభక్తికి ఏ ప్రత్యయములు చెందునో పరిశీలించితిమి పైన విర్ధారించిన విభక్తులలో వానికి చెందిన ప్రత్యయముల స్థానములో ఇతర విభక్తుల ప్రత్యయములు ప్రయోగింపబడుట జరుగును దీనినే విభక్తి విపర్యయము లేక విభక్తుల మార్పు అందురు 'వేఱ్ఱుమైమయక్కం' అని తమిళమునందును, 'విభక్తి పల్లట' అని కన్నడమునందును పరిభాషించుట కలదు దీనినే ఆంధ్ర శబ్దచింతామణి కారుడు అవ్యహాఃక్వచిద్ప వేద్వాన్యా అని చెప్పెను ఇదియే బాలవ్యాకరణమున కూడ 'ఒకానొకచో నొక విభక్తికి మఱియొక విభక్తియునగు' [బా వ్యా కారక 21] అని అనువదింపబడినది

పోతన భాగవతమునగల విభక్తుల మార్పిడిని పరిశీలింతము

1 సప్తమికి ప్రథమ :

ఉదంతముల సప్తమికి ప్రథమ క్వాచిత్కముగా నన్నయ, తిక్కన, ఎఱ్ఱన లలో గలదు

'శిర్రములాద నోవరు' ఆర 2-286
పోరి పోరి మోము బాష్ప జలపూరము గ్రమ్మగ శల్య. 1
ఉర్వింగల్గు శీర్షంబులెల్ల నే నాదుదు హరి పూ 5

పోతన ప్రయోగములు

తోయములాడుచుండ [తోయములందు] 10 పూ 1417

మునివీరుసొచ్చి వెదలఁడు [పీటియందు] 9-97

2 తృతీయకు ద్వితీయ

మహోగ్రగగ్ర

ద్రావలివోలె జంతువుల సంగముబద్ధతి జింతు రెవ్వరున్ [జంతువులతో] 3-562

3 సప్తమికి ద్వితీయ

హరి పితృసువర్షతిర్యఙ్నర రూపములన్ జనించి [రూపములందు] 3-353

గాలింగుం భినవగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్ [దిక్కులందు] 7-90

చమదండాశమేత్రోషలన్ [త్రోవలందు] 7-110

4 పంచమికి ద్వితీయ

ఉండి లోపించుట వలన పంచమి స్థానములో ద్వితీయ వచ్చుచున్నది

కన్నులన్ జాలజాలు దుర్విషానలము జొబ్బిలుచుండగ [కన్నుల మండి] 10 పూ 600

కన్నుల రక్తంబు గ్రక్కుచు 10 పూ 667 [కన్నులనుండి]

5 పంచమికి తృతీయ

తనకూతుతో విరోధంబు 7-1 5 [కూతువలన]

రోగవిదావ దేహముతో విరక్తుడునాక [దేహము వలన] 7-358

గురుయోగ శక్తిచేన్ [శక్తివలన] 3-1050

విత్యుదౌటచేన్ [విత్యుదౌట వలన] 3-216

6 తృతీయకు చతుర్థి

సోదరుఁ జంపిన పగకై, యాదరమించుకయులేక [పగచేత] 7-94

7 షష్ఠికి చతుర్థి

ఆత్మ ప్రభావంబు దెలుపు కొఱకు విజకళాసంభవులైన రామకృష్ణుల [తెలుపుటకు] 2-174

పై వ్యయుక్తంబుగానవి సంహరించుకొనుటకు
[సంహరించుటకు] 3-71

అనుదానుడు వేటకై వనంబునకేగి [వేటకు] 9-237

విశదంబుగఁ జేయవలయు విజయము కొఱకున్ [విజయమునకు]
10 పూ 1154

8 ప్రథమకు షష్ఠి

ఒకనరునకుఁ బ్రార్థింపనేల యాత్మజ్ఞులకున్ [ఆత్మజ్ఞుల] 2-22

9 చతుర్థికి షష్ఠి

విన్ను మోక్షమార్గంబునకున్, బ్రేరేచినవాడు [మార్గంబు కొఱకు]
4-242

10 సప్తమికి షష్ఠి

అనుగ్రహముఖగా స్మరించునొవ్వడు మదిలోన్ [మదియందు]
7-204

కడుపు లోపలనున్న పాపడు [కడుపునందు] 10 పూ 558

కంలోన జీవుండు [కలయందు] 7 18

ధర లోపనవత్యుండగుటొప్పను [ధరయందు] 4-404

పాలమున్నీటిలోపల సర్వత్ర్యణల తౌషధముల దెప్పించి
[మున్నీటియందు] 8-175

ఖండవములోప ద్రుంచె [ఖండవమందు] 3-129

మునికులములోని మిక్కిలి వినుకుల గలవాడు [కులమందు] 1-112

11. తృతీయకు సప్తమి :

చే, యుంచెన్ మూడు తురంగమేధముల దేవేంద్ర ప్రభావంబునన్
[ప్రభావంబుచే] 1-176

ధరణీ చక్రమునే నేర్పునన్ నిలువన్ వచ్చును [నేర్పుచే] 3-406

ఆత్మప్రభావంబునం గ్రమ్మఱనగ్నులయి చనిరి
[ప్రభావంబుచే] -4-674

12. పంచమికి సప్తమి .

ఆలోకేశుముఖంబునం గలిగె [ముఖము వలన] 9-517

## 3 10 0 సమాస నిర్మాణము

## (FORMATION OF COUMPOUNDS)

ఇతరములయిన పరిభాషలు, ప్రక్రియలు సంస్కృతమునుండి తెలుగులోనికి వచ్చినట్లే ఈ సమాసమను పదమును వచ్చినది 'సమ్' ఉపసర్గ పూర్వము గల 'అస్' ధాతువునకు భావార్థమున 'ఘ ఞ్' ప్రత్యయమును చేర్చిన 'సమాస' అను రూపమేర్పడును కావున అనేక పదములకే కీభావ రూపమగు సంశ్లేషమను అర్థము సమాస పదమునకు సంభవించును [1] సామర్థ్యముతో గూడిన పద విధియే సమాసము

సమాస విషయమున ఇతర భాషలందు గల స్వభావమునించుక పరిశీలించుట యుక్తము ద్రావిడ భాషలలో ప్రాచీన దనమగు తమిళమందలి తొల్కాప్పియమున సమాసముల విషయము ప్రస్తావింపబడినది సమాసము అను పదమునకు "తొగై" అనునది సమానార్థకముగా నుపయోగింపబడినది దీనికి "కూడు, చేరు, తొలగు, లోపించు" అను అర్థములు గలవు 1 విభక్తులు తొలగించుటచే సమాసములు గలుగుట 2 పదములు కూడికచే సమాసములు గలుగుట అను రెండభిప్రాయములు దీనియందు గలవు [2] తొల్కాప్పియనారు సమాసము అను ఆఱు విధములుగా విభజించెను

[ఏ] వేట్రుమైత్తొగై — తత్పురుష సమాసము
[బి] ఉవమత్తొగై — ఉపమిత సమాసము
[సి] వినైత్తొగై : ఇందు మొదటిది క్రియాజన్యము రెండవది నామము
[డి] పణ్బుత్తొగై . విశేషణ పూర్వ పద కర్మధారయ సమాసము
[ఇ] ఉమ్మైత్తొగై — ద్వంద్వ సమాసము [ఉమ్, -ను-సముచ్చయము]
[యఫ్] అన్మొ త్తొగై [అన్మొళి] — బహువ్రీహి

1 కౌముదీశరదాగమము సంపు 11 పు 114
2 తొల్ చొల్ సూ 418-20, సూ 412 చొల్.

కన్నడమున వ్యాకరణ కారులు సంస్కృత మందలివి స్వీకరించిరి [3] వీనినే కేశిరాజు శబ్దమణి దర్పణమున నుపయోగించెను కాని "క్రియాసమాసమని, గమక సమాసమని మరిరెండింటిని అతడు కల్పించెను, తెలుగున "చింతామణి యందు సమాస శబ్ద నిర్వచనములేదు కాని సంస్కృత సమాసముల పేర్లను వివరించెను ఆంధ్ర భాషా భూషణమున "మొదలి పదంబు విభక్తుల నుడిచ్చిమీది పదంబులతోడ సమ్యక్ప్రసంక్తంబులగుటం జేసి సమాసంబులయ్యె" [4] అని వివరింపబడినది. పాణినీయమున సమాసాంతర్గములుగా విగ్రహ వాక్యములో కనుపట్టు దగిన విభక్తి ప్రత్యయములకు లోపము విధింపబడినది దీనిని దృష్టిలో పెట్టుకొని చిన్నయసూరి" [5] సమాస విభక్తికి లోపంబగు" నని చెప్పి తెలుగు సంస్కృత సమాసములకు గల భేదమును గుర్తించి "అట్టునకుంగాదు" అని తెలుగు పదముల స్వభావమును నిరూపించుచు విధించెను

> 6 "సమర్థంబులగుపదంబు లేక పదంబులగుట సమాసంబు" అని చిన్నయ సూరి సూత్రము

పై అంశములను బట్టి రెండు విషయములు బోధపడుచున్నవి

[1] విభక్తిలోపము [2] వేరువేరు నర్థములను బోధించు పదములు చేరి ఒకే యర్థమును బోధించుట పై రెండింటిలో మొదటిది కొంత వరకు కృతకము రెండవది వ్యవహార సిద్ధము

---

3 వామ్నాం సమాస. సంగతార్థ "తస్యాంతర్వర్తినోః విభక్తయో లోపః । ఉత్తర పదార్థవృత్తి స్తత్పురుష ॥ పద వైకార్థ్యయ. కర్మధారయ । సంఖ్యాపూర్వేత్ ద్విగు "పూర్వపదార్థ ప్రధానో వ్యయీభావః । సర్వ పదార్థ ప్రధానోద్వంద్వః ॥ అన్య పదార్థ ప్రధానో బహువ్రీహిః క భా భూ

సూ 124-131

4. ఆం భా భూ.స 109

5. బా వ్యా సమాస 25

6 బా.వ్యా సమాస 1

"సంయోగ దశయందు గలిగెడు విభక్తిలో సాత్మక పద వ్యూహ సంగ్రహము" అని ప్రౌఢ వ్యాకరణకర్త సూత్రీకరించెను పోతన భాగవతమున గల సమాసములు క్రింద పరిశీలింపబడినవి

3 10 1 తెలుగు సమాసములను స్థూలముగా మూడు రకములుగా విభజింప వచ్చును

1. సాంస్కృతిక సమాసములు
2. అచ్చిక సమాసములు.
3. మిశ్రమ సమాసములు

1. సంస్కృత సమాసములను తెలుగు లోనికి కొన్ని మార్పులతో గ్రహించిన వానిని సాంస్కృతిక సమాసములందురు
2. తెలుగు శబ్దములను మాత్రము స్వీకరించి నిర్మాణముచేసిన వానిని అచ్చిక సమాసములందురు
3 సంస్కృత పదముల కలయికచే ఏర్పడినవి మిశ్రమ సమాసము అందురు

3 10 1 1 సాంస్కృతిక సమాసములు రెండు విధములు

1 సిద్ధము 2 సాధ్యము.

1. సిద్ధ సమాసములు సంస్కృతమునందేర్పడిన సమాసములకు తెలుగునందు ఆయా ప్రత్యయములు చేరగా సిద్ధ సాంస్కృతిక సమాసములు ఏర్పడును

పోతన భాగవతమునగల సిద్ధ సమాసములు

"మానిత ధర్మ మార్గ మహిమ స్ఫుట భూరితపస్సమాధి విద్యా నిర్భృతాత్మ యోగసముపార్జిత విష్ణుకటాక్ష లబ్ధశోభనాము దివ్యభోగ విహారభద్ర వితానములు" 3-804

"వహ్ని వరుణ సమీరణ చంద్రరుద్ర హైమవతీ కుబేర వృష్ణ భగాంగ శాండిల్య పాశుపత జటిలపటలమండితము" 1-39

2 పాధ్య సమాసములు :

సంస్కృత పదములు తత్సమములై యేర్పడిన సమాసములను పాధ్య సాంస్కృతిక సమాసములందురు

తత్సమ+తత్సమ

| | |
|---|---|
| ఉగ్రంపు మృగము | 9-413 |
| క్రూరపు గాలంబు | 1-336 |
| జనుల చిత్తములు | 4-431 |
| దైత్యవిబాధ | 7-116 |
| పౌరకాంతలు | 10 పూ 1455 |
| బాలార్క | 10,పూ 291 |
| మంజుభాషలు | 10 పూ 1709 |
| విరహాగ్ని | 10 పూ 19 8 |
| శుభాగారము | 10.పూ 1455 |
| హరిమాయ | 10 ఉ 1 63 |

3 10 1 2 అచ్ఛిక సమాసములు : తద్భవ దేశ్య పదములతో కలిసి ఏర్పడిన సమాసములు వీనిని ఈ క్రింది విధముగ వింగడింపవచ్చును

1 దేశ్యము + దేశ్యము

| | |
|---|---|
| అక్కచెల్లెండ్రు | 10 ఉ 470 |
| ఆట పాటలు | 2-129 |
| ఇరువంకలు | 415 |
| ఊరుగాయలు | 10 పూ 496 |
| ఎండ మంచు | 10 పూ.131 |
| ఎల్లినవ్వు | 10 ఉ 1197 |
| ఒక యేడు | 9-465 |
| కడు సిగ్గు | 8-200 |
| గుజ్జనగూళ్ళు | 10 పూ 1688 |
| చిగురాకు | 10 ఉ 62 |
| తండ్రిమాట | 9-543 |

| | |
|---|---|
| వాల్గు వంకలు | 4-767 |
| వచ్చవి గటిక | 10 పూ 499 |
| మడుగునీరు | 10 పూ 695 |
| వెలియేనుగు | 9-230 |
| సుడిగాలి | 10 పూ 423 |

2 దేశ్యము + తద్భవము

| | |
|---|---|
| ఏడు దీవులు | 2-9 |
| ఒకవేదియ | 10 పూ 1092 |
| కంటి తపసి | 9-188 |
| గొంతిమాట | 1-201 |
| చెలిపాలు | 10 ఉ 745 |
| తొంటిరూపు | 10 పూ 128 |
| వాల్గు మొగములు | 10 ఉ 960 |
| పెనుమెకంబులు | 9-16 |
| మునలితపం | 9-64 |
| రెండు గడియలు | 2-11 |
| లేగరక్కసుడు | 10 పూ 435 |
| వేటనెపము | 9-658 |

3 తద్భవము+దేశ్యము :

| | |
|---|---|
| అచ్చపు దలపు | 3-829 |
| జవరాలు | 9-72 |
| దేవరయడుగులు | 8-132 |
| విద్దెంపుటద్దంబు | 8-447 |
| పటికంపు గోడలు | 9-327 |
| మదినేరుపు | 1-99 |
| రాచపట్టి | 9-623 |
| నవతి తల్లి | 2-136 |

తద్భవము+తద్భవము

ప్రోడ చేడియ 9-393

3 10 1 3 మిశ్రమ సమాసములు :

1 తత్సమము+దేశ్యము .

అరిమాట 10 ఉ 1255
ఉత్తరపుగాలి 10 పూ 798
కంసునంపు 10 పూ 1212
చంద్రులసగిది 10 పూ 291
జీవుల మాటలు 8-91
భటులచందము 2-269
ముని పొంత 9-206
వటువి కాళ్ళు 81-600
పారంపుముద్ద 10 పూ 1303

2 దేశ్యము+తత్సమము

అన్ని దిశలు 9-101
ఎల్లకాలము 8-661
తలకుసాలు 9-410
తొలిదివసము 10 పూ 807
దొడ్డరాజు 10 పూ 1685
పల్దిక్కులు 7-63
పెక్కుబాధలు 2-173
ముద్దుల బాలుడు 8-930
రెండు దిక్కులు 10.పూ 1228
వాడి రుచులు 10 పూ 717

3 తద్భవము+తత్సమము

అచ్చపుహరి 10-ఉ-1163
తవసి ప్రయాణంబు 9-29

సిబ్బరపు బొం 1-173

పసదంపు పాకీండ్లు 9-327

రక్కసికులము 7-254

3-10-2 తెలుగు వ్యాకరణ కర్తలు వైరిసమాసములని కొన్నిటిని విడిగా చూపించిరి మొదటి పదము తత్సమము కాక సంస్కృత శబ్దమై దానితోసాటిగ తెలుగు పదము కలియునపుడు ఏర్పడువానిని వైరి సమాసము అందురు ఇవి వ్యాకరణ కర్తలంచే వెలివేసినవప్పటికి మహాకవులు తమ కావ్యములందు గ్రహించుటచే అనింద్య గ్రామ్యములనిరి వీని సాదృశ్యమున తక్కినవి ప్రయోగింపరాదని, ప్రయోగించిన నవి గ్రామ్యములగునని వ్యాకరణ కర్తలు నిషేధించిరి ఈ వైరి సమాసములు పూర్వకాలమున నన్నయనాటి నుండి గ్రంథములలోను, వ్యావహారిక భాషలోను అధిక ప్రచారమున గలవు

పోతన వైరి సమాసముల ప్రయోగించుట శివకవి సంప్రదాయ ప్రభావమని కొందరందురు శివ కవుల సాంప్రదాయ మెట్లున్నను పోతన వాడినట్లుచెప్పబడిన వైరి పదములలో పెక్కు వీరభద్ర విజయము, నారాయణ శతకములలో కనిపించుచున్నవి వాని కర్తృత్వ విషయమున వివాదముగలదు ప్రస్తుతము భాగవతమందున్న వైరి సమాసములని పండితులు చెప్పుచున్నవి క్రింద ఉదహరించుచున్నాము

1 విరటజాగర్భంబు 1-283
2 ఒక్కనేత్రుడు 8-607
3. పగాయత్తులు 10 పూ 991
4. దానవరాచూలు 10-ఉ-374
5 ప్రతిమాటలు9-394
6 ముమ్మూర్తులవిభుడు 10 పూ 542
7 అలితరూపు 10 పూ 859
8 చౌషష్టి-అరువదినాలుగు 3-121

ఇవి ఎంతవరకు సముచితమో పరిశీలింపుట మంచిది.

విరటజాగర్భంబు

విరటజాగర్భంబు పెక్కు తాళపత్రములందు సమ్మతమైన పాఠము కావున ఇది సరియైనదిగా భావింపవచ్చును కాని పలువురు విమర్శకులు తలంచినట్లుగా దోషముగాదని డాక్టరు దూళిపాళ శ్రీరామమూర్తిగారిట్లు పేర్కొనిరి "తద్వేద్విరుద శబ్దేషు యథేచ్ఛం వర్ణకల్పనా, గ్రామమానుష్య విరుద శబ్దానామపి పోషతః" ఈ అథర్వణుని ఉక్తివలన విరట శబ్దముతో సిద్ధ సమాన ఘటనము వ్యాకరణ సమ్మతము ఇట్టి వైరి పదము దోషముగాదని తాత్పర్యము

ఇట్టివి నన్నయ, తిక్కనలలోను గలవు

వగాయత్తులు :

"అత్తలు మామలన్ వశనాపడికె కోడళ నాథులన్ వగాయత్తులఁజేసి

10 పూ 991

'త్రపాయత్తత' వ్రాత ప్రతులలో పెక్కింటగలదు, అకాడమీ ప్రతిలో త్రపా యత్తులని గలదు ఒక వాక్యమందు వగచు ధాతువును బునరుక్తముగ వాడుట శబ్ద దరిద్రమునకు సూచన పోతన శబ్ద దరిద్రుడుగాదు పోతనలో శబ్ద పునరుక్తిలేదా? అనినచో అవి యన్నియు సప్రయోజనములగుట శబ్ద దారిద్ర్యమును సూచించునవికావు

దానవరాచూలు.

"ఓ చెల్లి యిట్లు దానవ
రాచూలికి జాలిఁవిలిచె రాయిబ్భంగిన్ 10-ఉ-374
ఓ చెల్లి యెట్టులో యా
రా చూలికి జాలిఁవిలిచె రాయిబ్భంగిన్

ఇది అకాడమీ ప్రతిపాఠము తమకు తెలియకుండ వింతవని యెట్లు జరిగెనో? యని యూత్పర్యము వ్యక్తమగును ఇట్లనుకొనుటలో నర్థములేదు అది యెట్లో తెలిసినగదా యిట్లనుకొనుట మరియు రాచూలికని యన్నచో దాలును. దానవ శబ్ద మధికము, అకాడమీ ప్రతిపాఠము

ప్రతి మాటలు – అని పలికిన వేల్పుల వెలియాలి ప్రతిమాటల కియ్యకొని 'ప్రతి సంస్కృతమున నవ్యయము ఉప సర్గము దీనికి తెనుగున వ్యస్తప్రయోగము

వ్యగ్రము ప్రతి శబ్దమునకు స్వతంత్రప్రయోగమర్వాచీనముగాని, అవ్యయ స్యేతరస్యాపి ప్రయోగో విష్ణుశర్మణా॥ ఈ వికృతివివేక గ్రంథమును బట్టి [సంజ్ఞా-27 కారిక] స్వదేశ్యాదిరారత ప్రయోగమునుబట్టి దీనికి తత్సమ తుల్యత్వము సంగీకరించి మిశ్రమ సమాసమును చేసికొనవచ్చును

సమూలవిభుఁడు

మూల విభుడని సిద్ధ సమాసము చేసికొని తరువాత ముందు శబ్దముతో మిశ్రి సమాసమును చేయవలయును మొదటివాఁడైన మూల విభుడని యర్థము లభించును. లేదా ముందు శబ్దమునకు సిద్ధసమాసైక దేశములోని కన్వయము చెప్పవలయును సంధి కొత్రిత్రాదులవలె చెప్పి కొనవచ్చును

లలిత రూప :

"కలిలోచన రంధ్రమ్ముల
మునుమిడి హరి లలితరూపములలో గొనినె
మ్మనముల బరిరంభించిరి

10 పూ 859

ఇది ముద్రణాలోపమై ఉండవచ్చును 'మునుమిడి' అని చెప్పిన పిదప మరల మునులోగొని అనుట పొసగదు

హరి లలితరూపములలోగొనియని యుండుట సరి కాదనిన "లలిత రూప"మ్మైరి పదముగాదని చెప్పవచ్చును "రూప" శబ్దమునకు రూపు అనుతత్సమము గూడ కల్పించుచున్నది చిత్రరూపుతరంగి విశ్లేషితంబులయ్యె సర్వభూతములు [ఉద్యో 4-116] ఇచ్చట రూపు సిద్ధ సమాసఘటితము కావున పోతన ప్రయోగమందలి "రూపు" సంస్కృత సమమనక తప్పదు అట్లే తక్కిన పదములకును చెప్పవచ్చును.

3 10 3 కారక సంబంధానుగుణముగ సమాసములను ఈ క్రింది విధముగ విభజింపవచ్చును

1] "తత్పురుష, కర్మధారయ, ద్విగువులు" — అని నిర్ధారక [DETERMINATIVE] సమాసములు ఇవి సాధ్య సమాసము లోని మూడింటిలోనేదో యొకదానికి చెందును.

2] బహువ్రీహి [POSSESSIVE]

3] ద్వంద్వము [COPULATIVE]

సామాన్యముగ ద్వంద్వ, బహువ్రీహి సమాసములు అచ్చిక సమాసము లతో కలిసియే యుండును

3 10 3.1 తత్పురుషము

1 తలుచుగవిది ఉత్తర పదార్థ ప్రధానము

చోరబాధలు 4-492

పట్టణ సుందరులు 10 పూ 12 8

పుణ్యనిధి 10 ఉ 1016

బంధుకోటి 10 ఉ 1076

బలగర్వము 10 ఉ 937

బుద్ధి బలము 1-320

2. కొన్ని యెడల తత్పురుషమున పూర్వపదము ఏకాక్షరమై కని పించును

పూఁబోడి 9-25

3 కొన్ని సమాసములందు పూర్వ పదము అదంత, ఇదంతముగా నుండును దీని వలన పూర్వపదములకు సంబంధమును స్థిరీకరించును

కన్నకడుపు 8-484

చలివెలుగు 9-171

చెవుల పండువు 1-134

పసిడి యొడలు 8-717

3.10 3.2 కర్మధారయము .

సామాన్యముగ విశేషణము ముందు విశేష్యము తరువాత వచ్చును [విశేషణ పూర్వపద కర్మధారయ సమాసము]

దేశ్యము+దేశ్యము :

ఎల్లిపొద్దు 1-240

ఎఱమంట 8-216

కడుసిగ్గు 8-200

చిఱువగవు 8-307

పెనుమంట 3-988

దేశ్యము+తత్సమము :

చెడు రీతి 3-401

తత్సమము+తత్సమము :

ఇష్ట చరిత 1-45

దృఢ శక్తి 3-546

2. కొన్నిచోట్ల పూర్వపదాంతమందలి 'ము' వర్ణములోపించి దాని స్థానమున "పు" వర్ణము వచ్చును.

కదిరపు పేరిటు 9-561

చిక్కని బంటు 10 పూ 1762

పారంపు ముద్ద 10 పూ 1303

3. కొన్నిచోట్ల పూర్వపదముపై మువర్ణ లోపముతో పాటు టుగాగమము వచ్చును

కోరంపుటలుక 10 పూ.1063

ప్రాయంపుటింతి 8-393

వీతం పుటురులు 10 ఉ 242

3.10.3 3 ద్విగు సమాసము .

1. ఇందు సంఖ్యా విశేషణము పూర్వమందుండి విశేష్యము తరువాత వచ్చును.

దేశ్యము+దేశ్యము :

ఇరువంకలు 4-415

ముగ్గురు గొడుకులు 9-172

నలుగడలు 8-216

ఏనేండ్లు 1-116

దేశ్యము+తద్భవము :

రెండు దెసలు 1-235

ఏడు దీవులు 9-560

ఎనిమిది కమ్మలు 10 పూ.543

2 కొన్నిచోట్ల పర పదాది 'న' కారము పూర్వ పదాంత హల్లుతో చేరి ఎ కారమును పొందును.

ఇమ్నూఱు 10.పూ 21

ముమ్నూఱు 9-262

నమ్నూఱు 3-349

నమ్నూటివి 10 పూ 21

ఒక, ఒక్క అను సంఖ్యలు విశేషణములుగ, పదమునకు పూర్వము ప్రయోగింపబడుచున్నది.

దేశ్యము+దేశ్యము :

ఒక బొట్టు 8-324

ఒక యేరు 3-345

ఒక్కచోటు 10 ఉ 619

ఒక్కమాట 10 పూ 738

ఒక్కవాన 1-103

దేశ్యము+తత్సమము .

ఒక పాతము 8-625

ఒక సమయము 3-489

ఒక్క క్షణము 9-70

4 పదమునకు పూర్వము 'రెండు' అనునది విశేషణముగా వాడబడును

| | |
|---|---|
| రెండముక్కలు | 10 పూ 1765 |
| రెండుగడియలు | 2-11 |
| రెండుదినలు | 1-235 |

5 కొన్నిచోట్ల "రెండు" అను రూపమునకు విశేషణము 'ఇరు' వచ్చును

| | |
|---|---|
| ఇరుగెలంకులు | 10 పూ 1082 |
| ఇరువంకలు | 4-415 |

6. 'మూడు' నకు విశేషణము 'ము'

| | |
|---|---|
| ముప్పిరి | 3-397 |
| మూమ్మాటు | 4-215 |
| ముయ్యేడు | 2-153 |

7 నాలుగు అను రూపమునకు విశేషణము'నలు'

| | |
|---|---|
| నలుగడలు | 8-216 |
| నల్దిక్కులు | 4-29 |
| నల్దిశలు | 4-648 |

8 ఇన్ని, ఎన్ని, కొన్ని అను వానికి ఇన్, ఎన్, కొన్, అను రూపములు వచ్చును

| | |
|---|---|
| ఇన్నాళ్లు | 9-425 |
| ఎన్నాళ్లు | 8-728 |
| కొన్నాళ్లు | 10 పూ 1631 |

3 10 3.4 బహువ్రీహి సమాసము అన్యపద అర్థ ప్రధానము

| | |
|---|---|
| దీన వత్సం | 1-109 |
| పువ్వుఁబోడి | 9-175 |
| ముక్కంటి | 1-352 |

3 10.3.5 ద్వంద్వ సమాసము : ఉభయ పదార్థ ప్రధానము

| | |
|---|---|
| అక్కా చెల్లెండ్రు | 8-470 |

తల్లి దండ్రులు 1-320
పుణ్య పాపములు 3-831
సుఖ దుఃఖములు 1-272

3 10 4 కారాగృహ లేదా కారాగార అనే సమాసములోని ద్వితీయావయవమైన 'గృహ' లేదా 'అగార' అనునవి "ఇల్లు" అను తెలుగు పదమునకు పర్యాయ పదములు ఈ పదములకు పర్యాయముగ "ఇల్లనువాడి" "కారాయిల్లు" అను సమాసమును మన వారు గల్పించిరి

కారా ఇంటనడంచె 10 పూ 130

ప్రయోగమును పోతన వాడెను

3 10 5 కారా గృహ "లేదా" కారాగార" అను సంస్కృతములో ప్రసిద్ధములైన సమాసములకు సాదృశ్యముగ గుర్తింపదగిన "కారాశాల" అను క్రొత్త సమస్త రూపమును ప్రయోగించిన కీర్తి పోతనకు దక్కినది.

"కారా శాలల మాపిమిత్రము మిముంగంసుందు
గారింపగా" 10 పూ 1393

## 4 క్రియారూప విజ్ఞానము (VERB MORPHGL OGY)

4 1 0 క్రియా వ్యవస్థ :

సంస్కృతమున ధాతువు, క్రియ, కృతి, వ్యాపారము, ఆఖ్యాతము అను పదములు భిన్నమైన వియతార్థములకు వాచకములుగా వాడబడినవి నిరుక్తము నందు 'నామాఖ్యాతో పసర్గ నిపాతము' అని నాలుగు రకములుగా శబ్దములు విభజింపబడినవి ఆఖ్యాతమనగా క్రియా వాచకము. 'భావ ప్రధాన మాఖ్యాతమ్ భావ మనగా 'నామ పద వాచ్యార్థాశ్రయ క్రియా వ్యంగ్యోభావ , పాకరాగత్యా గాభ్యా అని వివరణము ధాతువనగా పాణినీయ వ్యాకరణమున పేర్కొనబడిన క్రియార్థక శబ్దములని యర్థము 'భూ'- మొదలగునవి ఇవి సామాన్యముగా ఏకాచ్క, ద్వ్యచ్కములై యున్నవి ప్రాచీన సంస్కృత వ్యాకరణములలో సాధారణముగా ఆఖ్యా

తము [1] అను పదము శబ్ద పరముగా వాడుచుండగా తెలుగు వ్యాకరణము అందు క్రియా శబ్దము దాని స్థానమున బోధకముగా వాడపడుచున్నది

ద్రావిడ భాషలలో ప్రాచీనమైన తమిళమున క్రియ, ఆఖ్యాతములని సంస్కృత పరిభాషను పాటించక 'వినై' యను తమిళ భాషా పరిభాషనే గ్రహించిరి ఈ పదము వలన క్రియ అను సామాన్య వ్యాపారార్థమునే గ్రహించిరి కాని దానికి లక్షణము నిర్దేశించలేదు ఉరిచ్చొల్ [2] అను పదము ధాతువు అను వర్థమున తొల్కాప్పియనార్ వాడినట్లూహింప బడినది తమిళమున తొల్కాప్పియనారు కాల బోధకములకు క్రియా రూపములకు తమిళ పదములనే సంజ్ఞలుగా వాడెను

కన్నడ వ్యాకరణములందు సంస్కృత వ్యాకరణానుకరణము అగుటచే క్రియా విషయమున సంస్కృత సంజ్ఞ లేవాడబడినవి తెలుగున గల క్రియా పరిచ్ఛేదము కన్నడమున ఆఖ్యాత విధానము, ఆఖ్యాత ప్రకరణమని పేర్కొనిరి [3]

బాల వ్యాకరణాదికములందు ప్రాణినీయమునందువలె ధాతు లక్షణ ముగాని ధాతు పరిగణనముగాని చేయలేదు ఈ రెండును శబ్దమణి దర్ప మున చేయబడినవి తెలుగునకు క్రియ పదమును, ధావమును సంస్కృత మునుండియే వచ్చినవి ఆంధ్ర శబ్ద చింతామణి తెలుగు నందలి క్రియా వాచకములు ఉపకృతి, వరిణతి, నంస్కృతి అని మూడు విధములని పేర్కొనినది సంస్కృత సంజ్ఞాప్రకరణమున ధాతువు తెలుగు వ్యాకరణ

1. ధాత్వర్థేన విశిష్టస్య విధేయత్వేన బోధనే "సమర్థస్యార్థయత్నస్య శబ్దో వాఖ్యాతముచ్యతే, శబ్ద మణి ఆఖ్యాత ప్రకరణము

2 ఏ యస్ సుబ్రమణ్య అయ్యర్‌గారి ఆంగ్ల పరివర్తనముతో శబ్ద మణి పేజీ 141, 198

3 ఆఖ్యాత విధానమ్ 11 క భాషా భూ ఆఖ్యాత ప్రక క్రియె యర్థదమూలం ప్రత్యయరహితం ధాతు శబ్దమణి 215 క్రియార్థోధాతు క భా భూ

మున క్రియ అనబడును [4] ఇట్లు సూత్రించినను ధాతువుల తిఙంత రూపములయిన 'పోయెను' మొదలగునవి కూడ క్రియలవియే వ్యవహరింపబడుచు వచ్చినవి దీనినే కేతన తన గ్రంథమున నంగీకరించి వ్యవహరించెను [5] అర్వాచీనులు క్రియ పదమును తిఙన్త బోధకముగా వాడిరి. [6] కావున క్రియా శబ్దము ధాతువునకు తిఙన్త రూపమైన వచ్చెను మొదలగు శబ్దములకును గూడ తెలుగు వ్యాకరణమున బోధకమైనది ఆంధ్ర శబ్ద చింతామణి మొదలగు తెలుగు వ్యాకరణములందు క్రియా పరిచ్ఛేదము అను పేరే తిఙన్త రూపములను సాధించు ప్రకరణమకు పేరైనది క్రియాపదమున కర్థమును వాక్యపదీయమున[7] అప్రధానులైన అవయవములచేనుపలక్షితమైన సమూహము, క్రమజాతములయిన వానివి కూర్చిన బుద్ధిస్థమయిన యభేదము గలది అని చెప్పబడినది కావున క్రమముగా కల్గిన మార్పును గూర్చిన యభేద భావము గలదియే క్రియయనుట సిద్ధము

క్రియ వ్యాపార బోధకమైనది పదముల గుంపును అర్థకాది భావ బోధకముల నుండి విభజింపబడి రూపభేదమును కల్గినట్టిది క్రియ అట్టి క్రియలందలి ముఖ్య భాగమే ప్రాతిపదిక క్రియా ప్రాతిపదికకు కొన్నిచోట్ల ప్రత్యయములు చేరుటయు, మరికొన్నిచోట్ల ప్రత్యయములు లేకపోవుటయు పోతన ప్రయోగములందు కనిపించుచున్నది

**4.1.1** తెలుగు క్రియలన్నింటిని సమాపక, అసమాపకములని రెండు విధములుగా వింగడింప వచ్చును.

---

4 అద్య క్రియాపభూతార్థ ద్యోతినమాద్యగం వినాసర్వం సంజ్ఞా 17

5. ప్రత్యయ ఇహ వర్జక క్రియాధాతు సం 6

6. మధ్యమ పురుష క్రియలయందిత్తునకు సంధియగు బా వ్యా సంధి 7
తద్ధర్మభూత క్రియలార్థ్యాద్యర్థ పరకంబులై ప్రశ్నార్థకంబులగు వ్యతిరేక క్రియ యర్థత్రయ బోధకంబగు ప్రౌఢ క్రియ 7

7 యావత్సిద్ధమసిద్ధం వాసాధ్యత్వేనా భిధీయతే ఆశ్రిత క్రమరూపత్వాత్ సాక్రియేత్య భిధీయతే గుణభూతై రవయవైః సమూహః క్రమజన్మనామ్ బుద్ధ్యా ప్రకల్పితా భేదః క్రియేతివ్య పదిశ్యతే

సమాపకమనగా వాక్యార్థము పూర్తి అయి ఆకాంక్ష నెరవేరును అసమాపకమనగా వాక్యార్థము పూర్తిగాక ఆకాంక్ష నెరవేరక యుండును చేయుచున్నాడు—చేయుచున్నవాడు—చేయుచున్+ఉన్న+వాడు ఈ క్రమమున సమాపక క్రియారూపము లేర్పడినవి ఈ వాక్యములన్ని భావ పరిపూర్తిగల వాక్యములే చేయుచున్నవాడు అను దానియందు ధాత్వర్థము అయిన సంవ్యాపారము, కర్త, వచనము కాలము మొదలగునవి కలవు అది కాలక్రమమున విశేషణమైనది చేయుచున్నవాడు రాముడు అనునదియే వైయాకరణులచేత నంగీకరింపబడిన వాక్యమునందలి సమాపక క్రియారూపమైనది మొదటిది వాక్యావస్థ రెండవది విశేషణావస్థ మూడవది సమాపక క్రియారూపము తెలుగునందలి సమాపకక్రియ సమాసము వంటిదనుట ఉత్తమము ఎందుకనగా తెలుగుభాష యంతయు సంయోగాత్మకావస్థ యందును భాషారూప నిర్మాణ ప్రణాళిక సమాస రచనా విధానముపై ఆధారపడి యుండును సమాపకక్రియలో సంపూర్ణ వాక్యమేర్పడును అసమాపక క్రియలో సంపూర్ణవాక్య మేర్పడదు సమాపక క్రియయందు క్రియా ప్రాతిపదికపై కాల భావ బోధక ప్రత్యయము (Tense mood markers) పురుష ప్రత్యయము (Persona suffix) చేరును అసమాపక క్రియయందు క్రియా ప్రాతిపదికపై కాల భావ బోధక ప్రత్యయమే చేరును (Tense mood maker) పురుష ప్రత్యయము చేరదు

4 1.1.1 సమాపక క్రియలు రెండు విధములు

1 సామాన్యము (SIMPLE)

2 సంయుక్తములు (Compound)

1 కాలభావ బోధక ప్రత్యయములను క్రియా ప్రాతిపదికకు చేర్పగా సామాన్య సమాపక క్రియారూపములు గలుగును.

| | |
|---|---|
| కోరు-దు-రు > కోరుదురు | 1-80 |
| కూడు-ఎద-రు > కూడెదరు | 10 పూ 1472 |
| చెప్పు-ఎద-రు > చెప్పెదరు | 7-246 |
| నిలుచు-Ø-ను > నిలుచును | 2-13 |

నేరు-అ-→నేరరు 10 పూ 70

వెదకు-ఎ-ను→వెదకెను 10 పూ 505

వచ్చు-ఎద-వు→వచ్చెదవు 10 ఉ 110

విను-∅-ము→వినుము 9-6

ఈ క్రియా నిర్మాణమున గల కోరు, కూడు, చెప్పు, నిలుచు నేరు, వెదకు, వచ్చు, విను మొదలగు క్రియా ప్రాతిపదికలను అంతకంటె తక్కువ పదాంశములుగా విడదీయుటకు వీలుకాదు పై వానిలో ఒకే ధాతువును కలిగినది సామాన్య క్రియా రూపమగు చున్నది

సంయుక్త సమాపక క్రియలందు మూల ధాతురూపమునకు ఇతర విభక్తి ప్రత్యయములకు ప్రత్యక్ష సంబంధముండదు

క్రియా విశేషణము ప్రథమ పురుష సర్వనామముతో కలిసి వచ్చు చున్నది

ఉన్న-వాడు 1-214

ఉన్న-వారు 10 పూ 1226

ఉండు-వారము 7-324 వర్తమాన భవిష్యత్కాల

వాచక క్రియారూపములు ఈ తెగకు చెందినవి

4 1.1 2 భిన్న కాల భావ బోధక ప్రత్యయములతో ఏర్పడిన సామాన్య సమాపక క్రియానిర్మాణము క్రింది పట్టికలో [4 1 1 3] చూపింప బడినది. డాక్టరు భద్రిరాజు కృష్ణమూర్తి చూపిన పట్టిక ఉన్న దున్నట్లుగా విచ్చట ప్రదర్శింపబడినది [8] ఈ గ్రంథమున అనుసరించిన ప్రణాళికనుబట్టి మూల ధాతువును అజంతముగా తీసికొన వలెను

[7] పట్టిక యందలి 'వంద్-' మున్నగు రకములుగా గల ధాతువును వండు అని గ్రహించిన ప్రస్తుత ప్రణాళికకు సరిపోవును

8 Bh Krishna Murthy, Te ugu Verbal Bases, P 09

మార్పు లేనిచోట Ø శూన్యపదాంశము (Zero morpheme) ఉన్నదని గ్రహింపవలెను

4.1.1.3. సామాన్య సమాపక క్రియా నిర్మాణ పట్టిక.

4 1 1 4 పట్టిక ననుసరించి ఐదు విధములుగా సమాపక క్రియా రూపములు కలవని స్పష్టపడుచున్నది

1 భూతకాలము (PAST TENSE)
2 తద్ధర్మార్థకము (HABITUAL)
3 వ్యతిరేకార్థము (NEGATIVE)
4 విధ్యాశీరర్థకము (IMPERATIVE BENEDICTIVE
5 నిషేధార్థకము (PROHIBITIVE)

వీనియందు భూతకాల, తద్ధర్మార్థక, వ్యతిరేకార్థక, క్రియాపదము లకు ఎనిమిది విధములైన క్రియారూప జాతములు (Parad gms) కానవచ్చుచున్నవి

1 ఉత్తమ పురుషైక వచనము
2 ఉత్తమ పురుష బహువచనము
3 మధ్యమ పురుషైక వచనము
4 మధ్యమ పురుష బహువచనము
5 మహద్వాచక ప్రథమ పురుషైక వచనము
6 అమహద్వాచక ప్రథమ పురుషైక వచనము
7 అమహద్వాచక ప్రథమ పురుష బహువచనము
8 మహన్మహతీ వాచక ప్రథమ పురుష బహువచనము

ఇట్టి విభజన పోతన భాగవతమునకు వర్తించును :

4.1.2 క్రియా ప్రాతిపదిక : (THE VERB STEM)

క్రియా రూపముల కొన్నిటిని గ్రహించి యందలి ప్రత్యయములను పరిహరించి సమానాంశమైన దానిని ధాతువుగా వ్యాకర్తలు పేర్కొనిరి మూలద్రావిడభాషలో ధాతువులు చాలావరకు ఏకాచ్కములు, తెలుగులోను మూలధాతువులు చాలాభాగము ఏకాచ్కములు, క్రియారూపము లందలి

అర్థవంతమైన అల్పమైన మూలరూపములకు క్రియాప్రాతిపదికలని అందురు పోతన భాగవతమునగల క్రియా ప్రాతిపదికలను క్రింద ఉదాహరించు చున్నాము క్రియా ప్రాతిపదికలు సామాన్య, సంశ్లిష్ట, సంయుక్త ధాతు రూపములని మూడు తెఱంగులు

4.1.2.1. కాల భావ బోధక ప్రత్యయములు క్రియా ప్రాతిపదికలకు చేరు నపుడు వాని రూపముల ననుసరించి సామాన్యధాతువుల (Simple Verbal Roots) ను ఐదు తరగతులుగా విభజింపవచ్చును

4.1.2.2. క్రియా ప్రాతిపదికలకు -ఇంచు/ -ఇల్లు ప్రత్యయములు చేరుట వలన సంశ్లిష్ట ధాతువులు కలుగుచున్నవి. ఇందు-ఇంచు తాచ్ఛీల్య కరణ ప్రత్యయము, -ఇలు/ -ఇల్లు సకర్మక ప్రేరణార్థక ప్రత్యయములు సంశ్లిష్ట ధాతువుల (Complex Verbal Roots)ను మరల అచ్చిక, తత్సమములని రెండుగా విభజింపవచ్చును

4.1.2.3. సంయుక్త ధాతువులు

(COMPOUND VERBAL ROOTS)

ఒకటి కంటె ఎక్కువ ధాతువులుండి ప్రత్యయములు పరమైనను, కాకున్నను సంయుక్త ధాతువు లేర్పడును "ధాత్వాదులకు ధాతువులను ప్రయుక్తంబులయి విలక్షణార్థాభిధాయకంబు లగుసీయది శబ్దపల్లవంబులు నా బడు"[9] అని చిన్నయసూరి సూత్రీకరించెను సామాన్య సంశ్లిష్ట, సంయుక్త ధాతువుల విశ్లేషణము అనుబంధము-3లో ఈయబడినది

4.2.0 సామాన్య ధాతువులు .

(SIMPLE VERAAL ROOTS)

4.2.1 సామాన్య క్రియా ప్రాతిపదికలతో కూడిన రూపములు .

CANONIAL FORMS OF VERBAL ROOTS)

4.2.1.1. రెండచ్చులతో కూడిన క్రియా ప్రాతిపదికలు :

1 [హ] అహఅ . [అ=అచ్చు, హ=హల్లు]

అను : చెప్పు 9-104

---

9 బా వ్యా: క్రియా 18

| | | | |
|---|---|---|---|
| ఇడు | : | వశించు, ఇచ్చు | 10 పూ 967 |
| కను | : | చూచు | 4-845 |
| చను | : | వెళ్లు | 1-50 |
| చెడు | : | నశించు | 1-272 |
| తగు | : | యుక్తమగు | 3-331 |
| తెగు | | ఖండితమగు | 3-584 |
| విడు | | వదలు | 1-198 |
| వీను | | ఆకర్ణించు | 1-197 |

2. [హ] అ హ హ అ।

| | | |
|---|---|---|
| అంటు | తాకు | 9-362 |
| అబ్బు | కలుగు, దొరకు | 3-556 |
| ఉండు | నివసించు | 1-78 |
| ఉబ్బు | పొంగు | 3-185 |
| కట్టు | బంధించు | 10 ఉ 140 |
| తెచ్చు | తీసికొనివచ్చు | 1-79 |
| పుచ్చు | పంపు | 10 పూ.828 |
| మెచ్చు | శ్లాఘించు | 10 ఉ 314 |

3. [హ] అ హ అ

| | | | |
|---|---|---|---|
| అడు | . | అడుగొను | 10 పూ 920 |
| ఓపు | : | సహించు | 1-27 |
| కోరు | | వాంఛించు | 10 ఉ 963 |
| గీటు | | తాకించు | 9-102 |
| దాగు | . | మఱుగుపడు | 8-29 |
| తాకు | | స్పృశించు | 2-115 |
| దాటు | | అటువైపు వెళ్లు | 8-154 |
| పాయు | . | వదలు | 4-861 |
| రోయు | . | బాధపడు | 9-596 |

4. [హ] అ హ అ.

| | | | |
|---|---|---|---|
| సైచు | : | ఓర్చు | 7-32 |

5. [హ] అ హ హ అ.

| | | | |
|---|---|---|---|
| అర్చు | : | అరచు | 3-620 |
| ఈడ్చు | | బయటకు లాగు | 1-163 |
| ఏడ్చు | . | దుఃఖించు | 1-142 |
| ఓర్చు | : | సహింపు | 7-126 |
| పేర్చు | : | వరుసగా ఉంచు | 3-763 |
| వేల్చు | | దహించు | 4-122, 529 |

6. [హ] హ అ హ అ.

అది సంయుక్తతలో రేఫద్వితీయ వర్ణము

| | | | |
|---|---|---|---|
| క్రోలు | | సేవించు, స్వీకరించు | 3-194 |
| క్రాగు | | వేడియగు | 3-371 |
| క్రోచు | : | గెంటించు | 1-172 |
| త్రావు | | సేవించు | 10 పూ 11 |
| ప్రోచు | | కాపాడు | 4-823 |
| మ్రోయు | | ధరించు | 10 పూ 1126 |

7. [హ] హ అ హ హ అ:

| | | | |
|---|---|---|---|
| క్రమ్మ | | వ్యాపించు | 10 పూ 741 |
| త్రుంచు | | ఖండించు | 1-58 |
| ద్రచ్చు | | వశించు | 10 పూ 326 |
| వ్రచ్చు | · | మునుకొను | 4-58 |
| మ్రొగ్గు | : | ముందుకుతూలు | 10 పూ 1318 |
| మ్రొక్కు | | నమస్కరించు | 9-214 |
| వ్రగ్గు | : | తగ్గు | 1-278 |
| వ్రక్కు | : | దుఃఖించు | |

4 2.1.2 త్రిస్వర క్రియా ప్రాతిపదికలు [ ]

1. [హ] అ హ అ హ అ

| | | |
|---|---|---|
| అదరు : | కోల్పిల్లు, ఒప్పు | 1-34 |
| ఇదుపు : | ఉంచు | 10 పూ 1590 |
| ఒనగు | ఇచ్చు | 3-25 |
| కలగు | లభించు | 4-59 |
| చెనకు . | తాకు | 1-360 |
| తనరు . | ప్రకాశించు | 1-232 |
| పెరుగు · | వృద్ధిబొందు | 10 పూ 182 |
| వెదకు | అన్వేషించు | 4-751 |

2. [హ] అ హ అ హ అ :

| | | |
|---|---|---|
| అరయు . | వెదకు | 10 పూ 559 |
| ఏడుచు . | దుఃఖించు | 7-124 |

3. [హ] అ హ [అ] హ అ ,

| | | |
|---|---|---|
| అ/ధ్యా/యకు | ఉద్యమము చేయు | 9-468 |
| క/ల్గ/లగు | లభించు | 10 ఉ 664 |
| కొ/ల్చ/లచు | పూజించు | 3-484 |
| గె/ల్చ/లచు | జయించు | 1-360 |
| తె/ల్చ/లచు | చెప్పు | 1-131 |
| ప/ల్కు/లకు | మాట్లాడు | 4-296 |
| స/ల్పు/లకు | చేయు | 4-764 |

4. [హ] అ హ [అ] హ అ ·

| | | |
|---|---|---|
| అ/ర్చు/రుచు | బొబ్బరించు | 3-620 |
| ఉ/ర్చు/రుచు | లాగు | 1-163 |
| ఏ/ర్చు/రుచు : | దుఃఖించు | 1-142 |
| ఓ/ర్చు/రుచు : | సహించు | 7-126 |

ఏ౦గిలె/ర్చు/రుచు  కలుపు  1-214
నే/ర్చు/రుచు  అభ్యసించు  1-70
వే/ర్చు/రుచు  దహించు

5. [హ]  హ అ హ అ హ అ
క్రుదుకు.  జీవించు  7-322

6. [హ]  హ అ హ [అ] హ అ
ప్రే/ర్చు/రుచు.  తాపము నొందించు  10.ఉ 533

7. [హ]  హ అ హ హ అ హ అ
క్రుమ్మరు:  సంచరించు  3-503

4 2.1 3 చతుస్వర క్రియా ప్రాతిపదికలు.

1. [హ]  అహ అహ [అ] హ అ
కావ/ర్చు/రుచు  చేయు  2-245
కద/ర్చు/రుచు.  చరించు  10 పూ 721
చెమ/ర్చు/రుచు.  ఇంకిపోవునట్లు చేయు 10 పూ 1143
తవ/ర్చు/రుచు:  ప్రకాశించు  2-113

4 2.2 1 వ్యతిరేకార్థమునందు వాడబడిన క్రియా ప్రాతిపదికలు

| | | | |
|---|---|---|---|
| ఉడుగక | 3-386 | పడక | 1-165 |
| ఊరక | 1-80 | పొందక | 4-292 |
| ఎఱుంగక | 1-321 | పొరయక | 3-238 |
| కలయక | 3-204 | మానక | 3-119 |
| కదయక | 1-65 | పదలక | 3-256 |
| తోపక | 2-225 | | |

2. భాగవతమున క్రింది చకారాంత, యకారాంత ధాతువులను రెంటిని ఏకకాలమున పోతన ప్రయోగించెను

| | | | |
|---|---|---|---|
| ఏచు | 3-1026 | ఏయు | 9-448 |
| క్రోచు | 1-172 | క్రోయు | 3-530 |

### 4.2.3 క్రియా ప్రాతిపదికల విభజనమున సంధిగతమైన లక్షణములు (Morpho phonemic criteria for the classification of verbal stems)

కాల భావ బోధక పదాంశములకు పూర్వమున్న ప్రాతిపదిక పర్యాయ రూపము ననుసరించి ప్రాచీనాంధ్రమున గల క్రియ ఐదు ప్రత్యయాత్మక వర్గములుగ విభజింపవచ్చును తరచుగాను వస్థితమైన కాల భావ బోధక ప్రత్యయముల సంధిగతమున ఏ, బి, సి అను మూడు తరగతులుగ పునర్విభజింప బడినది[10] ఇతరములైన పర్యాయ రూపములు కుండలీకరణమున సూచింపబడినవి

#### 4.2.3.1 ఏ విభాగము . హలాది ప్రత్యయములు

1 -మన్ శత్రర్థకము
2 -చ్- . వర్తమాన కాలధాతుజ విశేషణము
3 -త- విధ్యాశీరర్థకము [ప్రథమ పురుష]
4 -డున్ · అనంతర్యార్థకము
5 --Ø- [ˎన్] తద్ధర్మార్థక ధాతుజ విశేషణము [బి-6]
6 -దు [ˎ/ద్ˎ/ట్] తద్ధర్మార్థకము
-తు [-త్]
7 -బి- భూతకాలము [బి-1]

#### 4.2.3.2 బి విభాగము తాలవ్యాచ్చాదిగా గల ప్రత్యయములు (అగ్రగ స్వరము ఆదిగాగల ప్రత్యయములు)

1. -ఇ-, -ఎ-, -ఇతి భూతకాలము
2. -ఇ . క్త్వార్థకము
3. ఇన [ˎ/న ఱ/అ] : భూతకాల విశేషణము
4. -ఇనన్ [ˎ/నన్ « అన్] చేదర్థకము
5 -ఎడు- / -ఎడి-/-ఎద తద్ధర్మార్థకము
6 -ఎడు-/-ఎడి/- తద్ధర్మార్థక ధాతుజవిశేషణము

---

10. Bh Krishna Murthy Telugu Verbal Bases, P 203, 205

4 2 3.3 'సి' విభాగము కంర్యాచ్చులాదిగా గల ప్రత్యయములు
(పశ్చాత్ స్వరములాదిగాగల ప్రత్యయములు)

1 -అన [\n] అన్నంతము

2 -అ- [\Ø] వ్యతిరేకార్థకము

3 -అకు వ్యతిరేక ప్రార్థనాద్యర్థకము [వ్యతిరేక వవదాంశము-అ-]

4 -అక [\క] వ్యతిరేక క్త్వార్థకము

5 -అవి [\వి] : వ్యతిరేక ధాతుజ విశేషణం

6 -ఉ-[/Ø] విధ్యాశీరర్థకము [మధ్యమ పురుషప్రత్యయములకు పూర్వము]

4 2 3 4 కొన్ని శూన్య క్రియలు తప్ప కాల భావ బోధక ప్రత్యయములకు ముందుండి వర్ణ్యయరూపము పొందిన క్రియా ప్రాతిపదికంన్నియు కొన్ని సంధిగతమైన సూత్రము-ద్వారా వివరింపబడును.

1 అజంత ప్రాతిపదికలకు అచ్చుపరమైనప్పుడు ప్రాతిపదిక అంత్యాచ్చు లోపించును హల్లు పరమైన అంత్యాచ్చు లోపించదు

కోరుచున్ [ఏ-1] 3-202

కోరి [బి-2] 1-234

కోరన్ [ఏ-1] 4-301

ఏ విభాగమునకు చెందిన ప్రత్యయముల ముందు కోరు అనియు బి,సి విభాగ ప్రత్యయముల ముందు కోర్ అనియు ప్రాతిపదిక వచ్చును

2. త్రిస్వర ధాతువులకు తాలవ్యాచ్చులైన ఇ/ఏలు పరమైనచో ధాతువు సందర్భి రెండవ అచ్చు 'ఉ' స్వర సామరస్యముచే మార్పుచెందును

తిరుగు-చున్ [ఏ-1] 9-210

తిరుగ్-అక [సి-4] 8-634

తిరిగ్-ఎదున్ [బి-5] 4-237

తిరిగ్+ఇ [బి-2] 9-606

[29]

హలాది ప్రత్యయములు పరమగుచో (ఏ విభాగము) తిరుగు అనియు, తాలవ్యాద్యులైన ఇ/ఏ లకు ముందు [బి - విభాగము] తిరిగ్ అనియు కంఠ్యాద్యులాదిగా గల ప్రత్యయముల ముందు (సి-విభాగము) తిరుగ్ అనియు క్రియాప్రాతిపదిక మూడు భాగములుగా పర్యాయ రూపములనొందును

3 -యు/-య్యు వర్ణాంత క్రియా ప్రాతిపదికలకు తాలవ్యాద్యులైన ఇ ఏలు పరమైనపుడు స్/స్సుగా పర్యాయ రూపముల నొందును

చేయు-దున్ [ఏ-1] 1-241
చేస్-ఇ [బి-2] 1-34
చేయ్-అన్ [సి-1] 2-209
చేస్-ఎను [బి-1] 1-51 దీవిపలన

యు వర్ణాంత ప్రాతిపదిక చేయు [ఏ-విభాగము] చేస్ [బి-విభాగము] చేయ్ [సి-విభాగము] అని మూడు పర్యాయ రూపములుగ వచ్చుచున్నది

4 [అ] చు వర్ణాంత క్రియా ప్రాతిపదికలకు తద్ధర్మార్థక ప్రత్యయములైన-తు-/-త్- పరమైనపుడు ప్రాతిపదిక మార్పుకు లోనగును తక్కినహల్లుల పరమైనచో ప్రాతిపదిక మార్పుచెందదు

-చు+దు-[ఒద్-1] > -తు- [ఒ-త్-]
చూచు+దు-రు > చూతు-రు 4-71
చూచు+ద్+ఉము > చూత్-ఉము 10 పూ 1481
చెఱచు+దు-రు > చెఱతు-రు 4-269
చెఱచు+ద్-ఉము > చెఱత్-ఉము 10 పూ 993
తలచు+దు-ను > తల-తు-ను 4-16

[ఆ] చ్చు వర్ణాంత క్రియా ప్రాతిపదికలకు తద్ధర్మార్థకప్రత్యయములైన -తు/-త్ పరమైనపుడు ప్రాతిపదికాంతవర్ణములకు త్ ఆదేశమగును ఈ మార్పు ఇతరములు పరములగునపుడు రాదు

-చ్చు + దు - [ఒద్-] > -త్తు- [ఒత్-]
చచ్చు + దు + రు > చత్ -తు- రు : చత్తురు 2-3
తెచ్చు + దు + ఒన్ > తెత్-తు-న్ : తెత్తున్ 1-143
వచ్చు+దు+రు > వత్-తు-రు : వత్తురు 7-67

అన్వాదులకు [అద్విరుక్త మవర్ణాంత క్రియా ప్రాతిపదికలకు] భూతకాల నపదాంశమైన -టి-, తద్ధర్మార్థక నపదాంశమైన -ద్- పరమైనపుడు ధాతు ప్రాతిపది కాంత వర్ణము ఙ్ గా పర్యాయ రూపమును పొందును.

అఙ్-టి-వి : అంటివి 3-574
అఙ్-ద్-రు : అంద్రు 3-949
కఙ్-టి-మి కంటిమి 4-949

హ్రస్వదీర్ఘాచ్చులతో కూడిన ఏకాచ్కధాతు ప్రాతిపదికలకు కంత్యాచ్చు లాదిగాగల [సి-విభాగములోని] ప్రత్యయములు పరమైనపుడు ప్రత్యయ గతమైన అచ్చులోపించును

వచ్చు :

| | | | |
|---|---|---|---|
| రా+అక | రాక | [సి—4] | 10 పూ 756 |
| రా+అన్ | రాన్ | [సి—1] | 9-331 |
| రా+అదు | రాదు | [సి—2] | 10 పూ 1727 |
| రా+అము | రాము | [సి—2] | 10 ఉ.232 |
| రా+అవి | రావి | [సి—5] | 10 పూ 498 |
| ర+ఉ+మ్ము | రమ్ము | [సి—6] | 7-209 |
| ర+ఉ+ండు | రండు | [సి—6] | 8-635 |
| రా+అ+వు | రావు | [సి—2] | 10 పూ 989 |

వచ్చు ధాతువునకు రా/ర- అనునవి నపదాంశములు

ప్రాచీనాంధ్రమున క్రియా ప్రాతిపదికలను ఐదు తరగతులుగ విభజించియున్నారు

### 4 2.3.5 మొదటి తరగతి (CLASS I)

పోతన భాగవతమున గల క్రియా ప్రాతిపదికలలో ఎక్కువభాగము ఈ వర్గానికి చెందినవి వీనిని రెండు అంతర్భాగములుగ విడదీయవచ్చును

[అ . 1. కను, చేయు మొదలగు ద్విస్వర ధాతువులకు, ఎవగు, తొరగు మొ॥ త్రిస్వరధాతువులకు కాలభావ బోధక ప్రత్యయ ములు పరములగునపుడు సంధిగత మార్పులు పొందును.

కను+ఇ కని [బి విభాగము] 3-971
చేయు+అకు : చేయకు [సి విభాగము] 3-35
చను+చున్ చనుచున్ [ఏ విభాగము] 9-224
ఎనగు+అక ఎనఁగక [సి విభాగము] 10.ఉ 1062
తొరగు+ఎదు తొరగెదు [బి విభాగము] 4-77

ప్రాతిపదిక ప్రత్యయముల ముందు పర్యాయ రూపమైన ప్రాతిపదిక

| ప్రాతిపదిక | ఏ విభాగము | బి విభాగము | సి విభాగము |
|---|---|---|---|
| ఇచ్చు | ఇచ్చుచున్ | ఇచ్చి | ఇచ్చు |
| | [1-248] | [2-819] | [1-219] |
| | ఇచ్చు- | ఇచ్చ్- | ఇచ్చ్- |
| తిరుగు | తిరుగుచున్ | తిరిగి | తిరుగక |
| | [9-210] | [9-606] | [8-634] |
| | తిరుగు- | తిరిగ్- | తిరుగ్- |

2 యువర్ణాంత రహితమై దీర్ఘాచ్చులేని ఏకస్వర, ద్విస్వర క్రియా ప్రాతిపదికలు ఏ వర్ణముతో ప్రారంభమగు భూత, తద్ధర్మ కాల భావ బోధక ప్రత్యయములు పరమైనపుడు వైకల్పికముగా 'ఇయ్-' ఆగమముగా వచ్చును.

| | | | | |
|---|---|---|---|---|
| కను | కన్-ఇయ్-ఎ-న్ | : | కనియెన్ | 10.ఉ.449 |
| కలుగు | కలుగ్-ఇయ్-ఉ | : | కలిగియు | 1-278 |
| కొను | కొన్-ఇయ్-ఎ-దు | : | కొనియెదు | 10 పూ 820 |
| చను | చన్-ఇయ్-ఎదున్ | : | చనియెదున్ | 1-330 |
| | చన్-ఇయ్-ఎన్ | | చనియెన్ | 3-1042 |

[అ] త్రిస్వర క్రియా ప్రాతిపదికలందు రెండవ వర్ణము మున్నచో సంధి గతమైన మార్పులలో ప్రాతిపదికలు కాలభావ బోధక ప్రత్యయములు పరమగునపుడు మార్పులు పొందును

ప్రత్యయముల ముందు పర్యాయ రూపతనందిన ప్రాతిపదిక

| ప్రాతిపదిక | ఏ విభాగము | బి విభాగము | సి విభాగము |
|---|---|---|---|
| అరుగు · | అరుగుచున్ | అరిగెదు | అరుగన్ |
| | [9-568] | [4-488] | [3-661] |
| | అరుగు | అరిగ్ | అరుగ్ |

4236 రెండవ తరగతి (CLASS II)

—చు వర్ణాంత క్రియా ప్రాతిపదికలు ఈ వర్గమునకు చెందినవి

—చు వర్ణాంత క్రియా ప్రాతిపదికలు 'వు'గ మార్పు చెందును.

| | | | |
|---|---|---|---|
| గెలుచు · | గెలువన్ | [సి విభాగము] | 10 పూ 706 |
| నేర్చు | నేర్తువు | [ఏ విభాగము] | 1-41 |
| కాచు · | కావవు | [సి విభాగము] | 3-549 |

ప్రత్యయముల ముందు పర్యాయ రూపాంత పొందిన ప్రాతిపదిక

| ప్రాతిపదిక | ఏ విభాగము | బి విభాగము | సి విభాగము |
|---|---|---|---|
| కాచు · | కాచు | కాచ్ | కావ్ |
| గెలుచు | గెలుచు<br>గెలుతు | గెలిచ్ | గెలువ్ |
| నేర్చు · | నేర్చు<br>నేర్తు | నేర్చ్ | నేర్వ్ |

విలుచు, విడుచు క్రియాధాతువులకు విధ్యర్థకర్తృక ప్రత్యయమగు 'ఉ' [సి-6] పరమైనచో ప్రాతి పదిక చివర ఆదేశముగా వచ్చు 'వ్' వైకల్పికముగా వచ్చును

| | | | |
|---|---|---|---|
| విలుచు · | విలు-వ్-అ-దు | విలువదు | 9-571 |
| | విలు-వ్-ఉ-ము | విలువుము | 9-618 |
| | విలు-వ్-ఉ | విలువు | 10 పూ 946 |
| విడుచు | విడు-వ్-అ-దు | విడువదు | 4-890 |
| | విడు-వ్-అ-ను | విడువను | 9-121 |

నేర్పు ధాతువునకు తంర్యాచ్చులాదిగాగల ప్రత్యయములు పర మగునపుడు [పి-1-5] ప్రాతి పదిక భిన్నముగా నుండును

| | | | |
|---|---|---|---|
| నేర్పు : | నేర్-అ-రు | నేరరు | 10 పూ 970 |
| | నేర్-తు-ము | నేర్తుము | 3-818 |
| | నేర్-తు-వు | నేర్తువు | 1-41 |

2 -చు/-ంచు/-ంచు వర్ణాంత ధాతువులు -పు/-ంపు/-ంపుగా మార్పును పొందును

| | | | |
|---|---|---|---|
| గడచు | గడప్+ ఉ | [పి-విభాగము] | 2-47 |
| తరచు | తరప్+ అన్ | [పి-విభాగము] | 3-1035 |
| తలంచు | తలంప్+ అ+రు | [పి-విభాగము] | 7-126 |
| త్రుంచు | త్రుంప్+ ఉ | [పి-విభాగము] | 1-200 |

3 ధాతువునకు తంర్యాచ్చులాదిగా గల ప్రత్యయములు పరమైనపుడు [పి-విభాగము] ధాతు ప్రాతిపదిక ఎట్టి మార్పును పొందదు

| ప్రాతి పదిక | ఏ విభాగము | బి విభాగము | పి విభాగము |
|---|---|---|---|
| మెచ్చు | మెచ్చుచున్ | మెచ్చి | మెచ్చక |
| [శ్లాఘించు] | మెచ్చు- | మెచ్చ్- | మెచ్చ్- |

తెలుగున వ్యాకర్తలు ఈ క్రియా ప్రాతిపదికలను రెండు రకములుగా విభజించిరి

సిద్ధచకారము అనగా ధాతువునందే స్వతస్సిద్ధముగా నున్న చ కారము

చూచు 3-101

పిలచు 3-457

2 అగమ చ కారము ఇది క్రియా ప్రాతి పదికకు అదనముగా చేరు ధాత్వీ కరణ ప్రత్యయముగాని సకర్మక ధాత్వనుబంధముకాని కావచ్చును సిద్ధ చ కార స్థానమున ఆదేశముగ 'వు' వర్ణము వచ్చును అగమ చ కార ముతో కూడిన ప్రాతిపదికలకు పశ్చాత్ స్వరములు పరమగునపుడు 'పు' వర్ణము అదేశముగ వచ్చును

[అ] అను స్వార సహిత సిద్ధ చ కార ధాతువులకు కంఠ్యాచ్చులాది గా గల ప్రత్యయములు పరమైన పు వర్ణము ఆదేశముగ వచ్చును.

| | |
|---|---|
| కలఁచు | 10 పూ 1725 |
| కలఁపన్ | 3-1005 |
| గదచు | 10 ఉ 1121 |
| గదపు | 2-47 |

[ఆ] అరుగుచు, పలుకుచు, మునుకుచు, పలుపుచు మొదలగు రెండవ అంతర్విభాగమునకు చెందిన ప్రాతిపదికాంతమందలి చు వర్ణమునకు కంఠ్యాచ్చులాదిగాగల ప్రత్యయములు పరమగు నపుడు చు వర్ణ స్థానమున పు వర్ణమాదేశముగ వచ్చినది. వీనివిలగమ చ వర్ణముగ నిరూపించుట క్లిష్ట సాధ్యము

ఓడు అను అకర్మక ధాతువునకు సకర్మకమున ఓర్చు అయించు అనియు, వారు అను అకర్మక ధాతువునకు సకర్మకమున వార్చు, సంధ్యను పాలించు అనియు వచ్చుచున్నవి. వీనికి కంఠ్యాచ్చులాదిగా గల ప్రత్యయములు పరమైనపుడు ఓర్ప్, -వార్ప్ అని రావలసి యుండగా ఓర్వ్, వార్వ్ అని వచ్చుట వైయాకరణుల యభిప్రాయమునకు విరుద్ధము. వి అంతర్విభాగమునకు సి- విభాగమునకు చెందిన ప్రత్యయములు పరమైనపుడు పొందు పర్యాయ రూపము గురించి వ్యాకర్తలు ప్రసంగింపలేదు

4 2 3 7 మూడవ తరగతి (CLASS I I)

-యు/-య్యు అంత మందలి క్రియా ప్రాతిపదికలకు సంధిగతమైన మార్పులలో ఒకటి మూడవ సూత్రములు వర్తించును. త్రివ్యర క్రియా ప్రాతిపదికల లో 'ఉ వర్ణము రెండవ వర్ణముగాగల ధాతువులిందు లేవు కావున రెండవ సూత్రము వర్తింపదు

| ప్రాతిపదిక | ఏ-విభాగము | బి-విభాగము | సి-విభాగము |
|---|---|---|---|
| చేయు | చేయు- | చేస్- | చేయ్- |

4.2 3 8 నాలుగవ తరగతి (CLASS IV)

ఈ విభాగమునకు చెందిన ప్రాతిపదికలు చాల తక్కువ.

వీనికి సంధిగతమైన మార్పులలో ఐదవ సూత్రము వర్తించును అమ, కమ, చను, మను, విను మొ॥ అన్నవి క్రియాప్రాతిపదికలు పోతన ప్రయోగములందు కలవు

చున్, చు, దు, ద్ ప్రత్యయములు పరమైన ముందున్న ప్రాతిపదికలు పర్యాయ ప్రవృత్తిని పొందునపుడు ఉవర్ణము లోపించును

| | | |
|---|---|---|
| అమచున్ | [ఏ-1] | 1-55 |
| అనియె | [బి-1] | 1-79 |
| అవినన్ | [బి-4] | 4-715 |
| అందు | [ఏ-6] | 10 ఉ 699 |
| అందని | [సి-5] | 10 పూ 861 |

చు ప్రత్యయము పరమగునపుడు ముందున్న ప్రాతిపదిక పర్యాయ ప్రవృత్తిని పొందునపుడు అంత్య ఉ వర్ణము కొన్నిచోట్ల వైకల్పికముగ వచ్చును

| | | | | | |
|---|---|---|---|---|---|
| అంచు | [ఎ-2] | 9 207 | అనుచు | [ఎ-2] | 4-925 |
| కొంచు | [ఎ-2] | 8-189 | కొనుచు | [ఎ-2] | 4-373 |

4.2 3.9 ఐదవ తరగతి (CLASS V

క్రియా ప్రాతిపదికలకు ఒకే విధమైన సంధిగత లక్షణములేని కారణముచే వీనినన్నిటిని శూన్య క్రియలుగా ఈ ఐదవ తరగతిలో చేర్చిరి కనుక ఏ బి సి అను ఈ మూడు రకముల ముందు ఒక్కొక్క క్రియా ప్రాతిపదిక పొందు పర్యాయ రూపములను ప్రత్యేకముగా ఇచ్చుట జరిగినది సులభతరమునకై ఈ ప్రత్యయములకు అంతర్విభజన చేయుట జరిగినది

అకారాది ప్రత్యయములు : ఏ విభాగమునందలి ప్రత్యయములు [1-5]

వాని పర్యాయ రూపములు [6 సూత్రము

ఇకారాది ప్రత్యయములు
ఎకారాది ప్రత్యయములు | బి విభాగమునకు చెందిన ప్రత్యయములు]

ఉ కారాది ప్రత్యయములు విద్యా కిరర్థకము [సి-6] వాని పర్యాయ రూపము.

1 అగు [అయినట్టి]

పపదాంశములు . అగు-
అవు-
ఔ-
అయ్యె-
కా-

అమచు [ఏ-2] 1-34
అగుటమ [ఏ-6] 4-206
అవుదువు [ఏ-6] 10 పూ 14 6
ఔదురు [ఏ-6] 1-267
అయ్యెదవేని [బి-5] 7-371
అగునేని [సి-6] 3-440
అగవడె [సి-2] 10 పూ 1299
కాదు [సి-2] 1-170
కాకుండునె [సి-4] 2-40

2 ఇచ్చు [సమర్పించు]

పపదాంశములు . ఇచ్చ్, ఇత్, ఇ, ఈ ఇయ్య

ఇచ్చు [ఏ-5] 1-2 9
ఇచ్చుచు [ఏ-2] 1-248
ఇత్తుమ [ఏ-6] 3-804
ఇత్తురె [ఏ-6] 8-521

3 ఉందు . [నివసించు]

పపదాంశములు ఉండు, ఉండ్, ఉన్,

ఉండు ఉండు+∅ [ఏ-5] 1-78
ఉండుదురు . ఉండ్+ఉ+దు+రు [ఏ-6] 1-333
ఉండిరి : ఉండ్+ఇ+రి [బి-2] 1-227
ఉండి ఉండ్+ఇ [బి-2] 2-136

ఉండవివాడు ఉండ్+అవి [సి-5] 2-51

ఉండగ . ఉండ్+అగ [సి-2] 10 పూ.994

ఉండవీక . ఉండ్+అన్+ఈక [సి-1] 7-184

4. ఉడుగు : నాశనమగు

సపదాంశములు ఉడుగు, ఉడుప్, ఉడిప్

ఉడుగు+ము ఉడుగుము [ఏ-5] 4-354

ఉడుగు+అ-డు ఉడుగడు [ఏ-5] 4-427

ఉడుగు+ఎ+ము ఉడిగెము [బి-1] 10 పూ 926

ఉడుగు+ఇ ఉడిగి [బి-2] 3-83

ఉడుగు+అడు : ఉడుగడు [సి-2] 7-253

ఉడుగు+అక : ఉడుగక [సి-4] 1-1026

ఉడుప్+అన్ ఉడుపన్ [సి-1] 10 పూ 1531

ఉడుప్+అ . ఉడుప [సి-2] 10 ఉ 177

ఉడుప్+∅ ఉడుపు [సి-6] 4-33

ఉడిప్+ఇన ఉడిపిన [బి-5] 10 ఉ.1135

ఉడుగు క్రియాప్రాతిపదికకు ఇన, అన్, ప్రత్యయములు పరమైనపుడు ధాత్వంత వర్ణమగు గ కార స్థానమున వ కారము వచ్చును

ఉడుగు+ఇన ఉడిపిన 10 ఉ 1138

ఉడుగు+అన్ ఉడుపన్ 10 పూ 1531

ఉడుగు+∅ ఉడుపు4-33

5 ఎఱుఁగు : తెలిసికొను

సపదాంశములు ఎఱుగ్, ఎఱిగ్,

ఎఱుగ్+అ · ఎఱుగ 1-178 [ఎ-5]

ఎఱుగ్+ఉన్ ఎఱుగున్ [ఎ-5] 9-617

ఎఱిగ్+ఎడు ఎఱిగెడు [బి-5] 1-99

ఎఱిగ్+ఇ ఎఱిగి [బి-2] 9-471

ఎఱుగ్+అము ఎఱుగము [సి-2] 1-251

ఎఱుగు అను క్రియా ప్రాతిపదికకు ఇ, ఎదు ప్రత్యయములు పరమగునపుడు మూడచ్చుల ధాతువు మధ్యగత వర్ణమందలి ఉత్వము లోపించి దానిస్థానమున ఇత్వము వచ్చును

ఎఱుగు+ఇ · ఎఱిగి [వి-2] 9-471
ఎఱుగు+ఎదు ఎఱిగెదు [వి-5] 1-99

6 కలుగు/కల్గు . [పొందు, లభించు]
పదాంశములు కలుగు, కలుగ్, కలిగ్, కల్గ్, కంగ్
కలుగు+Ø · కలుగు [ఎ-5] 4-174
కలుగ్+అ+దు : కలుగదు [సి-2] 3-320
కలిగ్+ఎన్ కలిగెన్ [వి-1] 4-238
కలిగ్+ఇ · కలిగి [వి-2] 3-138
కల్గ్+అవి కల్గవి [సి-5] 7-385
కల్గ్+ఇ కల్గి [వి-2] 4-136

7 కొలుచు : పూజించు, ఆరాధించు
ప పదాంశములు కొలుచు, కొల్చ్, కొలువ్
కొలుచు+దు+రు . కొలుచుదురు [ఏ-6] 10 పూ 073
కొల్చ్+ఇ : కొల్చి [వి-2] 3-184
కొలువ్+అ+రు · కొలువరు [సి-2] 10 పూ 1073

8 చను . వెళ్లు
పదాంశములు చన్
చన్+ఇ . చని [వి-2] 1-227
చను+చున్ చనుచున్ [ఎ-1] 3-161

9 చచ్చు . గతించు
పదాంశములు · చచ్చ్, చచ్చు
చచ్చ్+ఇన చచ్చిన [వి-2] 1-100
చచ్చ్+ఇ . చచ్చి [వి-2] 1-281
చచ్చు+చున్ చచ్చుచున్ [ఎ-1] 4-48
చచ్చు+ఎదము చచ్చెదము [వి-5] 10 పూ 1754

10 ... చొచ్చు : బలవంతముగా ప్రవేశించు

పదాంశములు చొచ్చు చొచ్చ్ చొత్

చొచ్చు+చున్ చొచ్చుచున్ [ఏ-1] 4-264

చొచ్చ్+ఇనన్ చొచ్చినన్ [బి-4] 10 పూ 1524

చొచ్చ్+ఇ చొచ్చి [బి-2] 4-261

చొచ్చ్+ఎదము చొచ్చెదము [బి-5] 10 పూ 830

చొత్+ను చొత్తును [ఎ-6] 10 ఉ 976

11 తొలఁగు ప్రక్కకు వెళ్ళు

పదాంశము తొలఁగ్

తొలఁగు+Ø [ఎ-5] 4-213 తొలఁగు

తొలఁగు+ఎ [బి-1] 10 ఉ 187 తొలఁగె

తొలఁగు+ఇ . బి-2] 1-66 తొలఁగి

తొలఁగు+అక [పి-4] 10 పూ 377 తొలఁగక

12 తెచ్చు తీసికొనివచ్చు

పదాంశములు తెచ్చు-, తెచ్చ్-, తెత్-

తెచ్చు+చున్ : తెచ్చుచున్ [ఎ-1] 4-251

తెచ్చ్+ఇ . తెచ్చి [బి-2] 10 ఉ 45

తెచ్చ్+ఎ తెచ్చె [బి-1] 1-79

తెచ్చ్+ఎద తెచ్చెద [బి-5] 10 పూ 1715

తెత్+తు · తెత్తు [ఎ-6] 8-521

13 నడచు

పదాంశములు నడచు-, నడచ్-, నడిచ్-, నడత్- నడప్
నడవ్-,

నడచు+చున్ నడచుచున్ [ఏ-1] 8-411

నడచ్+ఎన్ నడచెన్ [బి-1] 10 పూ 232

నడిచ్+ఎన్ నడిచెన్ [బి-1] 9-158

నడత్+ఉరె : నడతురె [ఎ-6] 8-467

నడచ్+ఉ+వు నడచువు [ఎ-6] 1-147
నడవ్+ఉ+దు నడపుదు [ఎ-6] -85
నడవ్+అ+రు నడవరు [సి-2] 1-332

14 పోవు వెళ్ళు

వ పదాంశములు · పోవు-/ పోవ్-/ పోయ్-/ పొ-/ పో-
పోవు+Ø పోవు ఎ-5] 2-8
పోవ్+అ+దు పోవదు [సి-2] 1-126
పోవ్+అన్ పోవన్ [సి- ] 10 పూ 1139
పోవ్+అక పోవక [సి-4] 10 ఉ 965
పోయ్+ఎడి పోయెడి [బి-5] 1-128
పోయ్+ఎదు పోయెదు [బి-5] 1-138
పోయ్+ఎద+ము పోయెదము [బి-5] 10 పూ 329
పో+ము్మ పొమ్మ [సి-6] 2-160
పో+అక పోక [సి-4] 1-18

15 పడు

వ పదాంశములు : పడు-/ పడ్-
పడు+దు+రు పడుదురు [ఎ-6] 1-397
పడు+చున్ · పడుచున్ (ఏ-1) 1ఒ ఉ 541
పడ్+ఇ పడి (బి-2) 4-183
పడ్+అక పడక (సి-4) 10 పూ 1756
పడ్+ఇతి+రి పడితిరి (బి-1) 10 పూ 403

16 ప్రమొగ్గు ఒక ప్రైపుకు వంగు

వ పదాంశము ప్రమొగ్గు-/ ప్రమొగ్గ్-
ప్రమొగ్గు+దు+రో ప్రమొగ్గుదురో (ఎ 6) 10 పూ 1214
ప్రమొగ్గ్+ఇ · ప్రమొగ్గి (బి-2 10.పూ 13 8
మొగ్గ్+ఇన ప్రమొగ్గిన (బి-3) 8-334
ప్రమొగ్గ్+అక ప్రమొగ్గక (సి-4) 10 పూ 1318

17 లేచు విలబడు

ప పదాంశములు · లేచు-/ లేచ్-/ లేవ్-/ లే-

| | | |
|---|---|---|
| లేచు+దు | లేచుదు (ఎ-2) 2-986 | |
| లేచ్+ఇ | లేచి (బి-2) 10 పూ 805 | |
| లేవ్+ఉ | లేవు సి-6) 10 పూ.1614 | |
| లే+Ø+చు | లేచు (సి-6) 10 పూ 85 | |

18 వచ్చు · వమీపించు

వపదాంశములు · వచ్చు-/వచ్చ్-/వత్-/ర-/రా-

| | | | |
|---|---|---|---|
| వచ్చు+చున్ | వచ్చుచున్ | [ఏ-1] | 1-148 |
| వచ్చ్+ఇ+రి | వచ్చిరి | [బి-2] | 1-246 |
| వచ్చ్+ఇతిన్. | వచ్చితిన్ | [బి-1] | 10.పూ 1622 |
| వచ్చ్+ఎదన్ | వచ్చెదన్ | [బి-5] | 10 పూ 1706 |
| వత్+తు+వు | వత్తువు | [ఏ-6] | 3-300 |
| వత్+తు+రు | వత్తురు | [ఏ-6] | 7-30 |
| వత్+తు+న్ | వత్తున్ | [ఏ-6] | 10 పూ 1436 |
| ర+ఉ+ము | రము | [సి-6] | 7-209 |
| రా+Ø+దు | రాదు | [సి-2] | 2-37 |
| రా+Ø+వు : | రావు | [సి-2] | 10 పూ 989 |
| రా+Ø+దు | రాదు | [సి-2] | 1-236 |

19 వెడలు : వెళ్లు

వపదాంశములు వెడల్-

| | | | |
|---|---|---|---|
| వెడల్+ఎదు | వెడలెదు | [బి-5] | 10 ఉ 237 |
| వెడల్+ఇ | వెడలి | [బి-2] | 4-694 |
| వెడల్+ఎ | వెడలె | [బి-1] | 1-234 |
| వెడల్+అన్ : | వెడలన్ | [సి-1] | 4-822 |
| వెడల్+అ+దు | వెడలదు | [సి-2] | 10 పూ 323 |
| వెడల్+అన్ | వెడలక | [సి-4] | 10 పూ 480 |

20 వెదకు : అన్వేషించు

సవదాంశములు వెదకు-/ వెదక్-

| | | | |
|---|---|---|---|
| వెదకు+Ø . | వెదకు | [ఏ-5] | 10 పూ 567 |
| వెదక్+ఇ | వెదకి | [బి-2] | 7-3 |
| వెదక్+ఎ+ను | వెదకెను | [బి-1] | 10 పూ 505 |
| వెదక్+ఎదు | వెదకెదు | [బి-5] | 4-751 |
| వెదక్+అన్ . | వెదకన్ | [సి-1] | 4-235 |

పై ఉదాహరణములన్నియు ఇంచుమించుగా కొన్ని తప్ప చు/చ్చు అంతమైన కొలుచు, వదుచు, లేచు, ఇచ్చు, చచ్చు చొచ్చు, తెచ్చు, వచ్చు క్రియా ప్రాతిపదికలు రెండవవర్గమున చేరిన ధాతువులందలి ఏ, బి విభాగ ప్రత్యయముల ముందు పొందిన రూప సిద్ధికంటె భిన్నమైనవి కావు ఇవి 'సి' విభాగ ప్రత్యయముల ముందు భిన్నమైన పర్యాయ రూపములను పొందినవి

## 4.3 0 సంశ్లిష్ట ధాతువులు (COMPLEX VERBAL ROOTS)

ధాతువు అనగా మూలము లేక ప్రాథమికము ప్రత్యయ సహితములైన రూపములన్నియు ధాతువు పంక్తి కలుగును ధాతువుల నుండియే భాషయంతయు కల్గినదని శాస్త్రజ్ఞులయూహ శబ్దజాలములో అనేకములను క్రియార్థకములైన ధాతువుల నుండి కల్పింపవచ్చును కొన్నిటికి వీలు పడదు భాషయందలి ప్రాచీన మూల రూపములను ధాతువులని వ్యవహరింపవచ్చును అవి క్రియార్థములుగా నుండనక్కరలేదు నామములుగా, విశేషణములుగా ఉండవచ్చును ఉదాహరణమునకు వెలుగు, వెల్లి, వెలియు మొదలగు రూపములలో 'వెల్' అనునది సమానాంశము.

క్రియా ప్రాతిపదికకు అనుబంధముగ స్వతంత్రికలేని BOUND) ప్రత్యయము చేరుటవలన సంశ్లిష్ట ధాతువులేర్పడును -ఇంచు, -ఇలు, -ఇల్లు, అను ప్రత్యయములు క్రియా ప్రాతిపదికాంతమున చేరి సంశ్లిష్ట ధాతువు లేర్పడును

- ఇంచు చేరుటచే ఏర్పడిన ధాతురూపములు సకర్మక, అకర్మకములుగా నుండును

- ఇలు చేరగా ఏర్పడిన ధాతురూపములు సకర్మక, అకర్మకము లుగా నుండును

- ఇల్లు చేరగా ఏర్పడిన ధాతురూపములు సర్వత్ర అకర్మకము లుగా నుండును

4 3 1 - ఇంచు ప్రత్యయము తెలుగునందు ధాతువులను ఏర్పరచును ఇది అచ్చిక శబ్దములందు, తత్సమ శబ్దములందు వచ్చును

అచ్చిక శబ్దములందు అరగించు 1-369
అదరించు 8-275

మొదలగు రూపములు గలవు

తత్సమములందు అనుగ్రహించు 1-289
ఆపేక్షించు 2-269 మొదలగునవి కలవు

వీనిలో ఎక్కువ భాగము నామములను ధాతువులుగా చేయుటకు -ఇంచు ప్రత్యయము వచ్చుచున్నది కనుక నామములకు -ఇంచు చేరుటచే ధాతువు లేర్పడుచున్నవి సంస్కృతమున నామములకీ పద్ధతి వర్తించును ఇది సహజ ప్రక్రియ తెలుగున ధాతురూపములకు కూడ -ఇంచు ప్రత్యయము చేర్చినట్లు కన్పించును

-ఇల్లు ధాతువు లేర్పరచు ప్రత్యయముగా (VERBALIZING SUFFIX) ప్రాచీన కాలమున ఉండి యుండవచ్చును రాను రాను కాలానుగుణముగా, భాషాను గుణముగా తొలగింపబడి దాని స్థానము -ఇంచు ప్రత్యయము ఆక్రమించి యుండును -ఇల్లుతో క్రొత్తధాతువుల సృష్టించుట కష్టము[1] సంశ్లిష్ట ధాతువులను అచ్చిక సంశ్లిష్ట ధాతువులు, తత్సమ సంశ్లిష్ట ధాతువులని రెండు రకములుగా విభజింపవచ్చును

4.3.2 అచ్చిక సంశ్లిష్ట ధాతువులు

పోతన భాగవతమునగల అచ్చిక సంశ్లిష్ట ధాతువులీ క్రింద చూప బడినవి

---

1 నేతి అనంత రామశాస్త్రి, శ్రీనాథ భాషా పరిశీలన, పు.253

1 క్రియా ప్రాతిపదికతో చేరి కొన్ని రూపములు అచ్చిక సంశ్లిష్ట ధాతువులుగా మారుచున్నవి

అదరించు [< అదరు+ఇంచు] భీతిల్లజేయు 0 ఉ 408
ఉలుకించు [∠ ఉలుకు+ఇంచు] వడగెత్తించు 10 పూ 317
తోలించు [< తోలు+ఇంచు] వెళ్లునట్లుచేయు -114

2 కొన్నిచోట్ల అచ్చిక సంశ్లిష్ట ధాతువులు ఆగమ, ఆదేశములకు గురియగుచున్నవి

ఇప్పించు [∠ఇచ్చు+ఇంచు] ఇచ్చునట్లుచేయు 1- 76
తెప్పించు [∠తెచ్చు+ఇంచు] తెచ్చునట్లుచేయు 0 పూ 1425
రప్పించు [∠వచ్చు+ఇంచు] వచ్చునట్లు చేయు 10 ఉ 281

3 పోతన ప్రయోగములు కొన్ని తమిళ, కన్నడ భాషలకు సాదృశ్యములుగ గలవు

| తమిళము | కన్నడము | తెలుగు |
|---|---|---|
| అగలు | అగలిసు | అగలించు 10 ఉ 541 |
| అదరు | అదరిసు | అదరించు [భయపడు] 10 ఉ 408 |
| అళుక్కు | అళుకిసు | అళుకించు [పూయించు] 9-320 |
| ఆరు | అరగిసు | ఆరగించు [తిను] -369 |
| అలు | అలిసు | ఆలకించు [విను] 10 పూ 408 |

కన్నడ భాషతో మాత్రము సాదృశ్యము కలది

| | |
|---|---|
| ఉడిగిసు | ఉడుగించు [అడచు] 1-364 |
| ఎదిరిసు | ఎదిరించు [పోరాడు] 3 681 |
| కదలిసు | కదలించు [కదలు] 8- 83 |
| కుప్పిసు | కుప్పించు [దుముకు] 3-637 |
| గెంటిసు | గెంటించు [నెట్టు] 1-359 |
| తాటిసు | తాటించు 3-637 |

పోతన తనకంటె పూర్వులు ప్రయోగించని -ఇంచు చేరిన కొన్ని అచ్చిక సంశ్లిష్ట ధాతువులను ప్రయోగించెను

ఊఁకించు 10.ఉ 803
పాలించు 9-462
కుయ్యాళించు 10 పూ 741
కరాళించు 10 పూ 1196
కళవళించు 3-161
కికురించు 10 పూ 458
కొవ్వరించు 3-413
ప్రక్కలించు (భాగములుచేయు) 8-351

5 పోతన భాగవతమున అమూర్త పదార్థ బోధక నామముల మీద -ఇలు, ఇల్లు చేరునపుడు ఆగమాదేశములు వచ్చును

వల్లటిలు (<వల్లటము+ఇలు) క్షీణించు 1-119
పిక్కటిలు (<పిక్కటము+ఇల్లు) విందు 10 పూ 1734
పెల్లగిలు (<పెల్లగము+ఇలు) పెకలించు 8-206
బెగ్గడిలు (<బెగ్గడము+ఇలు) -182
బెగ్గిలు (<బెగ్గలము+ఇలు) భయమొందు 1-305
మ్రుచ్చిలు (<మ్రుచ్చు+ఇలు) 10 పూ 166

తల్లిదిల్లు (<తల్లిదము+ఇల్లు) ప్రకాశించు 3-535
దుట్టగిల్లు (<దట్టగము+ఇల్లు) 10 ఉ 455
వల్లటిల్లు (<వల్లటము+ఇల్లు) తక్కువగు 9-142
పవ్వటిల్లు (<పవ్వటము+ఇల్లు) 0 పూ 670
పాటిల్లు (<పాటము+ఇల్లు) పుట్టు 4-92
పెల్లగిల్లు (<పెల్లగము+ఇల్లు) పెకలించు 10 పూ.1135
బెగ్గడిల్లు (<బెగ్గడము+ఇల్లు) 1-182
వాటిల్లు (<వాటము+ఇల్లు) కలుగు 3-700

6 మూల ధాతువును విడదీసి చూపుటకు వీలులేని రూపము పోతనలో గలదు మూలధాతువు క్రమముగా మార్పునొంది ప్రత్యయముతో సంశ్లిష్టతను పొందియుండును

వివ్వటిలు విజృంభించు, నెరవేరు 10 పూ 1083

7. పోతన ప్రయోగమునగల క్రియా ప్రాతిపదిక తద్భవముగా విరిచి యున్నది

ఉత్పతిల్లు [<ప్రా ఉప్పత్త>సం॥ ఉత్పద్] కలుగు 10 ఉ 533

4 3 3. తత్సమ సంశ్లిష్ట ధాతువులు

– ఇంచు అనునది తత్సమ ధాతునిష్పాదకము సంస్కృత ధాతుజన్యములైన నామములపై కూడ క్వాచిత్కముగా ఇంచు చేరవచ్చునని సూరి సూచించెను నామ పదములపై కూడ –ఇంచు చేరి తత్సమ ధాతువులు సిద్ధించుచున్నవని ప్రయోగముల వలన తెలియుచున్నది చిన్నయ సూరి మతి, స్తుతి, శయన మొదలగు కృదంతములపై మాత్రమే 'ఇంచు' చేర్చి మతించు, స్తుతించు శయనించు మొదలగు తత్సమ ధాతు నిష్పత్తిని ప్రతిపాదించెను.

కాని నన్నయ ప్రయోగములలో 'ఇంచు'చేరి తత్సమ ధాతువులుగా ఏర్పడిన నామములు కూడ గలవు దుఃఖ, ఉపమ, విస్మయ, పరివర, కరుణ మొదలగు సహజ నామములపై 'ఇంచు' చేరుటచే

దుఃఖ+ఇంచు దుఃఖించు ఆది 2-44
ఉపమ+ఇంచు ఉపమించు ఆది 2-114
విస్మయ+ఇంచు విస్మయించు సభా 1-170
పరివర+ఇంచు పరివరించు సభా 1-189
కరుణ+ఇంచు · కరుణించు అరణ్య 1-142
అని వచ్చిన రూపములు నన్నయలో కలవు

తత్సమ సంశ్లిష్ట ధాతువులను క్రియా ధాతువులు, నామధాతువులని రెండు విధములుగ విభజింపవచ్చును

4 3.3.1 తత్సమ క్రియా ధాతువులు

క్రియా ప్రాతిపదికలపై -ఇంచు చేరుటచే క్రియాధాతువు లేర్పడును.

పోతన భాగవత ప్రయోగములు

అర్పించు 1-255
కృశించు 10 ఉ 431

| | |
|---|---|
| వరించు | 7-334 |
| రక్షించు | 4-233 |
| రక్షించు | 3-24 |
| యజించు | 4-233 |
| వసించు | 2-31 |
| శపించు | 9-237 |
| హసించు | 10 ఉ 676 |

4 3 3.2 తత్సమ నామ ధాతువులు

సంస్కృత నామములపై - ఇంచు చేరుట వలన తత్సమ నామ ధాతువు లేర్పడును

| | |
|---|---|
| కాంక్షించు | 10 పూ 1431 |
| కీర్తించు | 4-385 |
| నుతించు | 8-5 2 |
| లజ్జించు | 10 ఉ 335 |
| చేష్టించు | 1-443 |
| పురాణించు | 1-7 |
| మానసించు | 8-488 |

పురాణించు అనెడు ప్రయోగము శ్రీనాథ, నన్నయలలో కవ్పించదు లజ్జించు, చేష్టించు అను తత్సమ నామ ధాతువులను శ్రీనాథుడు ప్రయోగించెను

| | |
|---|---|
| లజ్జించు | శృ నై 2-90 |
| చేష్టించు | హర 4-7 |

4 3 3 3 ఇ, ఉ, ఋకారాంతములైన సంస్కృత ధాతువులపై 'అ' ప్రత్యయము చేరుటచే ఏర్పడు కృదంతరూపముపై -ఇంచు చేరగా తత్సమ సంశ్లిష్ట ధాతువు లేర్పడును

జి > జే > జయ్+అ=జయ+ఇంచు . జయించు

ఇందు 'అ' ప్రత్యయము చేరుటచే గుణాది సంధులు వచ్చి ఏర్పడిన కృదంతములపై -ఇంచు చేరినది 'జయ' మొదలగు కృదంతములు,

నామములుగ తెలుగులో ప్రవేశించిన పిదప 'ఇంచు'ను అంతములో గ్రహించి తత్సమ ధాతువులయినవని తలంచుట సమంజసము

ఇ, ఉ, ఋ అంతధాతుజన్యములగు నామములపై గాక కేవల ధాతువులకు 'ఇంచు'ను చేర్చి విధించి ధాతువులోని స్వరములగు ఇ, ఉ, ఋ అను వానికి క్రమముగ 'అయ్, అవ్, అర్' అనునవి ఆదేశములగునని[2] ఇ, ఉ, ఋల కించుక్కు పరంబగునపుడయు గుణ గురుక్కులగునని నిర్దేశించెను ఇక్కడ జి+ఇంచు జయ్ ఇంచు జయించు అను రూప నిష్పత్తి సంస్కృత నామమునకు గాక ధాతువునకు ఇంచు చేరుచున్నది అప్పుడు ఇ అయ్ ఉ అవ్ ఋ అర్‌గ మారునని తలంపవచ్చును. ఇది సబబు కాదని సూరియే పరోక్షముగా అంగీకరించెను 'మతి'కి 'ఇంచు' పరముగాగ అందలి ఇ అయ్ గా మారినదని[3] నిర్జనామంబులకయు గాగమంబు గలుగదని' స్పష్టము చేసెను 'జి+ఇంచు' అన్నప్పుడు ఈ విశేషము సమన్వయము చేయదగును నామములపై గల ధాతువులు నిష్పన్నములైనవని తలంపవచ్చును జి→జయ అని కృదంతముగ తయారై పిదప ఇంచును గ్రహించి జయ+ఇంచు జయించు ఏర్పడి యుండును దీని కపవాదిగా గుర్తింపదగినది నిర్జి+ఇంచు నిర్జించు ఇందులో 'నిర్' ఉపసర్గ 'జి' ధాతువు దీనిపై ఏ ప్రత్యయము చేరకయే 'ఇంచు' చేరి 'నిర్జించు' అయినది ఈ ఒక్క ఉదాహరణములో మాత్రమే సంస్కృత ధాతువుపై నేరుగా 'ఇంచు' చేరినట్లు గుర్తింపవచ్చును సంస్కృత నామములపై -ఇంచు చేరుట సామాన్యసూత్రము నిర్జించు దీని కపవాదము

ఆ 'జి' ధాతువు 'నిర్' అనెడు ఉపసర్గతో కలిసివచ్చినపుడు 'అయ్' ఆగమము రాదు

నిర్+జి+ఇంచు నిర్జించు 3-62

ఉపసర్గలతో కూడిన ఇతర ధాతువులతో కలిసి వచ్చినపుడు అయ్, అవ్, అర్ అనునవి వచ్చును

---

2 బా. వ్యా క్రియా 64

3 బా వ్యా క్రియా 65

అను-నీ-ఇంచు > అను-నయ్-ఇంచు : అనునయించు 10 ఉ 244
అప-నీ-ఇంచు > అప-నయ్ ఇంచు : అపనయించు 3-1001
విర్-నీ-ఇంచు > విర్-నయ్-ఇంచు విర్ణయించు 7-435
అను-భూ-ఇంచు > అను-భవ్-ఇంచు అనుభవించు 3-980
ప్ర-భూ-ఇంచు > ప్ర-భవ్-ఇంచు . ప్రభవించు 1-440
అను-సృ ఇంచు > అను-సర్-ఇంచు అనుసరించు 2-269
అవ-తౄ-ఇంచు > అవ-తర్-ఇంచు అవతరించు 2-155

ఆ ఇ, ఋ వర్ణాంత ధాతువులకు -ఇంచు పరమగునపుడు అయ్, అర్ లు వరుసగా వచ్చును

జి-ఇంచు > జయ్+ఇంచు జయించు 2-27
స్మృ-ఇంచు > స్మర్+ఇంచు స్మరించు 7-204
హృ-ఇంచు > హర్+ఇంచు హరించు 1-294

2 'య' లేదా తదాదేశమైన 'అన' ప్రత్యయాంతములపై -ఇంచు చేరిన తత్సమ ధాతువులు పోతనలో కలవు

గమ్+అన+ఇంచు గమనించు 7-426

ఇట్టి ప్రయోగమే శ్రీనాథునిలోను కలదు

యజ్+అన+ఇంచు యజనించు భీమ 5-64

దృష్టి, సమాప్తి అను ఇన్నంతములపై ఇంచు చేరుటచే వచ్చిన
దృష్టించు శృం నై 7-160
సమాప్తించు హర 6-70

ఈ ప్రయోగములను శ్రీనాథుడు, తరువాత కవులు వాడిరి 'అన్న' ప్రత్యయాంతములపై -ఇంచు చేరుట వలన కల్గిన తత్సమ రూపములు నన్నయలో కనిపించుట లేదు

3 [4]ఉపధస్థానమున లఘు వున్న సంస్కృత ధాతువులకు -ఇంచు పరమైనచో గుణము వచ్చునని సూరి సూత్రీకరించెను ఇ, ఉ, ఋలు లఘువులు కావున

4 బా వ్యా క్రియా. 66

ఛిద్ √ ఛేద్+ఇంచు . ఛేదించు

పుష్ √ పోష్+ఇంచు పోషించు

హృష్ √ హర్ష్+ఇంచు హర్షించు అనునవి సూరి తెలిపిన యుదాహరణములు కాని ఛిద్ నుండి ఛేద

పుష్ నుండి పోష

హృష్ నుండి హర్ష అందు 'అ' ప్రత్యయము చేరుటవలన నామము లేర్పడును వాటిపై -ఇంచు చేరుటచే ఛేదించు, పోషించు, హర్షించు అను తత్సమ రూపములైన పదముల సమంజసముగా నుందును సంస్కృత ధాతుజన్యములైన నామములపై -ఇంచు చేరుటచే ఉద్భవించిన తత్సమ ధాతువులు పోతన భాషలో ప్రయుక్తములైనవి క్రింద చూపబడినవి

క్రుధ్+అ . క్రోధ్+అ క్రోధ+ఇంచు క్రోధించు 4-115

ముద్+అ మోద్+అ మోద+ఇంచు మోదించు 2-215

యుజ్+అ యోజ్+అ . యోజ+ఇంచు యోజించు 3-921

రుష్+అ : రోష్+అ . రోష+ఇంచు రోషించు 4-115

రుద్+అ రోద్+అ రోద+ఇంచు రోధించు 10 - 281

హృష్+అ హర్ష్=అ హర్ష+ఇంచు : హర్షించు 3-567

గ్రహ్ తర్జ్, భర్జ్ మొదలగు ధాతువులు 'అ' అను ప్రత్యయము చేరుటచే వానియందు ఏ విధమైన మార్పులు లేక గ్రహ, తర్జ, భర్జ అను కృదంత రూపము లేర్పడును

పోతన వాడిన ప్రయోగములు

గ్రహ్+అ+ఇంచు గ్రహ+ఇంచు గ్రహించు 4-494

తర్జ్+అ+ఇంచు తర్జ+ఇంచు తర్జించు 7-277

భర్జ్+అ+ఇంచు భర్జ+ఇంచు భర్జించు 9-454

5 కొన్ని తత్సమ ధాతువులకు -ఇల్లు ప్రత్యయము చేరునపుడు రేఫాగమము వచ్చును

తేజ్+అ+ఇల్లు తేజ+ర్+లు ఇల్లు తేజరిల్లు 3-89

6 'సృజ్' ధాతువునకు -ఇంచు చేరునపుడు గుణమురాదు

సృజ్+అ+ఇంచు సృజ+ఇంచు సృజించు

' మహాభూత పంచక యోగమున మేనులను

పురములు సృజించి 2-68

'సృజ్' ధాతువునకు ముందు 'వి' అను ఉపసర్గ చేరుటచే 'సృజ్

గుణమును పొంది 'సర్జ్'గా మారును

వి+సృజ్+అ+ఇంచు . విసర్జ్+అ+ఇంచు విసర్జ+ఇంచు

విసర్జించు [విడుచు] 10 పూ 1641

హరిహయుండు ధ్వర హయ హరణార్థమై మించికై కొని

విసర్జించినట్టి 4-524

7. 'ఇష్' ధాతువుపై -ఇంచు ప్రత్యయము చేరగా మార్పులు లేవగును 'ఇష్' ధాతువుపై 'ఇంచు' చేరి 'ఇషించు' రూపము వచ్చుటలేదు దీని నుండి 'ఇచ్ఛ' అను కృదంత రూపముద్భవించుచున్నది దీనికి ఇంచు చేరుటచే ఇచ్ఛించు అను శబ్ద ధాతురూపమునకు తెలుగు కావ్యములలో ప్రచుర ప్రయోగము గలదు భాగవతమున పోతన అనేక తావులందు ఈ ధాతురూపమును ప్రయోగించెను

ఇష్+ఇంచు ఇచ్ఛ+అ+ఇంచు ఇచ్ఛించు 1-124

'ఇచ్ఛయించు' అను రూపము కూడ భాగవతమున కలదు దీనిలో 'ఇచ్ఛ' అను కృదంత రూపము నిలిచి యున్నది

8 కొన్ని సంస్కృత ధాతువులకు '-ఇంచు' పరమగునప్పుడు 'ఇయ్' ఆగమముగా వచ్చును

| | | | |
|---|---|---|---|
| ఘటించు | 4-303 | ఘటియించు | 4-686 |
| చరించు | 3-906 | చరియించు | 4-751 |
| జనించు | 9-8 | జనియించు | 10 ఉ 1071 |
| తరించు | 4-284 | తరియించు | 3-16 |
| ధరించు | 3-[illegible]9 | ధరియించు | 9-291 |
| మతించు | 1-2 6 | మతియించు | 4-460 |

| | | | |
|---|---|---|---|
| పఠించు | 7-134 | పఠియించు | 3-222 |
| ఫలించు | 10 పూ 1734 | ఫలియించు | 3-829 |
| భజించు | 2-39 | భజియించు | 3-51 |
| భుజించు | 4-401 | భుజియించు | 9-644 |
| రమించు | 3-154 | రమియించు | 3-441 |
| లిఖించు | 10 ఉ 370 | లిఖియించు | 10 ఉ 345 |
| వధించు | 9-203 | వధియించు | 10 పూ 1037 |
| వసించు | 8-111 | వసియించు | 2-163 |
| సుఖించు | 3-52 | సుఖియించు | 3-257 |
| సృజించు | 2-68 | సృజియించు | 3-233 |
| స్తుతించు | 3-544 | స్తుతియించు | 1-227 |
| హరించు | 4-276 | హరియించు | 10 పూ 23 |

'ఇయ్' ఆగమముగా రాని రూపములు ;

| | | |
|---|---|---|
| కృశ్+ఇంచు : | కృశించు | 1-422 |
| | గ్రహించు | 2-56 |
| | తపించు | 10 ఉ 886 |
| | దహించు | 1-272 |
| | దుఃఖించు | 4-961 |
| | పటించు | 1-192 |
| | వర్ధించు | 3 62 |
| | లభించు | 3-440 |
| | వహించు | 1-100 |

9 ఒకటి, రెండు ఉపసర్గలతో కూడి తత్సమ ధాతువులు -ఇంచు ప్రత్యయము పరముగా గల ప్రయోగములు పోతన యందు కన్పించును

ఒక ఉపసర్గ .

| | | |
|---|---|---|
| అను+గమ్+ఇంచు | . అనుగమించు | 10 ఉ 396 |
| అను+భూ+ఇంచు | అనుభవించు | 10 ఉ 994 |
| అభి+అర్థ్+ఇంచు | అభ్యర్థించు | 10 ఉ 611 |
| ఉత్+పాట్+ఇంచు | ఉత్పాటించు | 10 ఉ 159 |
| నిర్+ఈక్ష్+ఇంచు | నిరీక్షించు | 10 పూ 1434 |
| ప్ర+దీప్+ఇంచు | ప్రదీపించు | 8-188 |
| ప్ర + భూ+ఇంచు | ప్రభవించు | 10 పూ 138 |
| ప్ర + వర్త్+ఇంచు | ప్రవర్తించు | 10 ఉ 1222 |
| ప్ర + సృ+ఇంచు . | ప్రసరించు | 10 పూ 177 |
| వి + తర్క్+ఇంచు | వితర్కించు | 10 పూ 1726 |
| వి + సృజ్+ఇంచు | విసర్జించు | 3-721 |
| సమ్ + స్కృ+ఇంచు | సంస్కరించు | 3-832 |

రెండు ఉప సర్గలు

| | | |
|---|---|---|
| ఆ + విర్ + భూ + ఇంచు | ఆవిర్భవించు | 9-722 |
| వి + నిర్ + గమ్ + ఇంచు . | వినిర్గమించు | 3-760 |

10. 'అధః కరించు' 10 పూ.1159 అను ప్రయోగము పోతనలో ఒక కొత్తదనమును ప్రస్ఫుటము చేయుచున్నది.

అట్లే మరికొన్ని ధాతువులు :

| | | | |
|---|---|---|---|
| ఆహారించు | 8-202 | పెంపగ్గించు | 4-136 |
| ఉద్ధాడించు | 8-47 | ప్రచ్ఛాదించు | 10 పూ 1665 |
| కళవళించు | 3-161 | ప్రముచ్ఛలించు | 8-100 |
| గురించు | 8-391 | విడంబించు | 1-191 |
| చన్నించు | 10 పూ 358 | విన్యసించు | 2-54 |
| | | సంస్థాపించు | 2-198 |

11. 'నిరీక్షించు' అనగా చూచు అర్థము

అతి చిర కాల సమాగత సతని నిరీక్షించి వృష్ణి యాదవ భోజ ప్రతతులు నెదురేగి 10 ఉ.1061

ఆధునిక కాలమున వీక్షించు అనగా ఎదురుచూచు అనెడు అర్థమున ప్రయుక్త మగుచున్నది

12 పోతన భాగవతమున వాడిన క్రొత్త సంస్కృత ధాతువులు ఇతరులు ప్రయోగింపనివి

వవించు 4-723 ?
కషకించు 10 పూ 1220 ?

## 440 సంయుక్త ధాతువులు

## (COMPOUND VERBS)

రెండు లేక అంత కంటె అధికముగా క్రియా ప్రాతిపదికలు కలిసి సంయుక్త ధాతువులుగా ఏర్పడును భాషలో శబ్ద జాలమును నిర్మించు పద్ధతి ఇదియే క్రియా ప్రాతిపదిక, అన్నంత క్త్వార్థక, విశేష్య, విశేషణ, ధ్వన్యను కరణ శబ్ద, అవ్యయములకు అదనముగా ఒకటి లేక రెండు అనుబంధ క్రియలు చేర్పగా సంయుక్త ధాతువులు వచ్చును ఈ ధాతువులు సాధారణముగా విలక్షణార్థమును కలిగియుండును వీనిని జాతీయములుగా, ప్రయోగార్హమైన సంయుక్త క్రియా ప్రాతి పదికలుగా స్వీకరింపవచ్చును వీనిని మూడు భాగములుగా వర్గీకరింప వచ్చును

1 ధాతు పల్లవములు క్రియా ప్రాతిపదిక, అన్నంత, క్త్వార్థక రూపములు

2 నామ పల్లవములు : విశేష్య, విశేషణ రూపములు

3 ఇతరములు : ధ్వన్యనుకరణ, అవ్యయ రూపములు

### 4411 ధాతు పల్లవములు క్రియా ప్రాతిపదిక అన్నంత, క్త్వార్థక రూపములు

మొదటి పదము క్రియా ప్రాతి పదికగా, రెండవ అంశము ధాతువుగా నుండి విలక్షణమైన యర్థమును బోధించు పదములకలయిక ధాతు పల్లవమందురు.

1 క్రియా ప్రాతిపదిక రూపములు :

| | | |
|---|---|---|
| ఆడు | తునుమాడు | 2-165 |
| ఆరు | ఒప్పారు | 1-83 |
| కొను | ఈడ్చుకొను | 10 పూ 400 |
| | పుచ్చుకొను | 10 ఉ 144 |
| కొలుపు | వీడు కొలుపు | 10 పూ.1164 |
| తన్ను | కూలదన్ను | 10 పూ 930 |
| | అరుగుదెంచు | 10 ఉ.2 8 |
| తెంచు | ఏగుదెంచు | 10 పూ 124 |
| తేరు | అరుగుదేరు | 3-523 |
| త్రొక్కు | ఎదత్రొక్కు | 10 పూ 931 |
| నేర్చు | కావనేర్చు | 9-64 |
| | చేరనేర్చు | 10 పూ 990 |
| పఱచు | చిక్కుపఱచు | 10 ఉ 10 |
| మఱచు | ఆడమఱచు | 7-122 |
| | చూడమఱచు | 7-122 |
| వచ్చు | చేరవచ్చు | 10 పూ 1533 |
| వలయు | చేయవలయు | 7-416 |
| వైచు | : ఎగురవైచు | 8-399 |

2 అవ్యంత రూపములు :

| | | |
|---|---|---|
| కలుగు | చేర గలుగు | 10 ఉ 1057 |
| | పొంద గలుగు | 10పూ 1702 |
| కూడు | . మాయ గూడు | 3-232 |
| కొట్టు | : దుల్లఁగొట్టు | 4-120 |
| | తెగఁగొట్టు | 4-355 |
| చను | చేయఁజను | 10 పూ 1407 |
| దోలు | . పాఱఁదోలు | 10 పూ 1720 |
| త్రోచు | . కూలఁద్రోచు | 9-568 |
| | పడఁద్రోచు | 10 ఉ 140 |

| | | |
|---|---|---|
| పంచు | ఉండఁబంచు | 7-199 |
| | కొలువఁబంచు | 19 ఉ 809 |
| పలుకు | ఎఱుంగఁబలుకు | 4-907 |
| పెట్టు | కొలువ పెట్టు | 9-536 |
| | కూడ బెట్టు | 10 పూ 128 |

3 క్త్వార్థక రూపములు

| | | |
|---|---|---|
| ఆడు | కొనియాడు | 2-211 |
| ఆర్చు | ఏసియార్చు | 9-454 |
| ఇచ్చు | కోరియిచ్చు | 0 ఉ 47 |
| | తెచ్చియిచ్చు | 10 ఉ 45 |
| ఎత్తు | . త్రుచ్చియెత్తు | 10 ఉ 103 |
| కూల్చు | ఒత్తి కూల్చు | 10 పూ 1144 |
| కొను | : ఇదికొను | 10 ఉ 447 |
| చూచు | పట్టిచూచు | 7-238 |
| తెచ్చు | తోడి తెచ్చు | 7-159 |
| నిలుచు/నిల్చు | మ్రొక్కి నిలుచు | 9-214 |
| | లేచినిల్చు | 10 ఉ 170 |
| పడు | అదరిపడు | 9-514 |
| పాఱు | వివరిపాఱు | 10 పూ 1170 |
| పుచ్చు | : కాల్చిపుచ్చు | 7-238 |
| పోవు | కొనిపోవు | 2-48 |
| వచ్చు | కొనివచ్చు | 1-500 |
| వైచు | · వఱికివైచు | 10 ఉ 1306 |

4 4 1 2 నామపల్లవములు విశేష్య, విశేషణ రూపములు. మొదటి పదము విశేష్య, విశేషణములలో నొకటి, రెండవ పదము విధిగా క్రియా ధాతువై యుండును అట్టివానిని నామ పల్లవములందురు

1 విశేష్య రూపములు

| | | |
|---|---|---|
| అగు | కంటకమగు | 2-166 |
| అడగు | ఒక్కడగు | 3-124 |
| అడచు | గర్వమడచు | 3-113 |
| అఱరు | పెంపఱరు | 3-262 |
| ఆడు | మాటలాడు | 1-86 |
| ఆరు | పాలుపారు | 3-135 |
| ఆర్చు | బొలార్చు | 3-669 |
| ఇచ్చు | అవతిచ్చు | 1-171 |
| ఇడు | మేతలిడు | 1-268 |
| కను | పొడగను | 3-293 |
| చెడు | వనచెడు | 8-179 |
| తన్ను | కాలుదన్ను | 3-44 |
| పట్టు | పగబట్టు | 4-707 |
| పఱచు | ఎగులుపఱచు | 9-193 |
| పుచ్చు | మోవపుచ్చు | 10 పూ 1148 |
| పెట్టు | మొఱపెట్టు | 10 ఉ 62 |
| పోయు | తలపోయు | 3-317 |

2. విశేషణ రూపములు

| | | |
|---|---|---|
| అఱు | సొంపఱు | 3-626 |
| ఆరు | ఏపారు | 3-476 |
| ఎక్కు | మున్నెక్కు | 1-361 |
| ఎత్తు | ఎలుంగెత్తు | 1-477 |
| ఏగు | వెంటనేగు | 1-317 |
| ఒత్తు | చక్కనొత్తు | 8-303 |
| నడుచు | తెగనడుచు | 9-419 |
| ముట్టు | దుట్టుముట్టు | 4-327 |
| రేగు | పెచ్చురేగు | 8-232 |

4 4 1 3 ఇతరములు : ధ్వన్యను కరణ శబ్ద, అవ్యయ రూపములు :

1 ధ్వన్యను కరణ శబ్ద రూపములు .

చిట్టిపట్టి యాపురవి వాపోవ 10 పూ 152
జనులు హా హూ యనుచు చలివేళ గుత్తుక
బంటికో యముతలోపల వసియించి 4-650

2 అవ్యయ రూపములు

చే-కొంటి . తీసికొంటివి 3-146
జో-కొట్టు నిద్రించుటకు జో జో అని కట్టు 10 పూ 193
డీ-కొలుపు ఎదురువడు 10 పూ 1317

4 4 2 తత్సమ సంయుక్త ధాతువులు

తత్సమ శబ్దములపై కొన్ని అనుబంధ ధాతువులు చేరుటవలన రెండంశ ముల సంయుక్త ధాతువులు ఏర్పడుచున్నవి

. ధాతుపల్లవములు క్రియా ప్రాతిపదిక, అన్నంత క్త్వార్థక రూపములు

1 క్రియా ప్రాతిపదిక రూపము
చేయు . ఘటింపజేయు 2-629

2 అన్నంత రూపము :
త్రొక్కు : త్రమక్కు-ద్రొక్కు 8-55

3 క్త్వార్థక రూపము
వళించిపోవు 3-483

2 నామపల్లవములు విశేష్య, విశేషణ రూపములు

1. విశేష్య రూపములు

అగు . రాజగు 1-34
తేజంబగు 2-32

ఆడు జలంబులాడు 1-143

ఇచ్చు శాపంబిచ్చు 8-123

ఒప్పు : జలమొప్పు 3-419

కట్టు : పట్టంబుగట్టు 4-368
పెట్టు : భంగపెట్టు 10 ఉ 838

2. విశేషణ రూపములు .

చేయు శుద్ధిచేయు 1-59
స్తుతిపేయు 2-54

4431

1 పోతన భాగవతమున వ్యతిరేకార్థమున క్రింది సంయుక్త ధాతువులు గలవు ఇందు వ్యతిరేకార్థమునకు సూచకముగ 'అక' వచ్చును

తుష్టి బొందక 4-292 సంతృప్తిపడక
తెలుంగెలుగక 1-32 మార్గముతెలియక
పట్టు వడక 10 పూ 1620 దొరకక
పొల్పరక 1-483 ఇష్టపడక

2 'పుచ్చు' ధాతువు కొన్ని సకర్మక క్రియంక్త్వార్థక రూపములకను ప్రయుక్తమగుచున్నది

కొల్చి పుచ్చు 7-238
క్రోసిపుచ్చు 8-596

3 'ఉచ్చు' ధాతువునకు 'పోవు' గమనార్థక ధాతువు అను ప్రయుక్తమగుచున్నది

ఉచ్చిపోన్ (అ క్రి) చెడునట్లు పలుకు 10 ఉ.565

443.2 సంయుక్త ధాతువు లేర్పడునపుడు వచ్చు ఆగమ, ఆదేశాదికార్యములు పోతన భాషలో కలిపి క్రింద చూపపడినది

1 [1] ద్రుత ప్రకృతికము మీది పరుషములకు సరళములగునవి సూరి మాత్రికరించెను

ఉదా . కోచెను+చుక్కలు . కోచెను జుక్కలు పోతన భాగవత ప్రయోగములు :

---

1. బా వ్యా సంధి 16

ఎడబాపు　ఎడన్+పాపు　తొలగింపచేయు 3-869
కూఁకట్రోచు　కూఁకన్+త్రోచు　పడగొట్టు 7-96
చేరఁగలుగు　చేరన్+కలుగు　దగ్గరకుపచ్చు 0 ఉ 1057
పొందఁజేయు　పొందన్+చేయు　సిద్ధించునట్లుచేయు 3-1008
మాయఁగూడు　మాయన్+కూడు　మాయతో కలిసి 3-232

2 గసడదవా దేశము వైకల్పికము

దీనినే [2]ప్రథమ మీది పరుషములకు గసడదవలు బహుళముగానగు నని సూరి వ్రాకుచ్చెను.

అరుగు దెంచు 10 ఉ 218
కాపు వెట్టు 8-452
సందడిగొల్పు 3-651

3 కొన్నిచోట్ల పదమధ్య సంధి సంయోగమున స్వరసంధి వచ్చుచున్నది

అనతి+ఇచ్చు : అనతిచ్చు 1-171 ఇత్తులోపము
కోరు+అడు　కోరాడు 10 పూ 1 59 ఉత్తులోపము
చక్క+అడు　చక్కాడు 10 ఉ 482 పదాంతమందు అత్తులోపము
చెండు+అడు . చెండాడు 1-79 ఉత్తులోపము

4 ప్రాచీన, అర్వాచీన రూపములు రెండును కలిగిన కొన్ని సంయుక్త ధాతువులు పోతన భాగవతమున కలవు

| ప్రాచీన రూపములు | అర్వాచీన రూపములు |
| --- | --- |
| అరుదెంచు 10 ఉ 155 | అరుగుదెంచు 10 ఉ 2 8 |
| అరుదేర 3-523 | అరుగుదేర 9-7 0 |
| ఏతెంచు 3-532 | ఏగుదెంచు 10 పూ 214 |

1433 క్త్వార్థక, వ్యతిరేకార్థక, శత్రర్థక అసమాపక క్రియా ప్రాతిపదికలకు 'ఉండు' ధాతువు యొక్క సమాపక క్రియా రూపము అనుబంధముగా చేరి సంయుక్త ధాతువులుగా ఏర్పడుచున్నవి

---

2 బా వ్యా సంధి 13

1 క్త్వార్థకము+ఉందు.

అదగియుందు (∠అదగు) 1-516

కలిగియుందు (∠కలుగు) 2-251

ఒక పని కొంత వరకు జరిగి, ఆ విధముగనే యున్నదని తెలుపును

2 వ్యతిరేకార్థకము+ఉందు

| | | |
|---|---|---|
| అంగకుందు | అంగక+ఉందు | 1-188 |
| కావింపకుందు | కావింపక+ఉందు | 4-149 |
| దాపకుందు | దాపక+ఉందు | 1-88 |
| చెరకుందు | చెరక+ఉందు | 2-210 |
| జనింపకుందు | జనింపక+ఉందు | 2-31 |
| తాకకుందు | తాకక+ఉందు | 3-616 |
| పోవకుందు | పోవక+ఉందు | 3-520 |

పని జరిగి పూర్తి అయిన దానికి వ్యతిరేకము.

3 శత్రర్థకము+ఉందు.

| | | |
|---|---|---|
| ఒప్పుచునందు ∠ ఒప్పుచున్+ఉందు | | 1-226 |
| కుందుచునందు ∠ కుందుచున్+ఉందు | | 1-209 |
| చేయుచునందు < చేయుచున్+ఉందు | | 1-241 |
| నడపుచునందు < నడపుచున్+ఉందు | | 10 ఉ 965 |
| పలుకుచునందు ∠ పలుకుచున్+ఉందు | | 2-218 |
| వెలుగుచునందు < వెలుగుచున్+ఉందు | | 2-100 |

ఇతరము లు

| | |
|---|---|
| కమకొమచుందు | 4-291 |
| గడుపుచుందు | 2-47 |

4434 అన్నంత క్రియలమీద అనుబంధ క్రియలు చేరి భిన్నార్థములో సంయుక్త ధాతువు లేర్పడుచున్నవి

1 సంయుక్త ధాతువులకు అన్నంత క్రియలపై వచ్చు అనుబంధ క్రియ ననుసరించి మూడు విధములుగా విభజింపవచ్చును.

1 అన్నంత క్రియ ప్రధాన క్రియగా కలిగిన సంయుక్త ధాతువులు :

ఎఱుఁగఁజెప్పు 1-148

కగ్గఁజేయు 4-284

చూడఁగోరు 10 – 151

2 అనుబంధ క్రియ ప్రధానముగా గల సంయుక్త ధాతువులు

అందఁజేయు 3-109

బిగియఁబట్టు 2-29

3 పూర్వాంగము అవ్యతంత్ర రూపముగా నుండి అనుబంధముచేరి సంయుక్త ధాతువుగా మారుచున్నది

ఒడంబఱచి 1-171

ఒనఁగూర్చి 9-553

ఒందఁజేయు 2-101

కట్టఁబంపు 7-199

దుల్లఁగొట్టు 4-120

2 'వలయు' ధాతువు సామాన్యముగా అన్నంత క్రియలపై వచ్చు న్యూన క్రియ ఇది వాక్యమందలి కర్తతోగాక అన్నంత క్రియతోనే అన్వయము కలిగియుండును

'శృంగారమే ప్రొద్దు జేయవలయు
ప్రాణేశుచిత్తంబు ప్రేమ రంజింపవలయు
మేధాదుల దైవతమని ప్రియు దలపవలయు
సద్బంధులన దవ వలయు
ప్రాతి ప్రవత్యమహిమ బుణ్యు జేసి మనవలయు 7-417

3 'పాఱు', పెట్టు ధాతువులు అన్నంతములపై చేరి అరంభార్థమున అను ప్రయుక్తమగును

కులుకఁబాఱు 8-303

కోయఁబాఱు 9-51

చేయ బాఱు 3-194

చొరఁబాఱు 8-29
తిరుగం బాఱు 1-72
కాలియఁబెట్టు 4-221
కూరఁబెట్టు 10 పూ 1208
కొల్వఁబెట్టు 9-536
కొలంగఁబెట్టు 10 పూ 128

4 కొన్ని సంయుక్త ధాతువులు పర్యాయ రూపత బొందుచుండును

కూలఁదన్ను మూఁడవనేల నాఁడు ముద్దుల బాలుఁడై
కోపించి శకటంబు 'గూలఁదన్నె'

కూలఁగఁదన్ను కం
కూలుండొక్కఁడు శూద్రుఁడు దాసరతిం గారుణ్య విరు
క్తుఁడై .
'నేలంగూలఁగఁదన్నె బంధితుల గావిర్భూత పాదాహతిన్

అరుదేర ఈ
శ్వరుఁ భజియింప గోరి యని వారల 'నిరందరుదేర
నిచ్చుటన్ 3-523

అరుగుదేర మఱియు చూతుము దగ్గఱ 'నరుగుదేర'
నరులలో బ్రతుకంచె మన్నతుఁడులేఁడు 9-710

పాలఁదోలు బంధుల గూడి కృష్ణ బల భద్రులు వచ్చిన బాల
దోలిరి' రక్కంధర వృత్తి 10 పూ 1720

పాలఁగదోలు 'బాఁజరవింతులంబముల బాల గదోలుట బంటుపంతమే
చాలు ' 10 పూ 1139

కావనేర్చు కాపు వెట్టి కొంత గావనేర్చు, గడ గి 9-64

కావంగనేర్చు కడగి మునలితపసి గావంగ నేర్చునె 9-64

కూలఁద్రోచు మాతిలోపలికి జాలి
లో గెవి భాగినాలోకించి కామియై కొమ్మ్కైన
దరి గొంత గూలఁద్రోచి 9-568

కూలఁగఁ ద్రోచు ... గో

పురమున్ 'గూల గఁ ద్రోచి' సౌధ భవనంబుల్మాకి
10 ఉ 398

4 4 3 5 'కొను' సాహాయ్యక క్రియగా చేరునప్పుడు ధాతువు పొందు మార్పులు

1 'కొను' ఆత్మార్థకముగా వచ్చినపుడు ప్రయోగములు

| | |
|---|---|
| ఊడ్చు కొను | 10 పూ 400 |
| అరసికొను | 10 పూ.212 |
| తమ్మకొను | 10 పూ 1173 |
| పుచ్చుకొను | 10 పూ 826 |

2 'కొను' సామాన్య ధాతువుగా మారినపుడు వచ్చు ప్రయోగములు :

| | | |
|---|---|---|
| కాపుకొను | 10 పూ 1060 | ముట్టుకొను |
| పట్టుకొను | 8-696 | గ్రహించు |
| మేలుకొను | 4-157 | లేచు |
| వేడుకొను | 9-572 | ప్రార్థించు |

3 అంచు, కొంచు ప్రయోగములు భాగవతమున పోతన రచనలో గలవు

| | |
|---|---|
| కూర్చెదమంచు | 10 పూ 1720 |
| కై కొందువందు | 10 పూ 1719 |
| చూపి కొంచు | 10 ఉ 793 |

4 4 3 6 సంయుక్త ధాతువులు కొన్నిచోట్ల అర్థ విశేషముతో మరికొన్ని చోట్ల అర్థ విశేషము లేక యుండును

| | | |
|---|---|---|
| ఒప్పారు | 3-795 | ప్రకాశించు |
| తనరారు | 2-239 | ప్రకాశించు |
| ముదమారు | 2-162 | ఆనందించు |
| పిపారు | 3-476 | వృద్ధిపొందు |
| పెంపారు | 3-125 | అతిశయించు |
| సొపారు | 3-476 | అధికమగు |

4 4 3 7 అకర్మక ధాతువుల అన్నంత రూపములపై -కొట్టు, -పెట్టు -చేయు, -ప్రేయు అను సకర్మక అనుబంధ క్రియలు చేరి సకర్మక సంయుక్త ధాతువులగుచున్నవి

-కొట్టు దుల్లిగొట్టు . నాశనముచేయు 4-120

తెగఁగొట్టు . ముక్కలగునట్లు చేయు 4-335

-పెట్టు

కూడు [అ క్రి]+పెట్టు [స క్రి] కూడబెట్టు 10 పూ 1208

తొలంగ [అ క్రి]+పెట్టు [స క్రి] . తొలంగ బెట్టు 10 పూ 128

-చేయు

కల్గు [అ క్రి]+చేయు [స క్రి] కల్గజేయు 4-84

తొలఁగు [అ క్రి]+చేయు [స క్రి] తొలఁగజేయు 9-113

పడు [అ క్రి]+చేయు [స క్రి] పడజేయు 7-219

పుట్టగ [అ క్రి]+చేయు [స క్రి] పుట్టగ జేయు 4-505

-ప్రేయు :

తెగు [అ క్రి]+ప్రేయు [స క్రి] తెగవ్రేయు 10 పూ 1768

పడు [అ క్రి]+వ్రేయు [స క్రి] , పడవ్రేయు 10 పూ 1318

4 4 3 8 పైచు : ఈ పదము కొన్ని అకర్మక, సకర్మక, స్వార్థముల మీద ప్రయోగింపబడును

ఎగురపైచు 8-399 ఎగురునట్లుచేయు [ఎగురు[అ.క్రి]

కలచిపైచు 10 ఉ 544 · కలచునట్లుచేయు [కలచు [అ క్రి]

త్రుంచిపైచు 10 పూ 945 : ముక్కలుచేయు [త్రుంచు [అ క్రి]

## 4 5 0 సార్వనామికాను బంధములు

## (PRONOMINAL TERMINATIONS)

తెలుగు సర్వనామముల యంతములు క్రియా విభక్తులుగా మారిన వని చెప్పవచ్చును తెలుగు భాషయందలి అనేక శబ్దములు పరిణతినొంది లోకములో వాడుక యందుండగా తమ కాలమున గల ఆ రూపములను గుర్తించి సంస్కృత వ్యాకరణమును చదువుట వలన గలిగిన సంస్కారమున లాఘవము, అనేక రూపముల అగమము మొదలగు విషయములను

మనమున మంచుకొని పండితులు పదములను ముక్కలుచేసి విడదీసినవే ఈ సార్వనామికానుబంధములు, వీనినే క్రియా విభక్తులని అందురు నేను -మేము, నీవు-మీరు వాడు-వారు, అది-అవి [అమహత్తు] అను ఈ సర్వ సర్వనామముల యొక్క పరిశిష్ట రూపములే ను, ము, వి, మి, వు, రు, వి, రి, డు రు, ను, రి, ది డు, ను, వి, వు ను అనునవి ఇకారముపై వచ్చినపుడీ ప్రత్యయములు ఇత్వమునొందును వీనినే సార్వనామికానుబంధములని, క్రియా విభక్తులని అందురు

**4. 5. 1**

| ఉ పు . ఏక వచనము | | బహువచనము | |
|---|---|---|---|
| ఇచ్చెదను | 8-580 | ము చదివిస్తుము | 7-154 |
| తుర్రింతును | 3-557 | చింతింతుము | 3-227 |
| విడువను | 9-121 | చేసెదము | 10 పూ 809 |
| వివరించెదను | 1-74 | వచ్చెదము | 10 పూ 830 |
| | | వెలుతుము | 7-75 |
| -వి . | | -మి | |
| కంటివి | 2-93 | కంటిమి | 3-545 |
| గ్రసించితివి | 4-494 | గెలిచితిమి | 4-33 |
| | | చేసితిమి | 10 ఉ110 |
| | | మింటిమి | 10 పూ 3 |

మధ్యమ పురుష

| | | | |
|---|---|---|---|
| -వు . | | -రు : | |
| గైకొనవు | 4-185 | చత్తురు | 2-3 |
| చేసెదవు | 10 పూ 1518 | | |
| వదతువు | 1-147 | | |
| -వి | | -రి | |
| కొంటివి | 10 పూ 822 | కంటిరి | 10 పూ 16 4 |
| చొచ్చితివి | 10 ఉ 432 | పడితిరి | 1-208 |
| తెలిపితివి | 10 పూ 3 | | |
| పట్టితివి | 1-91 | | |

ప్రథమ పురుష

మహద్వాచకము

| | |
|---|---|
| -డు : | -రు . |
| ఎఱుగదు 10 పూ 958 | గెల్తురు 4-313 |
| కవదు 1-37 | చెప్పెదరు 7-246 |
| దాలదు 1-123 | వెఱతురు 10 పూ 1258 |
| -ము : | -రి : |
| ఎక్కేము 9-298 | చూచిరి 1-256 |
| చూపెము 1-158 | తాకిరి 10 ఉ 1106 |
| కోరెము 9-261 | వడసిరి 10 ఉ.1061 |
| | వడసిరి 3-266 |

అమహద్వాచకము

| | |
|---|---|
| -ది : | |
| ఉన్నది 1-482 | — |
| -డు : | |
| ఎవయదు 1-251 | |
| కదలదు 9-576 | — |
| తిరుగదు 4-187 | |
| -ను · | |
| ఇచ్చును 10పూ 32 | |
| ఒదిగెను 10 పూ 926 | |
| తాల్చెను 4-407 | |

మహతీతరా మహద్వాచకము :

| | |
|---|---|
| — | -వి : |
| | చదివినవి 7-166 |
| | -వు |
| — | కుడువవు 1-340 |
| | కూడవు 1-340 |
| | మానవు 1-340 |

4511 ఏకవచన [ప్రథమేతర] పురుష ప్రత్యయములు పాక్షికముగ లోపించును ప్రథమ పురుష మహతీత రామహద్వాచక బహువచనము [-ను] లోపము పాక్షికము, ఏకవచన [ప్రత్యయ రూపముతో సదృశ్యమే]

ఉత్తమ పురుషైక వచనము .

పుట్టితి -Ø 3-859
పోయితి -Ø 1-489
పొందుదు -Ø 8-689
విడుతు -Ø 2-217
వెదకెదు -Ø 4-751

మధ్యమ పురుషైకవచనము

గెల్చితి -Ø 7-83
చెప్పితి -Ø 10 పూ 1245

ప్రథమ పురుషైకవచనము [మహతీతరా మహద్వాచకము]

క్రోపించె -Ø 9-523
మెలంగె -Ø 10 ఉ 1327

4512 కొన్ని సందర్భములలో మధ్యమ పురుషైక వచనమున-వు ప్రత్యయము యొక్క వ కారము లోపించును

త్రుంచెదు [< త్రుంచెదవు] 4-476
పోయెదు [< పోయెదవు] 10 పూ 635
ప్రేలెదు [< ప్రేలెదవు] 10 పూ 1546
మనలెదు [< మనలెదవు] 4-482

## 460 సామాన్య సమాపక క్రియలు

(SIMPLE FINITE VERBS)

### కాల భావ బోధక ప్రత్యయములు (TENSE-MOOD MARKERS)

పరిపూర్తియైన ఒక వ్యాపారమును, భావమును తెలియజేయు ఉచ్చారణ విభాగములను లాక్షణికులు సమాపక క్రియలని వీఃపై పరిభాషించిరి, వీనిపై చేరు కాల భావ బోధక ప్రత్యయములు క్రిందిచూపబడినవి

461 భూత కాలిక ప్రత్యయములు :

తెలుగున రెండు విధములైన రూపములు గలవు చేయుచున్న వాడు అను [క్రియాజన్య విశేషణ] రూపమునుండి వర్తమాన రూపము కల్గినట్లే చేసినవాడు అను భూతార్థక క్రియాజన్య విశేషణము నుండి కలిగిన చేసినాడు, చేశాడు అను రూపముల వంటివి మొదటి జాతివి ఇవి నవ్యములు తెలుగున మాత్రమే కలిగినవి ఈ రూపములు ప్రాచీనప్త తెలుగు శాసనములలో కలవు కాని యివి విశేషణ మాత్రములు కాం భేదమును చూపునవి కావు

ఉదా. [స్థితి చెఱిఞ్చి న వాణ్డుభారణాసి] స్థితి చెఱిచినవాడు వారణాసి యందు వధ చేసినవాడు ఇందు చెఱిచిన వాడు భవిష్యదర్థకమేగాని భూతార్థకము కాదు

చేసితివి, చేసితిమి, చేసితి, చేసెను, చేసిరి ఇత్యాదులు ప్రాచీనములు రెండవ జాతి ఇందలి ఇ వర్ణము భూతార్థమని తివర్ణము అగమమని మూరిమతము ఇవి ప్రాచీన ద్రావిడమునుండి తెలుగు పేరు వరకముంద గల తమిళ, కన్నడములందలి రూపములతో సమానము

కన్నడమున-ద, -ఇ వర్ణములు భూతార్థకములుగా వచ్చునని శబ్దమణి దర్పణము పేర్కొనినది [2]

ఉదా – పడెదం . పడసెను

గెల్దం గెలిచెను

ఇడిద పెట్టెను

కేళ్దం : అడిగెను

ఉకారాంత ధాతువులపై ఇకారము నిత్యముగా వచ్చును కన్నడ మున ఎత్తి నోచి, అది మొదలగు క్త్వార్థక రూపముల తుదిని ఇకారము కనపట్టు చున్నది

తమిళమున సెయ్ + ద్ + ఏన్ > సెయ్‌దేన్=చేసితిని,

---

1 ద్రా వ్యా క్రియా 17, 18

2 శబ్దమణి దర్పణము సూ 220

వరు+న్ద్+ఏన్ 7 వందేన్,=వచ్చినాడు

ఇందు -దు వర్ణము భూతార్థముగా వచ్చినది

పాడ్+ఇ+న్ ఏన్ పాడినేన్ పై రూపములలో -దు -ఇ వర్ణములు రెండును భూతార్థకములే భూతకాలిక వర్ణములు పోతన భాషలో -ఇతి-/ -టి-/-ఎ-/-ఇ- అనునవి వచ్చును

4611 మధ్యమ, ఉత్తమ పురుషైకవచనములను తెలియజేయు సార్వనామిక ప్రత్యయములు -వి/-మి/-వి/-రి అనునవి ఇవి చేరుటకు పూర్వము -ఇతి-ప్రత్యయము పోతన భాషలో వచ్చుచున్నది

మధ్యమ పురుషైక వచనము

| | | | |
|---|---|---|---|
| ఓడు | • ఓడు+ఇతి+వి | ఓడితివి | 1-354 |
| కోరు | కోరు+ఇతి+వి | కోరితివి | 4-20 |
| గెల్చు | . గెల్చు+ఇతి+వి | గెల్చితివి | 10 ఉ 41 |
| చేయు | చేయు+ఇతి+వి | చేసితివి | 2-76 |
| తెలుపు | తెలుపు+ఇతి+వి | తెలిపితివి | 10 పూ 3 |
| పట్టు | పట్టు+ఇతి+వి | పట్టితివి | 1-91 |

బహువచనము

| | | | |
|---|---|---|---|
| కొట్టు | కొట్టు+ఇతి+రి | కొట్టితిరి | 1-312 |
| వడు | • వడు+ఇతి+రి | వడితిరి | 10 పూ 493 |
| పట్టు | పట్టు+ఇతి+రి | పట్టితిరి | 1-312 |

మధ్యమ పురుష ఏకవచన ప్రత్యయమగు 'వి చేరుటకు ముందు 'ఇతి' చేరును 'ఇతి' భూత కాలిక ప్రత్యయమునకు పూర్వము కొన్ని చోట్ల 'ఇంచు' ప్రత్యయము పోతన భాషలో గలదు

| | | |
|---|---|---|
| ప్రాపు+ఇంచు+ఇతి+వి | ప్రాపించితివి | 1-444 |

ఉత్తమ పురుషైక వచనము

| | | | |
|---|---|---|---|
| పాయు | పాయు+ఇతి+వి | పాసితివి | 3-856 |
| చంపు | చంపు+ఇతి+వి | చంపితివి | 1-365 |

ఉత్తమ పురుష బహువచనము .

| | | | |
|---|---|---|---|
| గెలుచు | గెలుచు+ఇతి+మి | గెలిచితిమి | 4-333 |
| చేయు | చేయు+ఇతి+మి | చేసితిమి | 10 ఉ 110 |
| విఱుచు | విఱుచు+ఇతి+మి | విఱిచితిమి | 1-51 |
| వచ్చు | వచ్చు+ఇతి+మి | వచ్చితిమి | 10 ఉ 1156 |

4612 నాల్గవ తరగతికి చెందిన అన్వాది ధాతువుల ఉత్తమ మధ్యమ పురుషైక వచన, బహువచనములకు ముందు భూతకాలిక పర్యాయ రూప ప్రత్యయమగు -టి- పోతన భాషలో కన్పట్టుచున్నది

ఉత్తమ పురుషైక వచనము

| | | | | |
|---|---|---|---|---|
| కను | కం-టి-∅ | 3-146 | కం-టి-ని, | 1-265 |

ఉత్తమ పురుష బహువచనము .

| | | |
|---|---|---|
| కను | కం-టి-మి | 1-52 |
| మను | మం-టి-మి | 7-220 |
| విను | విం టి-మి | 10 పూ 3 |

| మధ్యమ పురుషైకవచనము | | | మధ్యమ పురుష బహువచనము | |
|---|---|---|---|---|
| అను | అం-టి-వి | 4-82 | అం-టి-రి | 10 ఉ 12 1 |
| కను | కం-టి-వి | 7-342 | కం-టి-రి | 3 523 |
| కొను | కొం-టి-వి | 10 పూ 822 | కొం-టి-రి | 10 పూ 470 |
| విను | విం-టి-వి | 10 ఉ 1142 | విం-టి-రి | 4-30 |

4613 ప్రథమ పురుషైక వచనమునకు, పురుషేతరా మహద్వాచక బహువచనమునకు ముందు భూతకాలిక ప్రత్యయమైన 'ఎ' వచ్చును

ప్రథమ పురుషైక వచనము

మహద్వాచకము

| | | | |
|---|---|---|---|
| ఎక్కెను | 8-298 | తిరిగెను | 10 ఉ 225 |
| చూపెను | 1-158 | తేర్చెను | 10 పూ 1497 |
| చెప్పెను | 10 పూ 638 | | |

మహతీ వాచకము

కాంచెను 4 81

మహతీతరామ మహద్వాచకము

ఇచ్చెను 1-1 1

ఒడిగెను 10 పూ 926

ఎనగెను 10 ఉ 805

కలెకెను 0 పూ 773

కాల్చెను 1-407

తొలంగెను 3-86

ప్రథమ పురుష బహువచనము

మహతీతరా మహద్వాచకము

అదరెను 3-604

తేల్చెను 10 పూ 1497

వండెను 9-318

4614 మహతీ, మహన్మహతీ వాచక ప్రథమపురుష బహువచనము కు అందు భూతకాలిక ప్రత్యయమైన '-ఇ-' వచ్చును

ప్రథమ పురుష బహువచనము

మహద్వాచకము •

ధాత్రీవరనందనుల్ రాజీవ దళాక్షు దాకిరి 10 ఉ 1106

మహతీ వాచకము

ఆడిరి రంభాది కాంత లానందనమువం 10 పూ 107

పొగడిరి కృష్ణునయ్యబ్జముఖులు 10 ఉ 692

మహన్మహతీ వాచకము

మునిశ్రేష్ఠునే క్రోతల్ గోరిరి 1-75

46 ) తద్ధర్మార్థక ప్రత్యయములు ,

-ఎను, -∅, -ఎద, /-దు/తు/ద్

తమిళ కన్నడ వైయాకరణులు వారవి తద్ధర్మార్థకములను ఒక

సప్తముని మండలమున్ 4-378
మేలు నమకుఋ నచటన్ 4-246
అవిశమునవ్మదీయ గురుడైన 4-730

/-మ/

తానమ మోదమందు 4-769
అసితేక్షణయైన కూతుమ 4-830

/-మన్/ .

ఉగ్ర గతిమొత్తె వాడునునోసరించె 3-673
ఆదరమున నీవునం బలెమ 4-809

2 -ఉన్ అనుసముచ్చ యార్థకమునందలి -ఉన్ అమ పదకల్పము మీద తిరిగి -ఉన్ అమనది ఆగమమగుచున్నది

'అదియుమంగాక లోకంబు వారలకుగ్లేశంబుఱ' 3-725
ఇదియుమంగాక 4-926

4 11 4 2 -ఏవి అను పదకల్పము భిన్నార్థములలో ప్రయోగింపబడు చున్నది.

1. -ఏవి అను పద కల్పము సామాన్యముగా చేదర్థకమును సూచించును

అచటికేగ గనోపుదువేవి నేగుము 3-630
బలిమి కలదేవి నాతోగలనమ నెదిరింపి 3-656
గగన వాణి పలికెనం
చలిగెదవేవి మృగాక్షికి 10 పూ 42
అతిథిజనుల కర్ధ మాడకయి రేవి 8-467
ధర్మంబవితో చేసేవి జనకా 10 పూ 889
లోకులందు నమభావన చేసితివేవి క్షత్రియున్ 10 పూ 1518

2 నామ, విశేషణంబుల మధ్య -ఏవి చేరుటచే విశేషణార్థమునకు ఆధిక్యము కలుగుచున్నది

బలం

బుసగలవేని విల్వు రణభూమిని 3-660

స్త్రీపురుషనపుంసకులలో నెవ్వరేని భూత దయలేక 4-477

విస్ఫురదవ, ధాముండై యెవ్వడేని తవరిన భక్తిన్ 4-667

3 ప్రశ్నార్థక సర్వనామములపై -ఏని అను పదకల్పము చేరి అనిర్దిష్టార్థము నిచ్చుచున్నది

ఎందేని

ఇట్టి యాశ్చర్యమెందేనిని గనుఁగొంటిరే 4-661

ఎక్కడేని

ఆకాంతతోడనెక్కడే నరుగుటయును 10 ఉ 424

4 11 4 3 అనుధాతువుకు క్త్వార్థక రూపము అని రెండువాక్యములను కొన్ని విశేషార్థములలో అనుసంధించుటకు ఈ అని శబ్దము పదకల్పముగా ప్రయుక్తమగును

1 అనుకరణమునందు, ధ్వన్యనుకరణమునందు 'అని' అనుబంధముగా నుపయోగింపబడును

కల కలమని పలికెఁ బక్షిగణ మెల్లెడన్ 10 ఉ 1002

అలివోకపలె ఘల్లని అంకెవైచిన 10 ఉ 403

గజ్జలు ఘల్లని మ్రోయగ 10 పూ 368

ధగ ధగమని మెఱుంగులు 10 ఉ.368

మిల మిలని మంచుతో దంబురుణించు 10 ఉ 346

భగ భగమని మంటలొదవె భయదములగుచున్ 10 పూ 1674

2 హేత్వర్థము

భయముకల్గని లోకముఁజెందు భూవరా 7-385

ఓడకుండుదని సంగరకౌతుకమొప్ప 10 ఉ 842

3 ఉద్దేశార్థము :

-అని/ -అనుచు/ అంచు

పలికెదనని గమకముఁగొను

పలుకదని నిలుచు 7-343

నన్ను వధించెననుచు బుద్ధిఁదలచు చున్నారె 4-486
దుష్పురుష సఖ్యము దుర్గతి హేతువంచు 3-831
తమచిత్తములం దలఁచు 7-459

4 11 5 కిలార్థకము (Assert ve Particle)

4 11 5 1 పోతన ప్రయోగించిన కిలార్థకములు

-కదా/ కదే/ -గాదా/ -కాదె/ కదయ్య

అనువదకర్పములు సందర్భమున తమగుణముగ సంతాపము, సందేహము, ఆశ్చర్యము, ప్రశ్నము, ప్రార్థనములను సూచిం చును

/-కదా/

రాజ సతామహాత్ములకు రాదు గదా వినుఁగాని 10 ఉ 1147

సంతాపమునకు

/-కదే/

అప్పటి జనంబు
పోయెబోయెఁగదేయని బొబ్బలిడగ 10 ఉ 1293
ఇచేత వచ్చితి భయంబెల్లో కదే యీశ్వరా 8-72

/-కాదా/ :

సందేహమునకు :

మహిమఁదేలినవేళ సుఖింతునేన కాదా 3-69

/-కాదె/ •

ప్రశ్నము

1 తమూర్తిని దప్పక చూచిరిగాదె తత్సభా
జనులెల్లన్ 3-90
భవ వృద్ధిలయము లా పరమేశుచేనగు
పీవెఱుంగుదుగాదె 1-102
హరిదయావలోక, నముసఁజేసికా దెనటనాఖ
సన్నిధి, కర్థినగుచు 10 ఉ 1029

/-కదయ్య/ :

ప్రార్థనము

మేలు మేలు గదయ్య 10 పూ 738

ప్రశ్నము .

కొడుకునీగదయ్య కొనవరులేక 9-194

పెంపలరగ బ్రోది వెట్టుదుగదయ్య 3-262

4.11 6 ఇతర అవ్యయములు , (Indecl nables)

4 11 6 1 పోతన ప్రయోగించిన -కాక/ -కాని అవ్యయపములకు వ్యంజకత్వము పెక్కు రీతులగా కల్పించుట

4 11 6 2 -కాక అను అవ్యయము అగు ధాతువు యొక్క క్త్వార్థక రూపము ఇది సందర్భానుసారముగా పెక్కు విధముల ప్రయోగింపబడు చున్నది

1. భుజ శక్తినాతోడఁ బోరాడ శంకించి
మున్నీట మునిగిన మునుగుగాక 7-32 వికల్పార్థము
అచల సంభ్రమమున కెఱిగి
వెన్నిచ్చిన విచ్చుగాక 7-32

2 ఇదియునుంగాక 4-926 అదనముగా అనునర్థమున

3 రాజు రాచకూతు రతి సేయఁ
దగు గాక 9-512 కాని అను అర్థమున

4. క్లేశంబుల పనయింపను
నీవకాక యితరులు గలరే 3-725 నిశ్చయము

5 వహ్ని శిఖావరం పరలచే
దగ్ధుండు గాకుండునే 2-24 భావమును తెలుపును

6 భద్రమగుగాక నీకు 2-243 ఆశీర్వాదమును తెలుపును

7. వినుమదిగాక యీభువి 3-885 కాని అను అర్థము
వినుమదియు గాక 3-321 కాని అను అర్థము

8 రోగనిదాన దేహములతో విరక్తుడుగాక 7-358
లక్ష్యపెట్టక అను అర్థమున

9 కొంత కాలం మరుగు గాక 8-641 వికల్పార్థము

10 పుండరీకాక్షుడొకడ కాక గణుతింప 10 ఉ 1279 విశ్చయము

11 నాకు గాక పరులకు వశమే 10 పూ 375
అదనముగా ననునర్థమున

4 11 6 3 -కాని అను అవ్యయము అగు ధాతువు యొక్క వ్యతిరేకార్థ విశేషము

ముని ముఖ్యుడు గాడిక యోగి గానగాం జాలడు -125

4 11 6 4 -అయ్యె అనుపదకల్పము కొన్నిచోట్ల పోతన ప్రయోగములలో కనిపించుచున్నది

/-అయ్యె/

వాయువుం గూడిన వట్టిదయయ్యెను 3-903
శమింపంగం జాలదయ్యె జగతీనాథా 8-213
బొజ్జ దిరిగి రాదయ్యె 10 పూ 385
ఈపురి లేదయ్యెనయ్య 10 ఉ 1284

## 5 వాక్య విజ్ఞానము (SYNTAX)

గరిష్ఠ పరిమాణముగల ఉచ్చారణ భాగము వాక్యము అర్థ దాహక మైన కనిష్ఠభాగము పదాంశము MORPHEME) ఇది సంపూర్ణ భావ బోధకము ఒక వాక్యమునందు ఇన్ని వర్ణములు, ఇన్ని పదములుండ వలెనను నియమములేదు ప్రాయికముగా వర్ణములు, పదములు సంపూర్ణ భావ బోధకములు కావు కాని కొన్ని యెడల ఒకే వర్ణము [ఆ, ఊ మొద లైనవి] సంపూర్ణ భావ ప్రకాశన సమర్థము కావచ్చును ఒకే పదమే వాక్యము కావచ్చును [తే, పో, రా మొదలైనవి] బోధన కవకాశము కల్పించునది వాక్యము అందువలన వాక్యమును భాషయందు పరమ ప్రమాణముగా స్వీకరింతురు

వాక్యమును గూర్చి అనేకులు అనేక విధములైన అభిప్రాయము లను వ్యక్తము చేసిరి

"వాక్యము నాయోగ్యతా కాంక్ష సహితంబగు నర్థము
గల యాసత్తి యుక్త పద సముదాయము"
వాక్యమని ప్రౌఢ వ్యాకర్త సూత్రించినాడు [1]

దీనిని ప్రౌఢ వ్యాకర్త సాహిత్య దర్పణము నుండి యున్నది యున్నట్లు తెనిగించుట స్పష్టము [2]

విషయ బోధకము వాక్యము

ఉద్దేశ్య విధేయ భిన్నంబు విషయంబు" అని సూత్రీకరించెను కందుకూరి వీరేశలింగము పంతులుగారు "ఒక్క క్రియతో నన్వయించు పదసముదాయము వాక్యమనంబడును"[3] అని లక్షణ మేర్పరచెను " రెండు విరామముల మధ్య సహజమైన వ్యవహారములో ఏర్పడేవా గ్రూపం" వాక్యం అనవచ్చు [4]

తెలుగునందలి వ్యాకరణ కర్తలు వాక్య నిర్మాణమున కవసరమైన విషయముల విడి విడిగా చూపించిరి. కాని వాక్య స్వరూపమును నిరూపించుటకు ప్రయత్నింపలేదు ఆంగ్ల వ్యాకరణములలో వాక్యలక్షణ ముండుట వలన ప్రాచీనాంధ్ర వ్యాకరములందు అంతకు ముందులేని ఈ వాక్య ప్రకరణమును ప్రత్యేకముగ ప్రౌఢ వ్యాకర్త చేర్చెను కాని వివరణ ప్రణాళికయును, లక్షణ నిర్వచనమును సంస్కృతమునుండి మాత్రమే గ్రహించుట స్పష్టము

చేకూరి రామారావు గారు రచించిన తెలుగు వాక్యం" అను గ్రంథమునందు తెలుగునందలి అనేక వాక్యముల స్వరూప స్వభావము లను గూర్చి వివరింపబడినది "సంపూర్ణము సంపూర్ణమని వాక్యంబు ద్వివిధంబు" అను ప్రౌఢ వ్యాకరణ సూత్రము ఆంగ్లమున వాక్యములు మూడు విధములు

---

1. ప్రౌఢ వ్యాకరణము వాక్య పరిచ్ఛేదము 5.

2 "వాక్యం స్యాద్యోగ్యతా కాంక్ష సత్తియుక్త పదోచ్చయం "
సాహిత్య దర్పణము

3 సంగ్రహ వ్యాకరణము 63వ పుట

4 భద్రిరాజు కృష్ణమూర్తి భారతి

1. Simple Sentence
2 Complex Sentence
3 Compound Sentence

పై మూడింటిని గ్రహించి తెలుగున సామాన్య, సంశ్లిష్ట, ద్వంద్వ వాక్యములను పేర్లను సంగ్రహ వ్యాకరణకారుడు కందుకూరి వీరేశలింగము పంతులుగారు ప్రవేశపెట్టినారు ఉప వాక్యమను పేరు Subordinate Sentence అను ఆంగ్లపదమునకు పరివర్తనముగాగూడ వాడెను పై మూడు వాక్యములను కుప్పుణ్ణయ్యంగారు ఋజు వాక్యము, అఋజు వాక్యము క్లిష్ట వాక్యము అను మూడు పరిభాషలతో తన సర్వలక్షణసార సంగ్రహమున వ్యవహరించెను

ఆధునిక భాషలకనుగుణముగ వాక్యములు సామాన్య సంశ్లిష్ట, సంయుక్త వాక్యములని మూడు విధములుగ విభజింపవచ్చు "ఒక వాక్యములో నిర్దిష్ట స్థానములో ఇంకొక వాక్యమును చేర్చిన సంయుక్త వాక్యమని[5] అనవచ్చును ఒక వాక్యమును ఇంకొక వాక్యముతో చేర్చినపుడు కొన్ని మార్పులు జరుగును ఈ మార్పుల తరువాత సంశ్లిష్ట సంయుక్త వాక్యములు ప్రయోగార్హములగును ఈ రెండు వాక్యములలోనే సామాన్య వాక్యములుండుటకు వీలు కలుగును

పోతన భాగవతమునందలి వాక్య నిర్మాణ విధానము ఆచార్య చేకూరి రామారావుగారి తెలుగు వాక్యం" అను గ్రంథమననుసరించి రూపింపబడినది వాక్య నిర్మాణ విశ్లేషణము పద్య విషయమున కంటె వచన నిర్మాణ విషయమున ఎక్కువగా సమన్వయించును

## 5.1.1 సామాన్య వాక్యములు (S mple Sentences)

సామాన్య వాక్యములలో మరల భేదములున్నవి అతి సామాన్యమైన దానిని నిశ్చయార్థకము అందురు సామాన్య వాక్యమును కొన్ని మార్పులు చేయుట వలన వ్యతిరేక, ప్రశ్న, కర్మణి మొదలగు భేదములు వచ్చును వీనితో పాటు విధి, సంప్రార్థ నాద్యర్థక వాక్యములు నేర్పడును.

5 చేకూరి రామారావు తెలుగు వాక్యం పు 1

ఒక వాక్యమునకు కిఅ, సంబుద్ధ్యాద్యర్థక ప్రత్యయములు చేరుటచే సామాన్య వాక్యములుమరల కొన్ని అర్థభేదములు కలుగును

సామాన్య వాక్యములు రెండు విధములు

1 క్రియారహిత వాక్యములు

2 క్రియాసహిత వాక్యములు సామాన్య వాక్యములలో అసమాపక క్రియలవకాశములేక సమాపక క్రియకు మాత్రమే చోటుండును

1 క్రియారహిత వాక్యములలో కొన్ని సహజముగా క్రియలేని వాక్యములు మరికొన్ని క్రియలోపించిన వాక్యములుండును ఇందు రెండు నామ బంధములుండును

క్రియా రహిత వాక్యము

---

ఉద్దేశ్యము (Subject) విధేయము (Predicate

ఉద్దేశ్యము ఉద్దేశించి చెప్పునది ఈ నామము ఏనామములైనను కావచ్చును సర్వనామములు కూడ కావచ్చును.

విధేయము ఉద్దేశ్యమును గూర్చి ఏది విశేషము చెప్పబడునో అది విధేయము ఇవి సిద్ధనామములు విశేష్యములనుండి సాధించిన నామములు కావచ్చును విశేషణపద పూర్వకమై యుండవచ్చును

పోతన ప్రయోగములు

| | |
|---|---|
| అల్లుడితఁడు | 9-66 |
| ఇత డెయితండు | 10 ఉ 779 |
| ఈగొంతి | 1-209 |

5.1.2.1 క్రియారహిత వాక్యములు

1 ఇవి ప్రథమ, మధ్యమ, ఉత్తమపురుష బోధకములును కావచ్చును అపుడు విధేయ నామము పురుష వచన భేదమునుబట్టి తద్బోధకమైన ప్రత్యయమును గ్రహించును

| | |
|---|---|
| ఎవ్వండు దండ్రి | 10 పూ 640 |
| ఏనుతవుడు | 9-111 |

ఏనేనీవు 4-851

నేమబాలద 7-359

2 ప్రాధాన్యవివక్ష ననుసరించి వాక్యములలో ఉద్దేశ్య విధేయముల వ్యత్యాసము జరుగవచ్చును పదక్రమములో ఈ మార్పుప్రాధాన్య వివక్ష కొరకు వచ్చును దీనివలన ఆఖ్యాత స్థానమునకు (Predicate-Position) చేరిన నామము అధిక ప్రాధాన్యమును వహించును

ఇంద్రియగుణార్థ చిదాభానజ్ఞానమందైన నేను 3-994

బాలుండితడు 10 పూ 686

3 క్రియారహిత వాక్యములలో విధేయములుగ వచ్చిన కొన్ని విశేషములు నామములుగ మారకయే ప్రయుక్తములగును ఇటువంటి వాక్యములలో విధేయ నామము మానార్థకముగ నుండును

దివ్య పదము వాడు 8-77

పెద్దవాడవు 1-311

మానిత చరితుడుత్తానపాదుఁడు 2-136

4 కొన్ని విభక్తి బంధములు కూడ క్రియారహిత వాక్యములలో కవిపించుచున్నవి

హరికిం పట్టపు దేవివి 7-340

5 విభక్తి బంధము లేకనే క్రియారహిత వాక్యములలో సంబంధ బోధకములు కవిపించును.

నామమెయ్యది 10 పూ 1114

6 (1) కొన్ని వాక్యములలో క్రియతోపాటు కాలబోధకత లేకపోవుట గమనింపవచ్చును ఆ సమయమున కాలమును బోధింపవలసి వచ్చినపుడు అట్టి వాక్యములకు "అవు" అనెడు క్రియను చేర్చుదురు

తగదని యెఱుగవు 10 ఉ 234

అవుగదే, లావణ్య మవుగదే, మాధుర్య మవుగదే 8-305

(2) ఇట్టి వాక్యములకు వ్యతిరేకార్థమున కాలబోధకత లేనపుడు 'కాదు' అను వ్యతిరేక రూపము చేరును

కాదనదు బొమ్మ 8-657

పెనిమిటి చేతను బెండ్లామనికాదు 4-230

(3) పురుష భేదమును వివక్షింపవలసినపుడు 'కాను' అను రూపము చేరును.

సత్యమో

తలపన్ నేరకయున్నదాననో యశోదాదేవి గానోవర, స్థలమో

10 పూ 342

7 (1) క్రియారహిత వాక్యములకు చివర 'ఆ' అను దీర్ఘాచ్చును చేర్చిన ప్రశ్నార్థక వాక్యము ఉద్భవించును

ఏల బాలకులారా ? 7-246

(2) పై వాక్యార్థమును వివిధ రకములుగ మార్చిన కిలార్థకాది రూపములు కూడ ఇటువంటి వాక్యముల చివర చేరవచ్చును

కొడుకువీ గదయ్య 9-194

ఫలముగాదె 1-102

5.1.3 క్రియా సహిత వాక్యములు

1. క్రియాసహిత వాక్యములో కర్తృ పదము వాక్యాదివి క్రియాపదము వాక్యాంతములో, కరణపదము, కర్మపదము క్రియకు పూర్వము వచ్చును దానికంటె ముందు స్థలబోధక పదము దానికి పూర్వము కాలబోధక పదము, క్రియా విశేషణము క్రియకంటె ముందు కర్మ పదము తర్వాత వచ్చును ఈ వరుసలో ఏ పదమునకు ప్రత్యేక ప్రాధాన్యముండదు ప్రాధాన్యము చెప్పవలసి వచ్చినపుడు ఆ పదమును క్రియాపదమునకు దగ్గరకు జరుపుట ఒక పద్ధతి.

అరయలేదు విధాత 3-404

కర్మవశంబునన్ జగము గల్గును 4-581

కంటిన్ నేటికి విన్న 9-146

తల్లుల చన్ను బాలుమును ద్రావు 10 పూ 788

నారదుండు చెప్పెను 7-8

నీరాట వనాటములకు బోరాటం బెట్లు గల్గెగె 8-19

కర్తృ పదము క్రియా సన్నిహితమైనపుడు కర్తకు కూడ ప్రాధాన్యము వచ్చును

క్రేపులు వాలె గోవులకు 10 పూ 1137

చలమున నమదాసి 10 పూ 1340

2 (1) కర్త, కర్మ క్రియలు గల వాక్యములు

జగనాథుండమరేంద్రు గెల్చి 10 పూ 1680

మునివరులు కామపాలుని వినుతించిరి 10 ఉ 945

ధనహీనుండు నృపాలు జేరి 4-300

(2) కర్త, క్రియలు మాత్రమే గల క్రియాసహిత వాక్యములు

ధరణి గంపించె 3-603

నీవపావకుడవు 9-129

మగువల్ సిక్కరె 10 పూ 993

మునివరుండు కాంచె 10 ఉ 613

పదక్రమ వ్యత్యయము వలన ఉద్దేశ్య విధేయములు మారునని తెలుగులో క్రియా పదముకు సన్నిహితముగ జరిగిన పదమునకు ప్రాధాన్యము కల్గునని తెలియుచున్నది కర్తృ, కర్మపదములు నామబంధములే యని చెప్పవచ్చును

ఉద్దేశ్య, విధేయములకు ఈ రకమైన నిబంధన లేదు

కొప్పులు బిగి వీడి 9-306

ఇందు "కొప్పులు" ఉద్దేశ్యము దీనిని బిగి వీడి కొప్పులు, బిగి కొప్పులు వీడి" అని మార్చిన బిగి" అనునది ఉద్దేశ్యముగ మారును

చిత్రమున భార్య దడసిన 9-470

ఇందు చిత్రము ఉద్దేశ్యము" దీనిని "భార్య చిత్రమున దడసిన" అని మార్చిన "భార్య" ఉద్దేశ్యముగ మారును

4 కొన్ని తావులకర్త స్థానము క్రియకు దగ్గరగా మార్చినను ప్రయోజన ముండదు.

పీథులు నక్కఁ గావించి 9-321
[కావించి పీథులు నక్కన్]
ఎండఁ గాయవెలచు 9-309
[కాయ ఎండన్ వెలచు]

దీని కర్త స్థానము క్రియకు దగ్గరగా చేర్చిన భావములో మార్పును గమనింపవచ్చును

5 [1] ఆఖ్యాత బంధమును ప్రధానమైనది క్రియా పదము దీని వలన కాల బోధకత తెలియును. కాల బోధక ప్రత్యయములు కాలాను గుణముగ చేరును. ఈ ప్రత్యయముల తరువాత కర్తృ పదములో గల లింగ, వచన, పురుషభేదమునమనరించి క్రియా విభక్తులు చేరును

తనయుని నీట బోవిడిచి తానరిగెంబృథ 9-721
క్షితినాథుకూతురును యోగ ప్రీతి చిత్తంబులో
నంధిల్లం బతివెంటనేగె I-317
ముష్టి కుందు ఘోరముష్టి నత్త్వముసెడి
కూలెగాలి ధరువు గూలినట్లు 10 పూ 1363

6 [2] తెలుగులో భవిష్యదర్థ, తద్ధర్మ బోధ ఒకే క్రియద్వారా జరుగును. నన్ను గావనేయయ్య గలండు గర్భజనితావద నెవ్వ డెఱుఁగు 1-280

6 ప్రశ్నార్థక వాక్యములు ఇవి రెండు విధములు

[అ] విశేష విషయాపేక్షకములు

[ఆ] విశేష విషయనిరపేక్షకములు

[అ] విశేష విషయాపేక్షకములు : ఇవి ప్రత్యేక పదార్థక పదముల ద్వార వ్యక్తమగును ఈ ప్రశ్నలు ఎవ్వుడు, ఎందుకు, ఎక్కడ ఏవి మొదలగునవి ఇవి క్రియకు దగ్గరగా పూర్వస్థానములో వచ్చును. భూభాగాన భోగాగంబుల నెక్కడ జనియె 4-474

అత డెందు బోయెను 9-62

ఏమికతమున మన్నదో యెఱుగమేము 4-784

అంభోరుహనేత్రు దేమిటికినై పాదర్రయన్ పేద 9-437

[అ] క్రియారహిత వాక్యముల నుద్దేశించి చెప్పినపుడు పేర్కొను ప్రశ్నలు విశేష విషయ నిరపేక్షములు ఇవి వాక్యాంతములో 'ఆ' చేరుటవలన ఏర్పడును

2 మొత్తము వాక్యమును ప్రశ్నించు 'ఆ' అను రూపము వాక్యాంతములో చేరును. 'ఆ' అనునది వాక్యములో సౌలభ్యము కొరకు మధ్యలోకూడ ఇతర పదములకు చేరవచ్చును ఆ విధముగ చేరుటచే క్రియనామ్నీ కృత మగుచున్నది

" మానితమగు మత్పదముం

బూనదురా యోగ ధర్మములనెటి గింతున్ 3-920

ఆరామ కృపవదఁ మెలగు 'దురా' 4-777

దరువిట మూడు 'మా' 10 ఉ 294

కొన్ని ఉదాహరణములందు ఏ కూడ కనిపించును

మంగళప్రద గుణ కీర్తి నామృతము బాయక క్రోలెద 'జెప్పవే' ? 3-194

పరిరక్షించిన యట్టి కృష్ణుని నుతింపన్ 'శక్యమే' యేరికిన్ 2-189

ఎక్కొట్రా మనుజేంద్రు చేలములు మీకి 'బాడియే' 10 పూ 1257

ఈ 'రే'కోర్కులు 8-590

7. విధ్యర్థ బోధక క్రియలందు కర్త ఎప్పుడును మధ్యమ పురుష సర్వ నామముగ కనిపించుచున్నది ఇది ఏకవచనమైనపుడు క్రియధాతు రూప ములో నుండును ఈ ధాతువులకు ఆదేశ రూపముఉన్నచో ఆ రూప ములే నుపయోగింపబడును

తెమ్ము-తెమ్మ ఒండొకటి దెమ్మ భూసురోత్తమయనుదున్ 8-699

పోవు-పో  యదువంశోత్తమ పోకు పోకు రణమీనర్థంబు
10 పూ 1622

"ఓరి గుహ్యక పోకుపోకుమని రోషోక్తిన్
బు కారాతివా డు  10 పూ 1124

"  బాలుర కడకే
యాటలకు బోక యొక బం
డాటంబున లేక భక్తి నలుపు దును  1-104

వచ్చు-రా

నీపాద కమలంబు నెమ్మిదగ్గలు గావి తరలి పోవంగ
పాదములు రావు"  10 పూ 989

ఇచ్చు-ఈ  దూడలకున్ గోవు లీవు దుగ్ధములు  1-340

చచ్చు-చావు · దుర్భావంబున బొంది చావడు భవద్దో దర్ప
విభ్రాంతుడై  7-231

## 5.1.4 కర్మణి వాక్యములు (Passive Vo ce Sentcnces)

తెలుగునందు కర్మణి వాక్యముల ప్రయోగపద్ధతి చాలా తక్కువ వీనిలో కర్తరి వాక్యములలోని కర్తృ కర్మ పదములు వ్యత్యస్తమగును అప్పుడు కర్తకు చేత వర్ణకము వచ్చును కన్నారాలోకులచే, విన్నారా మీరు వారి విధమెట్టిదియో  1-304

అన్య ప్రాణంబులచేత రక్షణముసేయన్  1-156

"  లోకులచేత సంప్రార్థితుడైన జలరుహనుభుండు  3-173

ప్రజలచే జగము లెట్లుండెన్  3-247

5 1 5 ఆత్మార్థక వాక్యములు . ధాతువులకు 'కొను' "అను" ధాతువుల చేరుటవలన ఏర్పడును "కొను" పరిగ్రహణములో ప్రవర్తించు విధి విశేషములు గుర్తించుట సాధ్యపడును ధాతువునకు "కొను" చేరునపుడు వ్యాపారమును కర్తృ ప్రయోజనముగా అన్వయింప వలెను

"అశ్వత్థామ శిరోజముల్ దఱిగి చూడాంతర్మహా
రత్నమున్, శశ్వత్కీర్తి వెలుంగ బుచ్చుకొని పాశ
వ్రాతబంధంబులన్ విశ్వాసంబున మాద్చిత్రోచె  1-172

"కొండంబులఁ దూరించుచు,
గండంబులఁ జల్లు కొనుచు గళగళరవముల్
మెండుకొన  8-45

"మాయపెడి తన్నుకొనుచును,
గూయుచు నశ్వాసురుండు గూలెన్ నేలన్  10 పూ 1173

5 1 6 [1] "కొనువంటి ధాతువులను క్రియలకు చేర్చుటవలన కొన్ని విశేషార్థములు వ్యక్తమగును ఇదంత క్రియలకు పెట్టు చేర్చుటచే పర ప్రయోజనార్థముగవచ్చును

"ప్రతి వానరంబు జెం
పలరగ క్రోధి పెట్టు దుగదయ్యె  3-762

"భూలోకంబెల్ల గ్రుమ్మరి ఓవంబునకు దాడి వెట్టియుండు నమర
విముఖులయిన బర్హిర్ముఖులం గనుంగొని"  3-612

2 పోవు వేయు చేర్చుటచే పరిపూర్ణార్థము వచ్చును

పోవు  తండ్రి పడిన నతని తనయులు పదివేలు
దలగి పోయి రతని దాకలేక"  9-459
భూమి గోరూపమై బ్రహ్మ జేర బోయి
కన్నీరు మున్నీరుగా రోదనముసేయ"  10.పూ 14

వేయు ' కన్యాలలామంబు మ్రొక్కినరుక్మిందెగ వ్రేయ
బోకమగిడెం గృష్ణుండు  10 పూ 1768

"  భాగవృషణంబులు ద్రెంచివేసిన వద్యాంగంబు
గ్రింద బడి  9-572

5.1.7 సామర్థ్యార్థము  కల, కలుగు,

1 'కల' ప్రయోగించినపుడు వాక్యమున ప్రత్యేకముగ కాలబోధ లేని యెడల వాక్యము తద్ధర్మార్థకమగును

భీష్మకుండనువొక దొడ్డరాజు గలడు  10 పూ 1685
పాపము గలదని నొడివిన
పాపాత్ముని పాపమునకు పారముగలదే  10.ఉ 77

2 దీనిని భవిష్యత్కాలములో కూడ ప్రయోగింపవచ్చును కాలబోధ ప్రత్యేకముగ చెప్పవలసి వచ్చినపుడు 'కల' కు "కలుగు" ఆదేశ మగును

ఏనీ శుభాకార మీక్షింప గన్నుల కఖిలార్థ లాభంబు గలుగు
చుండు భువనోన్నతత్వంబు బొందగలుగు 10 పూ 1702

3 వ్యతిరేకములో 'కల'కు 'లే' ఆదేశముగ వచ్చును
వగయు జెలిమి లేక వరగిన 10 పూ 877
కాదనడు పొమ్మ్న లేదీ రాదనడు 8-657
' లెమ్మ్న నీవాంఛితంబు లేదనకిత్తుం 8-602

518

సంభావన, అనుమతి వచ్చు

'అందఱు గూడి వివాహమైరి
గడవవచ్చునె దైవ సంకల్ప మెందు 4-943
ఏలాగున నోచవచ్చు నెఱిగింపగదే 10 పూ 783
బ్రదుకవచ్చు నొరల ప్రాణంబులుండిన 10 పూ 1758
'వను గొల్వ ముక్తికి నడవవచ్చు' 10 పూ 848

2 'వచ్చు'నకు వ్యతిరేకార్థములో 'రాదు' అను రూపము ఆదేశముగ వచ్చును ఈ అర్థములో క్రియలకు కాలబోధక ప్రత్యయములు గాని, క్రియావిభక్తులు గాని చేరవు

'ఈరాదు రాజ్య మెల్లను
బోరాదు రణంబు సేయబోయితి మేవిన్
రారాదు దనుజ చేతను
జారాదిట మీదనేమి జాడ' 8-454

519 సంవిధి

దీనియందు తప్పనిసరి 'అను' అర్థము వచ్చును. ఈ క్రియా రూపము సహజముగా భవిష్యదర్థబోధకము

శృంగారమే ప్రొద్దు జేయవలయు
ప్రాణేశు చిత్తంబు ప్రేమరంజింపవలయు

ప్రియుఁదలఁప వలయు
సద్బంధుల నడపవలయు
శయనాసన రతుల జరుపవలయు 7-417

2 సామర్థ్యమును చెప్పుటకు 'చాలు' అను క్రియ నుపయోగించెదరు.

' సాయ జాలనమం గొన్ని దినంబులంగ భవలీలం
దేల్పవే నావుడున్' 10 పూ 1494

5 1 10 తక్షణ భవితవ్యము పోవు

ఈ క్రియను అనుసంధించునపుడు మిగిలిన క్రియలకువలె దీనికి అన్ని కాలములందును రూపములుండును

'మామ యెఱింగిన మనువెల్ల జెడిపోవు' 10 పూ 978
' నీ కృప నెప్పుడు నెఱయుగల్గు
నప్పుడు బంధంబులన్నియు దెగిపోవు' 10 పూ 1661
కంబరుండు కుమారువిం గొనిపోవు 10.ఉ 38

5.1 11. నిషేధార్థము వలదు

'వనితా ముట్టకు మమ్ము చన్ను గుడువన్ వల్దమ్మ
నీ చన్ను మాకవయుం దొల్లిడు' 10 పూ 223
'విషధిలోన నొక్క విషము పుట్టు గలిగి వెలవ వలదు 8-175

5 1 12 తెలుగు వాక్యములలో కొన్ని రకముల అర్థప్రభేదములను కలిగింపగల శబ్దములు కొన్ని గలవు ఇవి ప్రత్యేక పదములు కావు ఇవి సామాన్యముగ వాక్యముల చివర చేరును వీనిని వాక్యమున ఏ పదముల కైనను తగిలింప వచ్చును

1 అట .

అట ప్రయోగించిన తరువాత ఏ శబ్దములైనను రావచ్చును వక్త ప్రయోగించిన వాక్య విషయము తాను స్వయముగా చెప్పుచున్న వాక్యము గాదని ఇంకొకరు చెప్పిన విషయమును తాను చెప్పుచున్నట్లు భావింప వలసి యుంటుందని వక్త ఉద్దేశించినపుడు అట ప్రయోగము జరుగును

వాక్యంలో విషయానికి వక్తకు ప్రత్యక్ష జ్ఞానరాహిత్యాన్ని సూచించటానికి అట ప్రయోగింపబడుతుంది [6]

'రాజట ధర్మజుండు సురరాజు సుతుడంట' 1-211

' వైష్ణవతేజో, లవనమున బుట్టినారట'
పసిబిడ్డలనంగ జవదు 10 పూ 1327

2 కీలార్థకములు

[అ] కదా .

రాజసతా మహాత్మ్యంబు రాదుగదా విన గాన 10 ఉ 1147

[ఆ] కాదా

ఇద్దేవుని వత్కృపామహిమ దెలివవేళ సుఖింతునేన కాదా' 3-69

[ఇ] కదే :

' అప్పుడచ్చటి జనంబు పోయె బోయె గదే యని
బొబ్బలిడగ' 10 ఉ 1293

[ఈ] కాదె .

విశ్వమునకు, భవ వృద్ధిలయములా వరమేశుచే
వగు నీ వెఱుంగుదు గాదె నీముఖమున 1-102

'యుగ యుగమున, వలవసముదయింతు గాదెయ
భవయనంతా' 10 ఉ 649

[ఉ] కదయ్య

'మేలు మేలు గదయ్య రాముడు మేటిరక్కసు నొక్కరుడున్
నేల గూలిచెన్' 10 పూ 738

3 సంబుద్ధ్యర్థకములు :

' ఇదివీ కనయంబును వలవదుడుగుమయ్య కుమారా 4-354

4 సందేహార్థకములు

/ఒ/ ఎందెతెంచిరొ కృష్ణుతో మెలగువారు 10 పూ 530

/ఓ/ 'ఏదిక్పాలుర జూచెనే దలుగునో యేదేవు
బంధించునో' 7-100

---

6 చేకూరి రామారావు, తెలుగు వాక్యం పు 22

/ఒకా/ : ఎట్టి కవంబు సేసెనొకా 10 పూ 676
ఎట్టి విజయంబు పల్కెనొకా 10 పూ 676

/ఒకో/ ఈ కాంతాజనరత్న మెవ్వరిదొకో 8-395

/ఒక్కొ/ ఏమరాముదొట యెఱుగ దొక్కొ 9-442

5 ప్రశ్నార్థకము

/-ఎ/ వత్తురెవిప్రులు వేడగ
విత్తురె దాతలును వేడ్క విప్రార్థములం
దెత్తురె మీరలు నంపదలు 8-521

/-ఏ/ . కృష్ణుని మతింపన్ శక్యమే 2-189
శప్రు ముఖ్యమ కావవే 9-129

/-అ/ దయవిటు సూడుమా 10 ఉ 204

6 కర్మపదములు ప్రాతి వాచకములైన ద్వితీయా విభక్తి ప్రత్యయము లైవము, వి అను గ్రహించుము వీనితోపాటు భిన్నార్థములందు భిన్న ప్రత్యయములు నామములకు చేరును

[అ] కు, కి

సంబంధార్థము .

'దేవర్షి పిత్రాదిలోకములకు ధర్మాదులకు మహాధార
మకదె' 7-34

సామ్యార్థము

'గరళంబు గంఠబిలమున హరుడు ధరియించుటకు
మెచ్చి 8-249

సంప్రదానార్థము :

'నీ ప్రేమకు వచ్చు దాసులకు గ్రించు కవంబున నెగ్గు
సేసితివ్ 9-116

ప్రయోజనార్థము

సురలు హరికి మొలలు వెట్టిరి 8-297

తరుణికి మంగళస్నానంబు సేయింకమవి 8 269

[అ] తో

కరణార్థము

'వినబడియెను స్వాయంభువమను వంశము వర్ణ ధర్మ
మర్యాదలతో' 8-3

సహార్థము

'వింగికి వడితో గొబ్బున నెగసి' 9-35

రీత్యర్థము :

హరితో బద్ధ విరోధము౦దొరదు 4-75

దేహమనఃస్థితి

'భాస్కర కళిమండలంబులు విజద్యుతితో
వెలుగొందెను' 3-710

[ఆ] లో

అధికరణార్థము

'గట్టిగ బుద్ధిలో వివిపికంటిమపాయము' 2-93
'భూదారములు నేలబొటియలలోదాఁగు 8-29

[ఈ] లోపల .

'కుత్తుక బంటితోయములలోపల వసించి' 4-648

[ఉ] మీదట

'నీవీకాయంబు విడిచి మీదట, మాయను మతి
బట్ట గలవు మద్భక్తుడైన' 1-127

## 5.20 సంశ్లిష్ట వాక్యములు (Complex Sentences)

ఒక ప్రధాన వాక్యమునకు కొన్ని ఉపవాక్యములు చేరుటచే సంశ్లిష్ట వాక్యము లేర్పడును సంశ్లిష్ట వాక్యములలో ప్రధాన వాక్యము క్రియా సహితమైన యెడల ఒకటికంటె ఎక్కువ క్రియలను గమనించుటకు వీలుకలుగును ఉపవాక్యములలో క్రియ సాధారణముగ అసమాపక క్రియగ నుండును మరికొన్నిటిలో క్రియ భావార్థక నామమ గ గాని క్రియాజన్య విశేష్యముగ గాని యుండును వీనిలో పురుషబోధ ఉండదు అసమాపక క్రియలలోనైన వ్యాపారము జరుగు తీరునుబట్టి యుండును

5 2 1 అసమాపక క్రియ :

తెలుగునందు ప్రధాన క్రియకంటె ముందు జరిగినట్లు భావించెడు వ్యాపారములను సూచించుటకు అసమాపక క్రియల నుపయోగించెదరు దీనినే క్త్వార్థకమందురు ధాతువునకు 'ఇ' ప్రత్యయము చేర్చుటవలన క్త్వార్థక మేర్పడును క్రియాంత భాషలలో ప్రధాన క్రియకు పూర్వమే ఇది కల్పించును పూర్వా పూర్వ వ్యాపారముల తెలుపుటకు ఇది యుపయోగపడును వాక్యములో క్త్వార్థక, శత్రర్థక క్రియలున్నపుడు ప్రధాన అప్రధాన క్రియలకు రెంటింటికి ఒకే కర్త యుండును వీనిని దృష్టిలో పెట్టుకొని చిన్నయసూరి 'సమానాశ్రయంబులం బూర్వకాలంబు నందిప్రత్యయంబగు'[7] అని సూత్రీకరించెను

'కోట కొమ్మలు నేల గూల ద్రోచి' 9-290

'ధనంజయుండు ద్రోణునందనుంగూడ నరిగి పట్టుకొని' 1-153

1 క్త్వార్థక క్రియతోనున్న వాక్యము కొన్నిచోట్ల ప్రధాన క్రియకు విశేషణముగ ప్రవర్తించును

'కుడిచి కూర్చుండి మొదవుపై గోర్కి జేసి
సంపద యదేల యీ యావు చాలుగాక
ఇట్టి గోవుల నెన్నండు నెఱుగమనుచు
బిట్టు తెండని తన యొద్ది భటుల బనిచె' 9-348

2 క్త్వార్థక రూపముల కొన్ని క్రియలు ప్రధాన క్రియకు సన్నిహిత ముగ నుండి వ్యాపార భంగిని బోధించును అప్పుడు ఉప వాక్యములను విడదీయుట కష్టమగును

'మా ప్రాణవల్లభు ప్రాణమిచ్చి కావు భక్తవరద' 10 పూ 688

'అక్కడ వచ్చి పెద్దకడనయ్యెను' 9 468

'ధర్మనందను జూచి యుక్కలిక తోడ బలికె' 10 ఉ 714

3 ప్రధాన క్రియతోగల ఉప వాక్యములు ప్రధాన వాక్యమునకు క్రియార్థక విశేషణములుగా ప్రవర్తింపుట గమనింపవచ్చును

7. బా వ్యా క్రియా 3

'చలమున నను డాసి జలరాశి జొరరాదు' 10 పూ 1340

అక్షణపతులార లజ్జించి చెప్పరు' 10 పూ 848

4 క్త్వార్థక క్రియ కొన్ని సందర్భములందు ప్రధాన క్రియకు హేత్వర్థకమగును

'కొందరు గలదని లేదని కొందరనుందురు' 8-225

5 క్త్వార్థక క్రియ తరువాత కొన్ని పరిమితి వాక్యములు సర్వసాధారణముగ వ్యతిరేకార్థక ప్రతిపాదికములుగా నుండును

'నిర్వక్రతత్వంబునఁ గృష్ణుఁబెట్టి తన క్రోవంబో
విచారింపదే' 10 పూ 1215

## 5.2 2 శత్రర్థకము

ప్రధాన క్రియ తెలుపు వ్యాపారముతోపాటు జరుగుచున్న వ్యాపారములను బోధించు క్రియ శత్రర్థక క్రియ అందురు క్త్వార్థక క్రియకుగల విశేష ప్రయోజనములు దీనికి లేవు ఒకే కర్తగా, ఒకే కాలములో జరుగు వ్యాపారములను తెలుపుట ఈ క్రియ ప్రధాన ప్రయోజనము

1 క్త్వార్థక క్రియవలె ఇదియును ప్రధాన క్రియకు రీతిబోధక విశేషణముగా ప్రవర్తించును

'కరి బృందము బోలె జనిరి కళకళపడుచున్' 4-339

2 స్థూలదృష్టితో పరిశీలించిన శత్రర్థక ప్రధానక్రియలు ఏకకాలములో జరుగుచున్నట్లు తోచినను అది నిజముకాదు రెండు వ్యాపారముల నడుమ వ్యవధి లేనపుడు కూడ శత్రర్థక క్రియ ప్రయోగింపబడును

కర్ణ రంధ్రముల్
బలువుగ మూసికొంచు జనబాడియటందురు" 4-90

## 5.2 3 చేదర్థకము

ధాతువుకు 'తే' అను రూపము చేర్చిన యెడల చేదర్థక రూపమేర్పడును కొన్నిచోట్ల 'తే' రూపము లేకనే చేదర్థక భావములను సూచించు వాక్యములును గలవు చేదర్థక క్రియ ఉన్నపుడు ప్రధాన వాక్యములో

శవిభ్యదోత్పాదక క్రియ యుందుట సాధారణము 'చోన్' అను అవ్యయము క్రియాజన్య విశేషణములపై చేరి చేదర్థక మగుచున్నది

"జగముమ శాపదించుచోన్ద్రావి" 7-289

## 5 2.4 అవ్యర్థకము

ధాతువునకు "ఇనన్" ప్రత్యయము చేర్పుటవలన అవ్యర్థక క్రియా రూప మేర్పడును

' కాం, చన రుచిమేన గల్గు పురుషత్వముతో
బొద సూపి విల్చినన్' 10 ఉ 456
'ఈ శునక శ్రేణి వధింతు నేడవి మొనన్
సోకోర్చి వర్తించినన్' 3-655

## 5 2.5 నామ్నీకరణములు

ఒక వాక్యమును మరొక వాక్యమందలి నామపదస్థానమున ప్రయోగించినప్పుడు కొన్ని మార్పులు వచ్చును ఈ మార్పులను నామ్నీకరణము లందురు

భావార్థక నామ్నీకరణము

సామాన్య వాక్యములను భావములో మార్పుచేసిన భావార్థక నామ్నీకరణము లేర్పడును ధాతువునకు భావార్థకమున 'ట' చేరును

'కాందఱుర్విపై గూలుట కంటిరే' 7-212
'వత్కథామృతము మానగ గ్రోలుటమాని' 3-1022

## 5.2.6 పరోక్ష ప్రశ్నలు

ఇవి విషయాపేక్షక ప్రశ్నలు, విషయావిరార్థక ప్రశ్నలని రెండు విధములు ఎవరు, ఎక్కడ, ఎప్పుడు మొ॥ విషయాపేక్ష ప్రశ్నలు ఆ-అను పదాంత శబ్దముతో వచ్చునవి విషయవిర్దేశకములు

'ఏమివిమిత్తమై భూమిగోరూపిణియయ్యె' 4-467
'వెరవు నాకెట్లు గలుగు' 3-311

"నీవెవ్వతె వెవ్వని విభుండెవండు" 4-846

మత్పదముం బూను దురాయోగ ధర్మముల

నెఱిగింతున్ 3-920

మన్నారాద్వారకలో, మన్నారాడుదువుల

గన్నారా లోకులచే విన్నారా" 1-304

కొన్నిచోట్ల 'ఆ' అనుటకు బదులు ఎ, ఏ లు వచ్చును

దైవమొకడు గల డెఱువిని 10 ఉ 1032

సిరి మూట గట్టికొని పోవంజాలిరే 8-590

530 సంయుక్త వాక్యములు (Compound Senteces)

కొన్ని సమాన ప్రతిపత్తిగల వాక్యములు కలిసి ఒక వాక్యముగ ఏర్పడినయెడల అది సంయుక్త వాక్యముగా మారును [8] ఆంగ్లమున and, హిందీలో ఔర్, యా, మగర్ అను శబ్దములను ప్రయోగించెదరు తెలుగులో అన్నిచోట్ల యిట్టి శబ్ద ప్రయోగములేదు తెలుగున రెండు వాక్యములను ప్రయోగించి వాని సంబంధములను అర్థమును బట్టి గ్రహింపగలము వాక్యపు చివర స్వరోచ్చారణ ద్వారమున ఈ సంబంధము వ్యక్తమగును

531 స్థితి బోధకమైన ఆఖ్యాతములున్నపుడు ఇటువంటి పరివర్తన అర్థభేదమును కలిగింపదు వాక్యములను ఏది ఏదిగ పంచినను, కలిపినను అర్థ వ్యత్యయము ఒక విధముగ నుండును

వి, పాపమునన సింతురెన్నటికి జావును బుట్టువులేవు వీరికిన్ 3-704

"వీరింట వీనుతుండిర, వారికి వీరికిని దొడ్డ వాదయ్యెనతీ" 10 పూ 312

532 భిన్న ప్రశ్నార్థక శబ్దములు గల వాక్యములను కలుపునపుడు సమక్రియల లోపము జరుగదు

"ఎవ్వడు విశ్వంబునెల్ల సలీలుడై పుట్టించు రక్షించు బొలియ జేయు

నెవ్వని చేష్టలనెఱుఁగరు బ్రహ్మాదులెవ్వనిమాయ మోహించు

10 ఉ 88

---

8 చేకూరి రామారావు తెలుగువాక్యం పు 98

5 3 3 రెండు వాక్యముల మధ్య వైరుధ్య సూచనకు కాని శబ్దము ఉపయోగింప బడును

"బాలు డంగిని కడు బాలుఁగాని సర్వాత్ముఁడు 10 పూ 343

"ఏమటికిమిగాని యీ ఒడికడుమాకున" 10 పూ 346

5 4 0 అనుకృతి

ఒకసారి ప్రయోగింపబడిన భాషాంశమును మరల ప్రయోగించుట అనుకృతి [9] అందరు అనుకృత అంశమునకు భాషా పరిధిలేదు వర్ణ, శబ్ద పద, వాక్య సమూహములలో నేదైన కావచ్చును

5 4 1 అనుకృతి ప్రత్యక్ష పరోక్ష అనుకృతులని రెండు విధములు ఉన్నదున్నట్లు అనుకరించి చెప్పుట ప్రత్యక్షానుకృతి విషయమును అనుకరించి చెప్పుట పరోక్షానుకృతి తెలుగున ప్రత్యక్ష పరోక్షాను కృతు లందు "అని- రూపము ప్రయోగింపబడును ఇది "అను ధాతు నిష్పన్న క్త్వార్థక క్రియారూపముతో సమానము

"కావలివారు మేల్కొని చూచి కలవుర శోకముల్" 10 పూ 148

"కొట్టుచుండిట్టి చిట్టి పట్టి యావ్వరని వాపోవ" 0 పూ 153

5.4.2 హేత్వర్థము

1. 'అని' అనునది హేత్వర్థమును బోధించును

"ఓహో వెలుపకు మని" 10 పూ, 206

"వేలు విశ్వంబుపైఁ బడ్డ నాఁగినఁ గదలని యట్టి కాళ్ళు 8–202

2 కొన్ని ప్రశ్నార్థక శబ్దములకు కూడ 'అని' ప్రయుక్తమగుచున్నది

"నీకు నేమని విన్నవింతుము 8–168

"క గవేలని చంపితి" 10 పూ 80

3 "అని"తో కూడిన ధ్వన్యను కరణ పదములు కూడి ఇందు కన్పించుచున్నవి

---

9 చేకూరి రామారావు, తెలుగు వాక్యం పు 74

కం కంపని వణికె 10 ఉ 1002

మిలమిలని మించుకోదంబురుడించు ధళ ధళమను 10 ఉ 346

542 విశేష్య విశేషణములకు లింగ బోధ విభక్తి వచనములలో సమరూపత యుండుట తటస్థించును

"తరుణుఁడు దీర్ఘ దోర్దండుఁడు గంబుకంధరు డు
పీతాంబరధారి వేల్పు కేళ్ల గదలి వెడలివచ్చె" 8-293

## 6. లోకోక్తులు, నుడికారములు

## (PROVERBS, IDIOMS & USAGES)

610 లోకమున అనగా జనులలో రూఢమైన ఉక్తి లోకోక్తి లోకోక్తి అనగా వాడుకమాట, పుకారు అని ఆంధ్ర వాచస్పత్యమున శ్రీ కొట్ర శ్యామల కామశాస్త్రి పేర్కొనెను లోకోక్తి అను సంస్కృత పదమునకు సామెత అనునది తెలుగుమాట ఈ సామెతలు జనవ్యవహారములో వినవచ్చు మణి పూసలవంటి వాక్యములు సమాజమునందలి వ్యక్తుల అనుభవసారము సారము పుట్టిన సత్య పరమార్థములు ముద్దకట్టిన మూర్తులివి అన్నమునకు కూరల వలె సామెతలను ప్రసక్తాను ప్రసక్తముగా జనులు వాడుకొందురు సామెతలు తరతరాల అనుభవములకు అక్షర రూపములు సామెత లేని మాట ఆమెతలేని ఇల్లు ఉండదని సామెత గలదు సామ్యమను అర్థములోనే సామెత అను పదము వ్యవహరింపబడినట్లు పెద్దల అభిప్రాయము. సామెత అను పదము 15వ శతాబ్దములోని వరాహపురాణములో తొలిసారిగా ప్రయోగింపబడినదని పంపత్ రాఘవాచారి అభిప్రాయము [1] సామెతకు సరియైన నిర్వచనము కల్పించుట కష్ట సాధ్యము. సామెతలు సృష్టించినది జానపదులు సామెతలు సమతా శబ్దభవమని బ్రౌణ్యనిఘంటువు పేర్కొనినది సామెతలు మరో పేరు 'సాటువ, సాటవ, చాటువ, చాటప' అని నెల్లూరు, రాయలసీమ ప్రాంతములలో కలదు 'సాటిక' అని దివాకర్ల వెంకటావధాని, [2] సమానత్వ లక్షణం

1 సంపత్ రాఘవాచారి తెలుగు సామెతలు, పీఠిక పు 2.

2 తెలుగు సామెతలు తెలుగు సాహిత్య అకాడెమి ప్రచురణ

దృష్టిలో పెట్టుకొని నవుక గర్జింపు' అని నేదునూరి గంగాధరం, [3] సామెత జీవితానుభవం యొక్క సూత్ర ప్రాయ నగ్న స్వరూపం, [4] అని ఆచార్య బిరుదు రామరాజు పేర్కొనిరి. జాన్ క్రిష్టియన్ సామెత ప్రజాజీవనమును స్ఫుటముగా తెలియజేయు ముఖపత్రమని, [5] బేకన్ "సామెతలు పదునైన వాక్పరికరములని, [6] హోమిడ్" భాషలో సామెత భోజనములో ఉప్పువంటిదని [7] పేర్కొనిరి. సామెతల లక్షణము తాము చెప్పదలచిన విషయమును ఎదుటి వ్యక్తికి సులభముగా అర్థమగునట్లు పోలికలతో కొన్ని మాటలు చెప్పుదురు. ఇందలి మాటల పొందికయే సామెత. ఇక వీని పుట్టు పూర్వోత్తరములను గూర్చి చెప్పుట అంత సులభమైన పనికాదు. సామెతలు అనేక విధములుగ రూపొందనగును. కొన్ని సూక్తులుగా, కొన్ని దృష్టాంతములుగా, కొన్ని సాదృశ్యములుగా, కొన్ని విదర్శనములుగా, కొన్ని ఏగాథనో, ఏ జానపద గేయమునో పురస్కరించుకొని పుట్టిన జనశ్రుతులుగా వాడుకలో నలిగి యుండును. సామెతలలో ఉపయోగింపబడిన భాషా పదములు, వస్తువుల పేర్లు, ఆభరణములు, వాహనముల ఆధారముగా సామెతల కాలమును కొంత వరకు ఊహింపవచ్చును. సామెతలు లౌకికములు. అన్ని సూక్తులు, సుభాషితములు, నిత్య వ్యవహారములో తరుచుగా వాడుటచే సామెతలుగా చెల్లిపోవుచున్నవి. ఇట్టి సుభాషితములు, నీతి వాక్యములు, సూక్తులు ప్రయోగమందు కొంత వ్యంగ్య మర్యాద నంపాదించి వాక్యగతమైన శబ్దములకంటె విలక్షణమైన అర్థమును సూచన చేసినప్పుడు సన్నివేశ బలము వలన

---

3. పసిడి పలుకులు : నేదునూరి గంగాధరం.

4. తెలుగు సామెతలు : తెలుగు సాహిత్య అకాడమీ.

5. Proverbs of a people are the index of their lives -Into. Beihari Proverbs.

6. Edged tools of speech - Bacon

7. A Proverb is to speech what salt is to food - Homid.

వానికి సామెత గౌరవము సంక్రమింపవు ఇట్టి అర్థ విశేషము సూచిం పబడుచుండుట సామెతల అర్థము వానిలోని మాటలకు చెందినది కాక ఇతర అర్థమేదియో ఉండునని తెలియుచున్నది

సామెతలు సామాన్యముగా జన సామాన్యమునుండి పుట్టుకొని వచ్చును కొన్ని సామెతలలో సామాన్య జనులు ఆయా వృత్తులపట్ల వానికి చెందిన వ్యక్తులపట్ల తమ అభిప్రాయములను ప్రకటించుచు వచ్చి నారు తన్ను తల్లి దూరమైనా కంసాలి వదలడు, దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడు, దాసరసేద్యం దత్తం చేటు, కాపులచదువు కాసుల చేటు ఆదాయం లేనిదే సెట్టి వరద బడిపోడు రెడ్డివచ్చె మొదలాడు, మంగలి పాత చాకలి కొత్త, పూటకూళ్లమ్మకు పుణ్యంతో పని లేదు నేసే వాణ్ణి నమ్మి పొలిమేర జగడము ఒప్పుకోవద్దు వంటివి ఆయా వ్యక్తుల పట్ల, వృత్తులపట్ల ఒకనాటి ప్రజాభిప్రాయములను తెలుపు జన వాక్య ములు కొన్ని సామెతలలో ఆయా ప్రాంతీయ నామములు ఆయా ప్రాంత ములలో వ్యవహారములో నుండును అనంతపురం జిల్లాలో రొద్దానికి ఎద్దును, పెనుగొండకు పిల్లను ఇవ్వకూడదు అని కృష్ణాజిల్లాలో 'ఎల్లటూరికి ఎద్దును వరుమాడికో వడుచును ఇవ్వకూడదు అని ఒకే అభిప్రాయమును వ్యక్తము చేయుటకుగాను ప్రాంతీయములైన జనపదముల పేర్లు వాడుట సర్వ సాధారణము ఇట్లే అంత మేర గోదావరి ఈత సామెతలు స్పృశిం పని మానవ జీవితానుభవము లేదు

ఇవి భాషను జీవన స్రవంతివలె ప్రవహింప జేయును అందులో సంతర్గర్భితములైనవి లోకోక్తులు మన జాతి, మత సంప్రదాయ సాహిత్య చరిత్ర, సంస్కృతులకు నీ లోకోక్తులు దర్పణము వంటివి

సామెతల వర్గీకరణమును ఎవరికి తోచిన విధముగా వారు చేసిరి కొందరు అకారాది క్రమమున, మరి కొందరు విషయ ప్రాధాన్యముగా వర్గీకరించిరి విషయ ప్రాధాన్యముగా వర్గీకరించుట పరిశోధనాత్మకముగా యుక్తమైనది డాక్టరు నాయని కృష్ణకుమారిగారు బంధు సంబంధి, వ్యక్తి వివేచనా సంబంధి, సత్య విషయ సంబంధి అని మూడు విధములుగా వర్గీ

కరించిరి భాగవతము ప్రధానముగా అనువాద రచనము అందును భగవ
ద్భక్తి పారమ్యము సామాన్య జన జీవన చిత్రణమునకంతగా ఆస్కారము
లేని భగవల్లీలా విలాస విన్యాసములకను ప్రాసము ఐనను సహజ
పాండిత్య శోభితుడగు పోతన కైవారమునందలి సామెతల తీరు తీయము
అను దొరకినంత వరకు పరికింతము

విషయాను సారి వర్గీ కరణము

61 . మానవ పరముగా

1 పాపోత్పన్నులకు వరములిచ్చుట, పన్నగములకు అమృతమిడుట
వంశజ గర్వా 7-383

హిరణ్య కశిపుని వధానంతరము నరసింహదేవుడు బ్రహ్మదేవునితో పలికిన పలుకులలోనిదీ సామెత దేవతల శత్రువులైన రాక్షసులు చేయు తపస్సులకు లొంగి వారిని మన్నించి హిరణ్య కశిపునికిచ్చిన వరముల వంటివి ఇక మీదట ఈయవలదు పాపములచే భ్రష్టులైన వారికి వరములిచ్చుట సర్పములకు అమృతము సమర్పించుట అవి పల్కొను సర్పములు సహజముగానే విషభరితములు ఎప్పుడు ఏ సన్నివేశములో కాటువేయునో ఎవ్వరికి తెలియదు అట్టి వానిని దూరముగా నుండి సంహరింపవలెనే కాని మృత్యువును జయింప గలుగు సాధనమైన అమృతమును వానికి సమర్పించుట పాపమును కలిగిన దేవతలకు వరము లిచ్చుట సమానమగుననెడు వృత్తాంతమును ఈ సామెత యందు బ్రహ్మదేవునితో విష్ణువు చెప్పెను

2 ఇంతి దావవహ్ని పురుషుడాజ్యఘటంబు 7-422

నారదుడు ధర్మ రాజునకు వర్ణా శ్రమ ధర్మంబులు తెలుపు పట్టునలోని దీసామెత. స్త్రీ దావాగ్ని పురుషుడు నేతికుండ ఈ రెండును కలిసిన నేయి కరగకుండ ఉండదు అట్లే కాముకత్వము కల్గిన యెడల బ్రహ్మయైన కూతురును వదలక మానడు బ్రహ్మచారికి ఇంతి పొత్తువలదు దీనిని బట్టి వర్ణాశ్రమ ధర్మములు వ్యక్తమగుచున్నవి

3 మహానిధింగోలుపోయిన పేద చందంబున 1-357

అర్జునుడు ద్వారకనుండి వచ్చి శ్రీకృష్ణుని నిర్యాణంబు సోదరులకు చెప్పుచు పల్కినది అర్జునుడు దుఃఖించుచు కరతలంబునందుడిచి కొనుచు గద్గద స్వరంబున మహానిధింగోలు పోయిన పేద చందంబుని విట్టూర్పులు విగిడించుచు అన్నతో పల్కెను పేద వాడు తాను పేద రికము ననుభవించుచు ఒకసారి అకస్మాత్తుగా మహానిధి లభించినది అట్టి నిధిని పదలుకొనుట పేద వానికెట్టి కష్టము కల్గునో దానిని వర్ణించుట దుర్లభము అర్జునునికి లభించిన నిధి శ్రీకృష్ణుడు అట్టి నిధిని శాశ్వతముగా దూరమగుట భరింపలేని దుఃఖమునకు హేతువైనది మహానిధి శ్రీకృష్ణుడు సమానము పేద వాడు అర్జునుడు సమానము

4. ముంగల నిలుచుచు నియతిని వెంగిలిక్రియ 1-105

నారదుడు వ్యాసునితో తన పూర్వ జన్మ వృత్తాంతమును తెలుపు సందర్భమున ఈ సామెత చెప్పబడినది యోగి జనులకు పరిచర్యలు సేయుచు ఎండకు వానకు ఇచ్ఛగింపక బయటకు వెళ్లక ఇతర పనులను ఆచరింపక అవివేకివలె ముంగల భాగమున నిలబడి ఉండుడును అవివేకి ప్రవర్తన నారదునిలో కన్పించుచున్నది ఎంగిలి మెతుకులను తినుట మూఢుని లక్షణము అట్లే నారదుడు ఎంగిలి మెతుకులను భక్షించుచున్న వానిగా స్పష్టము చేయబడినది

5 పుత్రేణ లోకాన్ జయతి 4-594

సత్పురుషులు పృథుచక్రవర్తిని అభినందించి పలుకుపట్టునందలి దీసామెత. ఇది వేదవచనము పుత్రుడు పున్నామ నరకము నుండి తల్లి దండ్రులను రక్షించునని పుత్రుని ఔన్నత్యమును వేనోళ్ల చాటుచు పుత్రుని వలన లోకములను జయించునని వచింపబడినది అనెడి వేదములందు చెప్పిన మాట నిశ్చయమగునని సత్పురుషులు పృథు చక్రవర్తితో పలికిరి

6.1.2 జంతువులు సరీసృపములు, కీటకముల పరముగా .

1 ఎద్దు క్రొవ్వి పెలుచన్నాలోకువై అంకె సైచిన చందంబున 10 ఉ 521

పౌండ్రక వాసుదేవుడు శ్రీకృష్ణునితో కయ్యమునకు కాలు ద్రవ్వగా పలికిన సందర్భములోనిది సామెత ఓ పౌండ్ర భూవనుత

నీమానము, నీబిరము యుద్ధములో మాన్పగలను దూత చేత పన్నా పేక్షించితివి అది ఎట్లున్నదనగా మదించిన ఆబోతుపై ఎద్దు క్రొవ్వి ఱంకె వైచిన చందముగా నున్నది ఇక్కడ ఆబోతు శ్రీకృష్ణుడు ఎద్దు పౌండ్రక వాసుదేవుడనెడు భావము స్ఫురించు చున్నది ఎద్దు క్రొవ్వి ఆబోతుపై తలపడినను పారిపోవలసినదే కాని ఎదుర నిల్వలేదు. అట్లే నీవు కూడ నా యెదుట నిల్వ లేవు అని శ్రీకృష్ణుడాతనితో పల్కెను

2 పసిరి కాయలోని ప్రాణిబ్రతుకు 2-51

పరమ భాగవతుడైన పాండవేయునితో వాసుదేవ పరాయణుడైన శుకుడు చెప్పు సందర్భములోని దీసామెత విష్ణుకీర్తన చేయనివారు గాలిలో మంచి కదలు శవముతో సమానము అట్లే విష్ణు పాదముల గాంచని వాని బ్రతుకు బంగారు కాయలో నున్న ప్రాణి బ్రతుకుతో సమానమని చెప్పెను కూపస్థమండూకము వలె నుండి బంగారు కాయ లోనున్నాననెడు ప్రీతి ఆ ప్రాణికి కలుగునే గాని బయట ప్రపంచ ముతో సంబంధములేకుండును ఆ బ్రతుకు వ్యర్థమైనది, నిష్ప్రయోజన మని సూచించును

3 పాములకు పాలుపోసిన మాదిరిన్ 8-316

ముకుందుడు స్త్రీ రూపమున ధరించి అమృతమును దేవాసురులకు పంచునట్టి సన్నివేశములో గల దీసామెత పాములకు పాలు పోయుట దోషము విష సర్పములకు పాలు పోయుటవలన వానికి కృతజ్ఞతాభావము కలుగదు పాలు పోసిన వానినే కాటు వేయు గుణము వానికి కలదు కనుక అట్టి అవివేకము పని కూడదు. రాక్షసులు సహజ ముగా క్రూరులు దేవతలపై ఎన్నోసార్లు దండయాత్రలు కావించిన వారు అట్టి వారికి అమృతము పోయుట పాములకు పాలు పోసిన దానితో సమానమని సుందరి తలంచి దేవాసురులను వేరువేరు వరుసలలో కూర్చొనపెట్టెను ఇచ్చట పాములు రాక్షసులు పాలు అమృతము అని తెలియుచున్నది

4 బడుగు ముసలెద్దు రోసిన పగిది 3-981

కపిలుండు దేవహూతికి భక్తియోగమును తెలియ జేయు సన్ని వేశము నందలి దీసామెత కుటుంబ పోషణమందు బలిమిసాలక మంద

భాగ్యుడై కుమతియై పూర్వక్రియా హీనుడై వృథా ప్రయత్నంబులు చేయుచు మూఢుడై ఉన్నట్టి వాని జూచి తద్దారసుతాదులాత్మజను వడుగరు వశక్తుడు ప్రోదగా బాధితదని పెగ్గింతురు అట్టివాడు సుఖము బొందలేడు అదెట్లన కృషీవలుడు బడుగు ముసలెద్దు రోసిన పగిది. కృశించిన ముసలి ఎద్దు బాధపడిన విధముగా అశక్తుడును బాధ పడునని తెలియుచున్నది.

5 సింహము పాలిసొమ్ము గోమాయువు గోరుచందము 10 పూ 1701

రుక్మిణి అగ్నిద్యోతనుడను బ్రాహ్మణుని కృష్ణుని వద్దకు బంపు సమయములోని దీసామెత రుక్మిణి శ్రీకృష్ణుని వేడుకొనుచు పలికిన మాటలు సింహము సొత్తును నక్క కోరు విధమున నీకు దక్క వలసిన సొమ్మును ఇంకొకడు నీచునికి దక్కుతున్నదని రుక్మిణి మాటలందు ద్యోతకమగుచున్నది ఇక్కడ సింహము శ్రీకృష్ణుడు గోమాయువు మత్తుడు, చైద్యుడు అయిన శిశుపాలుడు

6 1.3 ప్రకృతి పరముగా

1 ఎవ్వనికి నెండ మావుల నీళ్ళ గా బాదులు అన్యోన్య బుద్ధిబాపదరునట్లు 1-34

శ్రీమహాభాగవత పురాణంబునకుం గథా ప్రారంభెట్టిదని వివరించు సందర్భములోనిదీసామెత ఎండమావుల నీళ్ళయందు కాచాదులు అన్యోన్య బుద్ధివలె ప్రకాశించునట్లు విశ్వజన్మ స్థితి విలయంబులెవ్వని వలన యేర్పడునో వానిని కోరి చింతించెదను,

2 ఘన సింధువు జేరెడిగంగభంగి 1-199

కుంతీదేవి శ్రీకృష్ణుని నుతించు సందర్భమునందలిదీ సామెత శ్రీకృష్ణుని గొప్పతనమును వేనోళ్ళ చాటుచు, నీవులేని పాండవులు, యాదవులు జీవుని బాసిన ఇంద్రియముల చందంబున కీర్తి సంపదలు లేక తుచ్ఛత్వంబు నొందుదురు ఈ భూ మండలము నీవు లేక ప్రకాశింపదు అట్టి పాద పద్మముల చింతనముపైనా బుద్ధి ఎల్లప్పుడు కూడు కొని ఉండునట్లు చేయుము అదెట్లనగా గొప్ప సముద్రమును చేరు గంగవలె అని సామెత చెప్పబడినది సముద్రమును చేరవలెననెడి

ఉత్సాహము గంగాదేవికెట్లు గలదో నాకు నీ పాద పద్మములను సేవింప వలెననెడు కుతూహలము అట్లు కలదని కుంతి పేర్కొనెను

6.1.4 ద్రవ్యము పరముగా

1. ఇనుమయస్కాంత సన్నిధినెట్లు భ్రాంతమగు 7-149

తండ్రి మాటలకు పురోహితునిరీక్షించి ప్రహ్లాదుండు పలుకు సందర్భములోనిదీపాటెత ఇనుము అయస్కాంతమునెట్లు ఆకర్షించునో నా మనస్సు భగవంతుని యట్లాకర్షించును ఇక్కడ అయస్కాంతము భగవంతుడు ఇనుము నా మనస్సు అను విషయమును ప్రహ్లాదుడు వ్యక్తము చేసెను

6 1 0 నుడికారములు

మానవుని మనోగత భావములను విస్పష్టపరచు ప్రముఖ సాధనము భాష అనాదిగా నిది చిత్ర విచిత్ర పరిణామములు పొందుచు ఒక విలక్షణత్వమును సముపార్జించుకొనుచున్నది భాషకు విసర్గ రామణీయకమును, అర్థగాంభీర్యమును కల్గించుటలో నుడికారములు ఒక సముచిత స్థానమును పొందుచున్నవి స్థూల దృష్టికివివి కొన్ని పదముల సమాహారముగా గానవచ్చినను నిశితముగా పరిశీలించినచో ఒక వైశిష్ట్యమును మనమిందు దర్శింపగలుగుచున్నాము

ఇంగ్లీషున నుడికారములను Id oms అందురు [9] Idiom is a form of express on construct on phrase etc pecul ar to a Language, a pecul arity of Phraseology approved by usage, and often having a meaning other than its grammatical or log cal one 1628 Usage is a Hab tual use, establ shed practice, Customary mode of act on, on the part of a number of persons [10]

---

9 The oxford universal Dict onary illustrated P 1016

10 The oxford universal Dictionary i lustrated P. 2441

తెలుగున నుడికారము అనగా మాటలందలి చమత్కారము,
సరసత్వము [11] తెలుగులో నుడికారములు నానుడులుగాను, జాతీయ
ములుగాను, పలుకుబడులుగాను మానవులందరై పందిన వ్యవహారములో
చోటు చేసికొనుటచే క్రాంతదర్శులైన మహాకవులు సారస్వతములో
వీనికి సముచితముగా స్థానమును ఒసగుట పరిపాటి

నా నుడి అనగా నాడు నుడి అని యర్థము నాడుల యందు
జనులచేత ప్రయుక్తములైన నుడులను నానుడులుగా లాక్షణికులు
పేర్కొనుచున్నారు నానుడి, నుడి కారము దేశీయ పదములు ఒక
జాతి సంస్కృతిని పట్టి యిచ్చు పదములను పలుకు బడులుగా
పేర్కొందురు ఒక జాతి జనులు ప్రత్యేకముగా వ్యవహరించు మాట
లను జాతీయములందురు జాతీయము సంస్కృతము భాషకు విలక్ష
ణము అయిన అర్థ స్ఫూర్తిని కలిగించు పదములను నుడి కారములు
అందురు నుడి కారము భాషా సంప్రదాయమునే గాక జాతి సంప్రదా
యమును గోచరింపజేయుటలో మణిదర్పణముగా భాసిల్లుచున్నది
లోకోక్తులవలెనవి భాషా ప్రవాహగతికి విలక్షణమైన తత్త్వమును సమకూ
ర్చును సాధారణముగా ప్రతివ్యక్తి తన మనోభావములను ఎదుటి
వానికి వివరించుటలో తన యొక్క భాష పటుత్వముగలదైనపుడు
క్రొత్త పలుకు బడులు, క్రొంగ్రొత్త ఛాయలు, మనోజ్ఞ భావనలు
ప్రతీయమానమగుచుండును పొడి పొడి మాటలవలె నున్న విచిత్ర
పద సమ్మేళనము వలన అతిలోక భావనాసౌష్ఠవమును ప్రదర్శించి
భాషలో విశిష్ట పదబంధములుగా రూపుదిద్దుకొనును ఉదాహరణకు
"వాడుకంట వత్తిడుకొని చదివెను" అను వాక్యములో కంట, వత్తి,
ఇడుకొను అను మాటలు వేరువేరు అర్థములతోగానవచ్చు చున్నను
అవన్నియు కలిసి ఒకే మాటగా రూపొందినపుడు ఒక విచిత్రార్థము
ద్యోతకమగుచున్నది "కంటవత్తిడుకొను" అనగా అహోరాత్రములు
పరిశ్రమించుట, విశేష పరిశీలనము చేయుట అను విశిష్టార్థములు
స్ఫురించును. ఈ దృక్పథముతో పరిశీలించినచో సహజ పాండిత్య

---

11 సు.రా.వి పు 801

బిరుదాంకితుడైన బమ్మెరపోతరాజు కృతమగు శ్రీమదాంధ్ర మహాభాగవతమున నుడికారపు సొంపులు సహృదయ పాఠకుల మనస్సునకు ఆనందమును గల్గించును పోతన భాగవతమున సంతరింపబడిన నుడికారములను ఈ క్రింద అకారాద్యను క్రమమున వివరించుట జరిగింది

1. ఇంకఁబాఱు   ఇంకిపోవు

‘   పారావారమ్ము లింకఁబాఱిన లోలో
ధారుణిరజమై పోయిన ’   8-595

యశస్వి శుక్రాచార్యునితో మాట్లాడు సందర్భములోనిది నుడికారము ఇందలి పదములకు వేరువేరుగా అర్థములు చెప్పిన ఇంక ఇకమీదట, పాఱు పాఱును అని వచ్చును కాని ఇచట ‘ఇంక పాఱు’ అనుటచే ‘ఇంకిపోవు’ అనెడు విశేషార్థము ద్యోతకమగుచున్నది.

2 ఊరక రారు మహాత్ములు

"ఊరక రారు మహాత్ములు వారథముల యిండ్ల కడకు వచ్చుటలు"
10 పూ 284

రేపల్లెకు విచ్చేసిన గర్గ మహామునినిగాంచినందుడు పలికిన పలుకులలోని దీపలుకుబడి ఎంతటి వారైనను నిష్కారణముగారారు. ఒక ప్రత్యేక ప్రయోజనమును ఆశించియే వత్తురనెడు విషయమును చెప్పుటలో నిది చమత్కార దారువుగా వాడబడినది నేడు ఇది ప్రచురముగా వాడబడుచు ప్రసిద్ధిగాంచినది ఇప్పుడు లోకమున వ్యంగ్యముగ కూడనిది ప్రయుక్తము

3. ఎడమడుగు   వైషమ్యము, భేదము, అరమర

"ఎడమడుగులేని నెచ్చెలి
బొడగాంచుట చచ్చి మరల బుట్టుగాదే   10 పూ 202

‘దేవకీ దేవుల పూర్వ జన్మముల వృత్తాంతము’ అను ఘట్టములోనిది వసుదేవుడు నందుని కౌగలించుకొని ఆసీనునింజేసి అతనితో చెప్పుమాటలలోని దీపలుకుబడి ఎడము+అడుగు ఎడమడుగు ఎడము అనగా దూరము అడుగు అనగా పాదము అను అర్థములు వచ్చును. ఎడమడుగు అనగా దూరముగా నున్న చెరువు అను అర్థముకూడ

లోకములో కలదు రెండు పదముల సమ్మేళనము వలన ఆ అర్థములు గాక విష్కళంకము అను విశేషార్థముద్యోతకమగుచున్నది ఇట్టి విశేషార్థమును కల్గియుండుట మడికారము యొక్క సొంపుగా మనము చెప్పవచ్చును

4 కడుపుడిగు గర్భస్రావమగు

"కడుపు డిగెనంచు బొరలు గలుగ బడగ" 10 పూ 62

శ్రీకృష్ణ కథాప్రారంభము ఘట్టములో విశ్వరూపుడగు హరియ దుపులకు కంసుని వలన భయంబు గలుగునని యెరింగి యోగమాయా దేవకి చెప్పుసందర్భములోని దీనలుకుబడి, దీనిని విడి విడి పదములుగా తీసికొనిన కడుపుడిగు అనగా కడుపు క్రిందకు వచ్చు అనునది సామాన్యముగా వచ్చు అర్థము కాని ఇచ్చట రెండు పదములను సమ్మిశ్రమము చేయగా" గర్భస్రావమగు" అనెడు విచిత్రార్థము వచ్చును

4. కనుమాయ తెలియకుండ జరుగుట

'ఏమికనుమాయయో కాని యెఱుగమదిప' 10 ఉ 378

ఉష గర్భవతియైన వృత్తాంతమును చెలికత్తెలు బాణాసురునకు నివేదించు సన్నివేశములోని దీ మడికారము 'కను మాయ' ఇందలి పదములను విడి విడిగా తీసికొనిన వచ్చు అర్థము వేరు సమ్మేళనము చేసిన వేరొక అర్థము వచ్చును. కను అనగా చూచు, గ్రహించు, కన్ను మాయ అనగా మోసము. సమ్మేళనము పొందిన 'కను మాయ' అనగా తెలియకుండ జరుగుట అను క్రొత్త విషయమును ఈ పదబంధము చెప్పును.

6. కంటువడు ద్వేషముగొను, విరోధముగొను,

'అచ్చరలయాట పాటలకు మెచ్చుచు మింట మండి కంట బడి
కంటువడగం సునకిట్లనియె' 10 పూ.153

కంసుడు దేవకి కికల్గిన ఏడవ సంతానము బాలికైనను విడువక నేంపై వినరగా నా బాలిక పైకెగిరి కంసునితో చెప్పిన మాటలలోని దీ మడి కారము సామాన్యార్థము కంటువడు అనగా బాధపడు ఇందలి విశేషార్థము "విరోధముగొను" అని స్ఫురించుచున్నది

7. కరంబు క్రిందగు

"నూత్నమర్యాదం జెందు కరంబు క్రిందగుటనా హస్తంబు మీదౌట మేలగాదె" 8-425

'కరంబు క్రిందగు' అనగా చేయి క్రిందకు వచ్చు' ననెడునది సామాన్యార్థము ఈ మడి కారమునకు ఒకరిచే దానము పొందు స్థితిలో నుండు ననెడు విశేషార్థము వచ్చుచున్నది

8 కుప్పిగంతులు

క్రేళల్ సూడగ గుప్పిగంతులిడుచే
వీక్షింపు గోపార్భకా" 10 పూ 1337

శ్రీకృష్ణ బలరాములు చాణూర ముష్టికులను ముష్టి యుద్ధమున విధించుటకు తలపడిన ఘట్టములో చాణూరుడు కృష్ణునితో పలికిన పలుకులలోని దీ పలుకుబడి కుప్పిగంతులు అనునది బాల్య క్రీడా విశేషము కుప్పి గంతులు అనగా చిన్న చిన్నగంతులు అని సామాన్య అర్థము గొల్ల బాలలను చూడగానే కుప్పిగంతులు వేయుట, చిన్న చిన్న అడుగులు వేయుచు దుముకుట కాదు ఇది యుద్ధము "నాతో యుద్ధము చేయుట నీ తరము కాదు అను విశేషార్థమును ఈ పలుకుబడి పట్టి ఇచ్చుచున్నది.

9 కుయ్యో మొఱ్ఱోయను

శయనుఃఖాదులందు చేయు ఆర్తధ్వనియొక్క అనుకరణము
"అయ్యో దేవ జనార్దన, కుయ్యో మొఱ్ఱోయటంచు గూ యిడిరమరుల్
8-340

దేవాసురుల యుద్ధమందు అసురుల చేత చిక్కి, తెరువుగానక అమరులు దేవ జనార్దన అని వాపోవు సందర్భములోని దీ పలుకుబడి బాధలు వచ్చి నపుడు యాచించు స్థితిలో కుయ్యో మొఱ్ఱో యనెడు కేకలు వేయుట అల వాటు కుయ్యో మొఱ్ఱో అనగా బాధకు సంకేతములనెడు సామాన్యార్థము వినిపించును కాని ఇచ్చట మొరపెట్టుకొను అను విశేషార్థము వచ్చు చున్నది

10. కూడు గుడుచు

భీసుందాలగొడ్డెము లారంగ గూడు గుడిచెదవధిపా 1-313

గాంధారీ ధృతరాష్ట్రుల దేహత్యాగము చేసికొనుట అను ఘట్టములో విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పిన మాటలలోని దీ నుడికారము దీనిని వేరు వేరు పదములుగా తీసుకొనిన కూడు అనగా అన్నము కుడిచెదవు అనగా తినెదవు కూడు గుడుచుట అనగా భోజనము చేయుట అను సామాన్యార్థము వచ్చును కాని ప్రయోగమును బట్టి 'కూడు గుడుచు' అనగా నీచస్థితిని అనుభవించు అనెడు విశిష్టార్థము వ్యక్తమగుచున్నది

11. గజి బిజి బడు కలతనొందు

గుజ గుజలు పోవువాడను.

గజి బిజి బడు వారు లాం గం కలవడుచున్ 8-534

వామనుని రాకతో సభావేదిక తీరు తెన్నులను తెలుపు ఘట్టములోని దీ పలుకుబడి, 'గజి బిజి పడు' అనగా 'సందేహములను వెలిబుచ్చు' నని సామాన్యార్థము కాని ఇచ్చట 'గజి బిజి పడు' అను ఈ పలుకుబడికి 'కలగు' అనెడు విశిష్టార్థము స్ఫురించుచున్నది

12. గుఱు వెట్టు. గుఱక పెట్టు

తెప్పలు మూసి కేల్ దలగడై యుండగ నిద్రించుచున్, గుఱు వెట్టం దొడగెం గలల్ గనుచు నిర్ఘోషించుచున్ భూవరా 8-713

బ్రహ్మ నిద్రావస్థను తెలుపు వృత్తాంతమును వివరించు సన్నివేశములోని దీ నుడికారము 'గుఱు పెట్టు' అనగా 'గురిచూచు' అనునది సామాన్యార్థము ఇచ్చట 'గుఱు వెట్టు' అనగా 'గుఱకపెట్టు' అనెడు విశిష్టార్థము వ్యక్తమగుచున్నది

13. చల్లడము క్రింద దూఱు

నా, చల్లడము క్రింద దూఱని మల్లురు లే రెందు

10 పూ 1339

శ్రీ కృష్ణ బలరాములు చాణూర ముష్టికులతో బాహాబాహి పెనగిన ఘట్టములో చాణూరుడు కృష్ణునితో పలికిన పలుకులలోని దీ పలుకుబడి.

సామాన్యముగా 'వల్లదము' అనగా 'అర్ధోరుకము' ఊరు భాగము వరకు కప్పువది అను అర్థము గలదు కాని ఇచ్చట "నా వల్లదము క్రింద దూఱని మల్లులు లేరెందు అనుటలో 'నాతో సమానులు లేరు, అందరు నాకు దిగదుడుపు, నా కాలి క్రింద దూఱిపోవు, నాకు లొంగి పోవు అను క్రొంగొత్త అర్థములు సూచితములగు చున్నవి

14 తగులంగట్టు [తగులన్+కట్టు] తగిలించు, కూర్చు
"ఈ యిద్దఱిం, దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా" 10 పూ 1738

విదర్భ పుర ప్రజలు విదర్భరాజ సుత వివాహంబునకు రామ కృష్ణులు వచ్చుట విశేషముగా భావించుచు పలికిన పలుకులలోని దీ పలుకు ఇది ఇందలి పదములకు విడి విడిగా అర్థములు చెప్పిన తగులం తగులు పట్లు, కట్టు బంధించు అని వచ్చును తగులుపట్లుగా బంధించు అనునది సామాన్యార్థము. తగులంగట్టు అనగా బలవంతముగా అంట గట్టు అను విశేషార్థము గోచరించుచున్నది

15. తలచెదు

'తంచెడి సాలుక బాహు, బలమొప్పగ వాదు దృష్టి పథమున
ధృతితో 10 ఉ 895

సాల్వుడు శివ ప్రసాదంబును సౌభక విమానంబు పడసి ద్వారకా పురిపై దండెత్తు ఘట్టములో సాల్వుడు కృష్ణునితో యుద్ధమునకు వచ్చిన దీ సందర్భము. తలచెదు అనగా తంచెదిపోవు, మతిభ్రమించు అను సామాన్య అర్థము వచ్చును కాని ఇచట 'తంచెదు' అనగా 'తయపదు' అను విశిష్టార్థము ద్యోతకమగుచున్నది

16. తలల్ వంచు కొనంగజేయు అవమానపడునట్లు చేయు.

అసురేంద్రుని ముందట మాకు నౌదలల్ వంచుకొనంగ
జేసితివివైరి భూషణ వంశ దూషణా' 7-152

పురోహితుడు ప్రహ్లాదుని గాంచి అతని ప్రవర్తనకు విసుగు చెంది అనిన మాటలలోని దీ సందర్భము తలల్ తలలు, వంచు కొనంగిజేయు వంచుకొనునట్లు చేయు అనునవి సామాన్యార్థములు "తలల్వంచుకొనంగ

జేయు" అను ఈ నుడి కారమునకు 'అవమాన పరజేయు' అనెడు క్రొంగొత్త అర్థము విశదమగుచున్నది

17. నష్టేట ద్రోయు

నీదు దోసిలి సొచ్చి వచ్చిన నన్ను న
ష్టేట ద్రోప గ బాడియే కృపయింతలేక దయానిధీ 8-695

'నష్టేట ద్రోయు' అనగా ఏరుమధ్యలోనికి గెంటివేయు అను సామాన్యార్థము వచ్చును కాని ఇచ్చట సర్వనాశనము చేయు అనెడు విశేషార్థము స్ఫురించుచున్నది.

18. నీటిలో జాడ పుట్టించు .

"నీటిలో జాడ బుట్టించు నేర్పునీక
కాక గల్గునె మూడు లోకముల యందు 10 ఉ 370

బాణాసురుని కూతురైన ఉష తన చెలికత్తె చిత్రలేఖ కార్యనైపుణ్యమును ప్రశంసించు సందర్భములోని దీ పలుకుబడి "నీటిలో జాడబుట్టించు అనగా నీటియందు అడుగుజాడలను కల్గించు అను అర్థము స్థూలముగా కావవచ్చు చున్నది కాని నీటియందు అడుగుజాడ లేర్పడుట అసంభవము ఇచ్చట ఈ పదము లౌకిక అర్థము గాకుండ వేరొక విశేషార్థము గోచరించుచున్నది "ఎంతటి దుర్లభ కార్యము నైనను' సులభ సాధ్యము చేయగల ప్రజ్ఞాశాలినిగా" చిత్ర లేఖను సమర్థించుట జరిగినది.

19. నీళ్ళాడు [ప్రసవించు]

తెలిసి చక్కన వచ్చి దేవకినీళ్ళాడెరమ్మని యోభోజరాజుతోడ'

[10 పూ 148]

బాలిక ఏడ్పు విని కావలివారు భోజరాజుతో చెప్పు సందర్భములోని ది నుడికారము 'నీళ్ళాడు' అనగా 'స్నానము చేయు' అనునది సామాన్యార్థము కాని ఇచ్చట దేవకిదేవి "ప్రసవించె" అను అర్థములో పై నుడి కారము ప్రయోగింపబడినది. శీర్షమాడు అనునది దీనికి పర్యాయ పద బంధము

20. పిలుకు మార్చు

బలుడు, నగు నుగ్రసేను మాయయ్య గిటదగించి
నిన తండ్రి దేవకు 'పిలుకు మార్చి" 10 పూ 1160

వృషభాసుర ఘట్టములోని దీ పలుకుబడి 'పిలుకుమార్చు' అనగా చంపు, నాశనముచేయు అను అర్థములు వచ్చుచున్నవి

21. పిన్న బిడ్డాటలు

పిన్న బిడ్డాటలు చేసెనీ దురుకు టక్కరి
భారతికైన జెప్పరే" 10 పూ 1212

'కంసుని పంపున అక్రూరుడు బృందావనమునకు చనుదెంచుట' అను ఘట్టములో అక్రూరుడు హరిని మధురకు గొనిపోయెనని తెలిసి స్త్రీలు తమలో తాము తలచిన సన్నివేశములోని దీ నుడికారము. పిన్న బిడ్డాటలు అనగా అమాయకత్వముతో ప్రవర్తించుట, బాధ్యతలేని ప్రవర్తన, మూర్ఖులుగా మసలుట అనెడు అర్థములు వచ్చుచున్నవి

22 పిల్ల చెలి కీనినకైవడి

పిల్ల చెలికీనిన కైవడి బుత్రపౌత్రవర్ధనమున నొప్పె గృష్ణుడు
ముదంబున దామరతంపరై భువిన్" 10 ఉ 276

శ్రీకృష్ణునకు పదారు వేల సతులందు అసంఖ్యాక సంతానము కలిగెనను విషయమును "పిల్ల చెలికి నినకైవడి" అను పలుకుబడి ద్వారా మనోహరముగ పోతరాజు సూచించెను చెలకు ప్రక్కభాగమునుండి పిల్ల చెలకు పిలకలు వేసిన రీతిగా కృష్ణునకు భార్యల ద్వారా అధిక సంతానోత్పత్తి కలిగెనను విశేషార్థమును చెప్పుటకు ఈ పలుకుబడి ఉపయోగింపబడినది

23. బొగ్గులువేయు , పాడుచేయు

ధర్మకీర్తులన్, బొగ్గులు సేసి వారు
కడు బొందికటా 9-378

